జనప్రియ
పుస్తకమాల



62

[illegible]

# శ్రీప్రసాద్

# యుగంధర్




నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ · విజయవాడ-2



# YUGANDHAR

(Serialised in Vijaya Monthly)

By
Sri Prasad

Second Edition :
June '81

894 - 8133

Printers :
Sri Venkataramana Printers
Vijayawada-2.

Cver Design .
GANGADHAR

Publishers :

***Navajyothi Publications***

Eluru Road
Vijayawada-2

Price ;
Rs. 13-50

# శ్రీ ప్రసాద్ రచనలు

ఆర్య చాణక్య

రోషనార

అప్పాజీ

యుగంధర్

సురాజుద్దౌలా

షాజహాన్

సామ్రాట్ శ్రీరంగరాయ

విజయనగర పతనం

చదవండి ! చదివించండి ! ఆనందించండి

మీ అభిమాన రచయిత్రి

# ఆరెకపూడి [కోడూరి] కౌసల్యాదేవి

## రచనలు

నందనవనం
బృందావనం
దిక్చక్రం
కల్పవృక్షం
దివ్యదీపావళి
పూజారిణి
శాంతినికేతన్
చక్రనేమి
శంఖుతీర్థం
భాగ్యచక్రం
చక్రవాకం
శిలలు - శిల్పాలు
సత్యం-శివం-సుందరం
జనరంజని
హైందవి
ధర్మచక్రం
కల్యాణమందిర్
ప్రేమనగర్
చక్రభ్రమణం
సంసారచక్రం
బదనిక
పెళ్ళి ఎవరికి ?
అనిర్వాచనీయం
తీయని శాపం
సుప్రభాతం
శోభకృతు
విద్య
చెట్టూ - ఛాయా
ఉషస్సు

# యుగంధర్

ఆదిత్యస్సవితాసూర్యః ఖగం పూషాగ భస్తిమాన్
సువర్ణ సదృశో భానుర్హిరణ్యరేతా దివాకరః
నక్షత్రగ్రహ తారాణామధిపో విశ్వభావనః
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోస్తుతే
జయాయ జయ భద్రాయ హర్యశ్వాయనమోనమః
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః
రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతం
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరం.

ప్రత్యూష పవనములు అల్లనల్లన వీచుచుండ, బాలభానుని సంప ర్శనముచే కడలి యుప్పొంగి పొంగుచుండ సాగర సంగమమందు లోక సాక్షియగు మార్తాండునకు అర్ఘ్యమిస్తున్న మహామంత్రి హస్తోదకము నుండి సన్నని శబ్దము వెలువడింది. మహామంత్రి తన హస్తోదకము వంక చూశాడు. అందులో సన్నని సిరిబుడగలు వెలువడుతున్నాయి. మరుక్షణంలో మహామంత్రి ఊర్ధ్వాభిముఖుడయ్యాడు. గగనవీధిన కల పిక పక్షిజాలమును తమ కిలకిలా రావములతో ఎంతో స్వేచ్ఛా విహారం చేస్తున్నాయి. అప్పటివరకూ దూరాన వున్న గుడి గోపురం మీద వొంగి ఉన్న ఓ వృద్ధగృధ్రము నల్లున ఎగురుతూ వచ్చి సంతోష

తరంగములలో విహరిస్తున్న ఓ అందాల పక్షిని తన వాడి గోళ్ళతో తన్నుకొని పోతోంది. మహామంత్రి హస్తాలు అప్రయత్నంగా విడివడ్డాయ్. పంకిలమైన హస్తోదకం సర్వ పాప పరిహారుడగు సముద్రుని అనంత జలాలలో కలిసిపోయింది.

'విద్యానాథా !' అన్నాడు మహామంత్రి.

"స్వామీ !"

"అర్ఘ్యం అంబుధిపాలు కావటం చూశావుగా! అంతే కాదు: వామాక్షికూడా కీడునే శంకిస్తున్నది. మనం ఓరుగల్లు వదిలి మూడు నెలలు దాటింది. కాని ఇంత దుశ్శకునం ఇంతకు ముందు ఎదురు కాలేదు. మనము ఈ రామేశ్వర యాత్రకు బయలుదేరేటప్పుడే ఢిల్లీ నుండి తురుష్క దండయాత్రను గురించి వేగు వొచ్చింది? కాని, గత సంవత్సరపు అనుభవాన్ని గుర్తుకు తెచ్చుకుని తరువాత వారా ప్రయత్నాన్ని విరమించుకొన్నారని రూఢిగా తెలియటం వల్ల విరమించిన ఈ యాత్రకు ప్రభువులు ప్రోత్సాహమిచ్చారు. కాని, పొరపాటు జరిగిన దేమో అని నా అనుమానం."

"తమ్ముడు జనార్దనమంత్రి ఉన్నారు కదా?"

"అతడు బాలుడు."

"అయిననూ తమ శిష్యుడు, తమ దివ్య శిక్షణలో కాకలు తీరిన రాజకీయపు జోదు."

"ఆ మాట కాదనను. అంతే కాక, నేను తీర్థయాత్రకు బయలుదేరేటప్పుడు రాజరక్షణకు కావాల్సిన ఏర్పాట్లన్నీ స్వయంగా చేశాను. కాని, ఆ నియమ నిబంధనలను మహారాజు పాటించినంత వరకే కదా-చక్రవర్తి వాటిని అతిక్రమించనంత వరకూ జనార్దనుడు తన కార్యభార నిర్వహణలో అజేయుడు. ఒకవేళ మహారాజు నేనేర్పరచిన నియమాలను ఉల్లంఘిస్తే!"

"మహారాజు తాము గీచిన గీటు దాటుతారంటారా?"

"ఏమో! మృగయా వినోదుడు - ప్రభువులు - గీటు దాటిన మరు క్షణంలో సీతామహాసాధ్వి - ఆఁ! నా వాక్సుద్ధి తడబడుతున్నది. విద్యానాథా! అవశ్యం ప్రయాణ సన్నాహాలను చేయించు. ఈ రోజే మనం

ఓరుగల్లుకు ప్రయాణం కావాలి."

మహామంత్రులు అనవసరంగా భయపడుతున్నారు. జనార్ధన మహామంత్రి జెగజెట్టి. అప్రతిహత పరాక్రమ సముపేతుడు. సర్వ సైన్యాధిపతి భేతాళరావు. అసాధారణ ప్రతిభా సమన్వితుడు, దుర్గ రక్షకుడు బుక్కరాయలు స్వయంగా మహారాజు ప్రతాపరుద్రుడు మధ్యందిన మార్తాండ సదృశుడు. మీరు మీ యాత్రను కన్యాకుమారి వరకూ సాగించి, పూర్తి చేయండి మహామంత్రీ !" అన్నాడు విద్యానాథుడు.

"నీవు చెప్పినది కాదనను విద్యానాథా! కాని, కానికాలం వస్తే కారాని పని లేదు. విధి వికటిస్తే విశ్వమే తల్లక్రిందులై పోతుంది."

"అసాధారణ మేధస్సు విభవ సముపేతులైన యుగంధర మహామంత్రులు కూడా విధిని గణన చేస్తారా ?"

"మేధస్సు శోషించటం వల్లనే నే నీ యాత్ర తలపెట్టి ఉంటాను. నా రాజును, నా రాజ్యాన్ని వదలి, పుణ్య సముపార్జనార్థమని పుష్కరిణులను పట్టుకొని తిరుగుట వైదిక ధర్మమౌతుందేమో కాని, లౌకిక ధర్మం కాదుగా! వెంటనే ప్రయాణానికి మారుమాట చెప్పకుండ సర్వసన్నాహాలూ చేయించు."

విద్యానాథుడు మారు పలకలేదు. మహామంత్రి మాటకు తిరుగు లేదని తెలిసిన అతడు తన అవనత శీర్షంతోనే ఆమోదాన్ని సూచించాడు. రెండు క్షణాలు గడిచాయి. ఆలోచనా ధారంతో అవనతమైన శీర్షాన్ని ఎత్తి శిష్యునివంక తిరిగి "విద్యానాథా !" అన్నాడు మేఘగంభీర స్వరంతో మహామంత్రి.

"స్వామీ !" అన్నాడు విద్యానాథుడు వినయంగా.

"అంపె గుర్రాల స్వారిపై ఉత్తరక్షణంలో ఓరుగల్లులో వ్రాలాలని ఉంది. కాని, వృద్ధాప్యం నన్ను కూడా ఎదురు నిలిచి వెక్కిరిస్తోంది. నువ్వు వెంటనే బయలుదేరు ! శరవేగంతో ఓరుగల్లును చేరుకో! నీ బుద్ధి కుశలతను ఉపయోగించు! ఓరుగల్లు చేరేసరికి నాకు దుశ్శకునం వల్ల దుష్ఫలితం కలుగకుండా చూడు."

"అలాగే స్వామీ! తమ ఆజ్ఞానుబద్ధుణ్ణి!" అంటూ మహామంత్రి దగ్గర ఆ క్షణాన్నే సెలవు తీసుకొని బయలుదేరాడు విద్యానాథుడు.

అతడి చాకచక్యాన్ని చూసి ఓరుగల్లు తెలుగు కోడులు, అతణ్ణి అచ్చ తెలుగులో 'చెకుముకి' అని ముద్దు - ముద్దుగా పిలుస్తుంటారు. చెకుముకి అతడి మారుపేరు.

విద్యానాథుణ్ని ప్రయాణం చేయించిన మహామంత్రికి కొంత ధైర్యం కలిగింది. పదవిచే కాకపోయినా, ప్రతిభచేత మహామంత్రికి దాదాపు సరి సమానుడు. చారవృత్తి అతనికి ఉగ్గుపాలతో పెట్టిన విద్య. సామదాన భేద దండోపాయములు, అతని కార్యసాధనకు నమ్మినబంట్లు. ఎచ్చట దేనిని ప్రయోగింపవలెనో అతనికి తెలిసినట్లు కాకతీయాంధ్ర సామ్రాజ్యమున మహామంత్రికి తప్ప అన్యులకు తెలియవు. అంతేకాదు! విద్యానాథుడు సంస్కృతాంధ్రములలో ఉద్దండ పండితుడు, తాను స్వయంగా సంస్కృతంలో రచించిన అలంకార శాస్త్రాన్ని, మహారాజు ప్రతాపరుద్రునికి అంకితం ఇచ్చాడు. సార్వభౌముడు కవితా కన్యను సాదరంగా స్వీకరించటంతో, మహారాజుకే మామగారయ్యాడు విద్యానాథుడు.

మహామంత్రి దక్షిణదేశ తీర్థయాత్ర సంకల్పించినప్పుడు, విద్యానాథుడు కూడా మహామంత్రి ననుసరించటానికి ఉత్సాహించాడు. సామ్రాజ్యమందంతటా ప్రశాంత వాతావరణం వెల్లివిరియు చుండటంవల్ల మహామంత్రి అభ్యంతరం చెప్పాడు కాదు. కాని, ఈనాడు విద్యానాథుడు ఓరుగల్లు పట్టణంలో ఉంటే, దుశ్శకునాన్ని మహామంత్రి పరిగణించేవాడే కాదు. తానూ-విద్యానాథుడూ ఇరువురూ లేని ఓరుగల్లు రాజ్యసింహపీఠిక శాత్రవ జన సులభంగా గోచరించింది మహామంత్రికి. తమ్ముడు జనార్ధన మంత్రిలో మహామంత్రికి విశ్వాసం లేకపోలేదు. అయితే, అతడు చెప్పిన పనులను ఏమరక జాగరూకతతో అప్రమత్తుడుగా నెరవేర్చగలవాడే కాని, సమయానుకూల సన్నివేశముల సృష్టించి, ఎత్తులకు పైఎతులు వేయగల శక్తి సామర్థ్యములు అతనికంతగా లేవని మహామంత్రి ఉద్దేశం.

చూస్తూ చూస్తూ ఉండగానే సాగరం నుండి వెలువడి విద్యానాధుడు తీరాన ఉన్న ఉత్తమాశ్వాన్ని అధిరోహించి, క్షణకాలంలో ఉత్తరాభిముఖుడై బయలుదేరి, మెరుపుతీగ లాగ అదృశ్యమయ్యాడు. అతడు పోయిన దిక్కుగా సంతృప్త హృదయంతో చూస్తున్న మహామంత్రి మెల్లగా తన దృష్టిని అనంత సాగర జలాల వైపు మళ్ళించి, సాగర

గర్భంనించి చీల్చుకొని బయటికి వొచ్చి తనదైనందిన ప్రయాణాన్ని ప్రారంభించిన సహస్ర కిరణునికి అర్ఘ్యం తిరిగి ఇచ్చాడు - పవిత్ర సాగర జలాలలో పునఃపునీతుడై.

"హే, భగవాన్! ఈ పరమపవిత్రమైన పురాణభూమిలో శ్రీరామేశ్వర మహాక్షేత్రంలో పరమాత్ముడగు శ్రీరామచంద్రుడు శివలింగ ప్రతిష్ఠాపన చేసి, నీకు అర్ఘ్యం ఇచ్చి, ఆదిత్యహృదయాన్ని స్మరించి అభీష్టార్థ సిద్ధి పొందాడు. రావణబ్రహ్మను పరిమార్చి, ఆర్ష ధర్మ సంరక్షణ చేశాడు. ఆ పవిత్ర స్థలంలోనే ఆదిత్య హృదయాన్ని స్మరించి, అర్ఘ్యమిస్తున్న నాకు దుశ్శకునం కలిగింది. కర్మసాక్షీ! నే చేసిన తప్పేమిటి? నా రాజ్యం చేసిన పాపమేమిటి? నా రాజు చేసిన పొరపాటు ఏమిటి? నిరంతరం మ్లేచ్ఛదండయాత్రాఫలితంగా, క్షణ-క్షణానికి దిగజారిపోతున్న ఆర్ష ధర్మ రక్షణార్థం మా కాకతీయాంధ్ర సామ్రాజ్యాన్ని నీ సహస్ర కిరణ కాంతిపుంజంతో రక్షించు!" అంటూ నిమీలిత నేత్రుడై సూర్యభగవానుణ్ని పరిపూర్ణ హృదయంతో ప్రార్థించాడు మహామంత్రి.

కళ్ళు తెరచిన మహామంత్రికి, బాలభాస్కరునికి అడ్డుగా ఒకచిన్న మేఘం ప్రయాణం చేయటం కనుపించింది. చండప్రచండుడైన మార్తాండుడు సైతం సాధారణ మేఘానికి లోనయ్యాడు. అంతా విధి విలాసం. కాని, భాస్కరుణ్ణి మేఘరాజం కలకాలం కప్పిపెట్టలేదు అన్న [illegible]తో బయలుదేరాడు మహామంత్రి తన పట [illegible]రానికి.

శ్రీరామ ప్రతిష్ఠితమైన శివుని ఆత్మలింగానికి అభిషేకం చేయించి దుశ్శకున దుష్ఫలిత నివారణార్థం శనిదేవుని అర్చించి, విప్రులకు ధన ధాన్యదానంచేసి, ఆ సాయంకాలమే రామేశ్వర మహాక్షేత్రాన్ని విడిచిపెట్టి ఓరుగల్లు మహానగరానికి ప్రయాణమయ్యాడు మహామంత్రి.

ప్రస్తుత కథా కాలమున కాకతీయాంధ్ర సామ్రాజ్యమునకు ప్రభువు ప్రతాపరుద్ర చక్రవర్తి. ఇతడు కాకతీయ వంశజుడు. 'కాకతి' అను దేవతను ఆరాధించుటచే వీరి వంశానికి కాకతి వంశం అనే పేరు వచ్చింది. వీరినే గణపతి రాజులు అనికూడా పిలుస్తారు. రాజధాని

నగరం ఓరుగల్లు. దీనికి ఒంటికల్లు, ఏకశిలానగరం అనే మారుపేర్లుకూడా ఉన్నాయి. ఈ ఓరుగంటికి సమీపంలోనే అనుమకొండ అని ఒక గ్రామం ఉంది. కాకతీయ ప్రభువుల మొదటి రాజధాని అదే! అనుమకొండలో వీరి రాజధాని ఉన్నంతవరకూ వీరు చిన్న సంస్థానాధిపతులుగానే చెలామణీ అవుతూ ఉండేవారు. అనుమకొండను పాలించిన ప్రభువులు పన్నెండు పదమూడవ శతాబ్దాలలో క్రమక్రమంగా మహాబలవంతులై తెలుగు దేశాన్నంతా ఆక్రమించుకోగలిగారు. తెలుగు దేశం అంటే త్రిలింగదేశం. సింహాచలం, శ్రీశైలం, శ్రీకాళహస్తి మధ్యస్థ ప్రదేశాన్ని త్రిలింగ దేశం అంటారు. ఈ త్రిలింగ శబ్దమే కాలక్రమాన యవనభాషా సంపర్కంతో తెలంగాన్‌గా మారిపోయింది. అయితే, ప్రస్తుతం తెలంగాన్ అనే ప్రాంతాన్ని మాత్రమే ఓరుగంటి సామ్రాజ్యం అని పరిగణించవచ్చు.

కాకతి వంశానికి మూల పురుషుడు సోమదేవరాజు కుమారుడైన మాధవవర్మ. మాధవవర్మను గురించి ఒక చిత్రమైన కథ అనుశ్రుతంగా వినవస్తున్నది.

సోమదేవరాజు గోదావరీ తీరస్థ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న కాలంలో కటకాన్ని రాజధానిగా చేసికొని ఓఢ్రప్రదేశాన్ని బల్లహుండనే ప్రభువు పరిపాలిస్తూ ఉండేవాడు. ఈ రాజులిద్దరికీ పశుసంపద విరివిగా ఉండేది. ఆ రోజుల్లో ధనం పశువులే! ఈ పశువుల విషయంలోనే పేచీ వచ్చింది ఈ రాజులిద్దరికీ. తత్ఫలితంగా కటక భూపతి అయిన బల్లహుండు అసాధారణమైన సైన్యంతో దండెత్తివచ్చిన సోమదేవ భూపాలుణ్ణి అధర్మ యుద్ధాన సంహరించటమే కాక, నిండు చూలాలయిన అతడి భార్య సిరియాళదేవిని చెరబట్టటానికికూడా ప్రయత్నించాడు. ఆ మహాసాధ్వి భర్తృ వియోగ దుఃఖంతో ఆత్మహత్య చేసుకుందామని నిశ్చయించుకున్నా, ఆమె గర్భస్థ శిశువు అందుకెదురు నిల్చింది. విధిలేక మహారాణి సిరియాళదేవి ఆమె మంత్రుల సహాయంతో నిరాభరణగా, నిరస్త్రగా కోటనుండి బయట పడగలిగింది. ఆమెను వెంటతీసుకొని కనిపించిన ప్రతి సామంత ప్రభువునూ ఆశ్రయంకోసం అర్థిస్తూ బయలుదేరాడు వృద్ధమంత్రి. కొన్నాళ్ళు అడవులుపట్టి తిరిగిన పిదప ఎలాగో అరా తన సామంతులలో అత్యంత ఆప్తుడు, సన్నిహితుడు, విశ్వాసపాత్రుడూ

అయిన ఎపకదేవ మహారాజు పాలిస్తున్న అనుమకొండకు చేరాడు. పరిస్థితిని విశదీకరించాడు మహామంత్రి. నిండు చూలాలయిన మహారాణికి ఆశ్రయమివ్వమని అర్థించాడు. గౌరవమర్యాదలు జరపడంలో ఏ మాత్రం లోపం రానీయకపోయినా, బలవంతుడైన కటకభూపతికి భయపడి, మహారాణికి ఆశ్రయమివ్వ నిరాకరించాడు ఎపక భూపతి.

ఇది ఈవిధంగా ఉండగానే అనుమకొండలోనే మహారాణి ప్రసవించింది. సార్వభౌమ లక్షణ లక్షితుడైన పుత్రుడికి జన్మ ఇచ్చింది మహారాణి. ఆ బిడ్డను చూడగానే ఎపకభూపతి మనస్సు కరిగిపోయింది. కాని, అవతల మహా బలవంతుడైన బల్లహుడు! ఏమి చేయడానికి పాలుపోని ఎపకరాజు - అనుమకొండకు అనతిదూరంలోనే ఉన్న ఒక బ్రాహ్మణాగ్రహారంలో వేదవేదాంగ కోవిదుడైన మాధవశర్మ అనే విప్రోత్తముణ్ణి రావించి, పరిస్థితిని విశదీకరించి, మహారాణికి ఆశ్రయం ఇచ్చి రక్షించమని కోరాడు. కాలం కలిసిరాక కడగండ్లు పడుతున్న మహారాణిని, మాధవశర్మ సాదరంగా ఆహ్వానించాడు. కన్న కూతురిలా అక్కున చేర్చుకొని ఆదరించాడు. తన స్వగ్రామానికి తీసుకొని వెళ్ళి, మహారాణి సిరియాళదేవికి తన ఇంట్లోనే ఆశ్రయం కల్పించాడు. ఆ మహానుభావుడు చేసిన ఉపకారానికి కృతజ్ఞతా చిహ్నంగా, తన కుమారునికి 'మాధవవర్మ' అని పేరుపెట్టుకున్నది సిరియాళదేవి. మాధవవర్మ శుక్లపక్ష చంద్రునిలా క్రమక్రమంగా పెద్దవాడు కాసాగాడు.

ఇక్కడి పరిస్థితి ఈ విధంగా ఉండగా, కటకభూపతి బల్లహుడికి ఒక పెద్ద అనుమానం చెలరేగింది. నిండు చూలాలైన సిరియాళదేవి అదృశ్యం కావడం అతని మనోవ్యథకు కారణం. ఒకవేళ మగబిడ్డ పుట్టినట్టైతే ఆ పెరిగేటువంటి పుత్రోదయం కలిగితే, ఆ బిడ్డవల్ల తన కెప్పటికయినా ప్రమాదం తప్పదని శంకించాడు బల్లహుడు. 'శత్రుశేషానికి రాజనీతి ప్రాజ్ఞులొప్పరు' అనే సిద్ధాంతాన్ని అనుసరించి, సిరియాళదేవి కోసం తన చారులను నలువైపులకూ పంపించాడు. చారులు, ఇల్లిల్లూ గాలిస్తూ వచ్చినటువంటి చారులు, మాధవశర్మ ఇంటిలోనికి పోతున్న సిరియాళదేవిని చూడటం తటస్థించింది. మహాసామ్రాజ్ఞి లక్షణోపేతమయిన ఆమె ఎవరా? ఈ గ్రామంలో, ఈ అగ్రహారంలో, ఈ

బ్రాహ్మణ గృహంలో ఎలా జన్మించిందా ? అనే అనుమానం కలిగింది చారులకు. వెంటనే మాధవశర్మను పిలిచి, ఆమె ఎవరని ప్రశ్నించారు. మాధవశర్మ ఆమె తన కన్నకూతురనీ, భర్త దేశాంతరం వెళ్ళిపోవటం వల్ల పుట్టినింటనే ఉంటున్నదనీ సమాధానం చెప్పాడు. ఆ బ్రాహ్మణోత్తముడు అబద్ధం పలకడనే విశ్వాసం ఉన్నా, ఆమె రూపురేఖలు తమవద్దనున్న మహారాణి చిత్తరువును పోలి ఉండటంవల్ల ఆ చారులు బల్లహునికి ఆ విషయాన్ని నివేదించారు. అనుమాన నివృత్తికొరకు కతిపయ దినాలు ప్రయాణం చేసిన పిదప బల్లహుడు - మాధవశర్మ ఇంటికి వచ్చి చేరాడు. సింహద్వారం వద్దనే ఎదురైన అయిదేండ్ల బాలుని చూడగానే బల్లహుని అనుమానం స్థిరపడింది. ఇంటికి వచ్చిన మహారాజుకు మర్యాద సలిపి, ఎదురుగా కూర్చున్నాడు మాధవశర్మ.

'శాస్త్ర దప్పిక యిప్పిస్తారా, స్వామీ!' అని అడిగాడు బల్లహుడు. అప్పుడే అటుప్రక్కగా పోతున్న సిరియాళదేవిని చూసి—

"మహారాజుకు మంచినీళ్ళు తీసుకురా అమ్మా!" అని కేక వేశాడు మాధవశర్మ. మరుక్షణంలో సిరియాళదేవి స్వయంగా మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది మహారాజుకి.

మంచినీటి పాత్ర అందుకున్న మహారాజు ఎదురుగానున్న స్త్రీ వంక తేరిపార చూశాడు. నిజమే! ఆమె సిరియాళదేవియే! సందేహంలేదు. రూపురేఖలన్నీ అలాగే ఉన్నాయి. అంతేకాదు, ముఖద్వారం దగ్గర తనకెదురు వచ్చిన బాలుడు అయిదేళ్ళవాడు. సార్వభౌమ లక్షణోపేతుడు కాని, బ్రాహ్మణ బిడ్డడు కాడు. ఆ బాలునికి ఇప్పుడయిదేళ్ళు. తన కోటనుంచి, తన కట్టడినుంచి నిండు చూలాలుగా సిరియాళదేవి తప్పించుకొని పారిపోయి, ఇప్పటికి సరిగ్గా అయిదు సంవత్సరాలు. అన్ని విషయాలు సరిగ్గా అనురిపోతున్నాయి. కాని ఒక్కటే అనుమానం. మహారాజ్ఞిఅయినసిరియాళదేవి మంచినీరు తీసుకొనివచ్చి, తన భర్తకు పరమ విరోధిఅయిన తన చేతికి అందిస్తుందా? ఆ పని బ్రాహ్మణ బిడ్డలేకాని, రాచబిడ్డలు చేయరు. అదీకాక, అంతభయపరహితంగా తనకోసం వచ్చాడని తెలిసిన తన కంట బడటానికి సాహసిస్తుందా? పరస్పర విరుద్ధమైన భావాలమధ్య సంఘర్షణ పడసాగాడు బల్లహుడు. అతని ఆలోచనా ముద్రలో సిరియాళదేవిని

కన్నార్పకుండానే అలా చూస్తూనే ఉండిపోయారు. ఆ విషయాన్ని గ్రహిం చిన మాధవశర్మ—

"ఏమిటి, ప్రభూ—అలా చూస్తున్నారు? ..." అంటూ పృచ్ఛ చేశాడు.

"మరేం లేదు, స్వామీ! ఈమె ఎవరా అని చూస్తున్నాను."

"నన్నడిగితే చెప్పనా, ప్రభూ! ఆమె నా కన్నబిడ్డ, శ్రీదేవి. భర్త దేశాంతరగతుడు కావడంతో, పుట్టినింటే ఉండిపోయింది. వాడు నా మనుమడు మాధవుడు" అన్నాడు మాధవశర్మ.

బల్లహుడు మళ్ళీ అనుమానంలో పడ్డాడు, పరమ శ్రోత్రియుడైన ఆ బ్రాహ్మణుడు అసత్యం పలుకుతాడని నమ్మటానికి అతని మనసు తిరస్కరించింది. అతని హృదయం మాత్రం ఆమె సిరియాళదేవి అని ఘంటాపథంగా చెపుతూంది. ఏమిటి చేయడం? ఎలా దీన్ని పరిష్కరించటం ?

"ఏమిటి ప్రభూ ఆలోచిస్తున్నారు?"

ఇక ఆట్టే ఆలోచించకూడదనుకున్నాడు బల్లహుడు. ఉన్న విషయం తేల్చి చెప్పడం మంచిదనుకున్నాడు

"స్వామీ! ఉన్న విషయాన్ని ఉన్నట్టు చెబుతాను ఈమెను చూస్తే నాకు సోమదేవ భూపాలుని మహారాజ్ఞి సిరియాళదేవి జ్ఞాపకం వస్తోంది. మీరేమో ఈమె తమ పుత్రిక అని సెలవిస్తున్నారు ఇదమిద్ధమని నిర్ణయించలేకుండా ఉన్నాను."

"తమరు చెప్పింది కాదనలేను, ప్రభూ! మనిషిని పోలిన మనుషులు ఎందరైనా ఉండొచ్చు. పరమాత్ముడి సృష్టి చిత్రవిచిత్రమైంది."

"కాని, ఈమె సిరియాళదేవనే అనుమానం నాకు గాఢంగా ఉంది. తప్పుమాట అంటే మన్నించండి. మీరు సకల ధర్మకోవిదులు. మీ రెరుగని శాస్త్రాలు లేవు. రాజనీతి శత్రుశేషానికి ఒప్పదనే విషయం మీకు తెలియందికాదు. ఈమె సిరియాళదేవి అయ్యేపక్షంలో నేను నా రాజనీతిని ప్రయోగించక తప్పదనే విషయాన్ని మనవి చేయడానికి ఉంకి స్తున్నాను."

"దానికొరకు మీరు విచారించ నక్కరలేదు, మహారాజా! ఈమే సిరియాళదేవి అయితే, ఈమెకు మీ ఇచ్చవొచ్చిన శిక్ష విధించటానికి నాకేం అభ్యంతరం లేదు. కాని, ఈమె నా బిడ్డ శ్రీదేవి!"

"దానికి నిదర్శనం....?" అన్నాడు మహారాజు గంభీరంగా.

"నిదర్శనమా, ప్రభూ? ముంజేతి కంకణానికి అద్దం కావాలా? ఈ విషయం ఈ అగ్రహారంలోని ఆబాల గోపాలానికీ తెలుసు. త్రికాలాగ్నిహోత్ర తత్పరులైన ఈ అగ్రహారపు బ్రాహ్మణానీకంలో ఎవరి నడిగినా నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు మాధవశర్మ.

మరి కొద్ది క్షణాలలో బల్లహుని ఆజ్ఞమేరకు అగ్రహారంలోని విప్రోత్తములంతా రావించబడ్డారు. ఎదురుగా నిలబడివున్న సిరియాళ దేవిని చూపి 'ఈమె ఎవరో మీకు తెలుసా?' అంటూ ప్రశ్నించాడు బల్లహుడు.

"అదేమిటి ప్రభూ! అలా అడుగుతారు? మా కళ్ళముందు పుట్టి పెరిగిన బిడ్డను మేమే ఎరుగమా? ఆమె మాధవశర్మ కుమార్తె శ్రీదేవి...." అంటూ ముక్తకంఠంతో జవాబిచ్చారు ఊరిలోని బ్రాహ్మణులందరూ. వారి మాటలను శంకించటానికి ధైర్యంలేకపోయింది బల్లహునికి. అయినా, మరొక్కసారి తన అనుమానాన్ని సంపూర్ణంగా తీర్చుకోవాలని వాంఛించాడు బల్లహుడు.

"బ్రాహ్మణోత్తములారా! ఆమె మాధవశర్మ కుమార్తె శ్రీదేవి అంటున్నారు మీరు; నేను సోమదేవ భూపాలుని భార్య సిరియాళదేవి అంటున్నాను. ఆమె శ్రీదేవి అయ్యేపక్షంలో మీరామె చేతి భోజనాన్ని స్వీకరించటానికి సిద్ధంగా ఉన్నారా?" అని అడిగాడు బల్లహుడు.

బల్లహుడు రాకమునుపే సిరియాళదేవిని రక్షించటానికి, సోమదేవ భూపాలుని వంశాంకురాన్ని నిలపటానికి బద్ధకంకణులై ఉన్న బ్రాహ్మణులు-ప్రాణ మాన విత్త భంగమందు బొంకవచ్చుననే సూత్రాన్ని ఆధారంగా చేసుకొని, ఎలాంటి అనృతాలాడైనా సరే - ఎలాంటి విషమ పరిస్థితిని ఎదుర్కొని అయినా సరే తమ దీక్షను నెగ్గించుకోవాలని కృత

నిశ్చయులు కావటంవల్ల బల్లహుని ప్రశ్నకు ఈ విధమైన అనుమానమూ లేకుండా, తామంతా అందుకు సిద్ధమేనన్నారు.

"మాధవశర్మగారి ఇంట్లో నిత్య సంతర్పణలు జరుగుతుంటాయి. ఆమె చేతివంట తినని రోజులు నెలకు రెండో-మూడో ఉంటాయి. ప్రభువులు ఆజ్ఞ ఇస్తే ఈ రోజునే-ఇక్కడే ఆమె చేతి వంటకాలని తినడానికి మాకే విధమైన అభ్యంతరమూ లేదు."

విప్రోత్తముల సమాధానానికి తనలో తానే లజ్జితుడైనాడు బల్లహుడు. తన అర్థంలేని అనుమానాన్ని ఆస్కారంగా చేసుకొని, అంత మంది విప్రుల ఎదుట తన లేని గుణాన్ని ప్రదర్శించుచున్నానేమోనని బాధపడసాగాడు. అయినా అతని హృదయంలో గాఢంగా నాటుకుపోయిన అనుమానం వెలికిరానంటోంది. కింకర్తవ్యతా విమూఢుడైన బల్లహుడు అలానే ఆలోచిస్తూ ఉండిపోయాడు కొద్దికాలం - ఇంకేం ప్రశ్నించాలో అర్థంకాక. ఆ తరువాత ఇలా అన్నాడు :

"స్వామీ! ఆమె మీ కన్నకూతు రంటున్నారు. ఆ మాటకు ఈ అగ్రహారపు బ్రహ్మణోత్తములంతా సాక్ష్యమిస్తున్నారు. వారి సాక్ష్యాన్ని శంకించటం అసహ్యమే అవుతుంది. అయినా, అనుమానం పెనుభూతం లాంటిది. అది సంపూర్ణంగా మారణం కాకపోతే, హృదయంలో వెలలు వేస్తుంది. ఈమె చేతి తీర్థాన్ని నా ఎదుట స్వీకరిస్తారా, స్వామీ?"

ఆ మాటలకు చిరునవ్వు నవ్వాడు మాధవశర్మ.

"కన్నకూతురి చేతి మంచినీళ్ళు త్రాగడానికి నా కభ్యంతరం ఉంటుందా, ప్రభూ? అలాగే త్రాగుతాను. అమ్మా! మంచినీళ్ళు తీసుకురా!"

మాధవశర్మకు మంచినీళ్ళందించింది మరుక్షణంలో సిరియాళదేవి. సార్వభౌముని సమక్షంలో సకల ధర్మ కోవిదులయిన బ్రాహ్మణోత్తముల సమక్షంలో ఆ మంచినీళ్ళు త్రాగాడు మాధవశర్మ.

బల్లహుని అనుమానం నివారణ అయింది. అనవసరపు శ్రమ ఇచ్చినందుకు అగ్రహారపు బ్రాహ్మణులకు మన్ననలు చెప్పుకొని మరలి పోయాడు బల్లహుడు.

ఆ తర్వాత కాలంలో మాధవశర్మ - మాధవవర్మకు సకల ధర్మ

శాస్త్రిలు బోధించాడు ఎఱుకదేవరాజు పంపిన ఉద్దండులైన గురువుల సాన్నిధ్యంలో సకల శస్త్రాస్త్ర విద్యలనూ అభ్యసింపచేశాడు. అటు ధర్మ శాస్త్రంలోనూ, ఇటు రాజనీతిలోనూ, శస్త్రాస్త్ర విద్యలలోనూ సంపూర్ణత చెంది షోడశ వత్సరపూర్ణుడై, షోడశ కళాప్రపూర్ణుడైన చంద్రుడయ్యాడు మాధవవర్మ.

యుక్త వయస్సు వచ్చిన మాధవవర్మకు, తన కుమార్తె పద్మాక్షీ దేవినిచ్చి అతివైభవంగా వివాహం చేశాడు ఎఱుకదేవ మహారాజు. ఆ తరువాత అనుమకొండ సైన్యాలను సహాయం యిచ్చి, తాను స్వయంగా సర్వ సైన్యాధిపత్యం వహించి, బల్లహునిమీదికి దండయాత్రకు బయలు దేరదీశాడు మాధవవర్మను ఎఱుకదేవరాజు. ఆ తరువాత జరిగిన ఘోర సంగ్రామంలో బల్లహుని సైన్యాన్ని ఖండనంచేసి, బల్లహుని పరిమార్చి పితృఋణం తీర్చుకున్నాడు మాధవవర్మ. అయితే, మాధవవర్మ మాత్రం అనుమకొండలోనే స్థిరపడిపోయాడు. అనుమకొండనే రాజధానిగా చేసుకొని, చెయిజారిన ఆంధ్ర సామ్రాజ్యాన్ని పునరుద్ధరించసాగాడు మాధవ వర్మ. ఇతడే కాకతి రాజులకు మూల పురుషుడు.

ఈ వంశంలో అయిదవవాడైన పెంబెగుండమరాజు కటక వల్లభుణ్ణి మహోరాత్రి ఓడించాడు. ఏడవవాడైన ఎఱుకదేవరాజు యాదవ రాజులపై దండెత్తి, వారిని జయించి కప్పంగైకొన్నాడు. ఈ వంశంలో ఎనిమిదవ రాజు భువనైకమల్లుడు; పరమశైవుడు. శిల్పకళా నికేతనాలన దగిన శివాలయాలను అనేకం నిర్మించాడు. వేయిస్తంభాల గుడి యితడి దివ్యసృష్టి. పదియవవాడైన కాకతి ప్రోలరాజు - ప్రస్తుతం రాజధాని నగరం అయిన ఓరుగల్లు దుర్గాన్ని నిర్మించాడు. ఇతని కాలంలోనే రాజధాని అనుమకొండ నుండి ఓరుగంటికి మార్చబడింది.

మహా పరాక్రమవంతుడైన ఇతడు అనేక దిగ్విజయయాత్రలు చేసి, ఉత్తరమున కటకమునుండి దక్షిణమున శ్రీశైలం వరకు, తూర్పున బంగాళాఖాతమునుండి పశ్చిమమున మాల్యవంతము వరకు తన సామ్రాజ్యాన్ని వ్యాపింపజేశాడు. ఇతని కుమారుడు ప్రతాపరుద్రదేవుడు.

ఇతని కాలంలో వీరశైవమతం విపరీతంగా అభివృద్ధి చెందింది,

అప్పుడప్పుడే తల చూపుతున్న జైనమతానికి, శైవమతానికి సంఘర్షణలు పొడ ఎత్తింది కూడా ఇతడి కాలంలోనే. ఈ స్పర్థల ఫలితంగా ఇతడి తమ్ముడయిన మహాదేవరాజు ఇతడ్ని చంపి రాచరికానికి వచ్చాడు. ఇతడి కాలంలో జైనమతం ఆంధ్రదేశంలో ప్రవేశ్య పాతుకుంది. అయితే, రాజయిన అనతి కాలంలోనే ఆనవాయితీగా దేవగిరి రాజులు చెల్లించే కప్పాన్ని మానివేయడం వల్ల, దేవగిరి యాదవుల పైకి దండు బయలు దేరాడు. అయితే దురదృష్టవశాత్తు ఆ యుద్ధంలో అతను మరణించటం సంభవించింది. మహాదేవరాజు మరణించటంతో అతడు నిస్సంతువు కావడంవల్ల, మొదటి ప్రతాపరుద్రుని కుమారుడు గణపతిదేవుడు రాజ్యానికి వచ్చాడు.

గణపతి దేవరాజు రాజ్యానికి రాగానే దేవగిరి యాదవరాజులు తన పినతండ్రిని చంపారనే కసికొద్దీ అసంఖ్యాకమైన సైన్యాన్ని పోగుచేసి దేవగిరి మీదకు దండయాత్ర సాగించాడు. దేవగిరి కోటను చక్రబంధంతో ముట్టడించి ఘోర సంగ్రామం జరిపాడు. అతని పరాక్రమ ధాటికి తట్టుకోలేక దేవగిరి రాజులు సంధి చేసుకున్నారు. సంధి షరతుల ప్రకారము దేవగిరి రాజపుత్రికయిన రుద్రమదేవిని అతనికిచ్చి వివాహం చేసి, ప్రతి సంవత్సరం కప్పం కట్టడానికి ఒప్పుకున్నాడు. ఆ తరువాత తన సైన్యాన్ని చోళ, కటక దేశాలపైకి నడిపించి, ఆయా రాజులను సంపూర్ణంగా ఓడించాడు. అంతవరకూ సర్వ స్వతంత్రులుగా ఉంటున్న మన్నె దొరలను గెల్చిన ఖ్యాతి కూడా యితనికి దక్కింది. ఈ విధంగా దిగ్విజయ యాత్ర చేసిన తర్వాత, సామ్రాజ్యం సిరపడిన తరువాత ప్రజాహిత కార్యాలనేకం చేశాడీరాజు. దాన ధర్మాలలో సాటిలేని మేటియని విఖ్యాతి వహించాడు. అయితే తన తండ్రిని చంపిన మహాదేవరాజుకు సాయంచేసిన జైనుల మీద మాత్రం ఇతనికి సంపూర్ణమైన విద్వేషం ప్రబలివుంది. అగ్నికి ఆజ్యం పోసినట్టు నెల్లూరును పాలించుచున్న మనుమసిద్ధి భూపాలుని నుండి రాయబారిగా వచ్చిన తిక్కన సోమయాజి ప్రోద్బలంతో జైనులను నానా హింసలు పెట్టాడు. అతని జైనమత ద్వేషం శైవమతాభిమానంగా

వెల్లివిరిసింది. లింగధారులైన ఆరాధ్య బ్రాహ్మణులను గురువులుగా స్వీకరించి, వారి బోధన ననుసరించి వేనవేలుగా జైనులను సంహరించాడు. సామ్రాజ్యంలోని జైనులకు, శైవులకు విద్వేషాలు విపరీతంగా ప్రబలాయి. అయితే, చండశాసనుడైన గణపతిదేవునకు భయపడి జైనులు మారుమాట చెప్పక చెట్టుకు పుట్టకొకరైనారు. అయినా, వారిలోని పగ మాత్రం చల్లారలేదు.

గణపతి రాజుకు పుత్ర సంతానం లేదు. అయితే అతనికి యిరువురు పుత్రికలు జన్మించారు. మొదటి ఆమె పేరు రుద్రమ రెండవ ఆమె పేరు ముమ్మిడమ్మ. రుద్రమ్మదేవినే పురుషుడిగా అలంకరించి రాచ నీతి నేర్పి, రణవిద్యా కోవిదురాలినిగా చేసి, తన తరువాత ఆమెకే సామ్రాజ్య పట్టాభిషేక మొనర్చి, పుత్రులులేని కొరత తీరినట్లు సంతోషిస్తూ కన్నుమూశాడు గణపతిదేవుడు. ఈమెయే రాణి రుద్రమ. చండశాసనిగా పేరు గాంచిన ఆంధ్ర మహిళ. అబళలు అబలలు కారని నిరూపించిన మహాసాధ్వి. ఆడుదాని రాజ్యం ఏమిటని జైనులు లేపిన విప్లవాన్ని ఈమె అణచివేసింది. కత్తి పట్టుకొని కదనరంగాల కదను త్రొక్కింది. ఆంధ్ర దేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందికి తీసుకొని వచ్చింది. ప్రజలకు కన్నతల్లిలాగా, శత్రువులకు చండశాసనిలా వ్యవహరించింది రాణీ రుద్రమ. అయితే, ఆమెకూడా సంతానం లేకుండానే మరణించింది. ఆమె తరువాత రాజ్యానికి వచ్చింది ఆమె చెల్లెలు ముమ్మిడమ్మ బిడ్డడు రెండవ ప్రతాపరుద్రుడు. అతని మంత్రి యుగంధరుడు. ఆగతనాగతవేత్త, ఘటనాఘటన సమర్థుడు, అసాధారణ రాజకీయ కోవిదుడు.

మంగళ తూర్యారావముల మధ్య అరుణోదయమునకు ముందుగనే నిద్రనుండి మేల్కొన్న మహారాజు ప్రతాపరుద్రుడు పన్నీటి జలముల మంగళస్నాన మాచరించి పునీతుడై కులదేవతయగు కాకతి దేవతకు మ్రొక్కి, పిమ్మట ఆయుధశాలకు బయలుదేరాడు.

ఆ నాడు ఓరుగల్లు సమాదికోత్సాహంతో వెల్లివిరుస్తోంది. ఆంధ్ర వీరులు తమ తమ శరస్త్రాణాలతోనూ, విల్లు అమ్ములతోనూ, ఖడ్గకవచాల తోనూ అతి సుందరంగా ఆహ్లాదకరంగా అలంకరించుకొని, తమ తమ ఉత్తమాశ్వాలను అధిరోహించి దారాపుత్రాదులవద్ద వీడ్కోలు పుచ్చుకొని రాజ ప్రాసాదం చేరి, సరిగా అరుణోదయ సమయానికి బారులుతీర్చి నిల బడ్డారు.

ఆయుధగారంనుండి వీరపురుష వేషధారణతో వెలువడిన మహా రాజు తన ప్రాసాదపు రెండవ అంతస్థునుండి క్రింద వేచియున్న తన పరి జనులను ప్రశాంత దృష్టితో పరికించాడు. మహారాజును చూడగానే సైనిక సముచ్ఛయం ఉచ్చైశ్రవంతో దిక్కులు పిక్కటిల్లేటట్లు ఘోష చేసింది. మహారాజు చిరునవ్వులతో సమాశ్వాసం చేశాడు. ఆ తరువాత గంధగజ సదృశ గమనంతో అంతఃపురానికి బయలుదేరాడు.

అంతఃపురానికి చేరిన మహారాజుకు మహారాణి శయనాగారపు ద్వారాలు ఇంకా మూసివుండటం కనిపించింది. ద్వారానికి కిరువైపుల సేవికాజనం పరిమళ వసు సముచ్ఛయంతో, ముఖ ప్రక్షాళనాదికములకవసరమగు బంగారు బిందెలతో, బంగారు పళ్ళేరాలతో వేచి ఉండటం కనిపించింది. మహారాజును చూడటంతోనే దాసీలు వంగి నమస్కారం చేశారు. మహారాణి ఇంకా నిద్రలేవలేదని సేవికలు చెప్పకుండానే అర్థం చేసుకున్నాడు మహారాజు. మహారాజుకు ఏమి చేయటానికి తోచింది కాదు. తానెరిగి ఉన్నంతవరకూ మహారాణి ఎన్నడు అంతగా మైమరచి నిద్రించ లేదు. కింకర్తవ్యతా విమూఢుడై మహారాజు పరిజనంతోపాటు, తాను కూడా శయనాగార ముఖద్వారం వద్దనే దగ్గరలో ఉన్న ఒక పీఠంపై ఆసీనుడయ్యాడు.

క్షణక్షణానికీ సూర్యదేవుడు మింటికెగ్రబాకసాగాడు.

చూస్తుండగానే బారెడు ప్రొద్దెక్కింది. మహారాజు ఏమి జరిగి ఉంటుందా అని ఆందోళన పడసాగాడు. అయినా, మహారాణి నిద్రా భంగం చేయటానికి ఆచారం అవరోధంగా పరిణమించటంవల్ల, మహా రాజు మరేమీ చేయలేకపోయాడు.

ఇంతలో అంతఃపురాంతర్భాంనుండి కెవ్వున కేక వినిపించింది. మహారాజు ఇక తన ఆస్థానంలో నిలువలేకపోయాడు. మర్యాదలనుమన్నించటం మరచిపోయి, ఒక ఉదుటున తన ఆసనం నుండి దిగ్గునలేచి, మహారాణి అభ్యంతర మందిర ద్వారాన్ని తన భుజస్పందనమున లాఘవముగా బేధించి లోపలికి ప్రవేశించినాడు.

అప్పుడే నిద్రనించి మేల్కొనిన మహారాణి- మహారాజు నేత్రాలకు వికలిత మానసగా కనిపించింది. మహారాజు తన వీర పురుషోచిత వేషధారణలో భయంకరమూర్తిగా కనిపించాడు మహారాణి నేత్ర ద్వయానికి. ఒకరి నొకరు చూచుకుంటూ అలాగేప్రండి పోయారు ఆ తరువాత కాని మహారాజు సమ్ముఖంలో ఉన్నాడనే విషయం రాలేదు మహారాణికి. రాణి వెంటనేలేచి నుంచుంది. ఎదురుగా ఉన్న మహారాజుకు ప్రణామం చేసింది.

"ఏమి సన్నాహం, మహాప్రభూ?"

అప్పుడే మరచిపోయావా, దేవీ? వేటకు సర్వసన్నాహాలూ జరిగాయి: దేవివారి దగ్గర సెలవు పుచ్చుకోటానికి చాలా కాలంగా ద్వారం వద్ద నిరీక్షించాను."

రాణి గవాక్షంగుండా బయటికి చూసింది. సరసర మింటికెగ ప్రాకుతున్న బాలభానుణ్ని చూసి క్షణకాలం నివ్వెరపోయింది. ఇంత ప్రొద్దెక్కువరకూ నిద్ర మేల్కొననందుకు తనలో తానే లజ్జిత కాసాగింది. అది గ్రహించాడు ప్రభువు.

"మన్నించండి, మహారాణీ! తమరు తెలియపరచకుండానే అంతఃపురంలో ప్రవేశించాను. కాలాతీత మౌతున్నదనేది కారణం కాకపోయినా, తమరు పెద్దపెట్టున కేకవేశారు. కారణాన్వేషణకని ఆచారాల్ని అవతల త్రోసి, అంతఃపురంలో అడుగుపెట్టాను."

మహారాణి తన విభునివంక రెప్ప ఆర్పకుండా చూడసాగింది. ఆమె మనోగత భావాలు మహారాజుకు అందటంలేదు ఎంత ప్రయత్నించినా.

"శారీరక రుగ్మత ఏమైనా ఆవహించిందా, దేవీ?"

"లేదు, ప్రభూ! రుగ్మతకాదు" మహారాణి క్షణకాలం తల వంచి

ఆలోచించింది. ఆ తరువాత హఠాత్తుగా అడిగింది:

'ప్రభూ! ఒక్క కోరిక మన్నించగలరా !'

మహారాజు ఆశ్చర్యంగా చూశాడు. 'అడుగు దేవీ! దేవేరి కోరికను ధిక్కరింపగలనా ?'

'అయినచో. ఈ వేట మానివేయండి ప్రభూ?'

"దేవీ!"

"ఈ వేట కార్యక్రమాన్ని ప్రస్తుతానికి నిలిపివేయండి."

"ఇది విపరీతమైన కోరిక, దేవీ! భద్రాచలప్రాంత మన్యారణ్యాలలో వన్యమృగములు విచ్చలవిడిగా సంచరిస్తూ—రైతులనూ, గ్రామాలనూ అల్లకల్లోలం చేస్తున్నవని అనేక దినాలుగా వర్తమానాలు వొస్తున్నయ్. ఇంతకాలం ఉపేక్షచేసినా, ఉపేక్ష సామ్రాజ్యక్షయానికి దారితీసే లోపున కర్తవ్యనిష్ఠులవటం రాజధర్మం కదా ?"

"రాజధానిలో యుగంధర మహామంత్రులు కూడా లేరు, ప్రభూ!"

"వారి ప్రతిరూపము జనార్ధన మంత్రి ఉన్నారు కదా ? అయిననూ వీరపత్నివి - మీకేం భయము మహారాణీ! వేటయన్న భయపడుచున్నారా ?"

"లేదు కాని, మీరా వేటమానివేయవలెను."

"కారణముండవలెను కదా!"

"సకారణంగానే అర్థిస్తున్నాను ప్రభూ !"

"ఏమిటా కారణము ?"

"ప్రభూ మీరిందు ప్రవేశించు సమయంలో నేను ఒక దుస్స్వప్నము గాంచాను,"

"స్వప్నమా?" మహారాజు ముఖంలో ఒకించుక హాసరేఖ ఉదయించింది. "కలలు కల్లలు కాని, వాస్తవము లగునా ?"

"ప్రాతఃకాలమున కాంచిన కల వాస్తవమౌతుందని ప్రాజ్ఞులు చెప్తుంటారు, మహారాజా!"

"హుం. ఇంతకూ కల ఏమని ?"

"ఒక వాడిచూపుల గరుడపక్షి, ఆదమరచి అల్లనల్లన ఆడుకొనుచున్న ఒక పావురమును తన వాడి గోళ్ళ సందున ఇరికించుకొని నింగికెగసింది."

"ఇదేనా కల ?"

"ఔను, ప్రభూ!"

"దేవీ! నీ కలలోని గరుడపక్షిని నేనేల కారాదు ? ఆ ఆదమరచి ఆడుకొనుచున్న పావురము—నేనొనరింపబోవు వేటలోని ఏ సింహమో, శార్దూలమో ఏల కాకూడదు ?"

"ప్రభూ! తమకు సమాధానమిచ్చు శక్తిసామర్థ్యములు నాకు లేవు. కాని, నా మనస్సు కీడునే శంకిస్తున్నది."

"అది కేవలము రజ్జు సర్ప భ్రాంతి, దేవీ!"

"ఏమైనా మీరు ఈ వేట ప్రయత్నం విరమించండి."

అనుజ్ఞవేడటానికి సమ్ముఖానికి వొచ్చిన రాజుకు, మహారాణి చెప్ప వలసిన మాటలేనా ఇవి, దేవీ ?"

"ప్రభూ!"

"నాకు పిరికి మందుపోయాలని చూస్తున్నావా ?"

"లేదు, ప్రభూ!" మహారాణి మోము చిన్నపోయింది.

"అదేమిటి, అప్పుడే దేవీ! అంత కోపమా? ఆంధ్ర సార్వభౌముడు ప్రపంచములోని ఏ విషాదాన్ని అయినా భరిస్తాడు గాని, కలకంఠికంట కన్నీరొలకటం చూడలేడు. దేవీ! మా మృగయా వినోదం నీకు విచారం కలిగిస్తే, మేము భరించలేము. దీనికోసం ఇంతగా బ్రతిమిలాడాలా? దేవీ ! వేట కార్యక్రమాన్ని మానుకుంటున్నాం" అన్నాడు మహారాజు. తన శ్రేయోభిలాషి అయిన ఆంధ్రసామ్రాజ్ఞి కోరికను తిరస్కరించటం తనకు భావ్యం కాదనుకున్నాడు మహారాజు; ఆమె హృదయాన్ని క్షోభపెట్టటం తనకు శోభనం చేకూర్చదనుకున్నాడు ఆంధ్రసామ్రాజ్య రమను ఆమెలో లక్షిస్తున్న మహారాజు.

"ప్రతీహారీ!" అన్నాడు మహారాజు.

యుగంధర్

ప్రతిహారిణి అంతఃపురంలోనికి పరుగులెత్తుకొని వచ్చింది.

ప్రభూ! మురారిదేవుడు తమ దర్శనార్థం వచ్చి వేచి ఉన్నారు ప్రభూ

"మురారిదేవుడా !" అన్నాడు మహారాజు. మురారిదేవుడు మహారాజుకు సమవయస్కుడు, రుద్రమదేవి భర్త చాళుక్య వీరభద్రుని ప్రథమ కళత్రపు కుమారుడు కావటంవల్ల, మహారాజుకు కొంచెం దూరమైననూ బంధుకోటిలోనివాడే. రుద్రమాంబ కాలమున జరిగిన గృహచ్ఛిద్రము కారణంగా జరిగిన అంతఃకలహాల కాలంలో మురారిదేవునకూ, రాజవంశానికి కొంత దూరమైంది. కాని, ప్రతాపరుద్రుడు సింహాసనానికి రాగానే తన కనుంగు చెలికాడైన మురారిదేవుని సాదరంగా ఆహ్వానించి, ఉచిత మర్యాదలతో సత్కరించి, రాజాస్థానంలో తగు స్థానాన్ని ప్రసాదించి, పాతవైరాలకు స్వస్తి చెప్పాడు. ఆ క్షణంనించీ మురారిదేవుడు రాజునకు అత్యంత సన్నిహితుడు కావటం మొదలు పెట్టాడు తన ప్రవర్తనతో.

అసలు ఈ వేట కార్యక్రమాన్ని మహామంత్రి యుగంధరులవారు ఊరకలేరన్న కారణాన, మహారాజు ఈ మూడు నెలలనుండి వెనుకకు త్రోస్తూ వచ్చారు కాని, మురారిదేవుడు మాత్రం దిన-దినమూ ప్రజల ఆర్తనాదాన్ని సభలో వినలేకున్నామనీ, వన్యమృగాలనుండి ప్రజలను రక్షించాల్సిన బాధ్యతను ప్రభువులే విస్మరిస్తే, రాజ్య సంక్షోభం కలుగుతుందనీ —మహారాజుకు మహాసభ మధ్యంలో మనవిచేసి, వేట కార్యక్రమాన్ని నిర్ణయింపచేశాడు. మురారిదేవుని ఆగమనం ఆశ్చర్యం కలిగించకపోయినా, మహారాజు పరిస్థితి మాత్రం విషమంగా పరిణమించిందని గ్రహించాడు. వెంటనే మురారిదేవుని ప్రవేశపెట్టమని ఆజ్ఞ ఇచ్చాడు సార్వభౌముడు.

మరుక్షణంలో మురారిదేవుడు అంతఃపురంలో ప్రవేశించి విచలితుడైన మహారాజును, సంచలితచిత్త అయిన మహారాణిని తిలకించాడు. పరిస్థితి అర్థమైంది రాదతనికి.

"మహారాజా ! అభివందనములు!' అంటూ రాజును సమాశ్వాసించాడు మురారిదేవుడు,

"మురారిదేవా ! ప్రస్తుతం వేట కార్యక్రమాన్ని విరమించాం." అని మాత్రం అనగలిగాడు మహారాజు.

ఆ వాక్యం అతని పెదవులనుండి వెలువడలేక వెలువడలేక వెలువడి నట్లు కనిపిస్తూనే ఉంది. ఆ మాట అనటానికి అతని ఆత్మాభిమానం రూపొంది ఎదురు నిలిచింది. కాని, మహారాణి మహత్తర వ్యక్తిత్వం రాజుచేత ఆ పలుకు పలికించింది ఎలాగైతేనేం.

"ఇదేమి అన్యాయం ప్రభూ!" అన్నాడు మురారిదేవుడు.

"అన్యాయం కాదు. మా మాటకు మహారాణీవారు అడ్డుచెప్తున్నారు! మహారాజు దోషమును మహారాణీమీదకు త్రోసివేసినాడు.

రాజుకు ఆత్మగతముగా వేటపైనున్న తమకము అసాధారణ మైనది. అతడు అంతర్యమున మురారిదేవుడు ఏలాగున నైనా మహారాణిని సమాధానపరిచి, వేట కార్యక్రమమును పునరుద్ధరించవలెనని కోరుకుంటు న్నాడు: తదుద్దేశ్యానుసారంగానే పదప్రయోగం చేశాడు మహారాజు.

మురారిదేవుడీ విషయాన్ని గ్రహింపకపోలేదు.

"ఇది ఏమి అన్యాయం, మహారాణీ ! మహారాజును ఈ విధంగా అంతఃపురంలో బందించటం న్యాయమా ?"

మహారాణి—మురారిదేవుని వంక తీక్షణంగా చూసింది. కాని' సమాధానం మాత్రం ఇచ్చింది కాదు. చేసేదిలేక, మహారాజే మిత్రుడి మనస్సు నొప్పించటం ఇష్టంలేక సమాధానం చెప్పాడు.

"అదికాదు మురారిదేవా ! మహారాణి వారికి నేటి ప్రాతఃకాలమున, నిదురలో దుస్వప్న సందర్శనమైనదట."

"అందుకని?"

"అందుకని మహారాణి వారు మాకు పురము వీడ అనుజ్ఞ నిరాక రిస్తున్నారు."

"అనుజ్ఞ ఇవ్వటానికి నేనెవ్వతెను, మహారాజా ?"

"తమరు మహారాణులు, తాము ఇలా కోపంగా సెలవిస్తే ప్రజ [illegible] శంకిసూ

వాస్తవాలను విస్మరిస్తే అవతల వన్యమృగాల బారినుండి వ్యధపడుతూ— ఆర్తనాదాలుచేస్తూ బాధపడుతున్న ప్రజలు మీ బిడ్డలేగా దేవీ! అదీ కాక, అవక్ర పరాక్రమ సమపేతుడైన ప్రతాపరుద్ర చక్రవర్తిని, తేరి కన్నెత్తి చూడటానికి ఎవరికి సాధ్యమమ్మా? పదిమంది పెద్దలు కూర్చున్న సభా నిర్ణయాన్ని, తమను తమ దివ్య వ్యక్తిత్వాన్ని ఆధారంగా చేసుకొని మార్చాలని చూడటం న్యాయమా?" అన్నాడు మురారిదేవుడు.

మహారాణి ఆలోచనలో పడింది. ఒక ప్రక్క భీకరమైన కల! అందులో ప్రాతఃకాలమున వచ్చిన కల! మరొక ప్రక్క సర్వశక్తివంతుడగు ఘటనాఘటన సమర్థుడగు, ఆగతానాగత వేదియగు ప్రధానామాత్యుడు యుగంధర మహామంత్రి దేశాంతరాన ఉండటం, ఆ మహానుభావుడు తాను తీర్థ యాత్రార్థం బయలుదేరేటప్పుడు మహారాజును ఏ పరిస్థితిలోనూ కోట వెలుపలికి పోరాదని కట్టడి చేయటం. మరో ప్రక్క వేటకు సన్నాహాలూ చేసుకొని సెలవు గైకొనటానికి వచ్చిన హృదయేశ్వరుడు సార్వభౌముడు, అల్లంతదూరాన వన్యమృగాలకాహుతి ఔతున్న ఆంధ్ర జానపదానీయపు హాహారావాలు — —మహారాణికి ఏమనటానికి పాలు పోయింది కాదు.

మహారాణి పడుతున్న మధన గ్రహించాడు మహారాజు. ఆమెచేత ఔననిపించుకోవటానికి ఇంతకన్నా మంచి సమయంరాదు. మహారాణీ! మృత్యువన్నది విధిలిఖితం. శౌర్యధనుడు ఒక్కసారే మరణిస్తాడు పిరికివాడు రోజూ మరణిస్తాడు. జరా మరణాలకు సాక్షి కర్మసాక్షి కాని, మనం కాదు, దేవీ! వేటకొరకని ఇంతవిపుల సన్నాహం చేసి, వందలాది సైనికులను రావించి, చివర క్షణంలో భార్యావిధేయత కొరకు, ఆమె కొచ్చిన ఒక దుస్స్వప్నాన్ని చూసి భయపడి పిరికివాడై మహారాజు వేట కెళ్ళటం మానుకున్నాడని నడి వీధిలో పదిమంది మీభర్తను, మహారాజును వ్రేలెత్తి చూపుతుంటే, మీరు అలాంటివానికి భార్యగా ఉండగలరా, దేవీ? మీ వచనాన్నతిక్రమిస్తున్నాననుకోకండి, వాస్తవాన్ని మీకు చూపిస్తున్నాను. వేట మానివేయమంటే ఈ క్షణాన మానివేస్తాను. కాని, అల్లా అనటం భావ్యమేమో భావించండి? క్షణకా[illegible]

అలమటిస్తూ, క్రూర వన్యమృగముల బారినుండి రక్షణలేక అలమటిస్తున్న మీ అనంత ఆంధ్ర ప్రజానీకాన్ని చూడండి. ప్రజలను కన్నతల్లిలాగా చూడాల్సిన మీరు— భర్త రాజనే విషయాన్ని విస్మరించి, భర్తృ వ్యామోహంలోపడటం న్యాయమా, దేవీ?"

మహారాజు మాటలు వింటున్న మహారాణికి నోట మాటరాలేదు. ప్రతాపరుద్ర మహారాజు తన నాథుడే కాదు! యావదాంధ్ర సామ్రాజ్య ప్రజాహృదయాధినాథుడు కూడా.

మహారాణి మారు మాటాడకుండా అభ్యంతర మందిరాంతర్భాగం లోనికి వెళ్ళింది. త్వరత్వరగా తన కాలకృత్యాలు ముగించుకొని మంగళ భూషణాలంకారయై తిరిగివొచ్చి ఆంధ్ర సార్వభౌమునికి మంగళాంజలి ఘటించి, నుదుట కుంకుమను దిద్దింది.

మహారాజు పరిమితి పరిజన పరివేష్టితుడై వేటకు బయలుదేరాడు, మహారాణి వద్ద సెలవుపుచ్చుకున్న తరువాత. జనార్ధనమంత్రి కూడా నగరం సింహద్వారం వరకూ అనుసరించాడు, మహారాజుకు వీడ్కోలు చెప్పటానికి. మహారాజు పరివారం సింహద్వారాన్ని సమీపించే సరికి, ద్వారాని కెదురుగా వందలాది జైన సన్యాసులు బారులు తీర్చి నిలుచుని ఉన్నారు. మహారాజు వేటకుబయలు దేరుతున్నప్పుడల్లా జైనులు వంద లొందలు నగర సింహద్వారాని కడు విలచి, వన్యమృగాలను సంహరించవొద్దనీ, జీవహింస మహాఘోరమనీ, అహింస పరమ ధర్మమనీ ఎలుగెత్తి నినాదాలు చేయటం మామూలే.

జైనుల అహింసా సిద్ధాంతం చాలా విపరీతమైంది. దాదాపు అనేక శుష్క వేదాంత సదృశ్యం. చీకటిపడితే దీపాల ముందు భోజనం చెయ్యాల్సి వొస్తుందనీ, అలా భోజనంచేస్తే దీపాల కాంతికి కొన్ని సన్న సన్నని జీవాలు ఎగురుతూ వొచ్చి వంటకాలమీద వ్రాలుతాయనీ, ఆ వంటకాన్ని భుజించటంవల్ల ఆ జీవాలు చచ్చిపోతాయనీ, తద్వారా జరిగిన జీవహింస మూలంగా పాపాలు తమను చుట్టుకుంటాయనీ వారి భయం. అంతేకాదు. శ్వాసపీల్చటంవల్ల శరీరంలోకి పోతున్న గాలిలో ఉన్న సూక్ష్మజీవులు చనిపోతాయేమోనన్నే భెంగతో వారు ముఖపు

రంధ్రాల కడ్డంగా సూక్ష్మజీవులులోనికి ప్రవేశించి చనిపోకుండా గుడ్డ లడ్డు పెట్టుకుని గాలి పీలుస్తుంటారు. సర్వసంగ పరిత్యాగానికి చిహ్నం శ్వేతాంబరధారణ అని కొందరు జైనులంటే, అసలు దిగంబరత్వమే దానికి చిహ్నం అని మరి కొందరంటారు. అందువల్ల జైనులలో శ్వేతాంబరులు, దిగంబరులు అని రెండు తెగలు ఏర్పడ్డాయ్. శ్వేతాంబరులకు సంఘంలో స్థానమున్నా, దిగంబరులకు నాగరిక సంఘంలో స్థానం లేదనే కారణంవల్ల, ప్రతాప రుద్రమహారాజు దిగంబరులపై ఆంక్ష విధించాడు. కాని దానికి దిగంబరులంతా తిరగబడ్డారు. తమ మత సిద్ధాంతానికి వ్యతిరేకంగా తాము వస్త్రధారణ చెయ్యమని నినాదాలు చేస్తూ మత స్వేచ్ఛ మా జన్మ హక్కంటూ వేలాదిగా జైన దిగంబరులు రాజప్రాసాదం వద్ద పెద్దపెట్టున ప్రదర్శనలు జరిపారు. వారందరినీ చూసిన మహారాజుకు వొళ్ళు మండిపోయింది. వారందరికీ వస్త్రధారణ చేసుకోవటానికి ఒక యామం కాలంగడువు ఇచ్చాడు మహారాజు. వస్త్రాలు కట్టుకుంటామన్న వారికొరకు కావలసినంత గుడ్డ తెప్పించి వారి ముందు ఉంచాడు. సూర్యుడు నడినెత్తికి వొచ్చేలోపల వారు వస్త్రధారణ చెయ్యకపోతే, అలా చేయని వారందరి తలలూ నరికివేయమని ఆజ్ఞలు ఇచ్చి లోనికి వెళ్ళిపోయాడు మహారాజు. ఒక్కొక్క అడుగు సూర్యుడు గగనవీధికి ఎగబ్రాకుతున్నాడు. కాని జైనులలో చలనం కలుగలేదు. వారు మహారాజుతో అటో, యిటో తేల్చివేసుకోదలచుకొన్నారు. అదికాక అక్కడ చేరిన తాము అసంఖ్యాకంగా ఉన్నారు. ఒకరిద్దరైతే మహారాజు తల నరికించగలడు గాని, తమ సంఖ్య వేలలో ఉన్నప్పుడు మహారాజు ఎవడికొరకు దిగివస్తాడనే ధీమా వారిలో చాలా మందికి లేకపోలేదు. ఇంతలో సూర్యుడు మింటి నడిమికి వచ్చి చేరాడు. దిగంబరుల చుట్టూ ఓరుగల్లు సైన్యంలోని మేటి విలుకాండ్రు వేలమంది వలయాకారంగా నుంచున్నారు తమ విండ్ల నెక్కుపెట్టి. సరిగా మధ్యాహ్న సమయానికి మహారాజు మరలి వచ్చాడు తన ప్రాసాదాగ్రభాగానికి.

"మీ నిర్ణయానికి తిరుగులేదా ?

లేదు." అన్నారు దిగంబరులు ముక్తకంఠంతో.

"అయితే. అనుభవించండి. మరొక్క అవకాశమిస్తున్నాను. మీ ప్రాణాలు దక్కాలంటే నా రాజ్యాన్ని విడిచి పొండి!" అన్నాడు మహారాజు.

కాని, జైన దిగంబరులు కదల్లేదు.

"మరో అవకాశం యిస్తున్నాను. మీరు నా నగరం విడిచి సంఘానికి దూరంగా, ఏ అరణ్యాలలోనో బ్రతకండి. వెళ్ళండి.

ఈ మాటు కూడా జైనులు కదల్లేదు. తమ కోరికలు తీరిస్తేకాని, తాము ఒక అడుగన్నా కదలమన్నారు. దిగంబరులుగా ఉన్నంత కాలం, సంఘంలో వారికి స్థానం కల్పించటానికి నిరాకరించాడు ప్రభువు.

"మా కోరిక మన్నించి, మా మతాచారాల్ని మా ఇష్టం వచ్చిన పద్ధతిలో అనుసరించే స్వేచ్ఛ మాకు మీరు ఇచ్చేదాకా మేము నిద్రాహారాలు మాని, ఈ విధంగా ఇక్కడే ఈ రాజప్రాసాదం ముందే ఉండి

"అయితే, అనుభవించండి ! వీరిని చిత్రవధ చెయ్యండి ! సంఘానికి చీడపురుగులైన వీరిని నాశనం చెయ్యండి ! చంపి వేయండి !" అంటూ ఆజ్ఞ యిచ్చి, వెంటనే ప్రాసాదాంతర్భాగానికి వెళ్ళిపోయాడు మహారాజు.

మరుక్షణంలో మిన్నుముట్టిన హాహాకారాలు, క్రమక్రమంగా గాలిలో కలిసిపోయాయ్.

ఈ సంఘటన జరిగిననాటినుండి జైనులలో దిగంబరులకూ, శ్వేతాంబరులకూ ఉన్న భిన్నాభిప్రాయాలు సమసిపోయాయ్. ఏ విధంగా ఈ సామ్రాజ్యాన్ని నాశనం చేయ్యాలా అని ఆలోచించసాగారు. కాని, మహామేధావి అయిన యుగంధర మంత్రినిచూచి భయపడి బయటకేమీ చేయకున్నా లోలోపల గోతులు త్రవ్వుతూనే ఉన్నారు. రాజబంధువుల లోని రాజవ్యతిరేకులందర్నీ కూడగట్టుకుంటున్నారు. వీలుచిక్కినప్పుడల్లా ప్రదర్శనలు జరుపుతూనే ఉన్నారు. జైనులు సమస్యాత్మక జీవులుగా మారిపోయారు. సమస్య లేకపోతే సమస్య సృష్టిస్తారు. తద్వారా అశాంతిసృష్టిని కలిగిస్తారు. ఆ సన్నివేశాన్ని అనుకూలంగా వాడుకుం

టారు. దానివల్ల రాజుమీద విద్వేషాన్ని కలుగజేస్తారు.

ఈ రోజున మహారాజుకు నగర సింహద్వారం వద్ద ఎదురయిన ప్రదర్శనకూడా అలాంటిదే! వారు మహారాజుకు అడ్డు నిలుచుంటారు. అహింసా పరమోధర్మః - పరాయి రాజులను గెలవటానికి, దారుణ మారణహోమానికీ కదా ఈ విపులసైన్యం? ఇది మనకెందుకు? నిరాయుధీకరణ అత్యుత్తమ ధర్మం. ఒకరిపైకి దండెత్తే ప్రమేయం ఎందుకు? ప్రాణి హింస మహాపాపం. ఈ సైన్యాన్ని కూర్చోబెట్టి మేపేబదులు వీరందరిని తీసివేసి వీరిమీద ఖర్చుపెడుతున్న దాన్ని ప్రజాసౌకర్యాలకు వినియోగించటం మంచిది. మృగయా వినోదం మహాపాపం. అమాయక వన్యమృగాలు రాజ ప్రాసాదాంతర్భాగంలో పట్టుసెల్లాలమీద శయనించే మీకు ఏం కీడు చేశాయ్? అంటూ ఉపన్యాసాలు ఇస్తారు. దారి కడ్డు లేవమంటే లేవరు. దాంతో సైనికులు తమపై బలాన్ని ప్రయోగించి రాజుకు దారి చేయటం జరుగుతుంది. అది చాలు జైనులకు. వారాశించే ప్రయోజనం అదే. సైనికులు తమపై బలప్రయోగానికి పూనుకోగానే హాహాకారాలు చేస్తారు! అది చూస్తూన్న సామాన్య ప్రజలు 'రాజెంత క్రూరుడు! అమాయక సాధువులను ఎలా చిత్రవధ చేస్తున్నాడు,' అనుకుంటారు. అదే జైన స్వాములు ఆశించే ప్రయోజనం. ఈనాడు కూడా అలాంటి ప్రదర్శనే ఎదురైంది. మామూలు కార్యక్రమమే ప్రారంభమైంది రాజభటులవైపు నించి కూడా.

"ప్రభూ!" అన్నాడు జైనదళనాయకుడు కాయసిద్ధి.

"ఓ? కాయసిద్ధి శ్రమణకులు. మీరు చేయబోయే హితోపదేశం విన్నాం. మర్యాదగా దారి వొదలండి" అన్నాడు మహారాజు.

"జీవహింస మహాపాపం ప్రభూ!"

"ఆ విషయం మాకు తెలుసు. కాయసిద్ధీ!"

"మీరీ వేట ప్రమేయాన్ని మానెయ్యండి."

"తమరు దారి కడ్డు లేవండి."

"అది జరుగదు ప్రభూ! అహింసా పరమోధర్మః. సాటి వన్య మృగాల ప్రాణరక్షణకు నేను ప్రాణార్పణ చేస్తాను. ఈ రోజున తమ రథం ఈ కాయసిద్ధి శరీరంమీదుగా దాటి, నగరు బయటికి వెళ్ళవలసిందే!" అన్నాడు కాయసిద్ధి.

"మా రథం ఏ దారిన పోవాలో-మా అశ్వ చోదకుడికీ, అశ్వాలకు కూడా తెలుసు. పాపం! ఎన్నడూ ఈ ప్రదర్శనలలో బహిరంగంగా పాల్గొనని పెద్దలని మర్యాద ఇచ్చి మాట్లాడుతున్నాను. కాని, నా పలుకు చెవిటివాని ముందు శంఖధ్వని. ఊఁ! అతణ్ని దారిలో తొలగించండి!" అన్నాడు ప్రభువు.

మరుక్షణంలో కాయసిద్ధిని ఇద్దరు భటులు తమ చేతులపై ఎత్తు కొని వెళ్ళి అవతల నుంచోపెట్టారు. ఆ సమయంలో ప్రతాపరుద్ర చక్ర వర్తి ప్రక్కన - తన ఉత్తమాశ్వంమీద ఉన్న మురారిదేవుణ్ని చూసి కాయసిద్ధి ముఖంలోనూ, కాయసిద్ధిని చూసి మురారిదేవుని ముఖంలోనూ, అవతరించి అంతలోనే మరుక్షణంలో అంతర్ధానమైన సునిశితహాసరేఖలను- మూడవవాడు ఎవడూ గ్రహించలేకపోయాడు. వారి మధ్య ఆ క్షణకాల ములో జరిగిన రెప్పల భాష, సునిశిత దృష్టిగల జనార్దనమంత్రి కళ్ళలో కూడా మచ్చు చల్లింది. మిగిలిన జైనులరు భటులు తమ-తమ బల్లేలను అడ్డంగా త్రిప్పి, రెండు చేతులతోను పట్టుకుని వెనుకకు త్రోయసాగారు. జైనులంతా తమకు దెబ్బలు తగిలినా - తగలకపోయినా హాహాకారాలు చేస్తూ, నిరంకుశత్వం నశించాలని పెద్దగా అరుస్తూ దూరంగా వెళ్ళి పోయారు.

జనార్దన మంత్రి - మహారాజుకు నగరద్వారం వద్ద వీడ్కోలు ఇచ్చాడు. కాని; అతనిలో ఉత్సాహంలేదు. అతని శంకా సంకుచితాంతరం గాన్ని గ్రహించాడు ప్రభువు.

"అమాత్యులు ఈ స్వల్ప విషయాలకు అధైర్యపడటం సమం జసమా?"

"అది కాదు, మహారాజా! తమరు ప్రస్తుతానికి ఈ ప్రయత్నాన్ని విరమిస్తే!"

"ఏం? తమకు కూడా ఏదైనా కల వచ్చిందా?"

"ఔను, ప్రభూ! ఒక డేగ ఒక పావురాన్ని తన్నుకుపోతున్నట్లు."

"అంతే కదా - మహారాణీ వారికికూడా ఈ కలే వొచ్చిందిట! నేనే డేగను, వన్యమృగాలు పావురాలు సరా, మహామంత్రీ! కలలు నిజమౌతాయా, మీ చేతులలో ఉన్న నగరం కంచుకోటలాంటిదని నాకు తెలుసు. వేళ అతిక్రమిస్తున్నది!" అంటూ సెలవు తీసుకొని కదిలాడు మహారాజు మందహాస వదనంతో.

మహారాజుతోపాటే సైనిక నివహం కూడా కదిలింది తూర్పు దెసగా. ఆ సేనావాహిని కనుమరుగయ్యే వరకూ అలాగే చూస్తూండి పోయాడు జనార్ధనమంత్రి.

అనతికాలంలోనే ఆంధ్ర పతాకాలు నింగిలో తేలియాడుతూ దూరాన అదృశ్య మవసాగాయి. జనార్ధనమంత్రి అనుకున్నాడు ఆ దృశ్యాన్ని చూసి.

"ఆంధ్ర సార్వభౌముడు తన రాజ్యలక్ష్మిని వెంటతీసికొని. ఓరుగల్లును కనుమరుగై పోవటం లేదుకదా?" తన చిత్త చాంచల్యానికి తనలోనే కృంగిపోయాడు మరుక్షణంలో మంత్రి జనార్ధనుడు.

మహారాజు వేటకరిగి పదిరోజులు దాటింది. ఆంధ్ర రాజధాని ఓరుగల్లు పట్టణం మహారాజూ, మహామంత్రీ నగరంలో లేకున్నా, వారు లేని లోటును మాత్రం మచ్చుకయినా అనుభవించటం లేదు. చారచక్షుడగు జనార్ధనమంత్రి పగలనక, రాత్రియనక వేయి కండ్లతో రాజ్యాన్ని,

రాజధానినీ పరికిస్తున్నాడు. మహారాజు వేటకరిగిన పదకొండవ దినమున పాతిక వేల సంఖ్యాబలం కలిగిన తురకదండు ఢిల్లీనుండి బయలుదేరిందనీ, గోదావరి నవధరించి దాదాపు వారం రోజులు దాటిందనీ వేగు వచ్చింది. జనార్ధనమంత్రికి అనుమానం వేసింది. క్రిందటి సంవత్సరం ఢిల్లీ చక్రవర్తి అయిన ఘ్యాజుద్దీన్ తుగ్లక్ పెద్ద కుమారుడగు అలూఫ్ ఖానుడు దాదాపు లక్ష సైన్యంతో బయలుదేరి వచ్చి ఓరుగల్లు కోటను ముట్టడించాడు. కాని, ఆంధ్రవీరుల అసమాన అస్త్రశస్త్ర విద్యానైపుణ్యానికి తురుష్క సేన పలాయనం చేయసాగింది. ఆదిలో దుముకటానికి ముందుకురాని తురుష్క సేనను చూసి అలూఫ్ ఖానుడికి పట్టరాని కోపం వచ్చింది. ఉచ్చైశ్రవంతో తన సిపాయిలందరకూ ముందుకు దూకమని ఆజ్ఞ ఇచ్చాడు. కాని, ముందుకు పోతే ఆంధ్ర సేనావాహిని వర్షిస్తున్న శిలీముఖాల ధాటికి మృత్యు దేవతాలింగనం తప్ప గత్యంతరం లేదు. తమ నాయకుని అజ్ఞను పాటించటానికి వెనక ముందాడుతున్న తన సైన్యం మీద విపరీతమైన కోపం వచ్చింది అలూఫ్ ఖానుడికి.

"సిపాహియో! మీ ముందు నుంచోని ఆంధ్ర వీరులికి వెన్నుయిచ్చి పారిపోతున్న ఢిల్లీసైనికులు కాఫిర్లతో కలసిపోయారు. వెనక్కు తిరిగినా వార్ని సఫా చెయ్యండి—" అంటూ తన అంతరంగిక రక్షణదళం వారికి ఆజ్ఞ ఇచ్చాడు.

ఢిల్లీ దండుగతి నిర్గతి అయింది. ఎదురుగా వున్న బురుజువైపు పోతే ఆంధ్ర సైనికుల శస్త్రాస్త్రాలకు ఆహుతి కావటం తథ్యం. వెనుతిరిగితే తమ షాజాదాయే తమను మట్టుపెట్టిస్తున్నాడు. చూస్తూ చూస్తూ ఉండగానే లక్ష సంఖ్యా ప్రమాణం కలిగిన ఢిల్లీశ్వరుని దండు పాతిక వేలకు దిగిపోయింది. పీనుగ కుప్పలు పెరిగిపోసాగాయి. తన కళ్ళ ఎదుటే క్షణక్షణానికీ తరిగిపోతున్న స్వీయసైన్యాన్ని చూసి జయం మీద ఆశ క్షీణించి, ప్రాణాలు అరచేత పట్టుకొని పారిపోయాడు అల్లాఫ్ ఖాన్ అనాథ అయిన సైన్యం పైకి కోట తలుపులు

తెరిపించి, ఆంధ్ర సైనికులను నడిపించాడు యుగంధరమంత్రి. ఆ మహా రణరంగంలో ప్రాణాలతో బయటపడిన యవన వీరులు దాదాపు పదివేల మంది ఉంటారో, ఉండరో! ఇది జరిగి దాదాపు సంవత్సరం జరిగి పోయింది. నఖశిఖపర్యంతం ఆంధ్రవీరుల తాకిడికి హడలి పారిన మ్లేచ్ఛ సైన్యం తిరిగి ఓరుగల్లు మీదకి దండెత్తి రావటం. జనార్ధనమంత్రికి ఆశ్చర్యంగా తోచింది. అందులో సైన్యం అతి స్వల్పం. దాదాపు పాతిక వేలమంది మాత్రమే ఈ మాటు తురక దండుతో వస్తున్నారు. వీరు ఎందుకని వస్తున్నారో జనార్ధనమంత్రికి అంతుపట్టిందికాదు. మహామంత్రికి మరో విషయం కూడా తెలిసింది. ఈ మాటు ఈ దండు నడిపించుకొని వస్తున్నది ఢిల్లీ చక్రవర్తి కుమారుడు అలూఫ్ ఖాన్ కాడు; లల్లూఖానుడు. లల్లూఖానునికి సాటిలేని వీరుడనీ, యుద్ధ చార రాయబారతంత్ర కోవిదుడనీ మహమ్మదీయులలో పేరు ఉంది. ఈ మాటు ఈతని వెంట వస్తున్న ఈ దండు సశిక్షితమైన యవనసైన్యం కావచ్చునని ఊహించాడు జనార్ధన మంత్రి.

ఇతని వెంట ఖుస్రూఖాన్ సర్దార్ కూడా వస్తున్నాడు. ఖుస్రూఖాన్ సుల్తాన్ ఘ్యాజుద్దీన్ తుగ్లక్‌కు స్వంత చెల్లెలి కొడుకు.

జనార్ధన మంత్రికి మహారాజూ - మహామంత్రీ నగరులో లేకుండా ఉండటంవల్ల ఏమీ పాలుపోయింది కాదు. అయితే, పాతిక వేల బలం గల తురుష్క సైన్యాన్ని మట్టుబెట్టడం అతని కత్యంత సులభసాధ్యంగా గోచరించింది. అయినా, ఎందుకైనా మంచిదని తీర్థయాత్రయందున్న అన్నగారగు యుగంధర మహామంత్రులకు బేగిరావు టపాలుద ఈ వర్తమానాన్ని అందజేయమని చారులకు నిర్దేశించాడు. వేటలో ఉన్న మహారాజునుకూడా వెంటనే నగరమునకు తిరిగి రావలసిందని వర్తమానం పంపాడు. గోదావరీ నదీమతల్లిని దాటి వచ్చిన తురకదండు తిరిగి పోకుండా గోదావరి మీద బల్లకట్టులనూ చిన్న-చిన్న ఓడలనూ పగలగొట్ట వలసిందని ఉత్తరువులు పంపించాడు గోదావరినదీ రక్షక బృందానికి.

కోటలో ఉన్న లక్షమంది విలుకాండ్రకూ యుద్ధసన్నద్ధులు కావాలని ఆజ్ఞ ఇచ్చాడు. రథ గజ తురగపదాతి దళాలు వెంటనే సమావేశం కావాలనీ, ఆ యా దళాల అధిపతులందరూ తమ తమ సైనికులకు శిక్షణ పునః ప్రారంభం చేయాలనీ ముదల ఇచ్చాడు. అంతవరకూ రేయింబవళ్ళు తెరచియుండు నగర సింహద్వారాన్ని పగటివేళ మాత్రం తెరచియుంచి, సాయంకాల మగుసరికి బంధింపవలెనని ఆజ్ఞ ఇచ్చాడు. సింహద్వారం దగ్గరా, కోట బురుజుల మీదా కావలా ద్విగుణీకృతం చేశాడు! ఈ విధంగా విపత్కాలంలో చెయ్యదగిన జాగ్రత్తలన్నీ చేసి, అన్నగారి ఆగమనంకోసం, మహారాజు ఆగమనం కోసం కోటి కళ్ళతో నిరీక్షించ సాగాడు జనార్దన మంత్రి.

ఇంతలో మరో వర్తమానం అందింది జనార్ధన మంత్రికి. పరాజితుడై క్రిందటి సంవత్సరంపారిపోయిన అలూఫ్‌ఖాన్ ఢిల్లీకి వెళ్ళలేదనీ భీరువులా పారిన తాను ఢిల్లీ నగరాన్ని ప్రవేశించనని ఏనాటికైనా సరే, ఆంధ్ర సార్వభౌముడైన ప్రతాపరుద్రుని ఖయిదుచేసి, అతనిని వెంట తీసుకొని గాని ఢిల్లీ నగరం మరలిరాననీ ప్రతిజ్ఞచేసి, దేవగిరిలోని తమ యాదవ సామంతరాజుల ప్రాపకంలోనే ఉన్నాడనీ, ఇంతకాలంనుంచీ సైన్యాన్ని సమకూరుస్తున్నాడనీ, ఓరుగల్లులో ఉన్న పరస్పర వైషమ్యాల నాధారంగా చేసుకొని దేవగిరి ప్రభువులుకూడ యవనులకు దోహదం చేస్తున్నారనీ ఆ వార్త.

ఈ వార్త అందిన అనతికాలంలోనే అలూఫ్‌ఖానుడు ఇరవై వేల సైన్యంతో ఓరుగంటి నగరాభిముఖంగా బయలుదేరాడనీ, అసలు అతని రాకకు ఓరుగల్లు సామ్రాజ్యంలోని జైనమతాచార్యుల వద్దనుండి ఆహ్వానం వెళ్ళటమేననీ మరో వార్త అందింది. క్షణ-క్షణానికీ వివిధ చారవర్గాల నుండి అందుతున్న వార్తలను ఒకచోటపెట్టి చూచిన జనార్ధనమంత్రికి ఆందోళన హెచ్చసాగింది.

ఒకనాటి సుప్రభాతాన నగర ప్రాకారపు ఉత్తరపు బురుజును రక్షిస్తున్న సైన్యాధికారి రొప్పుకుంటూ-రోజుకుంటూ జనార్దనమంత్రి దర్శనానికి వొచ్చాడు మంత్రాలోచనా మందిరానికి. అతడు తెచ్చినవార్త మంత్రిశేఖరునికి ఆశ్చర్యం కలిగించకపోయినా, ఆందోళనను కలిగించింది. నగరునకు ఉత్తరంగా, దాదాపు ఒకమైలు దూరాన ఢిల్లీశుని గుడారాలు విడిశాయి. వాటిమీద మ్లేచ్ఛపతాకం నాట్యం చేస్తోంది.

ఈ వర్తమాన మందిన రెండు ఘడియలకు తురకదండు నాయకుడు ఉల్లాఖాన్- ఓరుగల్లు కోట సింహద్వారం వద్దకు కేవలం సేవక ద్వితీయుడై వచ్చి, మంత్రిశేఖరుల దర్శనం కోరుతున్నాడని వార్త వొచ్చింది. ఈ కోరిక కొంత విపరీతంగా గోచరించినా జనార్దన మంత్రి ఉల్లాఖానుడి ప్రవేశానికీ, అతడితో ప్రసంగించటానికి అనుమతి ఇచ్చాడు. ఆ తరువాత అనతికాలంలో ఉల్లాఖానుడికి-జనార్దన మంత్రి ఆలోచనా మందిరంలోకి ప్రవేశం కల్పించబడింది.

ఉల్లాఖాన్ డల్లంతదూరాన్నుండే బ్రహ్మవర్చస్సుతో మెరిసిపోతున్న జనార్దనమంత్రిని చూశాడు, చూసిన మరుక్షణంలో వంగి వంగి సలాములు జేస్తూ ముందుకు సాగాడు.

"సలామ్! మహామంత్రి యుగంధర్ మహారాజ్ సాహెబ్‌గార్కి-సలామ్ పెడ్తున్నాం! మీది తెల్వితేటల్కి- వంగి -వంగి నమస్కా-రాల్ పెడ్తున్నాం! మీ దీపేర్ వింటే, మాదీ దేషంలో పాలకోసం ఏడ్చే పసిపిల్లవాడ్ నోరు మూస్తాడ్ - బ్రత్కి- ఉన్నా, మన్సీ మీది పేర్ చెప్తే చచ్చిపోతాడ్! తమకి ఎన్నాళ్ళబట్టో దర్షనం చేయవాలా-చేయవాలా ఇచ్ఛగించినామ్. ఆ హదృష్టం మాకి అల్లా హిప్పట్కి- కల్గచేశాడ్! యుగంధర్ మహారాజ్! మిమ్మల్ని చూస్నా. ఈ దినం మంచి దినం. అవ్వారోట్ మల్లీ హొక్సారి వొంగి-వొంగీ దణ్ణం పెడ్తామ్!" అంటూ ఢిల్లీ సేనాని జనార్దనమంత్రికి సాష్టాంగ నమస్కా-రం చేసాడు. ఉల్లాఖాన్ స్థూలదేహం భూమాతను నఖ-శిఖ పర్యంతం చుంబించింది.

జనార్ధనమంత్రి ఈ అతిలోక వినయానికి ఆశ్చర్యపోయాడు. అందులో అతి వినయం ధూర్తలక్షణమని, అన్నగారు నేర్పిన ప్రథమ పాఠం. యుగంధర్ మంత్రి ఊరలేని విషయం తెలియకుండానే, లల్లూ ఖానుడు ఓరుగంటి నగర ప్రవేశం చేశాడనుకోవటం పొరపాటు! అంతే కాకుండా నయవంచన, అమాయకత్వపు నటన అతని కుత్సితాన్ని, గడుసుతనాన్ని తెలియచేస్తున్నవని త్రుటిమాత్రంలోనే గ్రహించాడు జనార్ధన మంత్రి.

"నమస్కారం, లల్లూఖాన్ సర్దార్‌జీ! తమరు ఇక ఆ ఆసనాన్ని అధిష్ఠించండి. నేను మహామంత్రి యుగంధరుణ్ణి కాదు, వారి సేవక మాత్రుణ్ణి-జనార్ధనుణ్ణి." అన్నాడు జనార్ధన మంత్రి.

"అయిన్దే, తమ పేరూ జనార్ధనుడూ జనార్ధన మంత్రీ! హంపే తసురి పేర్-బహుత్ అచ్ఛా! యుగంధర్ లేకపోతే, హోరుగల్లుకీ యుగంధర్ హీ రేహుంటూ వినీ ఉన్నాం. మిమ్మల్ని చూడటం మాకూ జాస్తీ సంతోషం సలాంలో, మహారాజ్!"

"సలాం, సర్దార్! తమరు వొచ్చిన పని సెలవిస్తారా?"

"అవష్యం. సెలవూ ఇచ్చుకుంటాం. కానీ, భాయీ సాహెబ్ మీకూ వంట్లో ఆరోగ్గం భాగాహుందీ?"

"ఆరోగ్యం మా కాకతి దేవత దయవల్ల సలక్షణంగా ఉంది. మీ సుల్తాన్ వారికి అల్లా కటాక్షం పూర్ణంగా ఉందికదా?"

"ఓ ! అల్లా పరిపూర్ణాకటాక్షం సంపాయించాలీ అనీ ఓరుగంటి! రాజు ప్రెతాప్ రుద్ర మహారాజ్‌తో భేటీ చేసీ రమ్మని మమ్మల్ని పంపార్."

"భేటీ! బహుత్ అచ్ఛా! క్రిందటి సంవత్సరం మీ రాజపుత్రుడు అలూఫ్‌ఖానుడు అపజయాన్ని పొంది పారిపోయినప్పుడే ఈ భేటీ జరగాల్సింది. కాలయాపన జరిగినా కావలసిన కార్యం కదా అది!"

"అదే మా సుల్తాన్వార్ హుద్దేశం. హిందీ రాజాకీ, హిందీ మంత్రికీ పరాక్రం వినీ మా సుల్తాన్ సాహేబ్ అంత పెద్ద పరాక్రమం మనుసుల్తో భేటీ హుంపే ఢిల్లీకి కోయీ కన్ను పెత్తి సూడలేర్. ఎల్లండి ఎల్లండి-

పోయి ప్రెతాప్ మహారాజాకి సజ్రూనాలిచ్చి భేటీ చేసోక్కొని తిర్గీ రండి మాదీ కొడుకూ అలూప్ చేసిన దండాయాత్రా మర్చిపొండి. మీకే అందులో కల్గిన నష్టం మాకే బరిస్తాం అనీ చెప్పమంటూ మీరు ఎల్లండీ!! మీరు ఎల్లండి!! మీరు ఎల్లండి!!! అంటూ మమ్మల్ని ఢిల్లీమే నిల్వ నివ్వలేద్," అంటూ తన ఆగమనకారణాన్ని విశదీకరించాడు అల్లుఖానుడు.

జనార్ధనమంత్రికి అతని ప్రతి మాటలోనూ కుత్సితమే ధ్వనించింది. రాయబారాన్ని అర్థించినవాడు ఆంధ్రసార్వభౌముని అనుమతి లేకుండా తెలుగుగడ్డమీద అడుగు పెట్టడం, అంతేకాకుండా అపార సేనావాహినితో కదలి రావటం .... అతని కుటిలత్వానికి చిహ్నాలు.

"సర్దార్! మీ రాయబారం సర్వవిధాలా హర్షించదగింది. అయినా, రాయబారానికి వొచ్చినవారు అసాధారణ సైన్యంతో తరలిరావటం, అనుమతిలేక ఆంధ్రదేశంలో ప్రవేశించటం ఆశ్చర్యంగా ఉంది."

"హన్మానం పడకండి, మహారాజ్, మీకే రాజాకి తొందర్గా కల్సూ కోవాలీ అనీ, భాయీ భాయీ కాబోతూ పరాయివాడిలాగే సెల్వా అడిగితే కోపం చేసుకుంటార్ అని తొందర్ తొందర్‌గా వొచ్చీపడినాం. లేకాపోతే హింతా సైన్యం లేకాపోతే ప్రెతాపరూద్రుడు రాజాకి హవమానం చేసినామ్ హౌతామనీ ఎంటా తీస్కొవొచ్చాం. మహారాజానీ కల్సుకోని సుల్తాను గారీ తరఫ్‌న భేటీ సేయటాన్కి మాసుల్తాన్‌వారూ తమ షొంతం చెల్లెలీ ఖొడ్కూ ఖుస్రూసర్దార్‌నీ పంపి ఉన్నార్."

మీ సదుద్దేశాలు సంతోషింపదగ్గవే, సర్దార్‌జీ!

అదీ సంతోషం మేమూ కోర్తూ ఉంటామ్ మాకీ రాజాకే దర్సనం హెప్డూ చేయిస్తార్? షామ్ రాజా దర్శన్ ఏర్పాటూ చేస్తార్?"

జనార్ధనుడికి అల్లూఖానుని ఆగమనంలోని అంతర్యం అవగాహన అయింది. నగరంలో యుగంధర మహామంత్రీ, మహారాజు ప్రస్తుతం లేరనే విషయాన్ని గట్టిగా తేల్చుకోవటానికే అల్లూఖాన్ తన దర్శనానికి వచ్చాడు.

"అల్లాఖాన్ సర్దార్! ఖుస్రూఖాన్ మీ సుల్తానువారి మేనల్లుడు-హుతో క్రిందటి సంవత్సరం అనవసరంగా పోరుసలిపి: మాకు అనంత సేనాన్నీ, ప్రాణాలనీ వ్యయంచేసింది సుల్తాను కుమారుడు అలూఫ్‌ఖాన్‌జీ గారు కదా? అలూఫ్‌ఖాన్ సర్దార్‌కూడా దేవగిరినుండి ఓరుగల్లుకి అభిముఖంగా బయలుదేరారని విన్నాం. వారు రాగానే భేటీ ఎర్పాచేయిస్తాం" అన్నాడు జనార్ధనమంత్రి.

"బహుత్ అచ్ఛా సర్కార్! బహుత్ అచ్ఛా?" అన్నాడే గాని అల్లాఖానుడి ముఖం చిన్నబోయింది. అతిగుప్తంగా ఉంచబడిన అలూఫ్ ఖానుడి ప్రయాణ సన్నాహం జనార్ధనమంత్రికి తెలియటం వల్ల ఆంధ్ర రాజనీతిజ్ఞులు ఏమరిలేరని గ్రహించాడు అల్లాఖాన్. అయినా, మేధాసంపన్నుడైన అల్లాఖాను వెంటనే తమాయించుకున్నాడు.

"మాదీ బుద్ధీ గడ్డీ తినీ మర్చిపోయింది. మీతో ఆ విష్యం మన్వీ చెయ్యలేద్. మాదీ సుల్తాను వారూ మాకీ ఈ భేటీకోసం హిక్కడీకీ పంపీనప్పుడ్ దేవగిరిలోని అలూఫ్‌ఖాన్ సర్దార్కీకూడా ఒక ఖత్ పంపినార్. అందులో సుల్తాను కొడూక్కిగారికి ఇలా రాయబారం హోరుగల్లాకి పంపూతుంతాం. మెంటనే ఎల్లి నీవు కూడా ప్రెతాప మారాజ్‌కీ మన్నన్ కోరూ హని హుకూం జారీ చేసినార్. హందువల్ల మాదీ రాజాకి బేటా మీరాజాకి దర్షనం కోసం ఆఖాల్ మీదా, మేఘాల్‌మీదా పరుగెత్తీ హొస్తున్నాడ్."

"చాలా మంచిది అల్లాఖాన్ సర్దార్? అలూఫ్‌ఖాను సాహేబ్‌గారు రాగానే దర్శనానికి అన్ని సన్నాహాలూ చేయిస్తాం. మీతో నిరాక్రమణ సంధి బరుపుకోవటానికి మాకు ఏ విధమైన అభ్యంతరంలేదు. కాని, దురాక్రమణను పూనుకొన్న వారిని దుష్టులుగా పరిగణించి, దురితజనసంహారం చేయవలసి వుంటుంది." అన్నాడు జనార్ధనమంత్రి.

"ఆహా! ఆహా! హద్భూతంగా సెల్వా యిచ్చి నార్. మీకే జోష్యం తెల్సా యేమో! మాదీ రాజాకీ గుండెకాయాలోని మాటా మీకి చెప్పినార్. అదీ మాకి జాస్తీ సంతోషం. మరీ మాకి సెల్వా యిప్పిస్తార్?"

"అవస్యం. సర్దార్‌జీ! మళ్ళీ మరొకసారి కలుసుకుందాం" అంటూ జనార్ధనమంత్రి లేచి లల్లుఖాన్ణి సాగానంపాడు.

ద్వారపాలకులు లల్లుఖాన్ణి నగరి సింహద్వారం వరకు తీసుకొని వెళ్ళి విడిచిపెట్టారు.

రామేశ్వరంనుండి తిరిగి వచ్చినరోజే విద్యానాథుడు జనార్ధన మంత్రిని కలుసుకున్నాడు. ఉదయభానునికి అర్ఘ్యమిస్తున్న మహామంత్రి అంజలిలోని ఉదకం పంకిలం కావడం, ఆ తరువాత ఎదురైన దుశ్శకునం జనార్ధన మంత్రికి వివరించి చెప్పాడు, దానికి తగినట్లుగా ఢిల్లీసుల్తాను దండు, నగరి బయట విడిసి ఉండటం గమనార్హమని విశదీకరించినాడు.

"మహారాజావారు మా మాట మన్నించారు కారు. సహజంగా వేటయందు మక్కువగల మహారాజుకు మురారిదేవుని ప్రోత్సాహం ఎక్కువయింది. ఎంత ప్రయత్నించినా లాభంలేకపోయింది. మహారాజు వేటకు వెళ్ళిన మునాడే సుల్తాన్ సైన్యం వచ్చి, నగరి బయట విడిసింది. భేటీకని కబురు కట్టింది.

"ఏమని భేటీ, జనార్దనా?"

"నిరాక్రమణ సంధిట! పరస్పర మైత్రి సూచకమైన సంధిట!"

"ఆ మాటలు మీరు విశ్వసించారా?"

"ఏమో! అంతా అగోచరంగా ఉంది. అన్నగారొస్తే ఏం సమాధానం చెప్పాలో తెలియకుండా ఉంది. విద్యానాథా ఒక పని చేస్తావా? ఈ తురకల అంతర్యాన్ని నువ్వే కనిపెట్టాలి! రాజూ మంత్రీ ఇద్దరూ ఊరలేని సమయంలో హటాత్తుగా ఊడి పడ్డారీ మ్లేచ్ఛులు. మహారాజు లేకుండా యుద్ధానికి కాలుదువ్వటం మన రాజనీతికి విరుద్ధం! వారికన్నా అధికమైన సైనిక ప్రపత్తి ఉన్నా, నాయకుడు లేని సైన్యం అనాథలా అల

మటిస్తుంది. అందుకని వారిని ఏ విధంగానయినా సరే- ఏమార్చవలసిన బాధ్యత నీది! వారి లోటుపాటులను బయటికి లాగాల్సిన బాధ్యత కూడా నీది!" అంటూ విద్యానాథుని రెండుచేతులూ పట్టుకున్నాడు జనార్దన మంత్రి.

"దీనికోసం ఇంతగా బ్రతిమాలాలా, జనార్దనా! ఇదుగో, ఇప్పుడే బయలుదేరి తున్నాను, సామ్రాజ్య రక్షణకు ఎలాంటి పనిచేయడానికియినా వెనుదీయను!" అంటూ బయల్దేరాడు ఆ క్షణాన్నే విద్యానాథుడు.

# 6

సంధ్యాసమయం అయింది. చండభాస్కరుడు తన సహస్ర కిరణకాంతి పుంజాన్ని ఉపసంహరించుకొని పశ్చిమాద్రి గర్భంలోకి కృంగిపోతున్నాడు. రాయబార రహస్యం జనార్దన మంత్రికి తెలిసిందే అన్న ఆందోళనతో లల్లూఖాను అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. తన పట కుటీరం ముందు. ఈ సమయంలో ఢిల్లీసుల్తాను కుమారుడు అలూఫ్‌ఖాన్ సర్దార్ తన బాసటగా ఉంటే ఎంత బాగుటుందనుకున్నాడు లల్లూఖాన్. అతనికా ఆలోచన వచ్చీనదే తడవుగా దూరాన గుర్రపు డెక్కల సవ్వడి వినిపించింది. ఆ వొస్తున్నది వేటకు వెళ్ళి తిరిగివస్తున్న ప్రతాపరుద్ర మహారాజేమోనన్న భయంతో లల్లూఖాన్ పశ్చిమ దిశను పరికించాడు. హయ పాదతాడనా సంజనితమైన ధూళి ఆకాశంలో మబ్బులా కమ్మిపోతోంది. అయినా, తాను చేసేదిలేదు: చేయగల్గిందిలేదు. రాజూ, మంత్రీ ఊర లేరని గంపెడాసతో వచ్చిన లల్లూఖాన్-మహారాజు నగరిలో ప్రవేశించబోతున్నాడనే ఉద్దేశ్యంతో తన మామూలు రాయబార నాటకాన్ని కొనసాగించదలచుకొన్నాడు. అంతలో అఘమేఘాలమీద తేలివస్తున్న అశ్వదళం తన పట కుటీరాన్ని సమీపించింది. తనకుయుక్తి మహారాజుకు తెలిసిపోయిందనే భయంతో కారు భూతాలవలె తనమీదికి దూసుకుతున్న అశ్వదళం నుంచి కనుమరుగు కావటానికి తన పట కుటీరంలో ప్రవేశించాడు. లల్లూఖాన్,

అంతలో బయట ఒక్కుమ్మడిగా జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టాయి. "షాజాదా అలూఫ్‌ఖాన్ బహద్దర్ జిందాబాద్!" అనే నినాదం ఒక్కసారిగా అనేక కంఠాల నుండి వెలువడి ఘనభోంతరాళాన్ని బద్ధలు చేయసాగింది. వచ్చినది ప్రతాపరుద్ర మహారాజు కాదు; ఛోటా సుల్తాన్ అలూఫ్‌ఖాన్ బహద్దర్ అని తెలుసుకున్నటువంటి ఉల్లూఖాన్ హృదయం ఒక దీర్ఘ సంతృప్త నిశ్వాసాన్ని విడిచింది. ఇక తనకు భయంలేదు. అలూఫ్‌కాన్‌తో రావల్సిన 25 వేల అశ్విక దళంకూడా వచ్చి వుంటుంది. వేడి నీళ్ళకు చన్నీళ్ళు తోడు అయినా, తాను తన అనంత సేనావాహినితో యుద్ధం చేయబోవడం లేదు. ఆంధ్ర సామ్రాజ్య రమను స్వాధీనం చేసుకోవడానికి ఆయుధబలం చాలదు. కదన రంగంలో కత్తి పట్టుకొని ముందుకు దూకి ఆంధ్ర వీరులతో చేయీచేయీ కలపడటం మృత్యుదేవత కరాళహస్తాన్ని ముద్దుపెట్టుకోవడమే అవుతుంది. అనవసరంగా ఆంధ్రులు ధర్మ పురుషులయ్యారు. వారిని జయించడానికి అధర్మ మొక్కటే సాధనం. వారికి శక్తి ఉంది; యుక్తి ఉంది; అసాధారణమైన మేధస్సు ఉంది. కానీ, అవన్నీ కుటిలుల కౌటిల్యానికి లోబడవే - అన్న ప్రగాఢ విశ్వాసంతో ఉల్లూఖాన్ కార్యసాధనకు పూనుకున్నాడు.

సంతోషాతిరేకంతో యువరాజుకు ఎదురు వెళ్ళి స్వాగతం చెప్పి, తన పట కుటీరానికి తోడ్కొని వచ్చాడు. ఇక కర్తవ్యాన్ని నిర్ణయించుకోవాల్సిన సమయం ఆసన్నమవడంచేత తోడి సరదారులందరికీ కబురు పెట్టాడు. ఆ తరువాత సమున్నత సింహాసీతిపైన ఆశీనుడై ఉన్న షహజాదా వంక చూచి, ప్రక్కనే కూర్చున్న ఖుస్రూకాన్‌కు సమాశ్వాసించి ఆనాటి తమ కార్యక్రమాన్ని వారికి విశదీకరించాడు. జనార్దన మంత్రితో తాను నడిపిన రాయబార సారాంశాన్ని కూడా వివరించాడు. రాజూ-మంత్రి ఊరికి పోవడం, అవ్యవధిగా వారు తిరిగి రాకనే తన ప్రగాఢ విశ్వాసం మొదలైన వాటన్నిటినీ వివరించాడు. ఇంతలో మిగిలిన సరదారులందరూ కూడా సమావేశం జరుగుతున్న పట కుటీరానికి అరుదెంచి తమ తమ ఆసనాలపై ఉపవిష్టులైనారు. చూస్తూండగానే సమావేశ స్థలమంతా

సరదారులతోనూ, వజీరులతోనూ, దండనాథులతోనూ నిండిపోయింది. లల్లుఖాన్ కథనం విన్న తరువాత రాజకుమారుడు అలాఫ్‌ఖాన్ తన అంతరంగికులను పరికించి ఆ సమయంలో తమ భావి కార్య నిర్ణయాను కూలమైనట్టి వివిధ సలహాలను చెప్పవలసిందిగా కోరాడు. మరుక్షణంలో దండనాథులు, వజీర్లు, సర్దార్లు తమ మిత్రులతో మంతనాలు చేయసాగారు. ప్రతి ఒక్కడూ తానే గొప్ప సలహాలను ఇచ్చి, రాజకుమారుని మన్ననలు పొందాలని బహుతీవ్రంగా ఆలోచించసాగారు. ఒకరితో ఒకరు సంప్ర దిస్తూ చేస్తున్న గుసగుస శబ్దం గుడారమంతా ఆవరించింది.

మహమ్మదీయ సేనాధిపతుల మంతనాలు జరుగుతున్న సమయంలో ఖుస్రూఖాను సర్దార్ లేచి నిలబడ్డాడు - తన అభిప్రాయాన్ని షహజాదా అలాఫ్‌ఖాన్‌కి మనవి చేయడానికి. మంతనాలు మానివేసి, ఖుస్రూఖాన్ చెప్పే ఆలోచనలు వినడానికి అందరూ అతనివంక చూశారు.

"షహజాదా అలాఫ్‌ఖాన్ సాహెబ్! రాజుగారు వేటకి పోయి ఉంటాడ్? ఒరంగోల్‌కి పెద్దమంత్రి రామేశ్వరం యాత్రాకి పోయి ఉంటాడ్! పెద్ద మంత్రి ఇపు అప్డె వచ్చేది లేదు. రాజాసాహెబ్ కూడా తిర్గీ వచ్చే తల్కి ఖోటనీ గన్కి మనం ముట్టడి ఏస్తే వరంగల్ సాలా షుల్బంగా మన చేతిలో పడిపోతుంది. ఒరంగోల్ పోయిం తరువాత, ఒరంగోల్ రాజా ఇక్కడ్కి రానేరాడు. ఘుట్టికోటా చేరిలోకి వస్తే, తక్కిన సామంత కోటల్‌కి హన్నిటినీ ఒక్టి హాక్టిగా కొట్టివేనూవాచ్చు," అంటూ తన అభిప్రాయాన్ని మనవిచేశాడు ఖుస్రూఖాన్.

కాని, అభిప్రాయాన్ని వ్యతిరేకించాడు సర్వసేనాధిపతి లల్లూఖాన్.

"షహజాదా! ఖుస్రూకాన్ చెప్పింది కాదూ అంటానికి ఇష్టంలేదు. కాని, ఖుస్రూకాన్‌గారు చెప్పినంత లేలికగా ఖోటా మనచేతిలోకి రావటం బహుత్ ముష్కిల్ ఉంది. ఖోటాకు సేన్యం జాస్తీ ఉంది. పైసా జాస్తీ ఉంది. తిండి గింజల్ హెక్వా ఉన్నాయి. రాజా వాపస్ వచ్చేలోగా ఖోటా మనదీ చేతిలోకి రాకపోతే చాలా కష్టంగా ఉంది. సామంత సేన్యాల్‌కి పుచ్చుకొని, రాజా తిర్గీ వచ్చి మనకి ఎనాక ముట్టడీ యేస్తాడ్! అధే

చ్చనమ్‌లో కోటాలోపలివారు తల్పులు తెర్చక మీద పడ్తార్! ముందు చూస్తే నుయ్యి, ఎన్కా సూస్తే గొయ్యి! వరంగోల్ సేన్యాల్ ముందు నుంచి, సామంత సేన్యాల్ హెన్కానుంచి హెతా - పెతా తగుల్కుంటే హింటీకాడ మనదీ బీబీల్కి లబాయిదిబాయి ఇంటాన్కి అల్లా కూడా రాడు."

"ఆయితే. ఇంతకీ ఏమంటావు, లల్లుకాన్ సాహేబ్?" అన్నాడు షాజాదా అలాఫ్‌కాన్.

"షాజాదా సాబ్! మాకీ మన్సొచేసేది ఇనోక్వాలా. వరంగోల్ మీదికి పోవటం అంత మంచిదీ కాద్. రాజా కొద్దీ పరివారమ్‌తో వేటాకీ వెళ్లాడు. మనం కూడా దొంగసాటుగా అడవికి వెళ్ళి, ఆయన్ని ఖయిదీచేసి ఢిల్లీకి పంపే ఏస్తే అటూ రాజూలేక - ఇటు మంత్రీ లేక గందులు వేసే వరంగోల్ మనదీ చేతి కిందికీ వస్తుంది," అంటూ తన అభిప్రాయాన్ని విన్న వించాడు లల్లుకాన్.

ఇంతలో గుడారం వెలుపల పెద్ద అలజడి వినవచ్చింది. అందరూ ఆ వంక దృష్టి నిగిడ్చి చూచారు. ఎవడో పిలకజుట్టు బ్రాహ్మడు-గుడారపు ప్రదేశంవద్ద కాపలా ఉన్న సైనికుడిని చాలా గడబిడ చేస్తున్నాడు.

"ఒరేయ్! నే నెవరో తెలిస్తే ఇట్టా మాట్టాడవురా! ఉన్నదున్నట్టు చెపుతాను; లేనిది లేనట్టు చెపుతాను. ఆగతానాగతాలే ట్తను; ఉన్నదీ లేనట్టూ చెప్పగలను. నిన్నిక్కడ కాపలా పెట్టిన నీ సర్దార్లు లోపల ఏం చెప్పు కుంటున్నారో - తక్క-ముక్క బయటనుంచే చెప్పగలను కావాలంటే. కోట, దర్శనం కోసం వచ్చిన బ్రాహ్మణ్ణి రాదంటే కోటి జన్మలవరకూ పంది జన్మ ఎత్తాల్సిందే!"

"తు, తూ! మాకీ సువర్ జల్మ ఎత్తమంటావ్?"

"ఒరేయ్! పంది అంటే సామాన్యంకాదురా! వరాహం విష్ణు మూర్తిరా! అయినా, నీవంటి వెధవ పందిజన్మ ఎందుకు ఎత్తుతాడు? ఇదిగో, చూడు-నేను లోపలికెళ్తున్నా. అడ్డొచ్చావో, గుద్దుకు చస్తావ్!

నన్ను కాదని బ్రతికి బయట పడ్డవాడు లేడు. కాదన్న ప్రతివాడూ కాటిలోకి వెళ్ళాడు. నాకు కోపం వస్తే ఏం చేస్తానో తెలుసా? నాపేరే చెకుముకి దుబ్బగా పెరిగిన నీ గడ్డంలో నిప్పురవ్వ రాజేస్తాను ఆంఫట్!" అంటూ ఒక్క దూకు దూకి ఒక గ్రుద్దు గ్రుద్ది కావలి కాస్తున్న సైనికుడు "అమ్మా!" అని గావుకేక పెట్టగానే చెంగున గుడారంలోకి లంఘించి సమాలోచనలో ఉన్న సేనాధిపతుల మధ్య నిల్చున్నాడు విద్యానాథుడు. అకస్మాత్తుగా; అర్ధాంతరంగా మంత్రాలోచనలో వున్న తమ మధ్యకు ఊడిపడిన విద్యానాథుడిని చూసి విస్తుపోయారు మహమ్మదీయ సర్దారులు.

"ఏం-అలా చూస్తారేం? నేనేం దయ్యాననుకున్నారా? భూతాన్ననుకున్నారా? నేను నేనే! నా పేరు చెకుముకి. చెకుముకి అంటే తెలుసా? నిప్పు రాజేసే రాయి. దాన్ని కొడితే ఏం వస్తుందో తెలుసా? మంట! మంట ఏం జేస్తుందో తెలుసా? తన్నవమానం చేసిన వాడిని భగభగా. భుగభుగా దహించివేస్తుంది."

"అవే! చెకుముకీ చాత్తుల్లగారూ! బైఠోవండీ! బైఠోవండీ!" అంటూ మర్యాద చేశాడు అల్లుకాన్.

"నువ్వెవరు నన్ను కూచోమంటానికి? కూచోమంటే కూచోవడానికి నువ్వు రమ్మని పిలుస్తే వచ్చానా, పొమ్మంటే పోతానా?"

"మరి ఎందుకు వచ్చారు, భాయ్?" అన్నాడు ఖుస్రూఖాన్.

"ఎందుకొచ్చానా? రావాలనుకున్నాను గనుక వచ్చా, మీతో నాకు పనుందీ నాతో మీకు పనుందీ కాబట్టి వచ్చా.

"మాతో మీకే పనీ ఉందేమో తెల్వదు కాని, మీతో మాకే పని హేమీలేదే?"

"ఆఁ, లేకపోతే కలుగుతుంది, నేనెపనుకున్నా రేమిటి? జ్యోతిష శాస్త్రాన్ని పుక్కిట బట్టాను. జరిగింపీ, జరుగుతున్నవీ. జరగబోయేదీ ఇట్టే చెప్పేస్తాను. గుడారం లోపల కూచోని మీరేమని చెప్పులు కొరుక్కుంటున్నారో చెప్పమంటారా?"

"అట్టా చెప్పాలే గాని మీకి మేమూ హొప్పుకుంటామ్, శాస్త్రుర్లూ భాయి.

"ఒప్పుకుంటారు, ఒప్పుకుంటారు. ఏదో మేలుచేసినట్టు మాట్లాడ తారేం? ఒప్పుకోక మరేం చస్తారా అంట - నిజం చెప్పే సామర్థ్యం నాలో ఉన్నప్పుడు. రాజాకీ పట్టాలనీ ఒక్డూ వరంగోల్‌కీ కొట్టాలనీ ఒక్డూ యాత్రాకి బోయిన పెద్దమంత్రి వాపస్ వస్తే పుట్టి మునిగి పోతుందని భోరున హేడుస్తున్నార్. అంతేనా సరదారులూ?" అన్నాడు విద్యానాథుడు సరదారు లందరూ ఒకరి మొహం ఒకరు చూచుకున్నారు. ఆశ్చర్యంతో ఆగంతకుడి వంక చూచారు. తామంత వరకూ బయటికి అనుకున్న మాటలు అతడు చెప్పటం అటుంచి తమ ఆంతర్యంలో ఉన్న భయాన్ని కూడా బయటపెట్టిన అతడి ప్రజ్ఞకు లోలోన విస్తుపోయారు. అయినా, తమ ముఖ కవళికలను దాచుకోవడానికి విపరీతంగా ప్రయత్నం చేశారంతపనూ.

"అరే శాస్త్రుర్లూ భాయి! నీకీ చాలా గొప్పవాడు ఉంసావ్ కావొచ్చు. కాని ఈ విషయంలో ఛాలా ఝటీబాత్ చెప్పినావ్ - మేము రాజీకి స్నేహం కోరి వచ్చినామ్ కాని...."

"ఆపవోయి సాయిబూ! హనుమంతుడి ముందరా కుప్పిగంతులు. నీ టక్కులు నాకు తెల్సునే. నాకు తిక్క రేగిందంటే ఏం జేస్తానో నాకే తెలియదు. టక్కు టమార గజకర్ణ గోకర్ణ విద్యలలో ఆరితేరిన నన్ను మోసం చెయ్యాలని చూస్తున్నావా? అసంభవం! మక్కా వచ్చి ఢిల్లీలో కలవొచ్చు, ఢిల్లీ వెళ్ళి మదీనాలో కలవొచ్చుగాని, నా మాట మాత్రం తప్పదు, అసలు నేను ముందే చెప్పానుగా — నా మాట కాదన్నవాడు కాట్లోకే బొయ్యేది."

"అరే. శాస్త్రుర్లూ భాయ్! కొంచెం బైఠోవండి. అంత కోపం చేసొక్కవాకండి."

"నేనొచ్చింది బైరాయించడానికి కాదోయ్! నా పని ముగించుకుని నేను వెళ్ళిపోరాలి."

"మీకీ, మా దగ్గరికి రాజా పంపినాడ్?"

"రాజా! అప్రాచ్యుడు. బ్రహ్మద్వేషి! చిన్నప్పుడు వాడూ-నేనూ కలిసి చదువుకున్నాం. ఒకనాడు పొడుగాటి నా పిలక పట్టుకొని రాజకుమారుణ్ణనే గర్వంతో 'చల్ చలోరే రంగడా ఘోడా' అంటూ నన్ను దౌడు తీయమన్నాడు. ఆ రోజునే వాడికీ-నాకూ షష్టాష్టకం అయింది. చదువులో వాడు శుద్ధ మొద్దు కావడంతో, నేను అపూర్వ మేధావంతుణ్ణి కావడంతో మా ఇద్దరికీ మళ్ళీ పేచీ వచ్చింది. అఖిల విద్యల్లోనూ పరిపూర్ణత పొంది, ఈ మధ్యనే రాజాశ్రయం కోసం పోయిన నన్ను పాత వైరాన్ని మనసులో పెట్టుకొని వెళ్ళగొట్టించాడు ఈ రాజు."

"అరే, శాస్త్రుల్లూ భాయ్! ప్రతాపరుద్రుడ్ మాకీ దోస్తు ఉంటాడ్! మాకీ ముందు వారిని హల్కాగా మాట్లాడటం మర్యాదగా లేడ్," అన్నాడు ఖుస్రూఖాన్.

"ఆఁ! నన్ను మళ్ళీ మోసం చేయాలనుకుంటున్నారా? వాడు మీకెంత నేస్తమో, నాకూ అంత నేస్తమే ..."

విద్యానాథుడి ధోరణి విచిత్రంగా కన్పించింది సర్దార్లకి. రాజు అంటే పరమద్వేషం అనీ, సర్వసమర్థుడయిన అతణ్ణి రాజు గుర్తించకుండా అన్యాయం చేసినందుకు ప్రతిగా అతడు రాజద్రోహిగా మారిపోయాడనీ అనుకున్నారు సర్దార్లు. అంతటి శక్తివంతుడిని తమ మిత్రకోటిలో చేర్చుకోవడమే తమకు అప్పట్లో క్షేమంగా తలచారు.

"అచ్ఛా, భాయీసాబ్! మీరు చాలా పెద్ద పండితుల్ ఉన్నార్. మాది మనసులో దాగిపోయి, మా రుమూల నక్కీ నక్కీ ఉన్న ఉద్దేశ్యాన్ని ఎల్బలీకీ లాగార్. మీకీ సహాయం ఉంటే మాకీ, మా ఆస్థానమకీ పండితుడ్ని చేస్తాం, అగ్రహారాల్ ఇస్తాం. ఏమంటాడు శాస్త్రుల్లు భాయ్!" అల్లుఖాన్.

"ఓరి వెఱ్ఱి వెంగళాయిల్లారా! అగ్రహారాలకు ఆశపడి కాదురా మీకు సహాయం చేసేది. నా పగ తీరటానికి నేను సహాయం చేసుకుంటు న్నాను. అయినా, ఓరెన్ని మాట్లాడినా ఆ తక్తుమీద కూచున్న షాజాదా సాహేబుగారు ఒక్కమాటయినా మాట్లాడడేం?"

షాజాదా అలూఫ్ ఖాన్ ఉలిక్కిపడ్డాడు. తానక్కడికి వచ్చి చేరినట్టు అంతరంగిక సైన్యాధిపతులకు తప్పితే అన్యులకు తెలీదు. అయితే ఈ విషయం ఈ బ్రాహ్మడికి ఎలా చేరింది? అతడు సామాన్య బ్రాహ్మణుడు కాడు. సర్వసమర్థుడు అని నిశ్చయించుకున్నాడు.

"వెకొముక్ గారూ! మీరుచేస్తానన్న సహాయానికి చాలా కృతజ్ఞుణ్ని. మా సరదారులు మీకు ఇచ్చిన వాగ్దానాలు మేం చేసినవిగానే భావించవచ్చు. ఓరుగల్లు సామ్రాజ్యం మా వశంకాగానే మిమ్మల్ని పెద్దమంత్రినిచేస్తాం?" అన్నాడు అలూఫ్‌కాన్.

"మీరు మంత్రి చేసినా ఒకటే? చెయ్యకపోయినా ఒకటే!" "అలా అంటారేం, భాయీ సాబ్?"

"ఆ యుగంధరుడంతటి లేకి వెధవ చేసిన ఉద్యోగ్యం నేను మళ్ళీ చేయడమా? అసంభవం! యుగంధరుడు మంత్రి అయిన మర్నాడే మంత్రి పదవికి విలువపోయింది."

"మీకీ పెద్దమంత్రిమీద కూడా కోపం ఉందీ?"

"ఎవడు పెద్ద! చెట్టులేనిచోట ఆముదపు చెట్టు మహావృక్షం. చెట్టంతటివాణ్ని నేనిక్కడ ఉండగానే ఈ ఆముదపు చెట్టు పైకొచ్చింది. వాడికి ఓనమాలు దిద్దపెట్టింది నేను. ఎక్కాలు నేర్పింది నేను. అదేమిటి అన్నీ నేనే నేర్పాను. అయితే, వాడు మాత్రం మంత్రయాడు. అయితే అయ్యాడు. అవగానే ఏం గొప్పా? రొయ్యకు లేవూ బారెడు మీసాలు." అన్నాడు విద్యానాథుడు. శాస్త్రులకూ, పెద్దమంత్రికీ ఉన్న వైరం తమకు మరింత అనుకూలమైన విషయం అని లోలోన సంతోషించారు సర్దారులు.

"భాయీ శాస్త్రుల్లూ! మీకీ జోతిష్షం బాగా వొచ్చా?"

"ఓ! అందులో నేను ఉద్దండ పండితుడ్ని. జ్యోతిష్యం రెండు విధాలు; ఒకటి సిద్ధాంతము. మరొకటి రాద్ధాంతము."

"రెండూ విధాల్ ఉందే జ్యోతిష్షం"

"ఆఁ. సిద్ధాంతమనగా హైందవ జ్యోతిష్యము. రాద్ధాంతమనగా యవన జ్యోతిష్యము. సిద్ధాంతము హిందువులకు, రాద్ధాంతము మహమ్మదీయులకు బాగుగా వర్తించును."

మాకే హిందూ సిద్ధాంతము సెప్తార్? లేక, తురక రాద్ధాంతము సెప్తార్, జ్యోతిష్షుడూ భాయి!" అన్నాడు ఖుస్రూఖాన్.

"మాకు రాద్ధాంతమే చెప్పండి!" అన్నాడు లల్లుఖాన్.

"సిద్ధాంత ప్రకారం ప్రతాపరుద్రుడి జ్యోతిష్షం గురించి మాకు చెప్పండి!" అన్నాడు అలూఫ్‌కాన్.

విద్యానాధుడు ఒక్క క్షణం ఆలోచించాడు. కళ్ళు మూసకొని, నొసలు పైకెత్తి ఒక దీర్ఘ నిశ్వాసాన్ని వదిలాడు.

"ఊఁ! రాద్ధాంత ప్రకారం చూస్తే, మీకు ప్రస్తుతం రాహుకాలం."

"అంటే ఏస్టి, జోస్యలా భాయీ!"

"రాహుకాలం అంటే - చంద్రుడిని అప్పుడప్పుడూ ఒక పెద్ద పాము మింగి వేస్తుంటుందే, అది రాహువు."

"అరే, భాయీ! శాస్త్రమ్‌లో అదీ మంచిదీ ఉందీ-ఈ చెడ్డదీ ఉందీ? ఆదుర్దాగా ప్రశ్నించాడు లల్లుకాన్.

"శాస్త్ర ప్రకారం మీ గతి అడకత్తెరలో పోకలా ఉంది."

సరదార్ల మొహాలు పాలిపోయాయి. తామంతకు ముందనుకున్న మాటలు జోస్యంలో కూడా ప్రతిఫలించేసరికి, లల్లుకాన్‌కి ముచ్చెమటలు పోయసాగాయి.

"అరే, సర్దార్ భాయీలూ! మీకు జయంలో మోసం ఉంది; మోసంలో అపజయం ఉంది.

"అంటే?"

"అంటే-అంతే! అదే రాద్ధాంతం."

"మరయితే సిద్ధాంతం ప్రకారం సూసి సెప్పండి, భాయీ సాబ్?"

"హిందువులకు సిద్ధాంతం చాలా అనుకూలంగా ఉంది. ఈ క్షణాన వారి కత్తి కెదుర బడ్డ ప్రతిపాటి కంఠం తెగిపోవాల్సిందే!"

"అరే, శాస్త్రుల్లూ భాయీ! మాకి ఇట్లాంటి బేవాక్స్ మాటా సెప్ప టానికి ఇంతదూరం పనిగట్టుకొని వచ్చావ్!" అన్నాడు లల్లుఖాన్.

"శాస్త్రుల్లూ భాయీ సాబ్! మేము ఇందులోంచి బైట పడటానికి ఏదైనా ఉపాయం చెప్పండి" అన్నాడు షాజాదా.

"ఉపాయానికేం? అపాయం లేని ఉపాయాలు కావల్సినన్ని. మీకున్న రాహుకాలం పోవడానికి, కనీసం ఒక నెల అయినా పడుతుంది ఘట్టిగా. ఈ నెలరోజులు దాటింతర్వాత మీరు పట్టింది బంగారం అవు తుంది. అప్పుడే రాహు యోగంపోయి, శని ఉచ్ఛదశకు వస్తాడు. శని చల్లటి చూపుచూడనే చూడడు. చూశాడో దేవేంద్ర భోగమే!"

"అరే, భాయీ సాబ్! మాకి మీద శనిగాడు సల్లటిసూపుసూత్వాలా అని ఖరాబేట్టి?"

"చూస్తాడోయి సాయిబూ! చూస్తాడు. నువ్ సాయిబువు గనక, శని నీకు ఉచ్ఛం! హిందువయితే నీకది నీచం."

"అచ్ఛా-అచ్ఛా! కాని, ఈ నెలరోజులు మాకి గడిచేది కైసా! మావీ ప్యాణాల్ ప్యాణాల్లో ఉండేది కైసా?"

"దానిదేముంది, ఇప్పుడాడుతున్న నాటకమే ఆడుతూ ఉండండి! భేటీకని వచ్చామని కబురు చేశారుగా! అదేమాట పొడిగించండి.

"అచ్ఛా-అచ్ఛా! మీరు బుద్ధికి ...ఏట్టి అంటార్ ... ...ఆఁ! ఆఁ! బుచస్పాతీ ఉన్నార్!"

"ఓరి, సాయిబూ! నీకు మా దేవతల పేర్లుకూడా తెలుసే! ఏమో అనుకున్నాను. అచ్ఛా నేనొచ్చిన పనయింది. ప్రతీకారం కోసం ఎదురు చూస్తున్న నాకు ఉపశాంతి జరిగింది. నేను వెళ్ళొస్తా! అవసరమైనప్పు డల్లా తమ దగ్గరకు వచ్చి దర్శనం చేసుకోటానికి ఏ విధమయిన అవ

రోధం లేకుండా, చెరుకుకి శాస్త్రులవారి ప్రవేశానికి అభ్యంతరం చెప్ప వద్దని మీ సాయిబులందరితో చెప్పండి."

"అచ్ఛా-అచ్ఛా! మేమూ అదే చెప్పవాలా అనుకుంటున్నామ్."

"ఔనౌను. మీ బుద్ధి అప్పుడప్పుడూ చాలా బాగా అనుకుంటూ ఉంటుంది సరే? నేను పోయొస్తాను. నెల రోజులవరకూ ఉన్న రాహు కాలం విషయం మాత్రం మరిచిపోకండేం! పొరపాటునయినా ఓరుగల్లు వైపు అడుగువేశారో, మీ పెళ్ళాల తాళ్ళు పట-పటా తెగాయే అందువల్ల మీ పని మక్కాలో కలవడానికి పోతే, నా ప్రతిజ్ఞ గంగలో కలవడానికి బయల్దేరుతుంది."

"అచ్ఛా-అచ్ఛా మేమూ కూడా అదే సెయ్యవాలా ఉన్నాం. ఒకవేళ నెల మీరూ సెప్పిన విధంగా రాయబారం నాటకం ఆడదాం! శనిదేవుడూ మా మీదకీ ఎక్కాంగానే సైన్యంతో లడాయి చేస్తాం."

"ఎక్కుతాడు-ఎక్కుతాడు. నీనెత్తిన త్వరగానే శనిదేవుడు డెక్కు తాడులే. సాయిబూ!" అంటూ లల్లుఖాన్ని ఆశీర్వదించి, షాజాదావద్ద సెలవు పుచ్చుకొని బయటకు నడిచాడు విద్యానాథుడు.

ప్రధాన ద్వారంవద్ద మొదట తన గ్రుద్దుకు ఆ్రపులించి, వెల్లకిలా పడ్డ సిపాయీని చూచి చిరునవ్వు నవ్వాడు విద్యానాథుడు.

"అస్సలామాలేకుమ్, సైతాన్ శాత్తుర్లు! అస్సలామాలేకుమ్!" అన్నాడు సిపాయి వళ్లు విరుచుకుంటూ.

"వాలేకుం సలాం రా నాయనా! ఈ సైతాన్ శాస్త్రులు ఇక నీకు రోజూ దర్శనం ఇస్తుంటాన్లే. సైతాన్ పడితే ఏడేళ్ళు, శాస్త్రులు పడితే పద్నాలుగేళ్ళు" అంటూ నవ్వుతూ వెళ్ళిపోయాడు విద్యానాథుడు.

విద్యానాథుడు వెళ్ళిన కొద్ది క్షణాలకే సభ చాలించి బయటకు వస్తున్న పరదాఖాలను ఎదుర్కొన్నాడు కాయసిద్ధి. అంతకుముందే వచ్చి వెళ్ళిన చెరుముకిని గుర్తుకు తెచ్చుకుంటూ ఎదురుగా వస్తున్న కాయసిద్ధిని ఆశ్చర్యంగా చూశాడు అలాఫ్‌ఖాన్. ఇంతకు ముందొచ్చినవాడు ఒక హైందవ పండితుడు, ఇప్పుడొస్తున్నవాడు ఒక జైనసిద్ధుడు. ఈ విధంగా

ఈ సన్యాసులంతా ఒక్కరొక్కరుగా తన వద్దకు రావడం ఆశ్చర్యంగా తోచింది షాజాదాకు. అయితే, ఆంధ్రదేశంలో జైనులకూ, శైవులకూ ఉన్న పరస్పర వైరుధ్యాన్ని అంతకుముందే గుర్తించినవాడు కావటంవల్ల షహజాదా కాయసిద్ధిని సాదరంగా సమాశ్వాసించాడు. నిజానికి ఆంధ్ర సామ్రాజ్యాన్ని జయించాలంటే జైనుల సహాయం ఎంతయినా అవసరం, అయితే తమ మతానికి మాతృమతమైన హిందూమతాన్ని కాదని, యవను లకు ఎంతమటుకు దోహదం చేస్తారీ జైనులు అనే విషయం తేల్చుకో దలచుకున్నాడు షహజాదా. అంతే కాకుండా, ఓరగల్లు నగరంలో దాదాపు లక్షమంది జైనులు ఉన్నారు. ఈ లక్షమందీ ప్రతాపరుద్రదేవుని తాతగా రయిన గణపతిదేవునిచేత, ప్రతాపరుద్ర మహారాజుచేత కూడా నానా హింసలూ అనుభవించిన వారే! ప్రతీకారజ్వాలలు వారిలో ఇంకా ఆరిపో లేదనే విషయం షాజాదాకి బాగా తెలుసు. అందుకోసమే ఎదురు వచ్చిన జైనపండితుని వెంట తీసుకొని తోడనున్న సరదాలను పంపివేసి తన స్వంత పటకుటీరంలో ప్రవేశించాడు షహజాదా. ఇరువురూ సుకాశీనులైనారు కుటీ రాంతర్భాగంలో.

"మీరు కూడా జోస్యం చెప్పడానికొచ్చారా?" అన్నాడు షాజాదా.

షహజాదా ప్రశ్నలోనే అంతకుముందే ఎవరోవచ్చి ఏదో జోస్యం చెప్పి వెళ్ళారనే విషయాన్ని కాయసిద్ధి గ్రహించాడు. తనకన్నా ముందే ఎవరో ఇక్కడికి వచ్చి వెళ్ళారన్నమాట! తనకు తెలీకుండా తనవాడెవడూ రాడు. ఇక వచ్చినవాడు ఏ యుగంధర మంత్రి చారుడో అయివుండాలి. కాబట్టి, కొంత జాగ్రత్తగా వ్యవహరించటం ఎంతైనా అవసరం అను కున్నాడు కాయసిద్ధి.

"లేదు, షాజాదా! నేను జైనసిద్ధుడినే అయినా, కార్యవాదిని. కర్తవ్య నిష్ఠుడైన కార్యవాది, జోస్యంలో నమ్మకం ఉంచుకోవడం అంత హర్షించదగిన విషయం కాదు" షాజాదా ఆ విషయాన్ని అలానే వది లేశాడు కాయసిద్ధి పలుకులలోని పదునుదనాన్ని గ్రహించాడు. ఇంతకు ముందు వచ్చిన పండితుడికీ, ఇతడికీ హస్తిమశకాంతర భేదం వుంది.

"మీ పేరు?"

"కాయసిద్ధి. ఓరుగల్లు నగరంలో ప్రధాన జైన భిక్షువులలో ఒకడిని. మీరు ఓరుగల్లు మీదకి దండెత్తి రావటాన్ని జైనులు విముక్త కాలంగా పరిగణించి సంతోషిస్తున్నారు. తర తరాలుగా గణపతిరాజులవద్ద అనుభవిస్తూ వచ్చిన బానిస జీవితానికి విముక్తి కలిగే శుభదినం వచ్చిందని ఆనందిస్తున్నారు."

"మేం కోట మీదకి దండయాత్ర చేస్తే మా పక్షం ఉంటారా?" అన్నాడు షహజాదా.

"తప్పకుండా ప్రభూ! మీ కోసం కాదు; వారి కోసం. మీకు సహాయం చేయకపోతే వారిని వారే నాశనం చేసుకున్నట్టవుతుంది. వారి బ్రతుకు బాటలో వెలుగు ప్రసరించటానికి ఇంతకన్నా సదవకాశం రావటంకల్ల."

"చాలా సంతోషం కాయసిద్ధీ! మేం తప్పకుండా ఓరుగల్లును వశం చేసుకుంటాం. కాని, నెలరోజుల వ్యవధి మాత్రం కావాలి" అన్నాడు షాజాదా.

"ఈ లోపున మీ మీ జైనులందరిని సమకూర్చి తర్ఫీదిచ్చి, వెనుక నుండి ఆంధ్ర సైన్యాలను దెబ్బతీయడానికి సిద్ధం చేయించండి!"

"నెల రోజులా!" ఆశ్చర్యంగా చూశాడు కాయసిద్ధి ఈ లోపున యుగంధర్ మంత్రి, వేటకరిగిన మహారాజూ ఇరువురూ తిరిగివస్తారు. వారిరువురూ నగరిలో ఉంటే కోటవంక కన్నెత్తి చూట్టానికి ఫాలాక్షుడి కైనా సాధ్యం కాదు. మీకు నిజంగా ఓరుగల్లు కోటను పట్టుకోవాలనుకుంటే వెంటనే అవ్యవధిగా బయల్దేరండి. విజయదుందుభులు మ్రోయించండి. చతురంగ బలాలను ముందుకు నడవండి. కోట కోడలకు నిచ్చెనలు వేయించండి. గంధ గజాలచేత ఓరుగంటి సింహద్వారాన్ని మొట్టించి బ్రద్దలు చేయండి. ఈ లోపున నగరులో ఉన్న జైనులందరూ ఒక్కుమ్మడిగా సింహద్వారాన్ని సమీపించి, కావలి సైనికులను సంహరించి తలుపులు తీయటానికి ప్రయత్నిస్తారు" అన్నాడు కాయసిద్ధి ఆవేశంగా.

"ప్రయత్నిస్తారు-అంతేనా?" షహజాదా నీరసంగా నవ్వుతూ.

"ఔను. అంతే, ప్రభూ! జైనులు నిరాయుధులన్న విషయం తమ రెరుగనిది కాదు. వారికి సైనిక శిక్షణ కొరవడి చాలా కాలమైంది. తమ ఆత్మలను మీ కంకితం చేయగలరే కాని, తమ శక్తి ప్రపత్తులను సంపూర్ణంగా తమకు సహాకరింప చేయడం ప్రస్తుతం వారున్న నీరస పరిస్థితులలో అంత ఎక్కువగా సాధ్యపడదు. అయినా, తమ శక్తివంచన లేకుండా సహాయ పడటానికి శాయశక్తులా ప్రయత్నిస్తారని జైనులందరి తరఫునా నేను మాట ఇస్తాను. విజయం మీకు తథ్యం!" అన్నాడు కాయసిద్ధి.

షహజాదా జిజ్ఞాసలో పడ్డాడు. చెకుముకి శాస్త్రుల జ్యోతిష్యరాద్ధాంత సిద్ధాంతాన్ని నమ్ముకొని కాలయాపన చేస్తే రాజూ, మంత్రీ తిరిగి నగరులో ప్రవేశించే అవకాశం ఎంతయినా ఉందని గ్రహించాడు. అలా అని దారెన బోయే కాయసిద్ధిని నమ్మి అదనపు బలాలు రాకముందే కోటమీదికి దూకటం కూడా అంత సబబుగా కన్పించింది కాదు. అదీకాక తాను క్రిందటి ఏడు ఒకసారి దెబ్బతిని ఉన్నాడు. ఆ విషయాన్ని షాజాదా ఇంకా మరచిపోలేదు. అందువల్ల తొందర పడటం అంత మంచిదికాదేమోనని ఉద్దేశం అతనికి కలిగింది. అయితే, ఆ పరిస్థితిలో జాగుచేయడం కూడా మంచిది కాదేమోననిపించిం దతనికి.

"అయితే, మమ్మల్ని ఏం చెయ్యమంటారు కాయసిద్ధీ? మాకు ప్రస్తుతం ఉన్న బలం కోటను పట్టడానికి చాలదు. ప్రస్తుతం మా గ్రహచారం కూడా అంతగా బాగాలేదు. అందువల్ల ఒక నెలరోజులు గడువు కావాలి; తప్పదు" అన్నాడు షాజాదా, చెకుముకి శాస్త్రులు చెప్పిన జ్యోతిష్యం విషయం రావాలని మరుగు పరిచాడు షాజాదా.

"దానికి నేనొక ఉపాయం చెప్తాను, ప్రభూ! ఓరుగల్లు సింహాసనానికి మురారిదేవుడనే పురో వారసుడున్నాడు. రాజునకు బహుదూరపువాడు. తనకు జరిగిన తీరని అన్యాయానికి ప్రతీకారం చేయడానికై అదనుకోసం వేచి వున్న అతడు ప్రతాపరుద్ర సార్వభౌముణ్ణి పట్టివ్వడానికి ఒక

వ్యూహాన్ని ఆలోచించాడు. ఆ విషయాన్ని తమకు మనవి చేయమని నన్ను నియోగించాడు. నా రాకకు ముఖ్య కారణం అదే."

షహజాదా ఒక క్షణం ఆలోచించాడు. మురారిదేవుడు తనకు పూర్తిగా అపరిచితుడు కాడు. క్రిందటి సంవత్సరం తాను ఓరుగల్లు మీదికి దండయాత్రకు వచ్చినప్పుడు కూడా శక్తివంచన లేకుండా అతడు తనకు సహాయం చేశాడు లోపాయకారిగా. కాని, కాలం కలిసిరాకపోవడంతో తాను వెనుదిరిగి పారిపోవాల్సి వచ్చింది. ఆ నమ్మకాన్ని అనుసరించే తమ దండయాత్ర విషయం ఒక ప్రత్యేక వార్తాహరుని ద్వారా కబురు చేశాడు తాను. అయితే, మురారిదేవునకు వార్తనందించిన వార్తాహరుడు తిరిగి తనవద్దకు రాలేదు. ఏది ఏమైనా మురారిదేవునకు ఆ వార్త శతవిధాల అంది ఉంటొచ్చు. తాము వస్తున్నామన్న వార్త అందుకున్న మురారిదేవుడు కావాలనే మహారాజుచేత వేటప్రయత్నం చేయించాడేమో నన్న అనుమానం మెరిసింది షాజాదా మనోవీధిలో.

"అయితే వేటకెళ్ళిన మహారాజును పట్టి బంధించమంటాడు మురారిదేవుడు. అంతేనా?" అన్నాడు షాజాదా.

"ప్రభువులకు దివ్యదృష్టి ఉంది."

"ఈవేట కార్యక్రమాన్ని ఏర్పాటుచేసింది కూడా మురారిదేవుడే కదూ?"

కాయసిద్ధి చిరునవ్వు నవ్వాడు.

"మహామంత్రిని రామేశ్వరయాత్రకు పంపింది?"

"షాజాదా వారికి తెలియని రహస్యాలు లేవు" అన్నాడు కాయసిద్ధి.

"సరే! మేము జాగ్రత్తగా ఆలోచించి, మా కార్యక్రమాన్ని నిర్ణయించుకుంటామని మురారిదేవుడికి మనవి చేయండి. మీకు శీఘ్రంగా అల్లా విముక్తి కలగజేస్తాడు" అన్నాడు షాజాదా.

ఆ తర్వాత కాయసిద్ధి శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. ఆలోచనా మగ్నుడైన షాజాదా కొద్దిక్షణాల్లోనే నిర్ణయాన్నికొచ్చేశాడు. ఆ వెంటనే

సైన్యాధిపతి లల్లుఖాన్‌ని, ఖుస్రూఖాన్‌ని పిలిపించి తన నిర్ణయాన్ని తెలియ చేశాడు. తాను కేవలం అయిదు వందలమంది అశ్వికులను మాత్రం వెంట బెట్టుకొని, భద్రాచల భీకారణ్య ప్రాంతంలో వేటాడుతున్న మహారాజును బంధించటానికి బయలుదేరుతున్నానని విశదీకరించాడు. మహారాజు ఒకవేళ దొరక్కపోతే తిరిగి వస్తానని, తాను తిరిగి వచ్చేవరకూ లల్లుఖాన్, ఖుస్రూ ఖాన్ మిగిలిన సైన్యంతో ఇక్కడే ఉండి, మామూలు నాటకాన్ని కొనసా గిస్తూ ఉండాలనీ, ఒకవేళ మహారాజే తనకు లభ్యపడిన పక్షంలో అతడినీ ఖయిదీచేసి నేరుగా ఢిల్లీకి తీసుకు వెళ్తాననీ, అలా వెళ్ళబోయేముందు ఆ విషయం వార్తాహరుని ద్వారా కబురు చేస్తాననీ కబురందిన వెంటనే లల్లూఖాన్ ఖుస్రూఖాన్‌లు తమ సైన్యాన్ని అనాథ అయిన ఓరుగల్లు మీదకి నడిపి కోట ముట్టడించి జైనభక్తుల సాయంతో దాన్ని స్వాధీనం చేసుకొని సర్వనాశనం చేయాలనీ తన వ్యూహాన్ని విశదీక రించాడు షహజాదా. లల్లూఖాన్-ఖుస్రూఖాన్‌లు "అచ్ఛా-అచ్ఛా" అంటూ తల లూచారు.

ఆనాటి రాత్రికే అయిదు వందల అశ్వికులను సర్వ సన్నద్ధులుగా బయలుదేరటానికి, సిద్ధం చేయమని ఆదేశించాడు అలాఫ్‌ఖాన్. షాజాదా ఆదేశాలను అమలుపరచటానికి లల్లూఖాన్ - ఖుస్రూఖాన్‌లు సవినయంగా వంగి సలాములు చేస్తూ నిష్క్రమించారు.

"భయ్యా!" అని మధురమైన పిలుపు వనవచ్చింది షాజాదాకు.

షాజాదా వెనుదిరిగి చూచాడు. ఆమె షాజాదీ రజియా సుల్తానా.

"రజియా!" అన్నాడు షాజాదా వాత్సల్యంగా.

"నేను వస్తాను, భయ్యా!"

"నువ్వెందుకు, అమ్మా?"

"నా సోదరుడిని జయించాననే గర్వంతో విర్రవీగుతున్న ప్రతాప రౌద్ర మహారాజు ప్రతాపమేమిటో, స్వయంగా చూశాలని కధా ఖుంత్త ధూరం వచ్చింది."

"నీ తెలివి తేటల ముందు అతడొక లెక్కా బెహన్?"

"ఆ విషయమే తేల్చుకోవాలని అనుకుంటున్నాను, భయ్యా! మారు మాట చెప్పకు నేను కూడా వస్తాను."

షాజాదీ రజియా అంటే షాజాదా అలాఫ్‌ఖాన్‌కి అపారమైన ప్రేమ. క్రిందటి సంవత్సరం ఓరుగల్లు మీదకు తాను జరిపిన దండయాత్రలో పరాభూతుడై ప్రతాపరుద్రుని పట్టి బంధించి, తన అశ్వం వెంట నడిపిస్తూ గాని ఢిల్లీ నగరంలో అడుగుమోపమని ప్రతిజ్ఞ చేసిన షాజాదా ఢిల్లీకి వెళ్ళకుండా దేవగిరిలోనే ఉండిపోయాడు. పుట్టిన దాదిగా కలసి మెలసి పెరిగిన సోదరుడు కనిపించక పోవడంతో రజియాకు ఆందోళన అధికమై ఒకనాడు హఠాత్తుగా దేవగిరికి వచ్చి చేరింది. నిరాశాపూరితుడైన షాజాదాకు ధైర్యాన్నిచ్చి అతడి ప్రతిజ్ఞను నెరవేరుస్తానని శపథం చేసి ! అతడిని దండయాత్రకు సన్నద్ధుడ్ని చేసి, ఈ ప్రస్తుత ఓరుగల్లు ముట్టడి కార్యక్రమ వ్యూహరచన చేసింది షాజాదా రజియాయే. అందువల్లనే ఆమె కోరికను నిరాకరించలేక పోయాడు షాజాదా.

"అలాగేనమ్మా! నువ్వు వస్తానంటే నేను కాదంటానా? నువ్వు పక్కన ఉంటే నాకు అపజయం అన్నదే లేదు," అన్నాడు షాజాదా మందహాసంతో.

ఓరుగల్లును విడిచిన ప్రతాపరుద్రుని బలగం భద్రాచల ప్రాంతంలోని సుదూరారణ్యాలకు శీఘ్రగతిని చేరుకున్నారు. ముందు శ్వేతాశ్వంపై మహారాజు వేట తమకంతో వాయువేగ మనోవేగాలతో పయనిస్తున్నాడు. ఆయనకు ఇరువైపులా ఇరువురు అంగరక్షకులు అశ్వారూఢులై వస్తున్నారు. ఆ వెనుక మందీ మార్బలం అంతా నడుస్తోంది.

వన్యమృగములు ఎక్కువగా తిరుగాడే ప్రదేశం చేరగానే భటులు మృగములను బెదరగొట్టేందుకై శృంగనాదము గావించి, తప్పెటలు వాయించి, బిగ్గరగా కేకలు వేసి అట్టహాసం గావించారు. వారు గావించిన కల్లోలానికి అరణ్యంలోని అసంఖ్యాకమయిన పులుగులు వింత - వింత ధ్వనులు గావిస్తూ, తమ-తమ నివాసములు వదలి మింటికెగసి పోసాగాయి. వృక్షముల మాటున పొదల మాటున దాగిన చిన్న-చిన్న జంతువులు ఛెంగున ఎగిరి బయటకు లంఘించాయి.

ఎలిమాని చిగుళ్ళు మేస్తూ, సెలయేటి నీరు త్రాగుతూ, అందంగా ఆనందంగా ఆడుకుంటున్న హరిణ కిశోరములు, గుండె లవియచేసే ఆ ధ్వనికి నాలుగు కాళ్ళమీద ఛెంగు-ఛెంగున ఎగురుతూ, అరణ్యంలో నలువైపులకూ కదలి పోసాగాయి.

సింహ కిశోరములకు క్షీరములు గ్రోవిస్తున్న సివంగి, రాజభటులు త్పతిల జేసిన ఆ మహా ధ్వనికి భయంకరంగా గర్జిస్తూ, కిశోరముల పైనుండి ఉరికింది. హస్తిమస్తమస్తిష్కమును చేదించి విందారగించుకుంటున్న మహారాజు, తన భయంకర గర్జనతో ఆ ధ్వనికి పరాకాష్టను కలిగింపజేశాడు. గజ సమూహం ఘీంకరింపులతో కల గుండు పడసాగింది. వృషభ మాంసాన్ని ఫలహారం చేసి, తన గుహాంతర్భాగంలో ఆదమరచి నిద్రిస్తున్న భొబ్బిలి గుంపులు గాండ్రుమన్నాయి.

తమ అలజడికి సంతృప్తికరమైన ఫలితం కనుపించగానే విలుకాండ్రు, భటులు తమ శృంగనాదములను, నగారా మ్రోతలను, తప్పెట శబ్దములను మరింత విజృంభింపచేశారు. ఆ సమయంలో ఆవిర్భవించిన ప్రళయఘోష భూమ్యాకాశాలను ఏకం చేసింది. అరణ్యం దద్దరిల్లింది; అంబరం మారు పలకడంతో పుడమి అంతా వ్యాపించింది. అనేక వేల భూకంపాలు ఏక కాలంలో సంభవించినట్టు భూమి కంపించసాగింది.

ఆ సద్దు భరించలేక తన ఫలహారాన్ని వదలి ముందుకు ఉరికాడు మృగరాజు. తీక్షణమైన ప్రతాపరుద్ర మహారాజు నేత్రాలు అల్లంత

దూరాన ఆ మృగరాజును చూచాయి. మహారాజు వింటిని జోడు అమ్ములు సంధించి, ఆకర్ణాంతం నారిని లాగి వదిలాడు. మరుక్షణం రెండు వాడి శిలీముఖాలు వచ్చి, మహోగ్రహంతో ముందుకు ఉరుకుతున్న మృగరాజు రెండు నేత్రాలలోనూ సూటిగా గుచ్చుకున్నాయి. ఆ బాధను తట్టుకోలేక మృగరాజు గావించిన బాధాభరితమైన గర్జనతో, ప్రతాపరుద్రుని భటులు కకావికలై పోయారు.

అంధుడైన మృగరాజు సూటిగా ఎగిరి, మహారాజు పంచకళ్యాణి పై కురకబోయాడు. పంచకళ్యాణి లాఘవంగా పక్కకు తప్పుకుంది. మహారాజు వింటినుండి విడివడిన మరో అంబు ఎగురుతున్న మృగరాజు హృదయంలో సూటిగా గుచ్చుకుపోయింది. మృగరాజు భీషణ గర్జనతో నేల కూలింది. భటులు గబాలున వెళ్ళి ఆ మృగరాజును తీసుకు పోయారు.

మృగరాజును సంహరిస్తున్న సమయంలోనే పంచకళ్యాణి అడుగులు వెనుకకు వేసింది. అదే సమయంలో ఆ మాటున పొంచి వున్న భయంకరమైన బెబ్బులి ఛెంగున అశ్వంపైకి దుమికింది. ప్రతాపరుద్ర మహారాజు గబాలున వెనుదిరిగాడు. ఎడమచేత కరవాలం లాగాడు. ఆ కరవాలం దక్షిణ హస్తంలోకి ధరించేందుకయినా సమయంలేదు. ఆ కరవాలంతోనే భయంకరంగా నోరు తెరుచుకున్న ఆ వ్యాఘ్రాన్ని సంహరించాడు.

కొన్ని ఘడియల కాలంలో అసంఖ్యాకమైన క్రూరమృగములను వేటాడాడు మహారాజు. ఆయన వెంట ఉన్న పరివారం కూడా వేటాడిన జంతువులను ప్రోగు చేసుకొని, అరణ్యంలో తూర్పు దిక్కును పూర్తిగా క్రూరమృగనిశ్శేషం గావించి, సంధ్యాసమయానికి కిన్నెరసాని ప్రవాహపు దరికి వచ్చి ఆగారు.

అక్కడి ప్రకృతి రమణీయకతకు ముగ్ధుడైన మహారాజు "నేటికి ఇక్కడ విశ్రమిద్దాం. రేపటిరోజు పశ్చిమదిశకు బయలుదేరదాం ఇచ్చట ప్రకృతి మా మనసుకు మిక్కిలి ఆహ్లాదాన్ని చేకూరుస్తూంది," అన్నాడు.

క్షణంలో ఆ నిర్జన ప్రదేశంలో అసంఖ్యాకమైన పటకుటీరాలు ఆవిర్భవించాయి. ఇంద్ర ధనస్సు కాంతులుత్పత్తిల్ల చేసే సప్తవర్ణ పట కుటీరం ప్రత్యేకంగా మహారాజుగారికి సిద్ధపరుపబడింది. ఆ పటకుటీరాగ్ర భాగంలో కాకతీయ విజయపతాకం గీర్వాణ శోభలలో విరాజిల్లుతూంది.

ఆ కిన్నెరసాని వాగు ప్రవహిస్తున్న ప్రాంతంలోని ప్రకృతి రమణీయకతకు ముగ్ధుడైన మహారాజు ఆ ప్రదేశాన్ని తన ఖేటనాకేంద్రంగా నిర్ణయించుకుని, ఉదయం మొదలు సాయంసమయంవరకూ సమీపంలోనూ, దూరాన కూడా క్రూరమృగ వేటసల్పి సంధ్యా సమయానికి ఆ ప్రదేశానికి వచ్చి చేరేవాడు.

ఆ విధంగా శుక్లపక్షం గడిచింది. కృష్ణపక్షం ఆరంభమైంది. ఒకనాటి సాయం సమయాన భానుబింబం అస్త్రాద్రి నలంకరిస్తుంది. ఆకసంపై అందమైన సప్తవర్ణ ఇంద్రధనుస్సులు అలుముకుంటున్నాయి. ఆ ఇంద్రధనుస్సుల కాంతి కిన్నెరసాని వాగులో ప్రతిబింబించి, పరిసర ప్రదేశానికే ఒక వింత శోభను చేకూరుస్తుంది. ఆ ప్రకృతిని చూస్తూ మైమరచాడు మహారాజు.

అదే సమయంలో దూరంనుంచి "ఓం! ఓహోం! ఓం! ఓం! ఓహో! ఓం!" అన్న సర్వాయుక్తమైన ధ్వనులు వినవచ్చాయి ఆ ధ్వనులనుబట్టి ఏదో ఒక మేనా అరణ్యంగుండా ప్రయాణం చేస్తూ ఉంటుందని గ్రహించాడు మహారాజు.

ఆ సంధ్యా సమయంలో ఆ దుర్గమారణ్యంగుండా పయనించ సాహసించిన వారెవరై ఉంటారా అని యోచించాడు మహారాజు. ఆ మేనాలో ఉన్నది స్త్రీలైనా అయివుండాలి. అలా కాని పక్షంలో రోగగ్రస్తులైనా అయివుండాలి. అనుకుంటుండగానే, ఆ ధ్వని అంతకంతకూ సన్నిహితమైంది. మరి కొన్ని క్షణాలలో నలుగురు బోయీలు జలతారు కుచ్చు అమర్చిన అందమైన మేనాను మోసుకు వస్తున్నట్లు చూచాడు మహారాజు. ఆ వెనుక కొంతమంది గుర్రములపైనను, మరి కొంతమంది లొట్టియల

పైనను వివిధములైన సామగ్రులు తీసుకొని వస్తున్నారు. ఆ వెనుక కొందరు పాదచారులై వస్తుండటం కూడా గమనించాడు ప్రభువు.

ఆ సమూహాం దృష్టిని పడటం ఇష్టంలేక మహారాజు సెలయేటి వైపుకు నడిచాడు. అప్పటికే సూర్యాస్తమయం అయింది. సాంధ్యరక్తిమ మాత్రం జేగురు అద్దినట్టు పశ్చిమదిశను' స్వర్ణకాంతులతో శోభింపజేస్తుంది. కొండలమీదనుంచి ఉరుకుతూ ఉద్భృతంగా క్రిందకు పడుతూన్న సెలయేరు గావిస్తున్న ధ్వనికి, నెలవులకు చేరుకుంటున్న పక్షి సంతతి కిల-కిలారావములు మేళవించి, వింత ధ్వనులతో కర్ణపేయంగా ఉంది. ఆనాడు ప్రతాపరుద్ర మహారాజుచేత వేటలో అసంఖ్యాకమైన వన్యమృగాలు సంహరించబడటంవల్ల, వాటి భయంకర గర్జనలు అంతగా వినరావటంలేదు. మహారాజు అద్భుతమైన ఆ ప్రకృతిని తిలకిస్తూ మైమరచి నిలచి పోతున్నాడు.

మేనా పటకుటీరాల్ని అధిగమించి కొన్ని ధనువులదూరం వెళ్ళింది. అంతలోనే మేనానుంచి 'రోకో' అన్న మధురమైన కంఠం మృదువుగా ఆజ్ఞాపించింది. పల్లకి ఆగిపోయింది. మేనాకు ఒకవైపునగల ముఖమల్ తెరలు రెండుగా విచ్చుకున్నాయి. అందుండి అమూల్య భూషణాలంకృతయైన శిరస్సు ఒకటి బయటకు ఆవిర్భవించింది. తుమ్మెదరెక్కలవంటి శిరోజములు, పూర్ణచంద్రుని ధిక్కరించే ముఖబింబం, ఆ ముఖంపై రెండు కమలాలవలే నిలిచిన కాటుక కళ్ళు, శిరస్సుమీద సొగసుగా వ్రేలాడుతున్న మృదువైన మేలిముసుగు, సృష్టిలో అందమంతా ఆమె సొత్తేనా అనిపించేటంతగా ఉంది.

మేనా వెనుకగా నడిచివస్తున్న ఆ వ్యక్తికేసి ఆమె నేత్రాలు కదిలాయి. మరుక్షణం ఆ వ్యక్తి మేనా ముందుకు వచ్చారు. ఆమె అతనితో రెండు క్షణాలు ఏమో సంభాషించింది. అతను 'ఆజ్ఞ' అంటూ చక-చకా పటకుటీరాలు పద్దనున్న మహారాజు భటులవైపు రాసాగాడు.

ఆ మేనాలోనున్న యువతి-ఆ వ్యక్తిపై పే చూస్తూ కూర్చుంది. ఆమె చేత అనుజ్ఞాతుడైన ఆ వ్యక్తి, తిన్నగా కుటీరాలువున్న ప్రదేశానికి

"బాబూ! ఈ కుటీరాలు ఎవరివో సెలవిస్తారా?" అని అడిగాడు.

"మహేంద్ర మహీపాలుర శ్రీ శ్రీ శ్రీ ప్రతాపరుద్ర మహారాజు-అరణ్యంలో వేటకై విజయం చేసివున్నారు. వారికి-వారి పరివారానికి నిర్మింపబడియున్న కుటీరాలు!" అని సమాధానం చెప్పాడు కాకతీయ భటుడు.

"బాబూ! ఒక మనవి. మీరు మీ మహారాజుతో మనవి చెయ్యండి. ఆ మేనాలో వున్నది- ఉత్తర భారత దేశములో అఖండ ఖ్యాతి నార్జించిన గాయనీమణి 'పాతిమా'. మేమందరమూ ఆమె పరిచారకులం. దక్షిణ భారతవాసులైన కొందరు ప్రభువుల ఆహ్వానంపై ఆమె దక్షిణాదికి వచ్చింది. కొన్ని మాసాలుగా ఇచ్చటివారి నందరినీ తన గానామృతంతో ముగ్ధులను చేసింది. ప్రస్తుతం ఢిల్లీ సుల్తానువారి ఆస్థాన గాయనీమణిగా పదవి నలంకరించటానికి తిరిగి ఢిల్లీకి పయనమయింది. ఈ మార్గంగుండా అయితే ఢిల్లీకి శీఘ్రగతిని చేరుకోవచ్చనే ఉద్దేశంతో బయలుదేరాం. మార్గ మధ్యంలో భయంకరమైన అరణ్యం తగిలింది. సూర్యాస్తమయం కాక ముందు సురక్షిత ప్రాంతాలను చేరుకుందామనుకున్నాం. కాని, ప్రయోజనం లేకపోయింది. భయంకర క్రూరమృగ సంయుతమైన ఈ అరణ్యంలో బహుకొద్ది పరివారంతో రాత్రి ఎలా గడపటమా అని మా బీబీ ఆలోచిస్తూండగానే, భగవద్దర్శనంవలె మీ పటకుటీరాలు కనిపించినై అనుజ్ఞ అయితే మేము కూడా మీ సరసనే గుడారాలు నిర్మించు కుని, ఈ రాత్రి నిర్భయంగా గడిపి రేపటి రోజున తిరిగి ప్రయాణం సాగిస్తాం" అని విన్నవించుకున్నాడు.

ఉండండి! మా ప్రభువుల అనుమతి తీసుకువస్తాను" అంటూ కాక తీయభటుడు మహారాజు సమక్షంలోకి వెళ్ళాడు.

ప్రకృతి సౌందర్యాన్ని అవలోకిస్తున్న మహారాజుకు ప్రణామం సల్పి—

"ప్రభూ! ఎవరో ఉత్తర భారతదేశంలోని గాయకురాలట. ఈ మార్గంగా ఢిల్లీకి వెడుతూ, ఈ రాత్రి మన ప్రక్కనే గుడారాలు నిర్మించు కునేందుకు అనుజ్ఞ వేడుకుంటూంది" అన్నాడు.

ప్రభువు వెను తిరగకుండానే 'అలానే' అన్నాడు.

ఇంతలోనే అక్కడికి వచ్చిన మురారిదేవుడు "ప్రభూ! వారు యవనులు. ఈ రాత్రి మన సరసను వారికి ఆశ్రయం కల్పించటం—"అంటూ తన అయిష్టతను వెలిబుచ్చాడు.

"యవనులుగాని, మరెవరుగాని భీతచిత్తులై మనను రక్షణకోరారు. రక్షణ కల్పించటం మన ధర్మం. ఆమెకు సర్వ వసతులు గావించండి!" అన్నాడు మహారాజు.

మురారిదేవుడు లోలోన సంతసించాడు.

భటుడు నమస్కరించి వెడలిపోయాడు.

సూర్యాస్తమయం పూర్తయింది. మసక చీకట్లు కారు చీకట్లుగా మారాయి. ఆ అంధకారంలో పటకుటీరాలలోని దీపికలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ముఖ్యంగా ఫాతిమా గుడారంలో చీనాదేశపు గాజు బుడ్లలోగల కొవ్వువత్తులు జ్వాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నాయి. అత్యంత సుందరంగా నిర్మించబడిన ఆ గుడారంలో పట్టు పరుపులు, ముఖమల్ బాలీసుల కానుకొని వయ్యారంగా-అర్ధశయనంగా ఫాతిమా గాఢ యోచనా మగ్నయై ఉంది.

ఆంధ్ర సామ్రాజ్య రమానాథుడైన ప్రతాపరుద్రుని బంధించాలని, తన అన్న అలూఫ్‌ఖాన్ బయల్దేరాడు. ప్రతాపరుద్రుని బంధించకుండా తిరిగి ఢిల్లీ ముఖం చూడనని, ఘోరమైన ప్రతిజ్ఞచేశాడు. ఎన్ని విధాలా యోచించినా మహారాజును బంధించగలిగే ఉపాయం గానక, ఆయనమైత్రితోనే ఆ కార్యం సాధిద్దామని ఓరుగల్లుకు వెళ్ళాడు. అన్నగారికి ఓపినంత వరకు తోడ్పడుదామని తనుకూడా బయల్దేరింది. కాని, తీరా ఓరుగల్లు

చేరుకునేసరికి, మహారాజు వేటలో ఉన్నారని తెలిసింది. అసమాన శేముషీ విధసంపన్నుడైన యుగంధర్ మంత్రి తోడు లేడు. వెంట ఉన్నది కూడా అల్ప సంఖ్యాకమయిన పరివారం మాత్రమే! మహామంత్రి తోడు లేని మహారాజును బంధించటం యుక్తిపరుడైన తన అన్నకు ఘనకార్యంకాదు. కాని, మహారాజును మరునాడు వేటకై తాను ఉత్తర దిశకు పంపాలి. అక్కడే తన అన్న షాజాదా అలూఫ్‌ఖాన్ పరివారంతో సంసిద్ధుడై యుంటాడనీ, మిక్కిలి తక్కువ పరివారం తోడుగా వచ్చిన మహారాజును బందించటం బహు సులభమనీ ఆమె భావన. తను ఇంతవరకూ గాయకిగా మహారాజును నమ్మించింది. ఏ విధంగా నయినా ఆయన దర్శనంకూడా గావించి, ఉత్తరం వైపుకు వేటకు వెళ్ళేటట్టు గావించాలి. అలా జరిగితే తన అన్న మహారాజును బందించి, చక్రవర్తి సముఖానికి సగర్వంగా తీసుకు పోగలడు. లేకపోతే, తను చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకునేవరకూ ఢిల్లీ ముఖం చూడడు. ఒకవేళ ప్రతిజ్ఞ నెరవేరకపోతే-పాపము శమించు గాక—ప్రాణత్యాగం కూడా గావిస్తాడు. అందువలన తానే విధంగానయినా మహారాజును ఉత్తర దిశకే వేటకు పంపాలి. అందుకు ముందు తాను మహారాజును సందర్శించాలి. ఏ విధంగా?

యోచనామగ్నమైన రజియా ముఖంపై సంతృప్తత గోచరించింది. ప్రతాపరుద్ర మహారాజు సంగీత సాహిత్యప్రియుడనీ, కవిగాయక పండిత సన్మాననిరతుడని తాను విన్నది. తను మహారాజుముందు గానవిద్య ప్రదర్శించడానికి అనుమతి వేడితేనో, కాదు- అలా వేడరాదు. మహారాజే తన గానం విని తనను ఆహ్వానించాలి. స్వతహాగా తను గాయకురాలు. అదీ గాక తన గానానికి అనేకమంది ముగ్ధులైనారు. అటువంటి తనకు తన స్వరమాధురిమీద విశ్వాసం ఉంది.

ఫాతిమాగా పరిచయమయిన రజియా చప్పట్లు చరిచింది.

ఒక యవన పరిచారిక గభాలున వచ్చి వంగి మూడుసార్లు సలాము చేసింది.

"హమ్ ఏక్ తార్ చాహతీహై!" అంది రజియా ప్రేలినున్న వజ్రాంగుళీయకం వంక చూస్తూ.

"జో హుకుం, షహాజాదీ!" అంది పరిచారిక.

రజియా తీక్షణంగా ఆమెవంక చూచింది. "మెహర్! నిద్రమత్తులో ఉన్నావా? లేక మాటలు తడబడుతున్నాయా? మేము షాహజాదీ కాదని, ప్రస్తుతం ప్రఖ్యాత ఉత్తర హిందూస్థాని గాయకి ఫాతిమా అని మాత్రం మీరంతా గుర్తించాలి. ఈసారికి మన్నిస్తున్నాం. మరోసారి ఆ మాట పొరపాటునయినా నీ నోటినుండి వెలువడిందో కఠిన దండన తప్పదు." అంది.

పరిచారిక గజ-గజలాడి పోయింది. "మాఫ్ కీజయే ...ష ...బీబీ! ఇక ముందునుంచి జాగ్రత్తగా ఉంటాను! ..." అంటూ రజియా కూర్చున్న దంతపు ఆసనం సమీపంలో ఉంచబడ్డ ఏక్ తార్ తీసుకువచ్చి, వినమ్రురాలై ఆమెకు సమర్పించి ఆజ్ఞకై వేచి ఉంది.

"అబ్ తుమ్ జాసక్తీ హో!" అంది రజియా.

పరిచారిక వంగి ముమ్మారు సలాముచేసి వెళ్ళిపోయింది.

రజియా ఏక్ తార్ చేతులలోకి తీసుకుని శృతిచేసి మెల్లగా మీటింది. మధుర మంజులమైన మృదువైన నాదం ఆవిర్భవించింది. మరుక్షణం ఆ నాదం వాయుతరంగ పంక్తులగుండా పయనించి మహారాజు విశ్రాంతి తీసుకుంటున్న సప్తవర్ణ పటకుటీరానికి చేరింది. హంసతూలికపై అర్ధనిమీలితనేత్రుడై శయనించిన ప్రతాపరుద్రుల కర్ణములు ఆ ధ్వనిని మహారాజు మనస్సుకు అందించాయి. అర్ధనిమీలితములైయున్న మహారాజు నేత్రాలు మెల్లగా వికసించాయి. క్రమంగా మధురధ్వని పొంపొందసాగింది. ఆ ధ్వనినే ఆలకిస్తూ హృదయంమీద దక్షిణహస్తాన్ని ఉంచి శయనించిన మహారాజు కర్ణములకు కొద్ది క్షణముల తర్వాత ఆ తుంబుర ధ్వనితోపాటు గంధర్వ గానాన్ని మించిన మధురగానం వినిపించసాగింది.

మహారాజు ఆ గానానికి ముగ్ధుడై తల్పంపై లేచి కూరుచుండి ఆలకించసాగాడు.

రజియా ఏక్ తార్‌ను అల్లనల్లన మీటుతూ అరమోడ్పు కన్నులతో మేఘమల్లారి రాగాన్ని మధురాతి మధురంగా ఆలపించసాగింది, మందధ

స్థాయిని ప్రారంభమైన ఆ రాగం మధ్యమంలోకి సాగి పంచమస్థాయిని అందుకుంది.

అలా పంచమస్థాయిని ఆలపింపబడుతున్న ఆ రాగం పరిసర ప్రాంతమంతా వ్యాపించింది. చరములైన జంతుజాలములేగాక; జడము లైన వృక్షసమూహం సైతం ఆ గానామృతపానంవల్ల పులకించి అల్ల నల్లన వీచే పిల్ల గాలులకు తమ తలల నూపసాగాయి.

ప్రతాపరుద్ర మహారాజు పరివారం సైతం మేనులు మరచి ఆ గాన రసాన్ని గ్రోలసాగారు. ఆదమరచి వింటున్న మహారాజు గభాలున లేచాడు. "ఎవరక్కడ?" అన్నాడు.

"చిత్తం ప్రభూ!" అంటూ ప్రతీహారివచ్చి ఎదుట నిలిచాడు.

"ఆ ఉత్తర హిందూస్థాన గాయకి ఫాతిమా గానాన్ని మేము విన గోరుతున్నామనీ, అభ్యంతరం లేకపోతే మా శిబిరంలోకి రాగోరుతున్నా మనీ చెప్పు" అన్నాడు.

"ఆజ్ఞ ప్రభూ!" అంటూ భటుడు వెనుతగ్గి నిష్క్రమించాడు.

తన్మయురాలై గానమాలపిస్తున్న రజియా వద్దకు యవన పరిచారిక పరుగు పరుగున వచ్చింది.

"ష ...ఫాతిమాబీబీ! ప్రతాపరుద్ర మహారాజుగారివద్దనుండి వార్తా హరుడు వచ్చాడు" అంది.

రజియా ముఖంమీద సన్నని మందహాసరేఖ గోచరించింది. "పక్షి పంజరంలోకి వస్తూంది. రమ్మను ..." అంటూ తిరిగి తన్మయత్వాన్ని అభినయించసాగింది.

మహారాజు వద్దనుంచి వచ్చిన భటుడు లోపలికి వెళ్ళి నిమీలితనేత్రు రాలై రాగాలాపన గావిస్తున్న రజియాను పలుకరించే సాహసంలేక ఎదుట నిలిచిపోయాడు.

కొద్ది క్షణాలకు ఆమె కనులు విప్పి ఆశ్చర్యంగా అతనివంక చూచింది. "అఖిలాంధ్ర మహీపతులు శ్రీ శ్రీ శ్రీ ప్రతాపరుద్ర మహా రాజులు తమ గానం వినటానికి కుతూహలపడుతున్నారు. అభ్యంతరం

లేకపోతే ఇదే ఆహ్వానంగా భావించి, మహారాజులవారిసముఖానికి రావచ్చు" అన్నాడు,

ఆ మాట వినగానే రజియా మనస్సు సంతోషంతో ఉప్పొంగి పోయింది. తన కార్యం సానుకూలమయే సమయం ఆసన్నమైంది.

మహారాజును తన గానామృతపానంతో మత్తెక్కింపజేసి, అరణ్యానికి ఉత్తరదిశలో క్రూరమృగములు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయని వాని బాధనుండి ఆటవికులను రక్షించమని ప్రార్థించాలి. మరునాడు ఏ విధంగానైనా ఉత్తరదిశకు మహారాజును పంపాలి అనుకుంటూ "మహారాజులవారి ఆహ్వానం నా అదృష్టంగా భావించుకుంటున్నా! తక్షణం వారి దర్శనానికి వస్తున్నామని మనవి చెయ్యి!" అంది.

భటుడు వెంటనే తిరిగి వెళ్ళిపోయాడు.

రజియా అపూర్వంగా అలంకరించుకుంది. ముఖమల్ సుర్వా, ముఖమల్ కుర్తా ధరించింది. అతి సన్నని వస్త్రాన్ని మేలి ముసుగుగా ధరించింది. ముత్యాల జాలరీలు ముంగురులపై వ్రేలాడజేసింది. సోగ కన్నులకు కాటుక దిద్దింది - నగిషీలు చెక్కిన ముఖమల్ చఢావ్‌లు ధరించింది. అత్తరు పన్నీగులు శరీరంనిండా అలుముకుంది. అవతరించిన అందాలభామగా, అపూర్వశోభలతో హంసగమనంతో నిలువుటద్దం ముందు నిలచింది. తన సౌందర్యానికి తానే ముగ్ధురాలైంది. మేలి ముసుగు సరి దిద్దుకుంటూ "మెహర్!" అంది.

మెహర్ గబ-గబా వచ్చి సలాము చేసింది.

"మహారాజులను సందర్శించాలి, నజరానా సిద్ధంచేయించు," అంది రజియా.

మెహర్ సలాము చేసి వెళ్ళిపోయింది.

రజియా సంతోషంతో పొంగిపోతూ, వయ్యారంగా నడుస్తూ పట కుటీరం వెలుపలకు వచ్చింది.

అప్పటికే మెహర్ స్వర్ణ పళ్ళెరాలలో ప్రభువులకు సమర్పించ టానికి నజరానా సిద్ధంచేసింది, ఇద్దరు సిపాహీలు కాగడాలు పట్టుకొని దారి చూపగా, షాలిమ్లా మేనా అధిరోహించినది,

మహారాజు పట కుటీరం వద్ద మురారిదేవుడు మేనానుండి దిగి రజియాను చూచి "ప్రఖ్యాత గాయనీమణికి ఆంధ్ర మహీపతుల తరఫున స్వాగతం! అన్నాడు.

రజియా సహజ దర్పంతో సలాము చేసింది. మురారిదేవుడు ప్రక్కకు తొలగి దారి ఇచ్చాడు.

రజియా మహారాజు సమక్షంలోకి వెళ్ళి నేలకు వంగి సలాము సమర్పించింది. "ఆంధ్రసామ్రాట్టులకు హృదయపూర్వక ప్రమాణాలు సమర్పిస్తున్నాం. దక్షిణ భారత యాత్రకు బయలుదేరినప్పుడే ప్రభువులు సంగీత సాహిత్య ప్రియులని, కవిపండితగాయక సన్మాననిరతులని విని తమ దర్శనం చేసుకోవాలని అభిలషించాను. కాని, ప్రభువులు రాజధానీ నగరంలో లేరని విని ఎంతో విచారించాను. తమన్ని సందర్శించకుండానే, తమకు నా గానం వినిపించి తమ ఆదరాన్ని బడయకుండా దక్షిణ భారతాన్నుండి మరలటానికి మనసు అంగీకరించకపోయినా, ఢిల్లీలో ఆలంపనాహ్‌వారి జన్మదినోత్సవ సందర్భాన దర్బారులో, నా కార్యక్రమం ఉండటంవలన వెంటనే ఢిల్లీకి మరలవలసి వచ్చింది. కాని, అల్లా దయామయుడు! మార్గమధ్యంలో నా మదిలో కోరిక నెరవేరుతుందని నేనేనాడూ తలచలేదు," అంది.

"ఫాతీమా! మేము కూడా ఈ ఖేటానా ప్రదేశంలో నీవంటి అద్భుత గాయకి పాట వినగలమని ఆశించలేదు. వేటలో అలసి ఉన్న మా శరీరాన్ని మనసునీ నీ అమోఘ గానామృత వృష్టితో ఆహ్లాదపరచు!" అన్నాడు ప్రభువు.

రజియా ప్రక్కలకు చూచి "మెహర్!" అంది.

వెంటనే మెహర్ స్వర్ణపళ్ళెరాలలోని నజరానతో లోపలకు వచ్చి ప్రభువులకు సలాం చేసి సేవకుల చేతిలో ఉన్న నజరానాను రజియాకు అందించింది. ఆమె వాటిని మహారాజు పాదాల ముందు ఉంచింది. అమూల్యమైన మణిమాణిక్య హారాలు. అద్భుతమైన సన్నని వస్త్రములు, కలతారు కుళ్ళాయిలూ చూసి ప్రతాపరుద్రుడు ఆశ్చర్యంతో "ఏమిటిది?

మేము సమర్పించాల్సింది పోయి, మీరు మాకు కానుకలు సమర్పించ టమా?" అన్నాడు.

అంతవరకూ అవనితయై మహారాజుతో సంభాషిస్తున్న రజియా తల ఎత్తి మహారాజు వంక చూసింది. అపూర్వమైన క్షాత్రవ తేజంతో విరాజిల్లుతున్న మహారాజు వర్చస్సు ఆమె హృదయపలకం మీద ప్రతిరూపు చిత్రించుకుంది. పరాక్రమ పౌరుషాలను ప్రతిబింబింపజేస్తున్న విశాల నయనాలు, వైరి వీరుల కంపింపజేసే అనుపమ పరాక్రమాన్ని వెదజల్లే సమున్నతమైన వక్షస్థలం, రాజసం ఉట్టిపడుతున్న ఆ మహారాజమూర్తి రజియా స్త్రీత్వాన్ని కలవరపరిచింది. ఆ అప్రయత్నంగా ఆమె కన్నులు అవనతములైనవి. అనూహ్యమైన ఆకర్షణతో ఆమె శరీరం పులకించింది. తను వచ్చిన కార్యం ఒక్క క్షణం విస్మరించింది. "ఆంధ్ర ప్రభువు ఎంత సుందరుడు! ఈ మహారాజును భర్తగా స్వీకరించిన ఆ మదవతి ఎంత అదృష్టవంతురాలో!" అనుకుంది మరు క్షణం ఆమె తన తత్తరపాటును అణచుకుంటూ "ప్రభూ! తమరంటే మాకున్న గౌరవాన్ని తెలియపరచుకోవటం కోసం ఈ చిన్న నజరానా సమర్పించుకుంటున్నాను. దయతో స్వీకరిస్తే అదృష్టవంతురాలిని," అంది;

ఆమె మనసు బాధపడటం యిష్టంలేక మహారాజు వానిని చేతితో తాకాడు. వెంటనే మురారిదేవుడు వానిని ప్రక్కకు తీసుకుపోయాడు:

"ధన్యురాలిని ప్రభూ," అంది రజియా.

"నీకు మాపై గల ఆదరాభిమానాలకు మా కృతజ్ఞత!" అన్నాడు మహారాజు.

"అనుజ్ఞ ఇస్తే గానం ఆలపిస్తాను" అంది రజియా.

అన్నాడు మహారాజు.

రజియా తనకై సిద్ధపరచబడిన ఆసనంపై కూరుచుంది.

మెహర్ ఏక్‌తార్‌ను ఆమెను అందించింది.

ఆమె మహారాజుకు మరొకసారి సలాముగావించి, గానాన్ని ప్రారంభించింది.

మధురాతి మధురమైన ఆమె కంఠస్వరానికి: ముగ్ధుడై మహారాజు రెప్పవాల్చక ఆమెవైపునకే చూస్తుండిపోయాడు. పాటలో మైమరచిన రజియా తన మేలిముసుగు జారినదికూడా గమనించలేకపోయింది.

సజన మొరె బినతి సునో
సవరయా మొహె అవనా బనో

—అని రజియా తనకోమల గాత్రంతో పలికినశబ్దాన్నే పలుమార్లు పలువిధములుగా మెలికలు తిప్పుతూ జిలుగులు చేకూర్చి పలుకుతూ, పాడుతుండగా ప్రకృతి పులకించి పరవశ్శు తొక్కసాగింది. ఆమె పాటకు కోడెతాచులు ఫణులు విప్పి ఆడసాగాయి.

పాడుతూన్న ఆమె నేత్రాలు మహారాజు వంక తిరిగాయి. ఆమె గానానికి ముగ్ధుడైన మహారాజు మందహాస ముద్రికతో ఆమె వంక చూడ సాగాడు. ఆ నేత్రాలలోనే ఆకర్షణను భరించలేక రజియా కన్నులు మూసుకుంది.

ఆమె శరీరం, కంఠం కంపించసాగింది. ఆ కంఠం నుండి వెలు వడిన గానం మిక్కిలి మధురాతి మధురంగా ఉంది.

ప్రియ మొరె బినతి సునో
ప్రీతమ్ మొహె అపనా బనో

ఆమె శరీరంతోపాటు తంత్రికూడా కంపిస్తూంది. ఆ కంపననుండి తంత్రీనాదం మధురాతి మధురంగా వినవస్తూంది. నిమీలిత నేత్రురాలైన రజియా అంతర్నేత్రముల ముందు కూడా మహారాజు మందహాసముద్రిక గోచరించింది. ఆ ముద్రిక తనలో ఐక్యమైనట్లు, తామిద్దరూ కలిసి నందనోద్యానవనాల్లో విహరిస్తున్నట్లు, మహారాజు బలిష్ఠమైనహస్తాలతో తన మృదుశరీరం గాఢపరిష్వంగంలో బంధించబడ్డట్లు చిత్రవిచిత్రమైన దృశ్యాలు ఆమె మనోవీధిని సాక్షాత్కరించాయి.

మితిమీరిన మానసికోద్రేకంతో ఆమె కన్నులనుండి ఆనందాశ్రు పులు జాలువారాయి. కంఠం రుద్ధమైంది. ఎంత పిలిచినా ప్రియుడు

తన చెంతకు రాలేదని, తన మొర వినలేదని బాధపడే అభిసారికవలె ఆమె హృదయం కరిగి, కన్నీరై ప్రవహిస్తుందా అనిపించింది మహారాజుకు. అత్యంత కరుణాభరితమైన ఆమె ఆరాటాన్ని చూడలేకపోయాడు మహారాజు.

"గాయనీ! చాలించు! అన్నాడు.

మహారాజు మాటలకు ఉలికిపడి కనులు తెరచిగది రజియా. అప్పటికి ఆమెకు తనతప్పు అర్థమైంది. క్షణిక మానసిక వేదనకు గురియై తాను మహారాజు ముందు లోకువైనట్టుగా భావించింది.

"గాయనీ! అనుభవించి పలువరించే నీ అద్వితీయ గానం మమ్మ ఆహ్లాదపరచింది. అయితే, ఆకస్మాత్తుగా ఈ ఖేటానా ప్రదేశంలో మన కలయిక సంభవించటంవలన నిన్ను ఘనంగా సత్కరించే అవకాశంలేక పోయినందుకు చింతిస్తున్నాను—" అంటూ మహారాజు ఆమె గానానికి తగిన సత్కారానికై ఒక్క క్షణం యోచించాడు. అయితే, ఆమె ఘన గానానికి విలువచేకూర్చే బహుమానమేదీ కూడా ఆయనకు గోచరించలేదు. అంతలోనే ఆయనదృష్టి తన రత్నాంగుళీయంపై ప్రసరించింది. మైమరచిన మహారాజు రత్నాంగుళీయకం తీయటానికి ప్రయత్నించి, అందుకు బదులు రాజముద్రికను ఆమెకు అందించాడు. "ప్రస్తుతానికి ఈ చిన్న బహుమతితో సంతృప్తి పడు. అవకాశం లభించి ఓరుగల్లుకు నీ రాక సంభవిస్తే, ఘనంగా సత్కారం చేస్తాము!" అన్నాడు.

రజియా వంగి రాజముద్రికను అందుకుని, శిరస్సు నేలకు తాకుతుండగా సలాము చేసింది. "ప్రభూ! రసమయులైన తమను నా గానం సంతృప్తి పరచటమే నాకు అన్నింటికంటె ఘనమైన బహుమానం—" అంటూ ఆ రాజముద్రికను కన్నుల కద్దుకొని, మహారాజువంక రెండు క్షణాలు చూచింది.

"మురారిదేవా! కాలాతీతమైంది. గాయకిని సురక్షితంగా ఆమె పటకుటీరం చేర్చే ఏర్పాటు గావించు," అన్నాడు.

రజియా ఆ మాటకు గాఢంగా నిట్టూర్చింది. "ప్రభూ!" మురారిదేవులు శ్రమ తీసుకోవలసిన అవసరంలేదు. అదృష్టం ఉంటే అల్లా

కరుణిస్తే, తిరిగి మిమ్మల్ని కలుసుకుని నా గానాన్ని వినపింప చేస్తాను. ఖుదా హాఫిజ్! ..." అంటూ మరోసారి సలాముచేసి, తడబడుతున్న పాదాలతో వెనుతిరిగింది. పట కుటీరంవద్ద ఆగి మరోసారి . మహారాజు అందమైన మూర్తిని మనసారా వీక్షించి, పట కుటీరం బయట సిద్ధంగా ఉన్న మేనాను అధిరోహించింది.

ఆ గాయకురాలి విచిత్రప్రవర్తనకు మహారాజు మందహాసం గావించి, తల్పంపై వరిగి కన్నుమూశాడు.

*   *   *   *

రజియా తన పటకుటీరంలో పట్టుపరుపుల పైన మేనువాల్చింది. అష్టమచంద్రుడు అప్పుడే ఉదయించి పటకుటీరానికి అమర్చిన గవాక్షం ద్వారా తన శీతల కిరణచ్ఛాయలను ప్రసరింపజేస్తున్నాడు. రజియా మనస్సులో తీరని ఆవేదన ఆరంభమైంది. నిద్రపోవాలని రజియా ఎంత ప్రయత్నించినా ప్రయోజనం ఇసుమంత కూడా లేకుండాపోయింది. పట్టు బాలీసునానుకుని ఉదయిస్తున్న చంద్రుని వంక తదేకంగా చూడసాగింది.

రాజసమూ, వర్చస్సూ, సౌందర్యమూ మూర్తీభవించిన ప్రతాప రుద్ర మహారాజు రూపు ఆమె మనస్సులో ముద్రపడిపోయింది. ముద్దా మన్నా మసుపురాని ఆ సుందర వదనం మాటిమాటికీ ఆమె నేత్రాల ముందు మెదలసాగింది. అటువంటి మహారాజుపై అప్రయత్నంగా రజియా మరులుకొంది. అటువంటి మహాపురుషుని కౌగిలిలో మైమరచిన మగువ జీవితమే సార్థకమని ఆమె నిశ్చయంగా విశ్వసించింది. అయితే, ఆ మహనీయుని సంపర్కం తనకు సాధ్యమౌతుందా? అసంభవం! అనూహ్యమైన విషయం. మహారాజును బంధించక ఢిల్లీ ముఖం కూడా చూడనని ప్రతిజ్ఞ పట్టాడు తన సోదరుడైన షాజాదా అల్లాఫ్‌ఖాన్. చక్ర వర్తికి బందీ అయిన తరువాత ప్రతాపరుద్రునికి జరగబోయే సన్మాన మేమిటో తనకు తెలుసు. ఆ విషయం ఆమెకు ఆలోచన కలగగానే రజియా శరీరం గజ-గజ వణకింది! ఇటువంటి అద్భుత సుందరాకారుణ్ణి ఆజన్మాంత ఖయిదీ గావించటమో, లేక....? ఆలోచించలేక పోయింది రజియా, ఆమె మనస్సు అంతకంతక్కూ ఆరాటపడసాగింది, ఏ విధంగా

నయినా మహారాజును ఉత్తర దిశకు వేటకు వెళ్ళకుండా చెయ్యాలి అను కుంది. అంతలోనే అలూఫ్‌ఖాన్ ప్రతిజ్ఞ ఆమె చెవులలో గింగురుమంది. రాజును బంధించి తన అశ్వంవెంట పాదచారిగా ఢిల్లీకి గొనిరాని పక్షంలో తాను ఢిల్లీ ముఖం చూడబోను అన్నాడు. అందుకుగాను అనేక మాసాలుగా ఢిల్లీ వదలి దేవగిరిలోనే ఉండిపోయాడు. తాను ఆయనకు సహాయం చెయ్యటానికి వచ్చింది. ఆ ఉద్దేశ్యంతోనే గాయకురాలిగా పరిచయమైంది. చక్రవర్తి ముద్దులపట్టి ఒక హిందూ ప్రభువులకు వంగి సలాములుచేసింది. తన గానంతో మైమరపింపజేసింది. కేవలం గానమే వృత్తిగా కలవారు చెయ్యివలసిన కార్యం తానెందుకు ఆచరించింది? తన అన్న ప్రతిజ్ఞ నెరవేర్చటం కోసం. దక్షిణ భారతంలో తమకు ప్రక్కలో బల్లెంగా ఉన్న బలవంతుడైన ప్రభువును కుయుక్తులతో బంధించటం కోసం— అటువంటిది తాను మహారాజు అందమనే వ్యామోహంలో పడి కర్తవ్య భ్రష్టురాలు కాకూడదు అనుకుంది. ఏమైనా, మరునాడు మహారాజును ఉత్తర దిశకే వేటకు బయలు దేరదీయాలి.

"ఓసి పిచ్చి రజియా! అపూర్వ సౌందర్యవంతుడైన ఆ మహా పురుషుని బంధింపజేసి నువ్వేం బావుకుంటావు?" మనస్సు పరిహాస మాడింది.

నా కర్తవ్యాన్ని నేను నెరవేర్చుకుంటాను." అంది ఆత్మ.

"హుఁ! కర్తవ్యం! అది చాలా పెద్ద మాట! ఏం అపకారం గావించాడని ప్రతాపరుద్రుని బంధించటం నీ కర్తవ్యంగాభావింవావు?"

"అపకారం గావించనక్కరలేదు. "కాఫిరోం ఔర్ ఇస్లామ్ పర ఈమాన్ నలానే నాంలోపర్ హమ్‌లాకరో" అన్న ఇస్లామ్ సూక్తి ఉంది. సందేహించక! మహారాజు కాఫిర్. అతన్ని ఏ విధంగానయినా బంధించటంలో తప్పులేదు. నీ కర్తవ్యము నీ వాచరించాల్సిందే!" అంది

"హుఁ! మతం జాతి, కాఫర్, ఇస్లామ్! ఇవి పిచ్చిమాటలు! ప్రేమకు జాతి మత భేదంలేదు. పిచ్చి ఊహాలకు పోయి చేతికందనున్న అమృతభాండాన్ని కాదనకు," అంది మనస్సు.

"మాట తప్పావా- పైగంబర్ మహమ్మద్‌నే మరచినదాన వవు తావు. ఆ తరువాత మక్కా - మదీనాలు తిరిగినా రోజుకు అయిదుసార్లు నమాజు గావించినా అల్లా నిన్ను క్షమించబోయేది కల్ల ."

రజియా మనసుకూ, అత్మకూ జరుగుతున్న ఆ తీవ్ర సంఘర్షణకు నిలువరించుకోలేక పోయింది. క్షణ క్షణానికీ అమె ఆరాటం అధికం కాజొచ్చింది. రెండు చేతులతోనూ గట్టిగా చెవులు మూసుకొని యా ఖుదా! అబ్ మై క్యా కరూం?" అంటూ తల్పంమీద వాలిపోయింది.

ప్రతాపరుద్రుని తన అన్న బంగించినట్టు, ఢిల్లీకోటలో ఆయనను ఖయిదీ గావించినట్టు, భయంకరమైన ఉన్మాది ఒకడు ఢిల్లీ నగర రాచ వీధుల్లో తిరుగుతున్నట్లు, ఢిల్లీ నగరం అకస్మాత్తుగా పరశురామ ప్రీతి అయినట్టు-పలువిధములయిన దుస్వప్నములతో ఆమె ఆ శేషరాత్రిని గడి పింది. ఆ దుస్వప్నాలు కలుగజేసిన అలజడికి ఆమె కన్నులు తెరచింది. అప్పుడే ప్రాగ్దిశను ఉషాసుందరి అలంకరణ గావించుకుంటూంది. రజియా, మనస్సు తను చూచిన దుస్వప్నములలో వికలమైపోయింది ఆమె మన స్సును ఆహ్లాదపరచేందుకై తంబురను చేతిలోకి తీసుకుని మీటబోయింది. పఠాలున తంత్రి తెగింది. ఆమెలోని ఆవేదన మరింత అధికమైంది. లేచి పటకుటీరం దాటి బయటకు వచ్చింది. అదే సమయంలో కిన్నెరసాని ప్రవాహంలో ఆనందంగా ఆడుకుంటున్న ఒక చిన్న చేపను ఆ పరిసర ప్రాంతాలలో ఎగురుతున్న ఒక గృధ్రము తన కాలిసందుల ఇరికించుకొని ఎగిరిపోయింది. అంతలోనే అతివేగంలో వచ్చిన ఒక డేగ, ఆ గ్రద్దను తన్నుకుపోయింది. ఆ గృధ్రము కాళ్ళ మధ్యనున్న చేప తిరిగి నీటిలోపడి సురక్షిత స్థానాలకు పోయింది.

ఆ దృశ్యాన్ని చూచిన రజియా మనోవీధిని, తను గాంచిన దుస్వప్నం తిరిగి సాక్షాత్కరించింది. అత్యల్ప పరివారంతో ఉన్న మహా రాజును, తన అన్న బంధించి ఢిల్లీకి గొనిపోనున్నాడు. మరియొక బల వంతుడు వచ్చి ఢిల్లీని అల్లకల్లోల పరచనున్నాడు. ఏ విధంగా చూచినా ఢిల్లీకి చేటుకాలం సమీపించినట్టుగా ఉంది, ఏ విధంగా ఈ సర్వనాశ

నాన్ని అరికట్టటం?" అనుకుంటూ ఆమె మహారాజు పటకుటీరంవైపు చూచింది.

అప్పటికే మహారాజు ఖేటనోచిత దుస్తులతో, తనకై సిద్ధపరచబడిన పంచకళ్యాణిని అధిరోహించనున్నాడు. ఆమెకు ముందు వెనుకలు ఆలోచించేందుకు అవకాశం లేకపోయింది. మహారాజును వేట ప్రయత్నం నుండి మరలించాలి.

"ప్రభూ!" అంటూ ఉన్మాదినివలె మహారాజు వంక పరువెత్తింది.

ఆ విధంగా పరువెత్తుకు వస్తున్న గాయకిని చూచి, అశ్వాన్ని అధిరోహించబోయిన మహారాజు ఒక్క క్షణం ఆగి, ఆమె వంకనే చూస్తూ ఉండిపోయాడు.

రజియా మహారాజును సమీపించి, వంగి సలాముచేసింది.

"ఏం, ఫాతిమా? మాతో ఏమైనా అవసరకార్యమా?"

"ప్రభువులు ఈనాడు - ఉత్తరదిశకే వేటకు వెడుతున్నారనుకుంటాను?"

"అవును."

"వద్దు, ప్రభూ! ఈనాటికి మీరు ఆ ప్రయత్నాన్ని విరమించండి. ఈనాడే కాదు; అసలు ఈసారికి తాము ఉత్తరదిశకు వేటకు వెళ్ళటం మంచిది కాదు."

మహారాజు ఆశ్చర్యపోయాడు. "ఏం? ఎందువలన?"

"ప్రభూ! గతరాత్రి నేను అనేక దుస్స్వప్నాలు గాంచాను. ఉలిక్కిపడి లేచాను. పటకుటీరం బయటకు రాగానే ఒక దుశ్శకునం గోచరించింది. కిన్నెరసాని వాగులోని ఒక మీనాన్ని ఒక గృద్ధం తన్నుకుని, ఉత్తరదిశగా ఎగిరిపోయింది. తమరు కూడా ఉత్తరదిశకే వేటకు వెడతామంటున్నారు. ప్రభూ! నా మనవి ఆలకించండి. తాము కనీసం ఉత్తరదిశకన్నా వేటకు వెళ్ళకండి. ప్రభువులకు ఏదో ఆపద రానున్నదని నా మనస్సాక్షి చెపుతూంది. దయయుంచి తమరు నా మొర ఆలకించండి!" అంటూ పంచకళ్యాణి కళ్ళెమును చేతిలోకి తీసుకుంది.

"స్వప్నాలకు, శకునాలకు భయపడి క్రూరమృగములు అధికమై ఆటవిక జనులను బాధిస్తుండగా, వాని బాధనుండి వారిని కాపాడలేకపోతే భీరువని ప్రజలు గర్హిస్తారు. ఫాతిమా! నువ్వు అనవసరపు ఆందోళనతో కలవరపడకు! మా నిశ్చయానికి తిరుగులేదు" కళ్ళెమును పట్టుకున్న ఆమె చేతిని మృదువుగా తొలగించి అశ్వాన్ని అదిలించాడు. మరుక్షణం మహారాజు అశ్వం, ఆయన వెంట కొద్ది పరివారం ఉత్తరదిశగా మరలి పోయారు. మహారాజు వెళ్ళినవైపే దీనంగా చూస్తూ నిలబడిపోయింది రజియా.

ఆనాటి మధ్యాహ్న సమయంలో విద్యానాథుడు మహారాజుగారి కొరకు, ఆ ఘటనా ప్రదేశానికి వచ్చాడు. మహారాజు పటకుటీరంలో లేక పోయేసరికి, మహారాజు ఏ వంక వేటకై వెళ్ళివుంటారో అనుకుంటూ ప్రక్కనే గుడారాలు ఎత్తివేయించి, ప్రయాణానికి సిద్ధంగా ఉన్న రజియాను మహారాజు పోయిన దిశను గురించి అడిగాడు.

రజియా ఒక్కక్షణంయోచించి "మహారాజు వెళ్ళిన దిశమాత్రం నాకు తెలియదు. రాత్రి నా గానామృతం ఆస్వాదించి, మైమరచి పొరపాటున ఈ ముద్రికను నాకు బహూకరించారు. దీన్ని మీ ప్రభువులకు చేర్చండి!" అంటూ మహారాజు తనకు కానుకగా ఇచ్చిన రాజముద్రికను విద్యానాథుని కందించింది.

విద్యానాథుడు దానిని కనుల కద్దుకొని, భద్రపరచి ముందుకు సాగిపోయాడు,

రజియా దీర్ఘ నిశ్వాసం విడిచింది.

# 8

క్రళ్ళెము, జీను, దాని ప్రక్కన వ్రేలాడుచున్న కత్తులు, కఠారులు, అమ్ముల పొదులు, ఈటెలు, బాకులు మొదలైన ఖేట సాధన సంపన్న మైన గంధవాహ బాంధవం మహారాజు తన వీపుపై కి లంఘించిన వెంటనే వాయువేగాన్ని మించిన వేగంతో ముందుకు పరుగెత్తసాగింది. మహారాజు బయలుదేరిన వెంటనే మురారిదేవుడు తక్కిన పరివారం తమ తమ కేశములు తలపాగలతో అణగిపోవునట్లు చుట్టుకొని ధోవతులు మడచి, కాసెకోకలు బిగించి, తమ ముంటిజేతులపై నున్న డేగలను ప్రోత్సహిస్తూ తమ ఉత్తమాశ్వముల నదిరోహించి బయలుదేరారు. వారి వెంట భయం కరమైన జాగిలాలు 'భౌ భౌ' శబ్దాలు చేస్తూ ముందు కురికాయి. కాని, కురంగ గమనంతో ముందుకు లంఘిస్తున్న మహారాజు అశ్వాన్ని మిగిలిన వేటగాండ్రు అందుకోలేకపోయారు. మహారాజు రెట్టించిన ఉత్సాహంతో వేట తమకంలో పరిజనులను మరచిపోయి ముందుకుపోసాగాడు. చుక్క లను చుంబించే వృక్షాగ్రాలు, మహామేరువుల్లా వున్న పర్వత శృంగాలు, కొండ చరియల నుండి తలక్రిందులుగా దుముకుతున్న సెలయేటి నీటి కలకలారావం, అచ్చటచ్చట విశాలమైన మైదాన ప్రదేశాలు, ఆ మైదానా లలో పచ్చికలు మేస్తూ, బెదురు చూపులతో దిక్కులుచూస్తూ, తలల నాడించుచూ, బారు కర్రలగొని సాము గరిడీచేయు వాని తలపించు హరిణ జాలములు, సెలయేటి గానాలకు లయగా కదం తొక్కుతూ పురి విప్పి ఆడేటి మయూరసంతతి మొదలైన ప్రకృతి రమణీయ దృశ్యాలను చూస్తూ మహారాజు కొంత దూరం పయనించాడు. ఆ తరువాత తన వారెవరూ తనను అనుసరింప లేకపోయినారనే విషయాన్ని గ్రహించి, అరణ్య శోభను తిలకిస్తూ తన అశ్వాన్ని ఆపుచేసి, కొంతకాలం విశ్రాంతి తీసుకున్నాడు మహారాజు, అశ్వాన్ని అవరోహించకుండానే. ఎంత సేపు చూచినా తన అనుచరులెవరూ రాకపోయేసరికి, విసుగెత్తి వంటరిగానే

ముందుకు పోవాలని నిశ్చయించుకున్నాడు మహారాజు. అంతలో దూరాన గుఱ్ఱపు డెక్కల శబ్దం వినివచ్చింది. మహారాజు వెనుతిరిగి చూశాడు. మురారిదేవుడు ఒక్క పదిమంది అశ్వికులను మాత్రం వెంటబెట్టుకునివాయు వేగంతో తనను అనుసరించి వస్తున్నాడు. శతాధికమైన తన సైన్యంలో తన్ను అనుసరించ గల్గినవారు పదిమందే నన్న మాట! అనుకొన్నాడు మహారాజు. బహుశా ఆ రోజున తను మహా వేగంతో అశ్వరాజాన్ని పరు గెత్తించి ఉంటాడు. మహారాజు తన గుఱ్ఱాన్ని వెనుకకు మళ్ళించి మురారి దేవుని కలుసుకున్నాడు. ఎదురు వస్తున్న మహారాజుకు అభివందనం చేశాడు మురారిదేవుడు.

"మహారాజా! పరివారాన్ని విడిచి తామింత వేగంగా ముందుకు రావటం అంతగా మంచిదికాదేమో! తమకు తెలిసినంతగా అశ్వహృదయం మాకు తెలియకపోవటంవల్ల మిమ్మల్ని అనుసరించలేకపోయాం. మన పరివారంలో పదిమంది మాత్రమే నన్నయినా అనుసరించి రాగలిగారు. మిగిలినవారు వచ్చేవరకు ఆ వట వృక్షం దగ్గర విశ్రాంతి తీసుకోవలసిం దిగా ప్రభువులను ప్రార్థిస్తున్నాను," అన్నాడు మురారిదేవుడు వినయం ఉట్టిపడగా. మహారాజు చిరునవ్వు ఒలకబోస్తూ సమాధానం చెప్పాడు.

"మురారిదేవా! ఎన్నడూ వినరాని మాటలు నీ నోటినుంచి వింటు న్నాను. నీకు కూడా ఏమైనా కల వచ్చిందేమిటి?"

"కలకాదు, ప్రభూ! అంతా ఒకటిగా ఉంటే ఎందుకైనా మంచి దనే ఉద్దేశ్యంతో...."

"హుఁ! అమాయికలైన ఈ వన్యమృగాలను సంహరించటానికి పరివారం అంతా కావాలా? మన పదిమందిమీ చాలమూ?" అంటూ తన అశ్వాన్ని ముందుకురికించాడు మహారాజు. అతని వెంటనే మురారిదేవుడు, మిగిలిన అనుచరులు కూడా తమ అశ్వాలను ముందుకురికించారు. ప్రతాపరుద్ర చక్రవర్తి, మురారిదేవుడు పక్కపక్కన స్వారీ చేస్తున్నా మిగిలినవారు వారిననుసరిస్తున్నారు, కొద్దిదూరంలో.

ప్రభూ! ఆ కనిపిస్తున్న పర్వతాగ్రం చూశారుగా!" అన్నాడు మురారిదేవుడు.

"ఔను. దట్టంగా పెరిగిన వృక్షాలతో మింటినంటుకున్న ఆ పర్వతం భయంకర రమణీయకతను ప్రస్ఫుటం చేస్తోంది." అంటూ మహారాజు పక్కకు మళ్ళించాడు తన అశ్వాన్ని.

రాజహృదయం తెలిసిన మురారిదేవుడు, ఆశించిన ఫలితాల్ని తేలిగ్గా సాధించినందుకు సంతృప్తి నిట్టూర్చాడు. కొద్ది కాలంలోనే మహారాజు ఆ భయంకరారణ్యంలో ప్రవేశించాడు. భీకరమైన వేట ప్రారంభమైంది. కనిపించిన ప్రతి మృగాన్నీ తనవాడి తూపులకు ఎరచేస్తున్నాడు, మహారాజు. జింకల గుంపులు చెదరి చెదిరిపోసాగాయి. తోకలు ముడుకున్న సివంగులు దెబ్బలు తిని ఆర్తనాదాలు చేస్తూ తమ గోడు మృగరాజుతో విన్నవించుకోవటానికి పారిపోసాగాయి. ఎలుగులు కొండకోనలను పట్టి ప్రాకసాగాయి. పిల్లకోతులను కడుపునకదుముకొని తల్లికోతులు చెంగు చెంగున ఒక కొమ్మ మీదనుంచి మరో కొమ్మమీదికి గంతులిడసాగాయి. అస్త్రపాతముల ఒడలునొచ్చిన శార్దూలాలు నోరుతెరచుకొని భయంకరంగా గాండ్రిస్తూ అటూ ఇటూ పరుగిడసాగాయి. మహారాజు ఆ భయంకరదృశ్యాలను ఆహ్లాదకరంగా స్వీకరిస్తూ ముందుకు సాగిపోసాగాడు. మురారిదేవుడు, మిగిలిన అనుచరులు అరచేత ప్రాణాల నుంచుకొని మహారాజుచే శస్త్రాస్త్రఘాతముల గొని తమ పైకి దూసుకొచ్చిన సగము చచ్చిన వన్యమృగములను తమ తమ ఖడ్గధారల కెరచేస్తూ మహారాజు ననుసరించారు. సరిగా మధ్యాహ్న సమయానికి మహారాజు, అతని పరివారం ఆ భయంకర పర్వతారణ్యాన్ని అధిగమించి ఆవలిప్రక్కకు చేరగలిగారు. వాతావరణం ప్రశాంతంగా ఉంది. అడవి పల్చబడిపోయింది, పచ్చికబయళ్ళు విస్తారంగా ఉన్నాయి. అల్లంత దూరాన అనంత గౌతమీ జలాలు సాగర సంగమం కోసం ఉవ్విళ్ళూరుతూ పరుగులు తీస్తున్నాయి.

"ప్రభూ! తమరీ వటవృక్షచ్ఛాయన కొంతకాలం విశ్రాంతి తీసుకోండి" అన్నాడు దగ్గరగాఉన్న ఒక మర్రిచెట్టును చూపిస్తూ మురారిదేవుడు ప్రతాపరుద్ర చక్రవర్తితో. మృగయావినోదంలో అలసి సొలసిన

మహారాజును ఆ సలహా పాటించతగిందిగానే కన్పించింది. తానే కాకుండా తన అశ్వరాజంకూడా చాలావరకూ అలసిపోయింది. అందుల్ల ప్రభువు తనకన్నా ముఖ్యంగా తన అశ్వానికి విశ్రాంతి ఇవ్వాలనే ఉద్దేశ్యంతో తన గుర్రాన్ని వటవృక్షం దగ్గరకు నడిపించి వృక్షచ్ఛాయలో అశ్వాన్ని అవ రోహించాడు. వెంటనేవున్న పరిజనం ప్రభువుకొరకు రత్నకంబళీ పరి చారు. తాము తీసుకొని వచ్చిన చల్లని సెలయేటి జలాలతో ప్రభువుకు సేద తీర్చారు. ఆ తరువాత ప్రభువు మధ్యాహ్నం భోజనాన్ని ఆరగించాడు. బయట ఎండ తీక్షణత ఎంత ఎక్కువగా ఉన్న వృక్షచ్ఛాయ ప్రభువుకు చల్లదనాన్ని విపరీతంగా ప్రసాదించింది. తన అశ్వాన్ని మేతకని పచ్చిక బయళ్ళలోకి పంపమని ఆజ్ఞఇచ్చి, తాను ఆ వృక్షచ్ఛాయన విశ్రమించాడు. కొన్ని క్షణాల్లోనే ప్రభువు నిద్రాదేవి గాఢపర్ష్వంగంలో మైమరచి పోయాడు. చుట్టూ ఉన్న అంగరక్షకులు ప్రభువును వేయికన్నులతో కని పెట్టసాగారు. మురారిదేవుడు మాత్రం ఆందోళనపూరిత నయనాలతో అటూ-ఇటూ చూస్తూండిపోయాడు. భానుడు క్రమక్రమంగా అస్తాద్రివైపు ఒకొక్కక్క మెట్టే దిగిపోతున్నాడు. క్షణక్షణానికి మురారిదేవునిలోని ఆందోళన అధికం కాసాగింది. తాను రచించిన వ్యూహం ఇంతవరకూ సక్రమంగా సాగింది. కాయసిద్ధి తన కార్యాన్ని సరిగా నిర్వహించాడో లేదో! ఒకవేళ అతడు తన విధిని సక్రమంగా నిర్వహించే వుంటే, ఈపాటికి షహజాదా అలూఫ్ఖానుడు రెక్కలు కట్టుకొని అక్కడ వాల వలసి వుంది. కాని అతని జాడే కన్పించటంలేదు. కాయసిద్ధివంటి కార్య తత్పరుడు పనిలో ఏమరుపాటుంటాడా! అసంభవం!' అనుకున్నాడు మురారి దేవుడు. అంతలోనే అతని ఆలోచనకు తగినట్టుగా దూరాన గుర్రపుడెక్కల సవ్వడి వినవచ్చింది. ఆ వొస్తున్నది ఆంధ్రసైన్యమే! అదే గనుక నిజంగా ఆంధ్రసైన్యమే అయితే, తాను ఇంతకాలం పన్నుకుంటూవచ్చిన వ్యూహం భగ్నం కావటం తథ్యం. ఒకవేళ అది అలూఫ్ఖాన్ సైన్యమే అయితే, తన ఆశయసిద్ధి క్షణాలలోకి వచ్చిందన్నమాట! మహారాజు బంది గావటం, మరుక్షణంలో తాను కాకతీయ సామ్రాజ్య సింహాపీఠి పైన అధిష్ఠించి పట్టాభిషిక్తుడు కావటంకూడా జరిగిపోతాయి. ఏది ఏమై

తన గుట్టు రట్టయ్యేందుకు ఆట్టే అవకాశం లేదని గ్రహించిన మురారి దేవుడికి వినిపించిన గుఱ్ఱపుడెక్కల సవ్వడి మహారాజును కావలికాస్తున్న మిగిలిన భటులకు కూడా వినిపించింది. అయితే, వారు కూడా ఆ సైన్యాన్ని ఓరుగల్లు సైన్యంగానే భావించారు. క్షణ క్షణానికీ గుఱ్ఱపు డెక్కల సవ్వడి ఎక్కువయింది.. ప్రక్కనే ఉన్న పర్వతపు చరియలలో నుండి చూస్తూ చూస్తూ ఉండగానే వందలాది వీరభటులు ఆంధ్ర పతాకను ఎగురవేస్తూ తమ అశ్వాలను పరుగెత్తించుకొని వచ్చారు. మహారాజును కావలి కాస్తున్న భటులకు ఈ ఆంధ్ర సైన్యం ఎందుకు వచ్చిందో అర్థం కాలేదు. అయితే, ఈ స్వల్ప విషయం కొరకు మహారాజుకు నిద్రాభంగం కలిగించటం ఇష్టంలేక మిన్నకుండిపోయారు. కొద్ది క్షణాల్లో ఆ కొత్తగా వచ్చిన సేనావాహిని మహారాజుని పరివేష్టించివేసింది. మహా రాజు అంగరక్షక దళం ఆ అంగరక్షక సైన్యాన్ని పరిశీలించింది. మరు క్షణంలో వారికి మోసం అర్థమైంది. ఆ వొచ్చింది ఆంధ్ర సైనికులు కారు. ఆంధ్రసైనికుల వేషభూషణాలలో ఉన్న యవనసైన్యం. వాస్త వాన్ని గుర్తెరిగి కర్తవ్యానికి పూనుకొనేలోగానే పరిస్థితి విషమించి పోయింది. సర్వసన్నద్ధంగా ఉన్న ఆగంతుక సైన్యదళ సభ్యులు మహా రాజు అంగరక్షక దళవారు తమ తమ కత్తులను ఒరలనుండి తీయక మునుపే వారినితమ వాడి కరవాలాలతో ఖండించివేశారు. బయట ఇంత జరు గుతూ ఉన్నా, మహారాజు మాత్రం మైమరచి నిద్రిస్తూనే ఉన్నాడు మురారి దేవుడు తన చిరకాల వాంచితం ఈడేరినందుకు సంతోషిస్తూ ఆగంతుక సైన్యాన్ని ఆప్రదేశానికి తీసుకొని వచ్చిన కాయసిద్ధిని హృదయ పూర్వ కంగా కౌగిలించుకున్నాడు. ఆ తరువాత షహజాదా అలూఫ్‌ఖాన్‌కు వంగి వంగి సలాములు చేశాడు. షాజాదా చిరునవ్వులతోనే సమాశ్వాసించాడు మురారిదేవుణ్ణి. ఆ తరువాత మురారిదేవుడూ, కాయసిద్ధీ మెల్ల మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ మహారాజును సమీపించి గాఢనిద్రలో ఉన్న ఆయన కరచరణాలను బంధించి వేశారు. ఆ తరువాత ధైర్యంగా మీసాలు మెలివేసుకుంటూ షాజాదా అలూఫ్‌ఖాన్ వద్దకు వచ్చి మురారి దేవుడు—

"అడుగో, ప్రభూ! మీ బందీ!" అంటూ మనవిచేశాడు.

షాజాదా వికటాట్టహాసం చేశాడు. అంతకన్నా రెట్టింపుగా వికటాట్టహాసం చేశారు మురారిదేవుడూ, కాయసిద్ధీ. ఈ అట్టహాసాల ఘోషలో నిదురలేనాడు మహారాజు. కన్నులు తెరిచి పడటానికి నిరాకరిస్తున్నాయి. తన శరీరంలోని ప్రతి నరమూ సంకుచితమవుతున్నట్లు తోచసాగింది మహారాజుకు. రక్తస్రావం ఆగిపోతుందా అన్నట్లయింది. తల చాలా భారంగా ఉంది. మహారాజుకు తనకేదో మత్తుమందు యిచ్చినట్లనిపించింది. వెంటనే శక్తినంతా క్రోడీకరించుకొని లేవబోయాడు. కాని, లేవలేక పోయాడు. ఒక కాలినంటి మరొక కాలు ప్రక్కకు కదలనంటోందని పించింది, కళ్ళు తెరచి చూశాడు మహారాజు. అతని చుట్టూ అపారసైన్యం ఉంది. తమ జెండాలు తన చుట్టూ ఎగురుతూ ఉన్నాయి. కానీ, ఇదేమిటి తన చేతుల నెవరో గట్టిగా బంధించివేశారు. అలాగే తన కాళ్ళనుకూడా ఏదో మోసం జరిగింది తనచుటూ ఉన్నది తన సైనికులు కాదు. మహారాజు పరికించి చూశాడు - ఆ సైన్యం యవన సైన్యం. అంతలో మహారాజుకు ఒకటిమీద ఒకటిగా మూడు వికటాట్టహాసాలు వినిపించాయి. తన దృష్టిని ఆ వైపు ప్రసరింపచేశాడు మహారాజు. కాయసిద్ధి తనవంకే చూస్తూ క్రూరాతిక్రూరంగా అట్టహాసం చేస్తున్నాడు. అతడి ప్రక్కనే నిలబడి విషపునవ్వులు ప్రసరింపజేస్తున్నాడు మురారిదేవుడు.

ప్రతాపరుద్ర చక్రవర్తికి పరిస్థితి అవగాహన అయింది. హితుల మాట విననివ్వకుండా మురారిదేవుడు పన్నిన వ్యూహంలోపడి వేటకు బయలుదేరి, యవనబలాలకు తాను చిక్కుపడటు గ్రహించాడు. తాను నిస్సహాయస్థితిలో ఉన్నట్లు అర్థం చేసుకున్న ప్రభువు అనవసరపు ఆవేశాన్ని కలిగించుకోకూడదనుకున్నాడు. కాని మురారిదేవుణ్ని చూస్తూంటే ప్రభువుకు వళ్ళంతా దహించివేసినట్లయింది. అతని కనులు అగ్నికణాలను వర్షించసాగాయి. అతడు ఆ క్షణాన బందీతుడవటంవల్ల సరిపోయింది కాని, లేకపోతే మురారిదేవుడు ఆ క్షణానే యమలోకయాత్ర చేసి వుండేవాడు, ఆవేశంతో-ఉక్రోషంతో తన బంధాలను సళ్ళి

కోవటానికి, గిల-గిలా తన్నుకుంటున్న మహారాజు ప్రతాపరుద్రుణ్ని చూసి మురారిదేవుడు పెద్దపెట్టున నవ్వసాగాడు.

"ప్రతాపరుద్ర చక్రవర్తీ! తాము బందితులమనే విషయాన్ని మరచి పోయి గింజుకుంటున్నారు. కాని, మీకు శ్రమ మాత్రమే మిగులుతుంది. ఇక్కడ మీ గోడు వినే నాథుడు ఎవడూలేడు. మీ అదృష్టభానుడు అస్త మించాడు. అస్తమించిన నా అదృష్టభానుడు తిరిగి ఉదయించాడు." అన్నాడు మురారిదేవుడు.

ప్రతాపరుద్రదేవుడు - మురారిదేవునివంక అసహ్యంగా చూశాడు. "ఛీ! ఆడుదాని పనిచేశావు, మురారిదేవా! వీరుడవైతే నా చేతికొక ఖడ్గాన్ని ఇచ్చి ద్వంద్వంలో నన్ను గెలిచి, రాజ్యాన్ని సాధించాలి కాని, అబలలా నిద్రాముద్రితుణ్నయిన నన్ను నిరాయుధుణ్ని చేసి బంధించి ప్రగల్భాలు పలకటం వీరపురుషుని లక్షణమా?" అన్నాడు ప్రతాపరుద్ర చక్రవర్తి.

ప్రతాపరుద్రుని ఈసడింపు మాటలకు మురారిదేవుడు విపరీతంగా నవ్వసాగాడు.

"నాకు తెలిసిన వీరపురుషలక్షణం ఒక్కటే. రాజ్యం-వీరభోజ్యం! వీరుడైనవాడు సింహాసనాన్ని అధిష్ఠించాలి!"

"ఇదేనా నీ పరాక్రమం! ఇదేనా నీ వీర్యం!"

"ఔను. ధర్మం, న్యాయం అంటూ మీనమేషాలు లెక్కపెడుతూ, చేతికి అందిన అదృష్టాన్ని కాలదన్నటం వీర పురుష లక్షణంకాదు. అది అసమర్థుడి లక్షణం. ఏ విధంగానైనా సరే, కార్యాన్ని సాధించటం, అభీష్టసిద్ధిని పొందడం వీరపురుషుని లక్షణం!" అంటూ మురారిదేవుడు కొండకోనలు మారుమ్రోగునట్టుగా వికటాట్టహాసం చేశాడు. ఆ అట్ట హాసంతో శృతికలిపాడు కాయసిద్ధి.

"మహారాజా! ఛీ! ఛీ! మీరింక మహారాజులు కాదు. మీ రాజ్య లక్ష్మి మిమ్మ విడిచి చాలా కాలమైంది. బంది - మీరిప్పుడు షాజాదా అలూఫ్‌ఖాన్‌వారికి బందీలు. మీచేత బాగా హింసలపాలైన మేము మా కళ్ళతో మిమ్మల్ని ఈ విధంగా చూడగలుగుతున్నందుకు ఆనందంగా

ఉంది. పండిన పాపభాండం అవనిబడి బ్రద్దలైంది. న్యాయం జయించింది." అన్నాడు కాయసిద్ది.

ప్రతాపరుద్ర చక్రవర్తి ఈ విధమైన లేకి పరిహాసాలను భరించలేకపోయాడు. మురారిదేవుడూ, కాయసిద్ధీ కలసిచేసిన కుట్ర మూలంగా తను షాజాదాకు పట్టుబడిపోయాడన్న మాట! ఇలాంటి నీచకార్యాన్ని చేయటానికి భావి ఢిల్లీ సామ్రాట్టుకు ఏ విధంగా సిగ్గులేకపోయిందా? అని బాధపడసాగాడు. లోలోన కుమిలిపోతున్న మహారాజును మురారిదేవుడూ, కాయసిద్ధీ విపరీతంగా పరిహాసం చెయ్యసాగారు. వారిరువురి ప్రవర్తనా మహారాజుకే కాకుండా, షాహజాదాకు కూడా అసహ్యం వేయసాగింది క్రమ క్రమంగా. చివరికి మురారిదేవుని నీచ ప్రవర్తనను ఏ మాత్రం సహించలేకపోయాడు!

"మురారిదేవా! కాయసిద్ధీ, మీరు మాకు చేసిన సహాయానికి సంతోషమే. కాని, మీ ఈ నీచ ప్రదర్శనను ఏ మాత్రంకూడా సహించలేను. అదీ కాక, మీరెప్పుడు రాజనీతిని గురించి, వీరపురుషలక్షణాన్ని గురించి కార్యసాధకుడి కర్తవ్యాన్ని గురించి చేసిన ప్రసంగం మాకు నచ్చింది. మీరు మిమ్మల్ని ఇంతగా ఆదరించి విశ్వసించిన మహారాజు ప్రతాపరుద్రుణ్ని మాకు బందీగా పట్టి ఇచ్చారు. మేమే కనక ఈ క్షణాన మిమ్మల్ని విశ్వసిస్తే, రేపు మమ్మల్ని మాత్రం నిలువునా శత్రువులకు పట్టి ఇవ్వరని నమ్మకం ఏమిటి," అన్నాడు షాజాదా.

అతడి వాక్యాలకు చిన్నబోయి గజ-గజ వణకసాగారు మురారిదేవుడూ, కాయసిద్ధీ. షాజాదా తాము చేసిన మేలును ఈ విధంగా స్వీకరిస్తాడని, పాపం కలలో కూడా భావించలేదు వారిరువురూ. తాముచేసిన పాపానికి ఫలితం అనుభవించక తప్పదు అనుకొని, ప్రాణరక్షణకు మార్గాన్వేషణ చేయసాగారు.

"ప్రభూ! మీకు మేము ద్రోహంచేస్తామా? మీరు దాసానుదాసులం! మీకు సామంతుణ్ణిగా దక్షిణ భారతాన్ని పరిపాలించబోతున్న నేను, నా సార్వభౌముడికి ద్రోహం చేస్తానా?" అన్నాడు మురారిదేవుడు.

"నిన్ను సామంతుడిగా ఎవరు స్వీకరిస్తామన్నారు?"

"నేను అలా అనుకున్నాను, ప్రభూ!"

"అయితే, దానికి నేను బాధ్యుణ్నికాదు."

"అయినా. నేను మీకు భృత్యకోటిలోని వాణ్ణే!"

"అలాగా?"

""కనీసం మీకు ప్రతినిధిగానయినా నేను దక్షిణ భారతాన్ని....!"

"హుం! దక్షిణభారతాన్ని ఆయిన ఇష్టపడితే, ప్రతాపరుద్ర మహారాజే మాకు లోబడి పరిపాలిస్తారు!" అన్నాడు షాజాదా.

"లేదు' ప్రభూ! వారు అందుకిష్టపడరు."

"ఓ! వారి తరఫున వకాలత్ పుచ్చుకుంటున్నారా? మీ స్వార్థం కొరకు మమ్మల్ని ఆశ్రయించిన మీరు-మీ స్వార్థానికి మేము అక్కరకు రాకపోతే, మమ్మల్ని మాత్రం నట్టేట ముంచరని నమ్మకం ఏమిటి? మీ వంటి స్వార్థపరులు ఏ సామ్రాజ్యానికైనా చీడపురుగులు. మీవంటి చీడ పురుగులను స్వేచ్ఛగా బ్రతుకనివ్వరాదు. సిపాయిలూ! వీరిదుపురినీ ఖయిదు చేయండి," అంటూ ఆజ్ఞ ఇచ్చాడు షాజాదా.

తమ విధిని లోలోన నిందించుకుంటూ, నోట మాట లేక ద్రాన్ప డిన మురారిదేవ కాయసిద్ధులను, యవన సిపాయిలు వెంటనే నిరస్త్రులుగా చేసి ఖయిదు చేశారు. ఆ తరువాత షాజాదా - ప్రతాపరుద్రదేవ మహారాజు బంధాలను తొలగించమని ఆజ్ఞ ఇచ్చాడు. వెనువెంటనే సిపాయీలు ప్రతాపరుద్ర చక్రవర్తిని బంధవిముక్తుణ్నిచేశారు.

"ప్రతాపరుద్ర చక్రవర్తీ! మిమ్మల్నిలా బంధించినందుకు మన్నిం చండి. మీరు ప్రస్తుతం మా అధీనంలో ఉన్నారు. దయచేసి మర్యాదగా మా వెంట ఢిల్లీకి రావాలని కోరుతున్నాం! మీకు ఏ విధమైన అపకారమూ జరగదని నేను మీకు హామీ ఇస్తున్నాను," అన్నాడు షాజాదా-ప్రతాపరుద్ర చక్రవర్తి వైపు చూసి.

షాజాదా సగౌరవ వచనాలకు, లోలోన సంతృప్తిచెందాడు మహారాజు. అయినా, ఢిల్లీ అతణ్ని తాను అనుసరించవలసి వొచ్చినందుకు విచారించాడు. కాని, కాదని చేయగలిగిందేమీ లేదు. ఆ క్షణాన షాజాదా తన కన్నా విపరీతమైన బలసంపన్నుడు! తాను ఏకాకి! నిరస్త్రుడు! పారి

పోవటం అసాధ్యం. యుద్ధంచేసి, ఆ యవన సైన్యాన్ని జయించడం కల లోని వార్త. మహత్తరమైన సంఘటన జరిగి, తన కొరకు సైన్యాలు వెతుక్కుంటూ వొస్తేనేకాని తనకు విముక్తిలేదు అనుకున్నాడు ప్రతాప రుద్రుడు.

అంతవరకూ దూరానవున్న మైదానప్రాంతంలో లేపచ్చికలమేసి, గోదావరీ జలాలతో దప్పికను తీర్చుకొని తిరిగి వొస్తున్న ప్రతాపరుద్ర ఉత్తమాశ్వం తన రాజును ఎవరో అపరిచితులు చుట్టిముట్టి వుండటం గమనించింది. వెంటనే శరవేగంతో మహారాజువైపు దూసుకొని రాసాగింది-భయంకరంగా సకిలిస్తూ. అదిచూచి అక్కడవున్న సిపాయిలందరూ హడలిపోయారు. ఆ గుర్రం అక్కడి వాతావరణాన్ని తారుమారు చేస్తుం దేమోననే భయంతోనూ, ఆ గందరగోళంలో మహారాజు తమను కనుమరు గించి, ఆ అశ్వంపైన అధిరోహిస్తే, మరుక్షణంలో ఓరుగల్లులో తేలుతా డనే భయంతోనూ సిపాయిలు తమ తమ వరలనుండి విచ్చుకత్తులను తీసి మహారాజుకు చుట్టూ చక్రవ్యూహాన్ని రచించారు. అంతలో అశ్వ రాజం వారిని సమీపించి భీకరంగా సకిలిస్తూ ముందుకాళ్ళను పైకెత్తి కని పించిన ప్రతి వ్యక్తి తలనీ తన గిట్టలతో మొట్టసాగింది. ఒక్కొక్క ప్రహారానికి ఒక్కొక్క సైనికుడు నేలకూలసాగాడు. క్షణకాలంలో వాతా వరణం తలక్రిందులు కాసాగింది. సైనికులంతా చిందర వందర కాసాగార.

"ఆ అశ్వరాజం సంగతి మీకు తెలీదు. ఉపేక్షిస్తే ప్రమాదం. ప్రతాపరుద్రుడు అశ్వంమీద అధిరోహించి అదృశ్యమౌతాడు. వెంటనే ఆ అశ్వాన్ని మీమీ ఖడ్గప్రహారాలతో సంహరించండి ..." అంటూ పెద్దగా అరిచాడు మురారిదేవుడు.

"ఛీ! నీచుడా! ఉత్తమాశ్వాన్ని ఖండించమన్న నీచుడివి, నిన్ను ఖండ ఖండాలుగా చేసినా పాపంలేదు" అంటూ తన చేతిలోని ఛురికను మురారిదేవునిపైకి గురిచూసి విసిరాడు షాజాదా. మరుక్షణంలో "అమ్మా!" అంటూ బాధగా మూలిగి నేలకూలాడు మురారిదేవుడు - చేసిన పాపానికి

ఫలితం అనుభవిస్తూ. అది చూసి కాయసిద్ధి గోలుగోలున ఏడ్వసాగాడు, మురారిదేవుని శరీరంమీదపడి. అంతలో ఆ రంగాన్నంతా అల్లకల్లోలం చేస్తున్న అశ్వరాజం తన ముందు కాళ్ళ గిట్టలను పైకిలేపి కాయసిద్ధి తల పైన బలంగా కొట్టింది. దానితో కాయసిద్ధి ప్రాణాలు పరలోకయాత్రకు బయలుదేరాయి.

"ఆ ఉత్తమాశ్వానికి ఎవరు కీడుచేయ తలపెట్టినా వారి శిరస్సు ఖండిస్తాను. దాన్ని సజీవంగా యే మాత్రం గాయం లేకుండా పట్టుకోండి!" అంటూ ఆజ్ఞాపించాడు. సిపాయిల పని ఇరకాటాన పడినట్లయింది. గుర్రానికి ఏ విధమైన గాయం తగలకుండా దాన్ని బంధించాలని చూడటం తమ ప్రాణాలను తాముగా తీసుకొని వెళ్ళి దాని కర్పించటమే! వారి అవస్థ చూసిన ప్రతాపరుద్ర చక్రవర్తి షాజాదాతో ఇలా అన్నాడు :

"షాజాదా! తమరు అశ్వహృదయ మెరిగిన ఉదారులు. అది ఉత్తమాశ్వం. ఓరుగల్లు రాజుల పట్టపు గుర్రం ఒకరు దాన్ని బంధించలేరు. నాకు తప్ప అన్యులకు దాన్ని శాసించటం అసాధ్యం. మీకు కనుక యిష్టమైతే ఆ గుర్రాన్ని ఆ సైనికుల నిక బీభత్సం చెయ్యకుండా వెళ్ళిపొమ్మంటాను."

షాజాదా ఒక్క క్షణం ఆలోచించాడు, మహారాజు చెప్పినవిధంగా అది ఉత్తమాశ్వం అనీ, అన్యులకు లొంగదనీ తెలుస్తూనే వుంది. ఆ అశ్వాన్ని గాయపరిచి, ప్రాణావశిష్టంగా తప్ప తమ వారికి పట్టుకోవటం అసాధ్యం. అలా పట్టుకున్నా, ఆ అశ్వం మరొకరి యాజమాన్యాన్ని సహించదు. కాబట్టి తన సైనికులను అంతగా వేధిస్తున్న ఆ అశ్వాన్ని అక్కడినుండి పంపివేయటమే ఉత్తమంగా తోచింది షాజాదాకు.

"అలాగే చేయండి మహారాజా! ఆ విశ్వాసపాత్రమైన అశ్వానికి ఏ అపకారమూ చెయ్యటానికి మాకు ఇష్టంలేదు."

వెంటనే ప్రతాపరుద్రుడు "తురగా!" అనిఆప్యాయంగా పిలిచాడు. అది ఆయన అశ్వానికి ముద్దుగా పెట్టుకున్న పేరు. ప్రభువు పలుకు విన్న క్షణకాలంలోనే అశ్వరాజం శాంతించింది. తరువాత మందగమనంతో

ప్రభువు దగ్గరికి రాజసంతో నడిచి వొచ్చింది. తన వద్దకు చేరిన అశ్వాన్ని వీపుపై తట్టి కన్నీరు కారుస్తూ "తురగా! రాజధానికి వెళ్ళిపో!" అన్నాడు ప్రభువు.

ప్రభువు పరిస్థితిని అర్థం చేసుకున్న అశ్వం కన్నీరు విడిచింది. దానికి కూడా తన ప్రభువు పరిస్థితి సంపూర్ణంగా అర్థమైనట్లుంది. తన ప్రభువునెలాగయినా రక్షింపాలనే దీక్షతో "తన బలగం చాలదు. మిగిలిన బలాల సహాయం తీసుకొని రావాలనే" ఉద్దేశ్యంతో కాబోలు, ఛెంగున లంఘించి శత్రునివహాన్ని అతిక్రమించి, దక్షిణాభిముఖంగా తూరీగలాగా దూసుకుని క్షణాలమీద అదృశ్యమైపోయింది.

"ఇక మమ్మల్ని అనుసరిస్తారా?" అన్నాడు ప్రతాపరుద్ర చక్రవర్తితో షాజాదా.

చక్రవర్తి ఆమోద సూచకంగా తల ఎగురవేస్తూ "పదండి!" అన్నాడు.

శృంఖలాబద్ధుడైన ప్రతాపరుద్ర మహారాజును మేనాలో ఉంచి అలూఫ్‌కాన్ తనడు త్ అమాశ్వాన్ని అధిరోహించిబయలుదేరాడు. అతనివెనుక అయిదువందల మంది ఆశ్వికులు బయలుదేరారు. ఆ సేనా నివహానికి మధ్య ప్రతాపరుద్ర చక్రవర్తి వున్న మేనా బయలుదేరింది. అలా జాముకాలం ప్రయాణం చేసి, ఆ భయంకరారణ్యాన్ని అధిగమించి, గోదావరీ తీరాన్ని చేరాడు షాజాదా అలూఫ్‌ఖానుడు.

గోదావరి ఉధృతంగా పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తోంది. ఆ సైన్యానికి ఆ నదిని దాటితేనే కాని రక్షణలేదు. యే క్షణాన అయినా ఆంధ్ర సార్వభౌముణ్ణి వెతుక్కుంటూ అతని సైన్యం రావొచ్చు. షాజాదా అదృష్టంకొద్దీ, ప్రతాపరుద్ర చక్రవర్తితో వేటకని వొచ్చిన వీర భటులు నందమంది మాత్రమే! అయినా, ఆంధ్ర పౌరుషాన్ని సంవత్సర క్రితం

చవిచూచిన షాజాదాకు గుండె ఆగటంలేదు. అందుకని తొందరపడి అతడు చేయకలిగిందేమీలేదు. తానూ-తన అయిదువంచల సైన్యం గోదావరిని దాటటం సామాన్యమైన విషయంకాదు. తాము నదిని దాటాలంటే పెద-పెద్ద నౌకలు రెండు కావాలి. అప్పటికే గుర్రాలను ఇవతలి దరిన వదలి వేయాలసిందే! అయితే, ఆ విషయంలో వెంగలేదు. గుర్రాలను పదిమంది సైనికుల సహాయంతో అల్లుఖానుడి దగ్గరకు త్రిప్పి పంపివేయవచ్చు.

గోదావరి అవతలివైపున తమ గుర్రాలను సర్వ సన్నద్ధంగా ఉంచమని, చాలారోజుల క్రితమే హుకూం జారీచేశాడు. అతని ఆజ్ఞానుసారంగా ఆ విధంగా సిద్ధం చేయబడిన గుర్రాలు, అనంత జవాలకపతల ఉండటం చూసి అతడు సంతృప్తి పడ్డాడు. కాని, నదిని దాటటమే అతని కొక ప్రాణసంకటంగా ఉంది. వరదల వరవడిలో వడి-వడిగా పారుతున్న గోదావరిలోకి అశ్వాలను దూకించటం మూర్ఖమే ఔతుంది, అని అతని తక్కిన సరదారులు ఆ విషయాన్ని అతనికి స నిశితంగా నచ్చచెప్పారు. కాని, లేక పోతే, ఆ ఆత్రంలో అతనాపని చేయించి ఉండేవాడే! అయినా! ఈ నది యింత ఉధృతంగా పారుతుందని ముందుగానే తెలిసిన షాజాదా-ఆ విషయంలో అశ్రద్ధ చెయ్యలేదు. తెల్లవారు జామునే తన అశ్విసలలో పది మందిని నౌకలు సాయంసమయానికి సిద్ధంచేసి, భద్రాచలం రేవు వద్ద ఉంచమని పురమాయించాడు. కాని, వారేమయ్యారో-ఏం చేస్తున్నారో కూడా తెలీలేదు. ఎప్పుడూ కళ కళలాడే ఆ రేవు నిర్మానుష్యంగా ఉండటం, కనుచూపు మేర దూరంలో ఒక్క పడవకూడా కనిపించకపోవటం అతని ఆత్రాన్ని ఇనుమడింప చేశాయ్. పిచ్చెక్కినవాడిలా గోదావరిగట్టున పచార్లు చేస్తున్నాడు షాజాదా. ఇంతలో అతని చారులొక వార్త మోసుకొని వొచ్చారు "గోదావరి నది పొడుగునా వున్న పడవలనూ - బల్లకట్లను ఆంధ్ర ప్రభుత్వపు మంత్రిగారి ఉత్తరువుల ననుసరించి - ఆయా ప్రాంతాల మున్సబులూ, కరణాలు, జాగీరదారులూ పగులగొట్టించి వేశారట! అంతే కాదంటా గోదావరిని ఈ పదిరోజుల్లో దాటినవాడికీ, దాటించిన వాడికీ కూడా ఉరిశిక్ష విధిస్తారని ప్రకటించారట" అని-ఈ వార్త షాజాదాలో మరింత ఆత్రాన్ని కలిగించింది. ఏం చెయ్యాలి? చేజిక్కిన శత్రువు. అలాగ్గా చిక్కిన

చక్రవర్తి తిరిగి తప్పించుకపోతాడా? తన ప్రతిజ్ఞ నెరవేరేటట్లుగానే కనిపించి-కనిపించి, వెల్లకిలా పడుతుందా అని వాపోవసాగాడు. అయితే, శృంఖలా బద్ధుడైన ప్రతాపరుద్రుడు తమ దగ్గరే ఉన్నాడు కాబట్టి తెగించి, తన మీదికి ఆంధ్ర సైన్యం కత్తి దూయదనే విశ్వాసం మాత్రం పైకెగిరిపోతున్న అతని పంచప్రాణాలనూ తిరిగి తీసుకొనివచ్చి యథాస్థానంలో ప్రవేశం చేయించింది. అలాచూస్తే తమ రాజును తురకలు తెగటార్చుస్తారనే భయం ఆంధ్రులకు ఉంటుందనే నమ్మకం అతని ధైర్యానికి దోహదం చేసింది.

అయితే షాజాదాను మరో వార్త కలచివేసింది. ప్రతాపరుద్ర చక్రవర్తి చేతికి లభ్యమయ్యాడు కదా అనే సంతోషంతో ఇంతవరకూ ఆ విషయాన్ని విస్మరించాడు అతడు. కాని, తీరా ప్రయాణానికి సర్వసన్నద్ధమై గోదావరీ తీరాన పడవల కోసం ఎదురుతెన్నులు చూస్తున్న సమయంలో షాజానీ ఇంకా తిరిగి రాలేదనీ, ఆమెతో వెళ్ళిన పరిచారికల జాడ కూడా తెలీరాలేదని చారులు మనవిచేశారు. నిన్నటి దినమనగా ఆమె ప్రతాపరుద్రుణ్ణి పట్టి బందిస్తానని తన స్త్రీ పరిజనంతో అతని గుడారానికి అభిముఖంగా బయలుదేరిన విషయం జ్ఞాపకం వొచ్చింది షాజాదాఅలూఫ్ ఖాన్‌కి. ఆమె ఎవరిని బందిస్తానని బయలుదేరిందో ఆ ప్రతాపరుద్ర ప్రభువు తనచేతికి చిక్కాడు. కాని, అతని కొరకు వెళ్ళిన షాజానీ జాడమాత్రం తెలీలేదు. షాజానీ కొసమని క్షణకాలం ఆగినా, సిద్ధాన్నం నేలపాలు కావటం తథ్యమనుకున్నాడు షాజాదా. ఆడదై ఉండీ అనవసర సాహసంచేసి తమకు ప్రతాపరుద్రుడు చిక్కినట్లుగానే షాజానీ ఆంధ్రులకు చిక్కలేదు కదా అనుకున్నాడు. ఏది ఏమైనా, షాజానీ కోసమని గోదావరీ తీరాన క్షణకాలమైనా ఆగకూడదనే నిశ్చయానికొచ్చాడు. అలా అనుకున్నాడే కాని, అతని మనసు పరిపరి విధాల పోయింది. కింకర్తవ్యతానిమూఢుడై పరిజనాన్ని చూస్తేనే ఖస్సుబుస్సుమంటూ తీరాన పచార్లు చేయసాగాడు. షాజాదా చూస్తూ చూస్తూ ఉండగానే నలుమూలలనుండి, చీకట్లు క్రమ్ముకొని రాసాగాయి. ప్రతాపరుద్ర చక్రవర్తి మాత్రం విధిని నిందించుకుంటూ తన కొరకు నిర్మించబడిన పటకుటీరంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. పడవవాళ్ళు ఎవరూ దగ్గరలో లేరని, ఉన్న పడవలన్నింటినీ

జనార్ధనమంత్రి పగులగొట్టించేశాడనీ వార్త అందింది పటకుటీరంలోని ప్రతాపరుద్ర చక్రవర్తికి కూడా. తన మంత్రి జాగురూకతను లోలోననే అభినందించుకోసాగాడు. మురారిదేవుడి ద్రోహాన్ని కనిపెట్టలేని అసమర్థతను తనలోనే నిందించుకోసాగాడు. ఆలి మాటనూ, అయినవారి మాటనూ నిర్లక్ష్యం చేసి వేట తమకంలో క్రూరమృగాలనే కాక, అమాయిక ప్రాణులను అనేకాన్ని ఆహూతిగొన్నందుకు వాటి ఉసురు తన్నీ విధంగా పట్టించి బాధించసాగిందేమో అని చింతించసాగాడు. తాను లేని ఓరుగల్లు-యుగంధరులవారు లేని ఓరుగల్లు—యవన కబంధ కరాళ హస్తాలలో సర్వ నాశనం అయిపోతుందేమో అనే భయం ఆవహించింది. అతనికిక జీవితం వ్యర్థమనిపించింది. సకలశక్తివంతుడైన చక్రవర్తియై ఉండి సాధారణుడిలా శృంఖలాబద్ధుడైనాడు. ఔను, లేడి పులిగొత్తవేర పట్టుబడలేదు, కాలం కాక కట్టుబడిపోయింది. తన పరిస్థితి అలాగే ఉంది. ఆంధ్ర ప్రజాస్వామ్యానికీ, ఆర్ష ధర్మానికీ చిహ్నంగా ఈ నాటికీ నిలబడిన్న తాను—తన తెలివితక్కువచే తురుష్కులకు చిక్కి కట్టుబడి ఆంధ్ర సామ్రాజ్యాన్నీ, ఆర్ష ధర్మాన్నీ యవనులు హస్తగతం చేస్తున్నాడు. పట్టుబడ్డ తాను ఒక సాధారణ పరాక్రమశాలి అయిన వ్యక్తి మాత్రమే కాదు. ప్రతాపరుద్రుడు వ్యక్తిగా పట్టుబడితే బాధపడాల్సిన అవసరంలేదు. కాని, పట్టుబడ్డ ప్రతాపరుద్రుడు వ్యక్తికాదు; సంస్థ. ఈ విధమైన నిర్వచనం అతని మనస్సులో ప్రవేశించిన మరుక్షణమే కలచివేయసాగింది. అయితే, అతనికింకొక ఆశారేఖ మాత్రం మిగిలింది. అనేక సంవత్సరాలుగా తనకు విశ్వాసపాత్రమయిన ఉత్తమాశ్వం ఆఘమేఘాలమీద ఓరుగల్లుకు చేరి, తాను బంధింపబడిన విషయాన్ని జనార్ధనమంత్రికి చేరవేస్తుంది. లేదా, కనీసం గుడారం వద్దకైనా వెళ్ళి ఈ వార్తను అందిస్తుంది. మరుక్షణం తనసైనికులు హయాన్నీ అనుసరించి బయలుదేరతారు. కాబట్టి, పరమాత్మడి అనుగ్రహమనేది ఏమాత్రం తన మీద ఉన్నా, ఆంధ్ర సైన్యం ఏదో ఒక క్షణంలో తాను గోదావరి దాటకముందే సాక్షాత్కరించవొచ్చు. ఈ ఊహ ఒకటే అతని నిరాశపూరిత హృదయంలో ఆశాజ్యోతిలా వెలుగుతోంది.

గోదావరీ తీరాన పడవలకోసం పోయిన తన పరిజనులకోసం ఎదురుతెన్నులు చూస్తున్న షాజాదా అలూఫ్‌కాన్ క్రమక్రమంగా నిరాశా పూరితుడు కాసాగాడు. ఇహ ఏ క్షణంలోనైనా తమ సార్వభౌముణ్ణి వెతుక్కుంటూ ఆంధ్ర సైనికులు రాగలరేమోనన్న ఊహ అతన్ని హడల గొట్టేస్తోంది. ఆ రాత్రి అక్కడ గడపటం ఎంతైనా ప్రమాదకరం. నదికి ఎగువకో, దిగువకో పదిహేను ఆమడలు కదిలితేనే గాని, కనీసం ఒక బిల్లకట్టయినా లభ్యం కాదని నిశ్చయించుకున్నాడు. కాని, ఆ భయంకరారణ్యంలో ఆ అర్ధరాత్రివేళ ఆ విధంగా చేయటం అంత మంచిది కాదేమోననిపించింది. ఉత్పన్నమైన సమస్యలీవిధంగా ఉంటే, మధ్యలో ఈ షాజాదీ ఒకతే! ఎక్కడికి పోయిందో, ఏం చేస్తున్నదో, ఎలా ఉన్నదో కూడా తెలియని పరిస్థితి. ఒకవేళ తాను నదికి ఎగువకు గానీ, దిగువకు గానీ ప్రయాణం చేస్తే అనుకున్న సంకేత స్థలానికి వచ్చి చేరే ఆమె అడివిపాలు కావటం తథ్యం. ఢిల్లీ సుల్తాన్ వంటి చండశాసనుడైన చక్రవర్తి కూతురు, తనవంటి వీరాని వీరుడి సోదరి ఆంధ్రసైనికులకు అప్పగించబడటంకన్నా వేరే అవమానంలేదు అనుకున్నాడు షాజాదా.

శూన్య దృష్టులతో నదిని తిలకిస్తున్న షాజాదాకు నదికి దిగువగా మినుకు మినుకు మంటున్న ఒక దీపం కనుపించింది. అది తప్పకుండా పడవే అయి ఉండాలనుకున్నాడు షాజాదా. ప్రొద్దుటనగా పడవలకోసం బయలుదేరిన తన సైనికులు, ఇప్పటికి సాంధిచగలిగారన్న మాట ఒక నౌకను. అల్లా కటాక్షంవల్ల ఆ నౌకలో తాము ఈ రేవు విడిచే వరకూ ఆంధ్ర సైనికులు ఆ వంక రాకుండా ఉంటే బాగుండుననుకున్నాడు షాజాదా.

అలూఫ్‌కాన్ షాజాదా ఎప్పుడూ అదృష్టవంతుడే. ఆ తరువాత కొద్ది కాలానికే పడవ రేవు చేరింది. ఆ వచ్చింది ఒక పడవ కాదు. రెండు పడవలు. రేవు చేరిన పడవలనుండి తన సైనికులు బిల-బిలా క్రిందికి దూకారు. తాము పడవలకోసం పడ్డ పాట్లన్నీ వివరించసాగారు. కానీ, షాజాదా అవేమీ వినే పరిస్థితిలో లేడు. త్వర-త్వరగా తన మందీ మార్బలాన్ని ప్రతాపరుద్రమహారాజుతో సహా పడవ నెక్కించాడు ఇక మిగిలింది

షాజాదీ, షాజాదీకోసం ఎదురుతెన్నులు చూస్తూ అక్కడ కాచుకొని ఉండటం ప్రమాదహేతువని ఊహించాడు అలూఫ్‌ఖాన్. తన పరివారంలో ఒక పాతికమంది సైనికులు మాత్రం షాజాదీ కొరకక్కడ వదిలివేసి, ఒక పడవనక్కడిరేవులోనే ఉంచి, తాను కూడా బయల్దేరాడు పడవ దగ్గరకు.

షాజాదా అలూఫ్‌ఖాన్ పడవ సదిరోహించగానే ఆయన ఆజ్ఞమేరకు లంగరెత్తబడింది. కళాసులు తెరచాపల నెత్తారు. పడవ ఉత్తరాభిముఖంగా బయలుదేరింది.

"ఒరేయ్, కళాసులూ! జాగ్రత్తగా, లాఘవంగా అవతలికిచేర్చండి. ఎంత త్వరగా చేరిస్తే అంత మంచిది. మీకందరికీ తలకొక నూరు వరహాలిస్తా!" అన్నాడు అలూఫ్‌ఖాన్.

వరహా పేరుచెప్పేసరికి కళాసుల్లో నూతనోత్సాహం రేకెత్తింది. రెట్టించిన ఉత్సాహంలో తెడ్లు వేయసాగారు పాట పాడుతూ.

మా తల్లి మమ్మేలవే గోదావరి
సల్లంగ దరిజేర్చవే ..
మారేడు పత్రితో నేరేడు దళములతో
తంగేడు పూలతో దణ్ణాలు పెడతా

అంటూ కళాసులు గోదావరి తల్లికి దణ్ణాలు పెట్టి, వడి-వడిగా తెడ్లు వేయసాగారు. గాలి కూడా అనుకూలంగా ఉండటంవల్ల పడవ అనంత గోదావరీ జలాలకు అడ్డంగాప్రయాణం సాగించింది. ఇంతలో చంద్రోదయం కూడా కావటంతో లేత చంద్రుని పసుడు కాంతులు ప్రవాహ తరంగాలలో ప్రతిఫలిస్తూ, రజిత ద్రవం ప్రవహిస్తున్నదా అన్నట్లు భ్రమపెట్టసాగాయ్.

తెడ్లు వేస్తున్న కళాసుల బృందం బృందగానం చేయసాగింది. గానం కూడా క్రమంగా అంచులకు దూరమవసాగింది.

కడలిసేడును కలియ
కాంక్షలురకెత్తగా
పుష్పొంగి పారింది గోదావరీ
జల జల సాగిందీ గోదావరీ.. ॥కడలి॥

పురవళ్ళ త్రొక్కుతూ
పరవళ్ళ పారుతూ
సుడులలో మడులలో
వడివడిగా తిరుగుతూ
కొండలను చుట్టేసి
కోనలను నింపుతూ
గోదావరీ తల్లి
ఘనముగా కదిలింది ॥కడలి।

భద్రాద్రి రఘురాము
భజన కావించుకొని
పాపికొండల్లోన
పాపాల నొదిలేసి
కోటి లింగాలలో
[illegible] ॥కడలి

# 10

ప్రతాపరుద్రమహారాజును షాజాదా అలూఫ్‌ఖాన్ ఖయిదుచేసి తీసుకొని పోయిన మరునాడే యుగంధర మంత్రి ఓరుగల్లు చేరాడు. అయితే, మహారాజును అలూఫ్‌ఖాన్ పట్టుకున్న విషయం పదిమంది ప్రజలకూ తెలియక పోవడంవల్ల నగరం యథాప్రకారంగానే ఉంది. కాని, మహామంత్రిని

మరొక్క విషయం ఆశ్చర్యపరచింది. కోటకు ఉత్తరపు వైపున వెలసి యున్న మహమ్మదీయ గుడారాలు అతడి దృష్టిని విపరీతంగా ఆకర్షించాయి. కోట సింహద్వారం దగ్గరే నిలబడిపోయాడు మహామంత్రి. మరలి వచ్చిన తమ మహామంత్రిని చూచి గవిని కావలా కాస్తున్న ఆంధ్ర సైనికులు జయ-జయ ధ్వానాలు చేశారు. "మహామంత్రి యుగంధర్ల వారికీ జై!" అనే నినాదాలతో కోట గోడలు ప్రతిధ్వనించాయి. ప్రతి వారిలోనూ సంతోషమూ, ఉత్సాహమూ పెల్లుబకసాగాయ్. కాని, మహామంత్రికి ఇవేవీ కనిపించటంలేదు-వినిపించటంలేదు. అతని మనసు మనసులో లేదు. ఎదురా అల్లంతదూరాన మహమ్మదీయ సైన్యపు పటకుటీరాల మీద అతని దృష్టి కేంద్రీకరించబడి ఉంది. అతని మనస్సు యోచనా ముద్రతో ఆ పటీరాలలో ఏం జరుగుతున్నదా అని యోచించసాగింది? అసలీ దండు ఏందు కొచ్చింది? దీని ఉద్దేశం ఏమిటి? యుద్ధానికి వచ్చినటువంటి యవన సైన్యం అయితే, ఆ గుడారాలంత ప్రశాంతంగా ఎందుకున్నాయి? నిజంగా యుద్ధప్రమేయమే ఉంటే, తమవారు ఆ గుడారాలను అసలు అక్కడ ఎందుకుండనిచ్చారు? ఎంత ఆలోచించినా తమ వైపునుండి కూడా యుద్ధసన్నద్ధత లేకపోవడం మహామంత్రికే అంతు పట్టిందికాదు. హిందువులకూ మహమ్మదీయులకూ ఎప్పుడూ షష్టాష్టకమే. అలాంటి సందర్భంలో ఇరువాగుల సైన్యాలూ అత్యంత సన్నిహితంగా ఉండగా అసాధారణమైన ప్రశాంత వాతావరణం వెల్లివిరియటం వింతగా తోచింది. ద్వారపాలకులను అసలు విషయం ఏమిటని మహామంత్రి ప్రశ్నించలేదు. వారు చెప్పనూలేదు. మహామంత్రి రథచోదకుని వంక చూచి తోలమని సంజ్ఞ చేశాడు. రథం సింహద్వారాన్ని అతిక్రమించి లోనికి వెళ్ళింది కోటలోపల బురుజుల మీద గస్తీ సిపాయిలు మామూలుకన్నా, యింత లుండటం గమనించాడు మహామంత్రి. తమవాళ్ళు తనమకున్నంత ప్రమత్తతగా లేరని సంతృప్తిగా నిట్టూర్చాడు. రథం నగరవీధులగుండా సాగిపోతోంది. దారికిరుప్రక్కలా ప్రజలు మహామంత్రిని చూచి జయ జయధ్వానాలు చేస్తూనే ఉన్నారు. మహామంత్రికి ఆ విధమైన మర్యాద

జరగడం ఓరుగల్లు రాజవీధులలో పరిపాటే. అలాంటి సమయాల్లో మహామంత్రి చిరునవ్వుతోనే ప్రజలను సమాశ్వాసిస్తూ ఉండేవాడు. కాని ఆ రోజున కావాలన్నా రాలేదు, ఆ మధుర మందహాసం ఆయన ముఖం మీదకు.

మహామంత్రికి ఇంటికి చేరగానే కొన్ని ముఖ్య విషయాలు తెలిశాయి. మహారాజు వేటకు పోయాడనీ, దాదాపు పదిహేను రోజులయినా మరలిరాలేదనీ భేటీకి అని వచ్చిన ఢిల్లీసుల్తాన్ సైన్యం నగరి బయట బైఠాయించిందనీ, వచ్చినవారిలో సుల్తాన్ సర్వసేనాదిపతి ఉల్లూఖాన్, సుల్తాన్ మేనల్లుడు ఖుస్రూఖాన్ కూడా ఉన్నారని తెలిసింది. అంతేగాదు, దాదాపు మూడు రోజుల క్రితం అలూఫ్‌ఖాన్‌డు అయిదువందల సంఖ్య గల్గిన అశ్వికదళం అతణ్ని అనుసరించగా ఉత్తర దిశగా బయలుదేరాడని కూడా తెలిసింది. అన్నిటికన్నా మహామంత్రి మనస్సును కలచివేసింది మరొక్క విషయం. ఈనాటి తెల్లవారుజామునే మహారాజుకు అత్యంత ప్రీతి పాత్రమైన అశ్వరాజం నురుగులు గక్కుకుంటూ, ఓరుగల్లుకు వచ్చి చేరింది. ఈ వార్త మహామంత్రిని మరీ కలిచి వేసింది. మహారాజుతో మరలిరావాల్సిన పట్టపుగుర్రం ఒంటరిగా తిరిగి రావటంలో అంతర్యాన్ని ఊహించాడు మహామంత్రి! ఏమి చేయడానికీ పాలుపోక, అస్థిమితంగా తిరుగుతున్న మహామంత్రికి జనార్ధనమంత్రి ఎదురయ్యాడు.

"పరామర్శ చేయడానికి వచ్చావా?" అన్నాడు మహామంత్రి జనార్ద నుణ్ణి తీక్షణంగా చూస్తూ.

జనార్ధన మంత్రికి నోరాడింది కాదు. మౌనంగా నిల్చుండిపోయాడు తల వంచుకొని.

"మాట్లాడవేం?" మరల గర్జించాడు మహామంత్రి.

"ఏం మాట్లాడమంటారు, మహామంత్రీ?" అన్నాడు నసుగుతూ జనార్ధనుడు.

నిజానికి జనార్ధన మంత్రి పరిస్థితి సందిగ్ధంగా ఉంది. ఆ నాడు ఛాజా మాట కెదురాడలేకపోయాడు. నిండు సభాస్థలిలో ముఖారిదేవుని

నోరు మూయించలేకపోయాడు. ఈనాడు అన్నగారి ఎదుట నోరు తెరవ లేకపోతున్నాడు. కాస్త జాగ్రత్తగా ఆలోచిస్తే, జరిగిందంతా ఓ పెద్ద నాటకంగా గోచరించసాగింది జనార్ధనునికి. ప్రతిరోజూ ప్రజలు వచ్చి తమ గ్రామాలలో వన్యమృగాలు విచ్చలవిడిగా విహారం చేస్తున్నాయని చెప్పడం, దాన్ని ఆసరాగా తీసుకొని మహారాజులో సహజంగా ఉన్న వేట తమకాన్ని గుర్తించి, మురారిదేవుడు వంత పాడటమూ, అటు ప్రజల గోడుతోనూ, ఇటు మురారిదేవుడి ప్రోత్సాహంతోనూ తన మాటను రాజు నిర్లక్ష్యం చేయడమూ అంతా ఒక్కసారి పరిశీలిస్తే జరిగిందంతా ఒక నిర్ణీతమైన నాటకంలాగా గోచరించసాగింది. మహారాజు వేటకు వెళ్ళిన మనాడే తురకదండు ఓడగల్లును సమీపించడం ఈ నాటకంలోని ఒక అంతర్భాగ మేమోననే అనుమానంకూడా కల్గింది•జనార్ధనమంత్రికి.తనకుతానే సమాధానం చెప్పుకోలేని పరిస్థితిలో ఉన్న జనార్ధనమంత్రి మహామంత్రికి మాత్రం ఎలా సమాధానం చెప్పగల్గుతాడు?

అంతవరకూ తన పరిశీలనాదృష్టులతో జనార్ధనుణ్ని నిశితంగా చూస్తున్న మహామంత్రికి అతని పరిస్థితి అతడు చెప్పకుండానే అర్థమైంది. ఔను, పాపం! అతడు మాత్రం ఏం చెయ్యగలుగుతాడు? జరిగిందానికి విచారించి ప్రయోజనంలేదు. జరగాల్సిందాన్ని లక్షించటమే మేధస్సుకు లక్షణం. మహామంత్రి జనార్ధనుణ్ని మరేమీ విపరీతమైన ప్రశ్నలు వేయ లేదు, అతడి మనస్సు నొప్పించకూడదనే ఉద్దేశ్యంతో.

"జరిగిన విషయాలు తెలిశాయి జనార్ధనా! మహారాజు ఏమయ్యారో తెల్సిందా? వారిని గురించిన వాస్తవం నాకు కావాలి."

"మహారాజుగారికోసం చెకుముకిశాస్త్రి వెళ్ళాడు మహామంత్రీ! వారి వాస్తవ పరిస్థితి ఇంకా మన కందలేదు. వేటకు వెళ్ళిన మిగిలిన సైని కులు కూడా తిరిగిరాలేదు. మహారాజు అలాఫ్ ఖానుడిచేత పట్టుబడ్డారన్న విషయం సరిగా తెలియనప్పటికీ, పట్టపుగుఱ్ఱం ఒంటరిగా తిరిగి రావడాన్ని బట్టి, అశుభాన్ని శంకించాల్సి వస్తోంది."

మహామంత్రి ఒక దీర్ఘ నిశ్వాసాన్ని విడిచాడు, తరువాత అన్న

దమ్ములలో ఎవరూ మాట్లాడలేదు, భోజనాదికాలు పూర్తయిన తరువాత మంత్రాలోచన సభకు బయలుదేరారు జనార్ధనమంత్రీ, మహామంత్రి యుగంధరుడూ.

# 11

"మహామంత్రీ! తమ వ్రేలు విడిచిన పినతండ్రిగారి కుమారుడట-మార్తాండ జ్యోతిష్యులట-- తమ దర్శనాన్ని వాంఛిస్తున్నారు...." అంటూ మనవి చేశాడు దౌవారికుడు- ఆలోచనా మందిరంలో తమ్ముడు- జనార్దన మంత్రితోనూ, తదితర రాజోద్యోగులతోనూ మంతనాలాడుతున్న యుగంధర మంత్రితో.

"మార్తాండ జ్యోతిష్యులా!"

"ఔను, మహామంత్రీ!"

మహామంత్రి భ్రుకుటి సాలోచనగా ముడివడింది. ఒక్క-క్షణం ఆలోచించాడు. మార్తాండ జ్యోతిష్యుడు తన వ్రేలు విడిచిన పినతండ్రి కొడుకు. వ్రేలు విడువనేరాదు కాని, విడిచిన తరువాత ఎంతదూరమైనా పోతుంది చుట్టరికం. కాని ఆ పేరు ఎక్కడా తగిలినట్లు జ్ఞాపకంలేదు మహామంత్రికి. రెండుక్షణాలు తీవ్రంగా ఆలోచించిన తరువాత అతనికి హఠాత్తుగా జ్ఞాపకం వొచ్చినట్లయింది. "ఓ! మార్తాండ జ్యోతిష్యులనగా ఎవరెవరో అనుకున్నాను. మార్తాండాయ్! ఇప్పుడు జ్యోస్యం చదివాడన్న-మాట! వెంటనే ప్రవేశపెట్టు!" అన్నాడు మహామంత్రి.

దౌవారికుడు నిష్క్రమించాడు.

జనార్ధనుడు అర్థంకానట్లు చూశాడు.

అతడి పరిస్థితి గ్రహించాడు. "అలా చూస్తావేంరా, జనార్దనా? మన రాయగుండం బాబాయి-సోమనాధసోమయాజి, ఆయన కొడుకు మార్తాండాయ్ ఇంకా జ్ఞాపకం రావేదురా?...."

మహామంత్రి మాట పూర్తికాకముందే ఒక సమున్నతాకారుడు చెవులకు బంగారు మకరకుండలాలుతో చేతులకు సువర్ణఘంటా కంకణము

లతో, కుడికాలికి ఘనమైన స్వర్ణగండపెండేరంతో మలచికట్టిన పచ్చని పీతాంబరంతో, తలపైన సరిగంచుజరీపాగాతో ముఖమున విభూదిరేఖలతో కంఠాన రుద్రాక్షమాలతో, పైన కాశ్మీరదేశపు మేలుశాలువాతో మహా కవి పండిత లక్షణాలతో సభలో ప్రవేశించాడు. అలా ప్రవేశిస్తున్న అపూర్వవ్యక్తిని క్షణకాలం పరిశీలనగా చూసి, ముఖంలో చిరునవ్వు తాండవిస్తుండగా చర- చరా ఎదురువెళ్ళి ఆప్యాయంగా కావిలించుకున్నాడు యుగంధరుడు.

"ఎన్నాళ్ళ తరువాత కలిశాం. బాబూ!"

"కాలం మించిన చాలకాలం తరువాత కలిశాం,"

మహామంత్రి ముఖం ఇంచుక పాలిపోయింది. అయినా. తనముఖ కవళికలని కనిపెట్టుకుంటూ ప్రశ్నించాడు:

"చిన్నాన్నగారు కుశలమే కదా?"

"అదే కుశలం, అన్నయ్యా! ఈ మధ్య కదలటానికి వీల్లేకుండా ఋగ్మత హెచ్చింది."

"కదలటానికి వీల్లేకుండానా?" మహామంత్రి మరింత ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"అవునన్నయ్యా, 'పర్ణశాల ఉష్ణజలాలతో స్నానం చేయిస్తే ఖారం తగ్గుతుందని వైద్యులాయన్ను గోదావరి దాటించి తీసుకెళ్లారు. వారి వైద్యం ఏ విధంగా వికటిస్తుందో ఏమో! సరే, ఎలాగా భద్రాచలం దాకా వొచ్చాం కదా! అన్నగారి నొకసారి చూసి పోదామని వొచ్చాను."

"చాలా సంతోషం, తమ్ముడూ! జనార్ధనా! గుర్తుపట్టావురా!" అన్నాడు మహామంత్రి.

"ఓ! చిన్నన్నయ్యా!"

"ఊఁ! చాల పెద్దవాడయ్యాడు. ఆ మధ్య నీవేదో కాశీలో జ్యోతిష్య శాస్త్రాన్ని అభ్యసిస్తున్నావని విన్నాను. కాని, ఇంత త్వరలో ఇంత

"మీ దర్శనం చెయ్యటం నాకు చాలా సంతోషంగా ఉందన్నయ్యా! మీరు చిన్నప్పుడు నాకు గురువులు. మీకు కానుకగా ఈ అంగుళీయకాన్ని సమర్పించుకుంటున్నాను—" అంటూ మార్తాండ పండితులు తన వ్రేలిన ఉన్న అంగుళీయకాన్ని తీసి యుగంధర మహామంత్రి చేతి కిచ్చాడు.

మహామంత్రి ఆ అంగుళ్యాన్ని చూసి క్షణకాలం నివ్వెరపోయాడు! "చాలా ఖరీదైంది! అన్నాడు.

"ఔను. అది కటకేశ్వరుడు నా ప్రతిభకు మెచ్చి ఇచ్చాడు. దాన్ని మీ కర్పించుకున్నాను."

"చాల సంతోషం. రా, నాయనా, రా! ఈ ఆసనంమీద అధిష్టించు—" అంటూ తమ్ముణ్ణి ఉచితాసనంమీద కూర్చొండజేసి, మిగిలిన సభాసదులందరికీ తన తమ్ముణ్ని- మార్తాండ జ్యోతిష్య పండితుణ్ని పరిచయం చేశాడు యుగంధర్.

మార్తాండ పండితుడు పేరుమోసిన జ్యోతిష్యుడని తెలియగానే రాజోద్యోగులంతా తమ చేయి అంటే:తమ చేయి చూడమని · ముందుకు వస్తున్నారు. మార్తాండపండితుడు ఒక్కొక్కరికే గురితప్పకుండా నిదర్శనార్థం గతంలో ఒక సంఘటనను వివరించి భవిష్యత్తును గురించి చెబుతున్నాడు ఒక్కొక్క చేతినే పరిశీలిస్తూ. ఆయన చెప్పిన నిదర్శనాల కదిరిపోయి, హడలిపోయి ఆయన పాండిత్య గరిమకు జేజేలర్పించసాగారు- తమ హస్తాలను వారికి చూపించుకున్న వాళ్ళు. ఒక్కమాటలో చెప్పాలంటే, సభ యావత్తూ తమ సభాకార్యక్రమాన్ని మరచిపోయి కొత్తగా వొచ్చిన జోతిర్విద్వాంసుని గొడవలో పడిపోయాడు.

మహామంత్రికివేమీ పట్టలేదు .గంభీరాలోచనానిమగ్నుడై భవిష్యత్తులోకి తన మేధస్సును ప్రయోగించి పరికిస్తున్నాడు. క్షణ క్షణానికీ తన చేతిలోని ఉంగరం వంక చూస్తున్నాడు. ఏం చేయాలి? ఏం చేయాలి? అదే అతని సమస్య. మహామంత్రి పరిశీలనా దృష్టితో సభనంతా కలియజూశాడు- తన ఆందోళనను అర్ధం చేసుకున్నవారైనా ఉంటారేమో అని, కాని, ఒక్క జనార్ధనమంత్రి తప్ప, మిగిలిన వాళ్ళంతా జ్యోతిష్యపు గొడవలోనే ఉండిపోయారు. జనార్ధనుడు మాత్రం అన్నగారి మనసులోని

మాట ఏమిటా అని తన మానసవీధితో మంతనాలాడుతూ కనిపించాడు మహామంత్రి ఒక్కసారి జ్యోతిష్యం చెబుతున్న తన తమ్ముడు మార్తాండ పండితుడి వైపు చూశాడు.

దుర్గరక్షకుడు బుక్కరాయలు తనహస్తాన్ని చూపాడు- భవిష్యద్వర్తమాన గ్రహణ కుతూహలంతో.

"మీ పేరు?"

"బుక్క రాయలు."

"ఔను. బుక్కరాయలు. మీరీ దుర్గానికి అధ్యక్షులు. శక్తియుక్తులలోనూ, పరాక్రమంలోనూ సాటిలేని మేటిగా అనేక పర్యాయాలు నిరూపించుకొని మహారాజు మన్ననకు పాత్రులయ్యారు. క్రిందటి సంవత్సరం జరిగిన యవన ఆంధ్ర సంగ్రామంలో మీరు చూపిన సాహసానికి మెచ్చి, మహారాజు తమకీ ఉన్నతోద్యోగాన్ని ప్రసాదించారు."

బుక్కరాయలు ఆశ్చర్యంగా మార్తాండ పండితుడి వంక చూడసాగాడు.

"మీ ప్రభుభక్తి సాటిలేనిది. కాని, మీకు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన ఇరువురు భార్యలున్నా, ఎలాంటి భార్యలైతేయేం ఎనిమిదిమంది ఉన్నారు"

బుక్కరాయలు గుడ్లు వెళ్ళబెట్టాడు.

అయితే, వీర పురుషులు కాబట్టి, ప్రతిరోజూ ఎనిమిది మందికి తమ ప్రేమను సమభాగాలుగా పంచటంతో ప్రథమయామం కాగానే రెండవ కంటికి తెలియకుండా దుర్గరక్షణ బాధ్యతను విస్మరించి, అష్టభార్యా సందర్శనానికి బయలుదేరు తుంటారు," అన్నాడు మార్తాండ పండితుడు.

బుక్క రాయలకు గంగవెర్రులెత్తింది. అందులోనూ నిండుసభలో అందులోనూ మహామంత్రి యుగంధరులవారి సమక్షంలో తన పరువు విలువనా ఎగిరిపోవటం సామాన్యమా? ఇంకా ఉపేక్షిస్తే ఇంకేం చెప్తాడా! కోపి, ఏమన్నా చేద్దామా అంటే, యుగంధరులవారి సోదరుడు.

మీరు సాక్షాత్ పరమ దేవతా స్వరూపులు. నాతప్పు

మన్నించి, నా పరువు కాపాడండి ..." అంటూ మార్తాండ పండితుడి సాష్టాంగ నమస్కారం చేసి యుగంధర మంత్రి కాళ్ళు పట్టుకున్నాడు బుక్కరాయలు.

మహామంత్రి చిరునవ్వు ముఖాన గోచరింపగా అతణ్ణి లేవనెత్తి "ఇకనించి అయినా ఇంద్రియ దౌర్బల్యానికి లోనుగాక, దుర్గరక్షణ కార్యక్రమాన్ని సక్రమంగా నిర్వహించ"మని ఆదేశించాడు.

ఆ తరువాత తన హస్తాన్ని అందించాడు మార్తాండ పండితునికి కోశాధికారి హరిహరరాయలు. హరిహరరాయల హస్తాన్ని చూడటంతోటే అదిరిపడ్డాడు మార్తాండపండితుడు. అతడి హస్తాన్ని పరిశీలిస్తున్న కొద్దీ మార్తాండదేవుడి భ్రుకుటి ముడిపడసాగింది. ఆలోచన తీవ్రం కాసాగింది. పరస్పర విరుద్ధమైన రెండు రేఖలు అతడి హస్తంలో ఉండటం అందుకు కారణం. అతడిలో రాజభక్తి విపరీతంగా ఉంది. అచంచలమైన ఆర్ష ధర్మ రక్షణాదీక్ష గోచరిస్తోంది. ద్రోహ చింత మచ్చుకయినాకానరాదు. అయితే, అతనిది సామాన్య జాతకంకాదు. మహాసార్వభౌమ లక్షణ సమన్వితమైన ఆ హస్తం అతని మేధస్సు మూలంగా మరో మహోజ్వల మహత్తర ఆంధ్రసాంమ్రాజ్యానికి నాందీ సూచకంగా ఒక దివ్యనగరం శత్రుని ర్భేద్యంగా ఉద్భవిస్తుంది. ఇతడు రాజుకు విశ్వాసపాత్రుడైన సేవకుడు. రాజు ఇక్కడ ఉండగా రాజరికంతో ఏ విధంగానూ సంబంధంలేని కోశాధికారి సామ్రాట్టుఎలా ఔతాడు? రాజు కితడేమైనా కీడుచేస్తాడేమో అనిఅనుకుందామంటే, అతడి విశ్వాసం అంచలమైంది. ఈ పరస్పర విరుద్ధాలయిన రెండు విషయాలను అతకలేక మార్తాండ పండితుడు అవస్థపడుతున్నాడు.

"ఎలా ఉంది నా భవిష్యత్తు, స్వామీ!"

"ఏమన్నారు, ప్రభూ?" ఆ హస్తాన్నిచూస్తున్న మార్తాండపండితుడు అప్రయత్నంగా అన్నాడు.

ఆ మాటకు కోశాధికారే కాక, మిగిలినవారందరూ అదిరిపడ్డారు. మార్తాండుడు తన పొరపాటును గ్రహించాడు.

"ఆ-మీ పేరేమిటన్నారు?" అన్నాడుమార్తాండ పండితుడు.

"హరి—"

"ఆఁ- సగం చాలు. హరి తరువాత హరుడు. హరిహరరాయలు. నెల్లూరు మనుమసిద్ధి భూపాలుని మంత్రి తిక్కన సోమయాజి తమ జనన కాలంలో ఓరుగల్లులోని గణపతి ప్రభువుల దగ్గరికి రాయబారిగావొచ్చి, తమ తండ్రిగారికి అతిథిగా ఉండి హరిహరదేవుని కంకితమిచ్చిన తమ భారతాన్ని తమ పితృదేవులకు వినిపించి ఉంటాడు. అందువల్ల మీనాన్న గారు మీకా పేరుపెట్టాడు. మీకు నలభై సంవత్సరాలు కదూ?"

హరిహరుడికి నోటమాటలేదు. జ్యోతిర్విద్యద్వారా ఇన్ని వివరాలు సేకరించవచ్చా? అనేఅనుమానం వేసింది.

"ఇన్ని వివరాలు జ్యోతిష్యంద్వారా సేకరించవొచ్చా అని అనుమానిస్తున్నారు కదూ? జ్యోతిష్యానికి కొద్దిగా హేతువాదాన్ని జోడిస్తే వాస్తవానికి అతి సన్నిహితంగా దృష్టి సారించవొచ్చు"

హరిహరుడు మరేమీ మాట్లాడలేదు.

"దివ్యమైన తమ దక్షిణహస్తం ఒక మహత్తర ఆంధ్ర సామ్రాజ్యానికి శంఖుస్థాపన చేస్తుంది"

హరిహరుడికి అధికమైన ఆశ్చర్యం వేసింది. ఆ ఆశ్చర్యం ఆనందంగా మారి, మరుక్షణంలో భయంకరంగా మారింది.

"వొద్దు, స్వామీ! నన్ను ప్రభుసేవకుడుగానే, రాజభక్తుడుగానే బ్రతకనివ్వండి. నేను సాంమ్రాజ్యస్రష్టను కావాలని కోరుకోవటంలేదు. ఒకవేళ అదే తప్పనిసరిగా జరుగుతుందని మీ ఃః నిర్దేశిస్తే ఈ క్షణానే నా శిరస్సును తమ ఖడ్గధార కెరచేయ్యండి! అంటూ హరిహరుడు తన నడుమున వ్రేలాడుతున్న ఒరనుండి సర్రున ఖడ్గరాజాన్ని వెనక్కిలాగి, మహామంత్రి యుగంధరుల వారి చేతికివ్వబోయాడు.

మహామంత్రి నిశ్చేష్టుడయ్యాడు. ఇంతటి ప్రభుభక్తి పరాయణుడు రాజద్రోహంచేస్తాడని, విశ్వసించటానికి నిరాకరించింది అతని హృదయం. కానున్నది కాకమానదు. విధిలిఖితాన్ని తప్పించటం అసాధ్యం! అదికాక అతడు సామ్రాజ్యానికి శంఖుస్థాపన చేస్తున్నాడన్నాడేకాని, పండితుడు అతడు

సార్వభౌము డౌతాడనలేదు. అందువల్ల ఆ శంఖుస్థాపన తామే చేయించి, ఒక నూత్న నగరాన్ని- దుర్గాన్ని నిర్మిస్తే సరిపోతుంది. కాలక్రమాన ఓరుగల్లు నుండి ఆంధ్రాన్ని పాలిస్తున్న కాకతి ప్రభువులు, ఆ నగరం నుండి తమ రాజ్యపాలనను కొనసాగిస్తారు అనుకున్నాడు యుగంధర్ మంత్రి.

"హరిహరా! నీ దోషంలేనప్పుడు, నిన్ను శిక్షించటం కేవలం అన్యాయం. లే- జరిగినదాన్ని మరచిపో!" అన్నాడు అమాత్యుడు.

"కాదు, మహామంత్రీ! నావల్ల తప్పుఉన్నా-లేకపోయినా నావల్ల సామ్రాజ్యానికి కీడు కలిగితే నేను దండనార్హుణ్ణి, రాజకీయంలోఫలితంతో నిమిత్తం కాని, తత్కారణాల మంచి చెడ్డలు నిమిత్త మాత్రం అన్న సిద్ధాంతం తమరు ఎరుగనిది కాదు. నా తల తీసివేయండి మహామంత్రీ!" అన్నాడు హరిహరరాయలు.

పరిస్థితి చెయ్యిజారిపోతుందనే విషయాన్ని గ్రహించాడు మార్తాండ పండితుడు.

"హరిహరరాయా! నీ ప్రభుభక్తి అచంచలమైనదే కాక, అసాధారణ మైంది. ప్రభువులకూ, ఈ సామ్రాజ్యానికీ నీ వల్ల ఏ విధమైన అపాయమూ రాదు కావాలంటే ఓరుగంటి కాకతీయ ప్రభువులకొరకు ఒక దివ్యనగరానికి, మీరే మీ మహత్తర హస్తంతో శంఖుస్థాపన చేయ వొచ్చు!" అన్నాడు మార్తాండ పండితుడు.

తన మనసులోని మాటనే మార్తాండుడు కూడా చెప్పే సరికి, మహామంత్రికి ఊరట కలిగింది. ప్రభుభక్తిపరాయణుడయిన హరిహరుడు, ఒక పెద్ద భారం తన శిరస్సుమీదనుండి తొలగిపోయినట్లుగా నిట్టూర్చాడు.

ఈ సంఘటన జరిగిన తరువాత మరెవ్వరూ తమ హస్తాన్ని మార్తాండపండితుడికి అందించటానికి సాహసించలేదు- తమ గుట్టు రట్టవుతుందేమో అన్న భయంతో. ఇంకెవరన్నా తమ సాముద్రికాన్ని పరీక్ష చేయించుకొని, ఫలితార్థాన్ని తెలుసుకోవడానికి ఇచ్ఛగిస్తారేమో అని అందరి వంకా చూశాడు మార్తాండ పండితుడు. లోకంలో తప్పుచేయని వాఢంటూ లేడు, తమ తప్పులను పదిమంధిలో భహిరంగంగా వెల్లడి

కోరుకునేవారూ లేరు. అయితే, అంతవరకూ మార్తాండ పండితుడికి పంకా విసురుతున్న పేరిగాడు మాత్రం నోరు తెరచుకొని, ఆశ్చర్యంగా పండి లయ్యవారి వంక చూడటం గమనించాడు యుగంధర్ మంత్రి. ఆయనకు తటాలున ఒక ఆలోచన తట్టింది.

"మార్తాండా! నీ వెనుక పంకా విసురుతూ ఉన్నాడు చూశావ్? వాడు మాకు చాలా సన్నిహితుడు. మహారాజునకు కూడా చాలా ఇష్టమైన వాడు. వాడికి తన సాముద్రికాన్ని పరీక్ష చేయించుకోవాలని ఉన్నట్టుంది. వాడిచేయి జాగ్రత్తగా చూడు! నేను ఇప్పుడే తిరిగి వొస్తాను," అంటూ నిష్క్రమించాడు యుగంధర్ మహామంత్రి,

"ఏమిరా, ఇటురా!" అన్నాడు మార్తాండుడు.

పేరిగాడు హడలిపోయాడు.

"నా కెందుకు. బాబయ్యా"

"ఇటు రా రా!"

పేరిగాడు మారుమాట పలకకుండా మార్తాండుని ముందుకొచ్చి నిలుచున్నాడు.

"నీచేయి చూపు."

"ఈ పంకా నాను దొంగిలించలేదు బాబయ్యా!" అన్నాడు వీవనను మార్తాండుని చేతికందిస్తూ.

"ఛీ! వెధవా! దానినవతల పెట్టు."

"అలానే బాబయ్యా?

"ఇక నీ చేయి చూపించు."

"ఎందుకు బాబయ్యా?"

"నీకు జోస్యం చెప్తానురా!"

"అంతే?"

"అంటే నీకు జరిగిందీ, జరగబొయ్యేదీ."

"స్వామీ! నా తప్పునేదు, సామీ! మరి కొత్త పులుచు పొయ్యావే నంజా అంటే, కోపంవచ్చి యదవసచ్చింది సలసల కాగుతున్న పుల్చు మ్లోచుకొచ్చి ఉన్నపుల్చంతా నీకు పోస్తే, నేనేం థాగేద్ది మ్హాఛా" అంథ్హా

"ఆ గండ నీ నెత్తిన కొట్టింది కదురా?"

"సత్తెం, సత్తెం సామీ, ఆ యినయం మీకెలా తెల్సింది సామీ?"

"దానిమీద నీవు దాన్ని చేయి చేసుకున్నావు కదూ!"

"ఔను, సామీ! కాని, నా ఎల్లంటే నాకు పాణం, సామీ!"

"కాని, మీ ఇద్దరికి వియోగం కలుగుతుందిరా, పాపం."

"అదెప్పుడో అయిపోయిందిగా, సామీ?"

"ఏమిరా అయింది?"

"అదే సామీ! పెళ్ళి! ఇహిహీ!

"పెళ్ళా? ఓరి దిద్దమ్మా వియోగమంటే వివాహమనుకున్నావురా!"

"అదే సామీ! మా మావ బతికుండగానే మా ఎల్లికీ, నాకూ లంకె పెట్టి ఎల్లిపోయిండు గద, సామీ?"

"వియోగమంటే ఎడబాటురా! నీ ఎల్లి ముఖం నువ్వు చూస్తే నువ్వు చచ్చిపోతావురా!"

"సామీ! అట్టాంటి మాట చెప్పావేం, సామీ? నా ఎల్లి నంజను సూడకుండా నే ఎట్టా బతికేది, సామీ? అయ్యో దేవుడా! ఇదేం ఖర్మరా బాబూ!" అంటూ గోలుగోలున ఏడవసాగాడు పేరిగాడు.

"ఒరే గోలచెయ్యక ఇటు చూడు. నీకు గండం తీసే ఏర్పాటు చేస్తాను."

"సరే, సామీ! సరే! నీ పేరు సెప్పుకొని బతుకుతా. నా పిల్లాడు పుడితే నీ పేరే పెట్టుకుంటా, సామీ!" అంటూ పేరిగాడు కృతజ్ఞతాసూచకంగా మార్తాండ పండితుడికి నఖశిఖలు నేలకాన్చి బోర్లబడి నమస్కారం చేశాడు. ఆ క్షణంలో యుగంధర మంత్రి సభాస్థలిలో తిరిగి ప్రవేశించాడు.

"ఏమిటి మార్తాండా! వీడేదో సాగిలి నమస్కారాలుచేస్తున్నాడు" అన్నాడు మహామంత్రి.

"మరేంలేదు, అన్నయ్యా? వీడికి నేడు తన భార్యను చూడగానే ప్రాణగండం సంభవిస్తుందని ఫలితార్థం వచ్చింది. అందువల్ల వాడు తన ఎల్లిని చూడకుండా తాను బ్రతుకలేనని గోలచేయసాగాడు. నేను వెంటనే

వాడికి వాడి ఎల్లిని చూచినా గండం తప్పే మార్గం సూచిస్తానని మాట ఇచ్చాను! దానితో వాడు కృతజ్ఞతను వెల్లడిస్తూ సాగిలపడి నమస్కారాలు చేస్తున్నాడు."

"పాపం! పిచ్చి వెధవ. మరి, వాడికి గండం గడిచే ఉపాయం చెప్పావా?"

"ఆహా! ఇంకాలేదు. జాతకంలో కనిపిస్తున్నదాన్నిబట్టి వీడికి ఎల్లి ముఖం చూడగానే మరణం తథ్యం! అయితే, ఎల్లి ముఖం చూడకముందే వీడు చచ్చి బ్రతికితే, ఆ దోషం నివారణ అయిపోతుంది."

"అదెట్టా, సామీ? సచ్చేదేదో నా ఎల్లి ముఖంచూసి తరవాతే సచ్చి పోతా గాని, నాను ముందుగా సావనే సావను, సామీ!"

"అది కాదురా! నీ ఎల్లి ముఖం చూసే లోపుగానే నీవు చచ్చి పోతావురా!"

"సచ్చినోడు బతుకుతాడా, సామీ?"

"ఆఁ! అన్నగారి గ్రుద్దుతిని బ్రతికినవాడు లేడు. అదృష్టవశాత్తూ నువ్వు బ్రతికావో చచ్చి బ్రతికినట్లే!"

"ఎట్టెట్టా? యుగంధరయ్యగారి చేతి గుద్దుతిని బతకడమే! అమ్మ వాయినోయ్! ..." అంటూ భీతి నయనాలతో చూడసాగాడు పేరిగాడు.

వాడి అవస్థ చూసి మహామంత్రి నవ్వుతూ "ఒరేయ్! మరేం ఫరవా లేదు. నిన్ను చావకుండానే ఒక్క గ్రుద్దు గ్రుద్దుతాను రారా!" అన్నాడు.

పేరిగాడు బెరుకు-బెరుకుగా మహామంత్రి దగ్గరకు వచ్చి "ఈ కట్టె మీది, సామీ! కాలటానికి కాట్లోకి ఎల్లకుండా గండం గడిసేంత పెద్ద గుద్దు గుద్దు, సామీ! దాసుణ్ణి!...." అంటూ వీపు వంచి నుంచున్నాడు.

మహామంత్రి అతి తేలికగా వాడి వీపుమీద చరిచాడు.

"అమ్మ, బాబోయ్!...." అంటూ పేరిగాడు గభాలున నేలకొరిగాడు.

మహామంత్రి ఆజ్ఞమేరకు పేరిగాణ్ణి లేవతీసి కూర్చోబెట్టి, శైత్యోపచారాలు చేయసాగారు పరిజనులు.

"మా ర్తాండా! అన్నట్లు నిన్ను ఒక విషయం అడుగ మరచాను. వేటకెళ్ళిన మహారాజు ఘూర్జరరాష్ట్రం మార్గంలో కొంత అంధకారంగా

ఉంది. మహారాజులు క్షేమమే నంటావా?" అని అడిగాడు యుగంధర మహామంత్రి.

మార్తాండుడు ఒక్క క్షణం ఆలోచించాడు. మహారాజు దగ్గర నుండి వర్తమానం కొద్ది క్షణాలలోనే వొస్తుంది. మహారాజు విషయంలో ఆందోళన అనవసరం అన్నాడు. మార్తాండుని మాటలు ముగియక ముందే ప్రతీహారి ప్రవేశించి, మహామంత్రికి జయం పలికి ప్రతాపరుద్ర చక్రవర్తి దగ్గరనుండి వార్తాహరుడు వచ్చాడని వార్త చెప్పాడు. మహామంత్రి వార్తాహరుణ్ని తక్షణం ప్రవేశపెట్టాడు. "జయము జయము మహామంత్రికి" అంటూ ప్రవేశించిన వార్తాహరుడు మహారాజు ముద్రికాంకితమైన కమ్మను మహామంత్రి కందించాడు. ఆ కమ్మను జనార్ధన మంత్రికిచ్చాడు చదివి వినిపించమని మహామంత్రి.

జనార్ధనమంత్రి కమ్మను కళ్ళ కద్దుకొని ఈ విధంగా చదివాడు:

ఆంధ్ర సార్వభౌముడు ప్రతాపరుద్ర చక్రవర్తి తమ అమాత్యుడు జనార్ధనమంత్రికి ఇందుమూలంగా తెలియ జేయునది....

ం!

దురదృష్టవశాత్తు తగిలిన వేట గాయములవే చాల అస్వస్థులుగా ఉన్న మేము అనుమకొండలోని మా పితామహుల గృహమున విడిసియున్నాము. మా అశ్వము ఈసరికి నగరమునకు చేరియుండును తాము ఏ విధమైన ఆందోళన కూడా పడనవసరములేదు. నేను. తిరిగి నగరిలో ప్రవేశించుటకు కావలసిన ఏర్పాట్లు చేయించ కోరు చున్నాము.

ఇట్లు,

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ ప్రతాపరుద్ర చక్రవర్తి

జనార్ధనుడు చదవటం ముగించాడు. అక్కడ సమావేశమైన రాజోద్యోగులలో మహారాజు తిరిగి వొచ్చినందుకు ఆనందమూ, వేటలో గాయాలు తగిలినందుకు ఆందోళనా గోచరించసాగాయి. మహామంత్రి వెంటనే బుక్కరాయలను పిలిచి మహారాజుకు కొంతకాలం విశ్రాంతి అవ

సరమనీ, అందువల్ల మరునాడు మహారాజును తిరిగి రాజాంతఃపురానికి చేర్చటానికి మేనా సిద్ధం చేయించమనీ ఆదేశించాడు.

ఆ తరువాత ఆ నాటికి సమావేశాన్ని నిలుపుచేశాడు యుగంధర మహామంత్రి-మహారాజు ఆగమనానికి సంతోష సూచకంగా.

సభికులందరూ సంతోషాంతరంగులై ఒక్కరొక్కరుగా వెళ్ళిపొయ్యారు ఆలోచనామందిరంనుంచి. ఇక అక్కడ మిగిలింది యుగంధర మహామంత్రీ, జనార్ధనమంత్రీ, మార్తాండ పండితుడు, మహామంత్రి ప్రసాదించిన పిడిగ్రుద్దు బాధనుండి అప్పుడప్పుడే తేరుకొంటున్న పేరిగాడు.

"మహాపెబూ! ఇక నాను సచ్చి బతికినట్టేగా?"

"ఆహా!"

"ఇక నాను నా ఎల్లి ముఖం సూడొచ్చుగా?"

"ఓ!"

"ఇక నాను గండం గడిసి బయటపడ్డట్టేనా, పెబూ?"

"ఆ! గండం గడిచింది, ఇక నీకు యోగం పట్టాలిరా!"

"యోగమేందీ, సామీ?"

"యోగమంటే భోగమురా!"

"బోగంది నా కెందుకు. సామీ? లచ్చనమైన ఎల్లి ఉంటే బోగం దెందుకూ నాకు? ఈ యిసయం ఎల్లికితెలిస్తే సావగొట్టుద్ది."

"భోగం అంటే బోగందికాదురా! రాజభోగం అంటే రాజయోగం. అంటే రాజువౌతావన్నమాట!"

"నేనేం రాజును. పో, సామీ! మా అయితే సాకల్రాజునౌతా గాని, వై బోగం యాడనుంచి వొచ్చుద్ది, సామీ?"

"వొస్తుందిరా వొస్తుంది. ఇటు సూర్యుడటు ఉదయించినా, నీ ఎల్లి ధవళవస్త్ర కిరీటధారణ చేసినా మా జోస్యం మాత్రం నిజమై తీరుతుంది. ఇందులో అనుమానం ఆవగింజంతయినా లేదు."

"నా ఎల్లి కిరీటం పెట్టుకుంటుందా, సామీ?"

"ఓ! తప్పకుండా పెట్టుకుంటుంది."

"అయితే, సామీ! నా ఎల్లి రాణి అవుద్ది."

"ఆహా!"

"ఎల్లి రాణీగోరయితే, మరి నానేమౌతాను, సామీ?"

"నీవు రాజు అవుతావురా!"

రాజే! ఒస్సిడియమ్మ సిగతరగా! రాజే! మారాజే!"

"అవును, మారాజే అవుతావురా! మమ్మేలుతావురా?"

"సామీ, సత్తెంగ సెప్పు సామీ!"

"సత్యమేరా! పోనీ, యుగంధరులవారి నడుగు,"

"ఏం దొరా! ఈ సామికి నానంటే మరీ ఎగతాలి అయిపోయింది దొర! సాకలినాయాల్తో సరదాలేంటి, దొరా?"

"సరదా కాదురా? నీవు రాజువు కావటం తథ్యం. కాని, జనార్దన మంత్రి చెప్పినట్టు నడవాలి. ఏ మాత్రం ఎదురు తిరిగినా జ్ఞాపకం ఉందిగా- ఇందాకటి మణుగురాయి గుద్దు?" అన్నాడు యుగంధర మంత్రి.

"అట్టనే దొరా! బోగం పట్టాలేకాని అట్టనే యినుకుంటా!"

"అయితే, సరే, ఇక ఇవాల్టికెళ్ళి ఎల్లితో క్షేమంగా సరదాగా గడిపి, రేపు ప్రాతఃకాలానికి ముందుగానే మా ఇంటికి రావాలి సుమా!" అన్నాడు యుగంధర మంత్రి.

"అట్టనే, దొరా! సోకు చేసుకొని మరీ వత్తాగా- అయితే, నా ఎల్లిని కూడా నూక్కురమ్మంటారా?"

"ఎల్లినా? తప్పు-తప్పు. నీవు వంటరిగా రాకపోతే పై భోగం పట్ట నంటుందిరా!"

"అట్టయితే! సరే!"

"మరి. పోయిరా!"

చాకలిపేరడు సోదరత్రయానికి వంగి-వంగి ప్రత్యేకంగా నమస్కారాలుపెట్టి నిష్క్రమించాడు.

"విద్యానాథా! నీ చాకచక్యానికి సంతోషం" అన్నాడు యుగంధరుడు మార్తాండుణ్ణి చూసి.

"కాని, నా చాకచక్యంతో మహారాజును మాత్రం రక్షించ లేక పోయాను. వారి ముద్రికను మాత్రం ఒక ఉత్తర హిందూస్థాన గాయికి నా చేతికందించింది. కాని, ప్రభువుపోయిన దిక్కును ఆమె వేరుగా చూపడంవల్ల సకాలంలో గోదావరి దాటకముందు ప్రభువులను దర్శించటం -రక్షించటం పడలేదు," అంటూ జరిగిన కథను సూక్ష్మంగా వివరించాడు విద్యానాథుడు యుగంధర మంత్రితో.

"జరిగిపోయినదానికి విచారించి ప్రయోజనం ఏమిటి? జరగాల్సిం దాన్ని గురించి ఆలోచించటం విజ్ఞుల లక్షణం. పరిస్థితిని బట్టి ఆలోచిస్తే, ఇందులో మురారిదేవుడు కుట్ర పూర్తిగా ఉందని తెలుస్తోంది. వేటకు ప్రభువులను ప్రోత్సహించింది అతడు- ప్రక్కన ఉండి పట్టి ఇచ్చింది కూడా అతడే కావొచ్చు. దీనికి జైనుల సహాయం కూడా అంతో - ఇంతో ఉండి ఉండకపోదు. మహారాజు వేటకరిగే సమయంలో జైనులు జరిపిన ప్రదర్శనకూ, జరిగిన సంఘటనకూ కూడా సంబంధం ఉంది అని నా అనుమానం! ఇక ఈ నాటకంలో ఒక స్త్రీ పాత్ర కూడా ఉంది. ఆమె మహారాజుపై మరులు కొన్నదేమోనని నా అనుమానం! షహజాదా అలూఫ్ ఖాన్ వెంట షహజాదీ—రజియా కూడా వచ్చిందని వేగులు వార్త తెచ్చారు. ఒకవేళ ఆ గాయనీమణియే గనుక షహజాదీ రజియా బేగమ్ అయితే, ప్రభువుకు ఢిల్లీ నగరంలో ఏ విధమైన అపాయమూ రాదు. ఇక ఇక్కడి పరిస్థితి ఏ విధంగా జరగాలో మీకు నేను ప్రత్యేకంగా వివరించ నక్కరలేదు. ఈ పేరిగాడు చాకలివాడైనా, రూప సామ్యంలో ప్రభువుకు అత్యంత సన్నిహితుడు. వీడే ప్రభువని అలూఫ్ ఖాన్‌చే బంధింపబడి అతని వెంట ఖైదీగా ఢిల్లీకి వెళ్ళినవాడు చాకలి పేరడని జనంలో విపరీతంగా ప్రథ కల్పించాలి. ఓరుగల్లు నగరి బయట విడిసిఉన్న యవన సైన్యాలకూ ముఖ్యంగా ఈ వార్త అందాలి. రేపు ప్రాతఃకాలాన్నే పేరణ్ణి మహా రాజోచిత వేషభూషణలతో అలంకరించి, అనుమకొండకు చేరుస్తారు. అక్కడినుండి ప్రభువును రాజోచిత లాంఛనాలతో, ఓరు

గల్లు నగరంలోని రాజాంతఃపురానికి చేర్చాలి. ఇకపోతే - అసలు ఆంతర్యం తెలిసిన మురారీదేవుడినీ, కాయసిద్ధినీ, వారి ముఖ్యానుచరులనూ పాతాళ గృహంలో బంధించాలి! అంటూ జరగాల్సిన కార్యక్రమాన్ని వివరించాడు మహామంత్రి

# 12

"ఎల్లీ! ఓ ఎల్లి! యాడ నచ్చావే? నా రంగుల రాట్నం, గజ్జెల గుర్రం, వయారిభామా, ఓ ఓప్పుల కుప్పా,...." అంటూ ఇంటిలో ప్రవేశించాడు పేరిగాడు. తనకు పట్టబోయే యోగాన్ని గురించి ఎంతో సంబరపడుతు ఎల్లికి చెప్తామని ఎగురుతూ వచ్చిన పేరిగాడి వాలకంచూసి నిర్ఘాంత పోయింది ఎల్లి.

"ఏందే, ఎర్రి మొగమా-అట్టా సూత్తావ్?"

"అది కాదు, మావా! ఏంసీ అట్టుంతావు అంట?"

"ఎట్టుండదేందే?"

"ఎట్టుండేదేంది?"

"అది కాదే- నా మొగం ఎట్టుంవీ అంట?"

"ఎట్టుంటుందేంది? పేరిగాడి మొహంలా ఉంది."

"అంతేనా!" అన్నాడు పేరిగాడు నిరుత్సాహంగా,

"అంత కాక ఎట్టుంటది, మావా?"

"అది కాదే-అహం! తెలక అడుగుతా- నా మొకంలో మాసప్ప లేదా అంట?"

"ఏం మాసప్ప, మావా! అంత యింతగా ఆడుగుతావ్?"

"ఇంకే లేవే! అహం! నీకే అ పట్టంలేదా అంట?"

"ఏంది ఆపింపేది?"

"అదేనే- నా మొఖాన రాజు కళ పళ్ళేదా అంట!"

"రాజూ! బూజుంది కొప్పు మీద-సాలు సాల్లే, మావా! ఊరుకో."

"అది కాదే, ఎల్లీ! సత్తె ప్పెమాణకంగా సెప్తన్నా-ఇనుకో. నాను రాజునౌతున్నా!"

"అహా! పో, మావా! నాతో ఏంది పరాచకాలు? నడివీదిని పొయ్యేవాళ్లు ఇంటే, పట్టుకెళ్ళి కొట్టో తోయిస్తారు."

"ఎట్టి ఎదవల్ని నానే తోయిత్తా. నిజంగానే ఎల్లే! నాను రాజు నౌతా. నువు రాణీ! ఇంక సూడు— నా సావిరంగా?"

"మావా! నీకేం పిచ్చెక్కిందేవిటి?" అంది ఎల్లి గాభరాగా, పేరిగాడి వింత ప్రవర్తనకు ఆశ్చర్యపోతూ,

"పిచ్చి కాదే ఎర్రి మొగం ఎల్లీ! నాను సత్తెన్ని సెప్పుతుండగా-

ఎల్లీ? నా ఎల్లీ!
నే రాజునౌతా నెల్లీ!
ఎల్లీ నా ఎల్లీ!
రాజుగారి తక్తు మీద
రమ్మెంగ కూకుంటే
చూసోక్క నా సామిరంగా
బోగమే వె బోగమూ. ॥ఎల్లీ॥

రాసోళ్ళ సేవ సేసి
రాజయినా పేరిగాడు
కులపుగుట్టు నిలబెట్టే
నలవరాజు అంటారు.

పెజలంతా నన్ను కొలువ
నేనొచ్చి నిన్ను కొలువ
సెక్రవర్తి పెళ్ళాం అంటు
సేవలు సేతారు నీకు!

"మావా! ఇకచాలు కాని ఆపు, మావా! ఎవరైన యింటే నవ్వి పోతారు, మావా!"

"నవ్వే నా యాళ్ళను నవ్వనియ్యవే, ఎదవ నంజా! ఆళ్ళ పళ్ళే బయట పడతై. నాను సెప్తున్నా నీ తోడు. ఓరుగంటి కాకతమ్మతోడు. తిరపతి ఎంకన్నతోడు పొలిమేర దేవత పోలేరమ్మ తోడు-నాను సెప్పే మాట సెవి నేసుకో. నాను రాజయ్యేది కాయం."

"ఏంది, మావా! సాలా ఇసిత్తరంగా మాట్టాడతావ్. నువ్వు రాజు వెలాగౌతావూ అంట?"

"హుఁ! దానికంతా ఉందిలేయే చాత్రం. అంజనంవేయిస్తే, అన్నీ తెలుత్తయ్. అసలు ఆడముండకు నీకేం తెలుచులేయే, యవ్వారం?"

"అది కాదు, మావా! నువ్వేం కల్లు తాగి రాలేదు కందా?"

"కల్లు! ఛీ! ఛీ! అయ్యేం మాంటలే, సాకలి నంజా! చారాయం అను. ద్రాక్ష సారాయం అనయే!"

"మావా!" అంది ఎల్లి ఏడుపు మొహంపెట్టి. పేరిగాడికి ఏదో పిచ్చెక్కిందని నిశ్చయించుకుని.

"ఏడుత్తాయెందుకే, ఎట్టి మొగవా? అసలు ఇసయం ఇళదంగా సెపుతాను ఇనుకోయే సెవినేసుకుంటూ. ఇయ్యాళ బాపనయ్యలు, మంత్రులు గోర్లూ అందరూ కలిసి నా జాతకం సుశారే. చూసి ఏమన్నారో తెల్పా-నా చేతిలో గీతే గీతన్నారు.

నను రాజుగా సేత్తమన్నారు
యింద్రబోగం యిత్తమన్నారు
దేయేంద్రబోగం యిత్తమన్నారు.

దేయేంద్రబోగంతో
బూదేవతలు కొలవ
ఎల్లి లంజా! ఓ
ఎల్లి లంజా! నిన్ను

తక్తుపైకెక్కిత్త
నను రాజుగా సేత్త
సాకింటివాళ్ళని
సరదారులుగ సేత్త
సరదారులందరికి
సలవపెట్టెలు యిత్త
నను రాజుగా సేత్త....
గుఱ్ఱాలు తీసేసి
గాడిదల పెడతాను
మంగలాళ్ళను తెచ్చి
మంత్రులుగ సేసేత్త
నను రాజుగా సేత్త....
నాను రాజవగానె
శూరుడనిపిత్తాను
సాయిబ్బు గడ్డాల
సాపుగా వుతికెత్త
నను రాజుగా సేత్తమన్నారు
యింద్రబోగం యిత్తమన్నారు
దేయేంద్రబోగం యిత్తమన్నారు!

“ఇదంతా నిజమేనా, మావా!” అంది ఎల్లి పేరిగాణ్ణి ఆశ్చర్యంగా చూస్తూ. పేరిగాడికి పిచ్చి ఎక్కి ఇవన్నీ వాగకుండా ఉంటే చాలునని పోలేరమ్మకు వెంటనే ముడుపు కట్టింది. ఎల్లి చేష్టలు చూస్తున్న పేరిగాడు నవ్వాపుకోలేక పోతున్నాడు. ఎల్లి ముండకేం తెలుసుద్ది - రాజాగం? అనుకున్నాడు పేరిగాడు. ఎల్లికి తన రాజయోగం ఇష్టంలేదేమో అనే అనుమానం వేసింది పేరిగాడికి. అందుకోసం ఎల్లికి తన వైబోగం విషయం ఇశదయ్యేట్టు చెయ్యాలి.

"ఎల్లీ! నాను సెప్పేది నిజం! అబద్ధం ఆడినాడు నంజ నా కొడుకు సరేనా! నా మాట నమ్మవే నా ముద్దుల గుమ్మా !

నేను రాజునై పోతానె
సాకలి ఎల్లీ !
నాను సెక్రవర్తినౌతానె
సాకలి ఎల్లీ!

శాస్త్రిలయ్య జోతిస్సం
తప్పకుండ జరిగినేను
పొద్దు పొడవకుంటానె

పెబువుగారినై పోతా
నే రాజునై ....

ఎల్లికి పేరిగాడు పాట వింటుంటే ఉషారెక్కసాగింది. ఎదురు పాట పాడటం ప్రారంభించింది.

ఎల్లి

అయితే అయ్యావు గాని,
పేరయ మావా! నాకు
సెంద్రహారం తెత్తావా.

సాకలి మావా?
పేరడు

సెంద్రహారమెందుకే
సాకలిలంజా నీకు?
ఇంద్రబోగమిత్తానె

ఎల్లీ! నా యెల్లీ! నీకు
యింద్రబోగమిత్తానె
ఎల్లీ! నా యెల్లీ!

ఎల్లి

ఇంద్రబోగమెందుకో
సాకలిమావాఁ నాకు?
కోకలుతికి పెడతావ.
పేరయ మావా?
నాకు కోకలుతికి పెడతావా,
పేరయమావా ?

పేరడు

ఊరిలోన రాజుగాని
ఇంటికాడ సాకలాణ్ణి
కులపు నీతి తప్పుతానా ?
కోరికలుతకనంటానా?
నీ కోకలుతకనంటానా?

# 13

షాజాదా అలూఫ్ఖాన్ అయిదు వందలమంది అశ్వికులను తీసుకొని వేటకు వెళ్ళిన ప్రతాపరుద్ర చక్రవర్తిని బంధించి, ఢిల్లీ తీసుకొని వెళతానని బయలుదేరి నాలుగు రోజులైన తరువాత ఓరుగల్లు బయట విడిసి ఉన్న యవనసైన్య కేంద్రానికి షాజాదానుండి వార్త వొచ్చింది - ప్రతాపరుద్ర చక్రవర్తిని తాను బంధించగలిగాననీ, తనతోపాటు ఢిల్లీ నగరానికి తీసుకుని వెళుతున్నాననీ, వీలు చూసుకుని ఓరుగలును యుగం

ధర మహామంత్రి తీర్థయాత్రనుండి తిరిగిరాకముందే ముట్టడించి సర్వ నాశనం చేయమనీ.

వార్త అందిన వెంటనే సర్వ సైన్యాధిపతి లల్లూకాన్ చక్రవర్తి ప్రతినిధిగా శిబిరంలో ఉన్న ఖుస్రూకాన్ వద్దకు బయలుదేరాడు- సమాలోచనకొరకు, భావి కార్యక్రమ నిర్ణయం కొరకు.

తన డేరాకు వొచ్చిన లల్లూకాన్‌ని సాదరంగా లోని కాహ్వానించాడు ఖుస్రూఖాన్. ఆ తరువాత వారిరువురూ సుఖాశీనులై మంత్రాలోచన ప్రారంభించారు.

"ఇదీ రోజ్ బహుత్ మంచీ రోజ్. మీకే ఒక సంతోష సమాచారం వినిపించాలి అనీ వొచ్చాం. షాజాదా అలాఫ్‌కాన్ సర్దార్ ప్రెతాప్ మహారాజాకి ఖైదీసేసి ఢిల్లీకి తీస్కా పోతున్నాం అంటూ కబురూ సేసినార్," అన్నాడు లల్లూకాన్.

బహుత్ అచ్చా! చాల చాల మంచీమాట చెవులోకి ఎసినార్?" అన్నాడు ఖుస్రూకాన్ సంతోషంగా.

"యుగంధర్‌మంత్రీ రాకా ముందే వరంగోల్ని పట్టమనీ మనకీ హుకూం జారీ సేసినార్."

కాని, యుగంధర్ మంత్రి హొచ్చి రెండు రోజ్ అయిందీలేదు."

"ఠీక్! రెండు రోజ్. అదీ కారణంగా ఓరుఘల్లూ మీద దండూ ఎత్తాటానికి గుండె య్ బెరుక్ బెరుక్ ఉందీ అదీకాక, జోష్యల్ నెలా రోజుల్ దాటితేనే గాని మన మీదికి శనిదేవా ఎక్కి కూకోదు అంటూ సెప్పి ఉన్నార్," అన్నాడు లకాల్లూన్.

"అచ్చా! అయితే, హెప్టి సెయ్యివాలా?"

హెక్వా బల్‌గం హొచ్చేదాకా వేఛీ ఉండాల్.

"బహుత్ అచ్చా!" అన్నాడు ఖుస్రూకాన్.

ఇంతలో దౌవారికుడు ప్రవేశించి "సర్దార్ సాహెబ్, చెకూముకి శాస్త్రుల్లు దర్శనానికి వొచ్చి ఉండార్!" అంటూ మనవి చేశాడు.

"ఒరి నీ అజ్ఞానం మండిపోనూ! నాకు పరిచయం పలికేవాడివి నీవొకడివా? ఒకరితో సంబంధం లేకుండా ఈ గుడారానికి ఏ వేళలో అయినా వొచ్చి పోవటానికి నాకు సర్వాధికారాలూ ఉన్నాయిరా కుంకాక్షీ!" అంటూ కాపలా వాడి మాటలు ముగియకుండానే లోపలికి ప్రవేశించాడు విద్యానాథుడు.

అనుకోకుండా తమ మధ్య ఊడిపడిన పండితోత్తముణ్ణి చూసి సరదార్లిరుపురికీ ఆశ్చర్యమే కాకుండా; ఒకవిధమైన ఈసడింపు కూడా వేసింది.

"సాస్త్రుల్లు భాయ్! మేము జర్రా పనిలో ఉన్నామ్!" అన్నాడు లల్లాఖాన్.

"నాకు తెలుసులేవయ్యా నీ పని! రాజాను పట్టి షాజాదా బంధించాడు కదా? ఓరుగల్లు కోటను ఎలా పట్టాలా అనుకుంటున్నారు."

సరదార్లు ఆశ్చర్యంగా చూశారు పండితునివంక.

"అంతేకాదు; ఈ జ్యోతిష్యం భాయి మనకి రాహుకాలం ఇది అంటే, షాజాదాకు మహారాజు ఎలా దొరికాడు? కాబట్టి ఇతగాడిది జూటా జ్యోతిష్యం అని కూడా అనుకుంటున్నారు."

"అచ్ఛా-అచ్ఛా! అదే హద్గవాలా ఉన్నాం,"

"అలా అడుగు చెప్తాను చెప్పనన్నానా, చూశావ్! నీ బట్టతల మీద పొరపాటున వెంట్రుకలు మొలుస్తాయేమో కాని, నా జ్యోష్యం మాత్రం అబద్ధం కాదు. నెల రోజుల వరకూ మీకు దుర్దినాలు. మీ షహజాదా ఏం చేశాడో తెలుసా ? నా మాట వినకుండా, రాజును పట్టుకోవటానికి రాహుకాలమని అన్నా చూడకుండా ముందుకు దూకాడు. ఏమైంది ఫలితం? మీ షహజాదా రాజునుకొని పేరిగాణ్ణి పట్టుకున్నాడు."

"పేరిగాడ్"!"

"ఆఁ! పేరిగాడు: లేక చాకలి పేరుడు. వాడు కూడా చూపులకు రాజుగారిలాగే ఉంటాడు. అయితే, వాడు రాజుగారి బట్టలు ఉతికే చాకలి! తీర్థయాత్రనుంచి తిరిగి వొచ్చిన వెంటనే, యుగంధర మంత్రి మీ

ఉద్దేశ్యాన్ని కనిపెట్టాడు. షాజాదావారు వేటలో ఉన్న రాజును బంధించ టానికి బయలు దేరటం కూడా ఆయనకు తెలిసింది. వెంటనే రాజుగారి చాకలివాడికి రాజోచిత వేషభాషణలిచ్చి, రాజుగారి గుర్రాన్నిచ్చి. షాజాదా మార్గానికి అడ్డుగా నిలబెట్టించాడు కావవాలని. ఆ గుర్రాన్ని చూసి, ఆ వేషాన్ని చూసి, ఆ భూషణాన్ని చూసి, ఆ పోలికలను చూసి, చాకలి పేరణ్ణి ప్రభువని భ్రమించి, మీ షాజాదా ఖైదీచేసి ఢిల్లీకితీసుకొనివెళ్ళాడు. తెలిసిందా?" అన్నాడు విద్యానాధుడు.

"మా షాజాదా రాజాకో పట్టినాడ్?"

ఛీ! ఛీ! మీ షాజాదా కావాలని పట్టుపడ చాకలి పేరడ్ని పట్టారు."

"థూ! థూ! మా షాజాదా చాకలి పేరడ్కో పట్టాడ్? రాజా పెర్ తాప్ రాజాకో పట్టినాడ్ ?"

"చాకలిని పట్టాడు."

ఇంతలో బయట అల్లంతదూరాన మంగళ వాయిద్యాలు వినరాసా గాయ్. గుజార ద్వారావరోధాన్ని తొలగించి, సరదాస్లు ఇద్దరూ ఆ వంక చూశారు.

"మీరు అంత శ్రమ తీసుకోవాలా! నన్నడిగితే నేను చెప్పనూ! వేట గాయాలతో నిన్ననే తిరిగివొచ్చిన ప్రభువు నగరిలో ప్రవేశించకుండా అనుమకొండలో తమ పితామహుల యింట్లో విశ్రాంతి తీసుకున్నాడు. ఇప్పుడు మంత్రి సామంత పరిజనసమేతంగా ఊరేగింపుతో నగరంలో ప్రవేశిస్తున్నాడు తెలిసిందా?" అన్నాడు విద్యానాధుడు.

సరదాల్లిద్దరికీ గుండె ఆగిపోయినంత పనైంది.

"మీరు చెప్పే బాత్ సరిగా ఉందీ!"

"సరిగ్గా ఉంది"

"లేకపోతే?"

"ఉంటే!"

"సరే! మా సిపాయీని ఆ హూరేగింపు దగ్గర్కి పంపి, ఇషయం తెలుసూకోనీ రమ్మటాం. ఆ తర్వాత మీపనీ పట్టాం:" అంటూ లల్లా ఖాన్ బయటికివెళ్ళి, ఒక సిపాయిని ఆ పని మీద పంపి తిరిగివొచ్చాడు.

"నా పని నువ్వేం పట్టావు? నీ జెజెల్లా-టివాళ్ళు పట్టలేకపోయారు. అసలు ఆ పోయిన సిపాయి తిరిగివొచ్చి చెప్పే వార్త విని, గుండె ఆగి పోకుండా చూసుకో చాలు. ఎందుకైనా మంచిది ఖుస్రూఖాన్‌గారూ! ఓ బిందెడు నీళ్ళు తెప్పించి ఉంచండి."

"ఎందుకూ?"

"మూర్ఛపోతే, నెత్తిన కుమ్మరించేందుకు."

"చూస్తాం-చూస్తాం! జోతిస్యం భాయ్! నీవు మాకి గులాం కావాలా! లేకపోతే, మేమూ నీకీ గులాం!" అన్నాడు ఖుస్రూఖాన్.

"హాఁ! హాఁ!" అన్నాడు లల్లూఖాన్:

"అచ్ఛా! సరదార్లూ! మాట తప్పితే మక్కా-మీద ఒట్టు!" అన్నాడు పండితుడు.

ఇంతలోకి ఊరేగింపు వైపుకు వార్తాసంగ్రహానికి వెళ్ళిన సిపాయ్ పరుగు పరుగుల తిరిగి వొచ్చి, అనుమతి అయినా కోరకుండానే లోపలికి ప్రవేశించాడు రొప్పుకుంటూ. వాడి పరిస్థితిని గమనించి—

"క్యారే? క్యా హువా? ..." అంటూ పరామర్శ చేశాడు లల్లూఖాన్.

"సర్దార్! కొంప మున్గిపోయింది సర్కార్! అదీ హూరేగింపూ, రాజాకీ హూరేగింపు. ప్రక్క ప్రక్క మంత్రుల్ ఉంటార్! యుగంధర్ మంతిర్ కూడా ఉంటార్. వెన్క ఉంటార్. హూరేగింపు నగరి ద్వారం, చేరేసర్కి "ఎల్లి" లేదు- "ఎల్లి"- మనకి గుడ్డల్ హుంతుక్కాతుందే అదీ దాని మొగుణ్ని పేరణ్ని మన షాజాదావార్ పట్కా ఎల్లినార్ అంటూ యుగంధర్ మంత్రీగార్కి మన్వీచేసి, ఘోల్ ఘోల్‌మంటూ ఏడ్చి ఘోలా చేసింది. దాంతో యుగంధర్‌గారే మండీపడ్డాడ్. ఎంటనే బయలూదేరి మీకి దగాకి వస్తూఉంటార్. అదీ చూసీ నేనూ ఘోడానీదా ఫర్గు ఫర్గునా హొచ్చియేసినాన్!" అంటూ విన్నవించాడు ఆ సిపాయ్.

లల్లూఖానుడు మ్రాన్పడిపోయాడు. మూర్ఖజ్యోతిష్యుడి మాట గొరం నిజంగా వొచ్చినంత పనైంది. ఖుస్రూఖాన్ సర్దార్ కూడా నిష

రీతమైన ఆందోళన పడసాగాడు. తమ షాజాదా చేసిన పనికి తమను ఏం చేస్తాడో, యుగంధరుడు. ఇక రాయబార నాటకప్రదర్శనకు ఏ విధమైన అవకాశంకూడా లేకుండాపోయింది. తమ దురుద్దేశం మంత్రికి తెలిసింది. ఏం చేయాలి? పోనీ యుద్ధం చేద్దామంటే రాజూ-మంత్రీ ఉన్న కాకతీయ నగరపు కోటను కన్నెత్తి చూడటానికి, ఎంతటి వాడికైనా అసాధ్యం!

ఆలోచనలలో నుండి సరదార్లు తేరుకోకముందే, గుర్రపు డెక్కల ధ్వని విపరీతంగా వినవచ్చింది. ఆ వెంటనే కాపలా సిపాయి లోపలికివచ్చి యుగంధర మహామంత్రి ఆగమనాన్ని సూచించాడు. వాడికి ఏ విధమైన సమాధానం చెప్పటానికి నోరు పెగిలించుకోలేని స్థితిలో ఉన్న సరదార్లను చూసి, విద్యానాథుడు విరునవ్వు నవ్వుతూ "చూశారా? నాదేమో చింతకాయ పచ్చడి జోస్యం, కోడిపులావ్ జ్యోస్యం అనుకున్నారేం కానియ్యండి చేసిన కర్మ అనుభవించక తప్పదు. అయితే, ఈ విషయంలో ఒకరు చేసిన కర్మను మరొకరు అనుభవిస్తున్నారు." అంటూ ఆ సిపాయిని చూసి.... "రమ్మనరా, బాబూ? రమ్మను - ఆ యమదూతను నేరుగా లోపలికి రమ్మను. నువ్వు వొద్దన్నా వాడెలాగూ లోపలికి వొస్తాడులే సరదార్లూ! యుగంధరుడంటే సామాన్యుడనుకున్నారా? వాడో చండప్రచండుడు! గుండెలుతీసిన బంటు. గుడిని - గుళ్లో లింగాన్నీ మ్రింగే రకం!" అన్నాడు.

కాపలా సిపాయి వెళ్ళిపోయాడు.

"ఇదుగో చూడండి! ఎందుకైనా మంచిది. నేను కాస్త ఆ పరదా ప్రక్కకి తప్పుకుంటాను" అంటూ విద్యానాథుడు పరదా పక్కకి పారి పోయాడు-సరదార్ల సమాధానంకోసం ఎదురు చూడకుండానే,

విద్యానాథుడు పరదా అవరోధానికి నిష్క్రమించిన మరుక్షణంలో పెద్ద-పెద్ద అంగలేసుకుంటూ, సమున్నతాకారుడైన యుగంధర మంత్రి లోనికి ప్రవేశించాడు. ఆ క్షణాన అతడి ముఖం భయంకరంగా జేవురించి ఉంది. కళ్ళల్లోనుంచి నిప్పుకణాలురాలుతున్నాయి. భృకుటిముడిపడింది. వెరవన్నది లేకుండా తమ గుడారంలోకి వస్తున్న యుగంధరమంత్రి భీభత్స

రూపాన్ని చూసి, హడలిపోయారు సరదారులిద్దరూ. తమ దౌర్భాగ్యాన్ని నిందించుకుంటూ గజ-గజలాడిపోసాగారు.

"మీరేనా, ఖుస్రూఖాన్?" గంభీరంగా ప్రశ్నించాడు యుగంధర మంత్రి.

"జి....జి....జీ....జిహాఁ!" అన్నాడు తడబడుతూ ఖుస్రూఖాన్.

"మీ పేరు?" అన్నాడు లల్లూఖాన్ వంక తిరిగి యుగంధరమంత్రి.

"న....న....నా పేర్ లల్లూఖాన్ సర్దార్!" అన్నాడు లల్లూఖాన్ వణికిపోతూ.

"సర్దార్! అచ్ఛా - మీ షాజాదా మా చాకలి పేరడ్ని పట్టి బంధించాట్ట! ఎందుకో తెలుసా?"

"మాలూంనై మహామంతిర్!" అన్నాడు లల్లూఖాన్.

"అయితే, నేను చెప్తాను. విను; వేట కెళ్ళిన మా మహారాజుగారితో వారి బట్టలు ఉతకటానికి పేరిగాడు కూడా వెళ్ళాడు. ఆ పిచ్చివెధవ రాజావారి గుర్రాన్ని మేపుతూ రాజావారి గుడ్డలను ఉతకటానికి కిన్నెరసాని వాగుకు మోపు మూపున వేసుకొని వెళ్ళాడు. ఏ బుద్ధిపుట్టిందో ఏమో-వాడు ఉతకాల్సిన రాజుగారి బట్టలను తాను వేసుకొని గుర్రం పక్కన నుంచొని కులుకుతూ మోజుతీర్చుకుంటున్నాడు. ఆ సమయంలో వాడ్ని చూసి ప్రతాపరుద్ర చక్రవర్తి అని భ్రమసి మీ షహజాదా వాడ్ని బందించుకొని వెళ్ళాడు. తెలిసిందా?"

"జీ, మహామంతిర్! ఇది చాలా జూటీబాత్!" అన్నాడు లల్లూఖాన్.

"జూట్? మీ ప్రాణాలు జూటా అవుతాయ్ - నెలరోజుల లోగా మా చాకలి క్షేమంగా మాకు తిరిగి రాకపోతే! మిమ్మల్ని సర్వనాశనం చేస్తాను. రాజదుస్తుల్లో ఉన్న మా చాకలిని బందించుకొని వెళ్ళటంతో మీ దురుద్దేశ్యం స్పష్టపడింది. మీరు వొచ్చింది రాయబారానికి కాదు; మా రాజును బంధించటానికి. వెంటనే మా చాకలి పేరడికోసం ఢిలీకి కబురు ... వాడు క్షేమంగా తిరిగి వొచ్చేవరకూ మీ ప్రాణాలకు రక్షణ

లేదనే విషయం గ్రహించండి. జాగ్రత్త!" అంటూ గిఱ్ఱున వెనుదిరిగి వెళ్ళిపోయాడు యుగంధర మంత్రి.

* * *

ఆనాటి అర్ధరాత్రి రెండవ కంటివాడికి తెలియకుండా గుడారాలను, తదితర భారమైన వస్తుసామాగ్రిని అక్కడే వొదిలివేసి, సైన్యాలను, అశ్వాలను మాత్రం బయలుదేరదీశాడు ల్లాఖాన్. తెల్లవారేసరికి ఓరుగల్లు నగరానికి సుదూరంగా ప్రయాణం చెయ్యగలిగింది యవన సైన్యం. తెల్లవారిన పిదప ల్లాఖానుడు సైన్యాన్ని దేవగిరికి నడిపించటానికీ, ఖుస్రూ కాన్ పదిమంది అంగరక్షకులతో ఢిల్లీ నగరానికి బయలుదేరటానికీ నిర్ణయం జరిగింది.

# 14

యుగంధర మహామంత్రి, రాజు బందీగా ఢిల్లీకి తీసుకొని పోబడిన తరువాత ఆ విషయం ఓరుగల్లులో పొక్కకుండా చేయాల్సిన ఏర్పాట్లన్నీ చేశాడు. షాజాదా అలూఫ్‌కాన్ పట్టుక వెళ్ళింది రాజునుకాదనీ రాజు వేషం వేసుకుని కులుకుతున్న చాకలివాడ్ని అనీ నగరం అంతా తెలిసిపోయింది. దానికి తోడు వేట గాయాలతో ఉండి అనుమకొండలో విశ్రాంతి తీసుకున్న పిదప, మంత్రి సామంత పరిజన సమేతంగా బహిరంగంగా పట్టపగలు నగరప్రవేశం చేసిన మహారాజును అల్లంత దూరాన్నుంచి ప్రజలంతా వీక్షించారు. దాంతో షాజాదా ఖైదుచేసి తీసుకుపెళ్ళింది చాకలివాణ్ణే అనే ప్రథ విపరీతంగా వ్యాపించింది. దానికితోడు భర్త వియోగంతో గోలుగోలున వీధి వీధినా ఏడుస్తూ ఎల్లి చేసే గందరగోళం ఈ వార్తకు ఇతోధికమైన ప్రచారం కలిగించింది.

యుగంధరుడి బెదిరింపుకు లొంగిపోయి రాత్రికి రాత్రే హఠాత్తుగా జండా పీకిన ల్లాకాన్-ఖుస్రూకాన్‌లు అనంతమైన ఆయుధ సామాగ్రిని అసంఖ్యాకమైన గుడారాలను, ఆహార పదార్థాలను, ఎడ్లబండ్లను వొదిలి వెళ్ళారు. యుగంధర మహామంత్రి ఆశించింది కూడా దీన్నే. యవనులతో ఆ క్షణాన యుద్ధం చేయడం అతని కంత సమంజసంగా తోచింది కాదు.

రాజు శాత్రవర్గం చేతిలో బందీ అయ్యాడనే విషయం ఏ క్షణాన తెలిస్తే ఆ క్షణాన ఆంధ్ర సైన్యాలు సఖ్య ఇస్తాయ్. ఇక తక్తుమీద కూర్చున్న పాకలివాని పరిరక్షణకు ఏ యోధుడూ కత్తిపట్టడు. అందుకోసం యుక్తితోనే వారి నక్కడనుండి తరిమివెయ్యాలని యోచించి పథకం వేశాడు. దాంతో యవనుల అనంతమైన అస్త్రశస్త్రాలు, గుడారాలు, ఆహార ధాన్యాలు ఆతని వశమైనాయి ఒక్క నెత్తురుబొట్టు చిందకుండానే - అతని మేధస్సుకు జేజేలర్పిస్తూ.

ఈ విధంగా ఓరుగల్లులో జరగాల్సిన కార్యక్రమాన్ని పూర్తిచేసి, లక్ష్మడు జనార్దనమంత్రిని పిలిచి ప్రభుపు వేషంలో పున్న పేరయ్యను వారాని కొకసారి నగర వీధులగుండా ఊరేగిస్తూ సభాస్థలికి తీసుకొని వెళ్ళాల్సిందనీ, అయితే సభాస్థలిలోనికి మాత్రం అత్యంత ఆంతరంగికు లయినవారికి తప్ప, ఇతరులకు ఏ విధమైన ప్రవేశమూ ఇవ్వరాదనీ సుదల ఇచ్చాడు. పేరిగాడికి రాజరీవీ, రాచమర్యాదలూ, రాచపలుకూ కొలువు కూటంలో ఆంతరంగికుల మధ్య అభ్యాసం చేయించాలనీ, వాడు అందులో పరిపూర్ణుడయ్యాడనే నమ్మకం కలిగేవరకూ రాజసభలోని ఆంత రంగికులకు తప్ప, అన్యులకు ప్రవేశం ఇవ్వరాదనీ కట్టడిచేశాడు.

ఆ తరువాత కోశాధికారి హరిహరరాయలకూ, దుర్గరక్షకుడు బుక్కరాయలకూ, ఊరికి పెద్దసెట్టి రత్నాకరుడికీ, విద్యానాధుడికీ వేరు - వేరు ఉత్తరాలు వ్రాసి, సరిగా రెండు మాసాల తరువాత వారికి ఆయా లేఖలను అందించాలని, అ లేఖలలో నిర్ణయించిన విధంగా వారు తమ - తమ కార్యక్రమాలను నిర్ణయించుకొని, ఎవరి విధి వారు నిర్వహించాలనీ నిర్దేశించాడు జనార్దనమంత్రికి.

ఇక తాను ఓరుగల్లు నగరంలో చెయ్యవలసిన కార్యక్రమాలన్నీ దాదాపు పూర్తిచేసినట్లు భావించాడు మహామంత్రి. అయితే, మరొక్క ముఖ్య విషయం మాత్రం మిగిలిపోయింది, ఇంతవరకూ మహారాజు వేట గాయాలతో ఉండటంవల్ల, వారిని చూడటానికి రాజవైద్యులచేత అభ్యంతరం చెప్పించాడు రాజమాత ముమ్మిడమ్మకూ, పట్టమహిషికీ. అయితే, వారికి వా స్తవం వివరించకపోతే గుట్టు రట్టయే అవకాశం ఎంతైనా వుంది.

అందుకోసం యుగంధర మంత్రి రాజమాత సందర్శనానికి బయలు దేరాడు.

వేట గాయాలకు చికిత్స పొందుతూ, విశ్రాంతితీసుకొంటున్న మహా రాజును చూడటానికి రాజమాత, పట్టమహిషి రెండు మూడు పర్యాయాలు ప్రయాణమయ్యారు. కాని రాజవైద్యులు వారి పరామర్శ ప్రమాదకారణం ఔతుందని నిక్కచ్చిగా కబురుచేయటం వల్ల వారా ప్రయత్నాన్ని అప్పటికి విరమించుకున్నారు. కాని, రాజసందర్శనానికి వారి మనస్సు అనుక్షణమూ తహతహలాడుతునే ఉంది. ఈ పరిస్థితి ఇలావున్న సందర్భంలో యుగంధర మహామంత్రి ముమ్మిడమ్మ సందర్శనానికి వొచ్చాడు.

తన గృహానికి వచ్చిన మహామంత్రిని సాదరంగా, ఆప్యాయంగా ఆహ్వానించింది ముమ్మిడమ్మ. అయితే ఆ తరువాత మహామంత్రి చెప్పిన విషయాలకు మూర్ఛపోయినంత పనయింది ముమ్మిడమ్మకు. అయితే జగదేక శౌర్యనిధిగాను, చండశాసనిగాను ప్రఖ్యాతిగాంచిన రుద్రమాంబకు సహోదరి కాబట్టి పోయిన ధైర్యాన్ని క్షణకాలంలో కూడగట్టుకోగలిగింది. ఆమె వీరమాతయే గాకుండా రాజ్యాంగవేత్త! స్వప్రయోజనాలకన్నా, సామ్రాజ్యక్షేమం ఆమెకు ముఖ్యం.

ఆ విషయం తెలిసినవాడు కావటం వల్లనే యుగంధరమంత్రి పట్టమహిషి దర్శనానికి వెళ్ళకుండా, రాజమాత దర్శనానికి వొచ్చింది. అంతఃపురంలో ఈ వార్త వెలికి రాకుండా చేయగల శక్తిసామర్థ్యాలు, రాజమాత ముమ్మిడమ్మకు ఉన్నాయని మహామంత్రి విశ్వాసం.

"మరి కర్తవ్యం ?" అంది రాజమాత.

"ప్రస్తుతానికి రాజు పోలికలున్న పేరిగాణి ప్రభువును చేశాం"

"ఈ రహస్యం యెంతకాలం దాగుతుంది?"

"మహారాజు తిరిగి వచ్చేవరకూ దాగితీరాలి. రాచనగరు వెలుపల ఈ వార్త పొక్కకుండా ఏర్పాట్లు చేశాను. ఇక రాజాంతపురంలో యీ విషయం రెండవ కంటికి తెలియకుండా చూడాల్సిన బాధ్యత మీది!"

"మహారాణిని మభ్యపెట్టటం సాధ్యమా?"

"అది మీరే చూసుకోవాలి సామ్రాజ్య క్షేమం దృష్ట్యా! ఏ భర్తృ సంక్షేమవ్రతాన్నో మహారాణివారి చేత వేట గాయాలతోఉన్న మహారాజులు శీఘ్రంగా కోలుకోవటానికని మొదలుపెట్టించండి. వ్రతారంభమైన తరువాత ఆరునెలల వరకూ పతి సందర్శనం చేయరాదని, చేస్తే ప్రమాదహేతువని పురోహితుని చేత మహారాణి వారికి మనవి చేయించండి"

రాజమాతకు ఈ ఊహ నచ్చింది. అయితే ఆమెను మరో అనుమానం పీడించసాగింది. ఆరునెలల తరువాత ...."

"అంతవరకూ బాగానే ఉంది యుగంధరా! కానీఆరునెలల తరువాత ఢిల్లీ నగరపు కంచుకోటలో బంధించబడివున్న నా బిడ్డ-నా వద్దకు తిరిగి వొస్తాడా?" రాజమాత కళ్ళు చెమ్మగిల్లినాయి.

"అమ్మా! నేను నా యజ్ఞోపవీతం సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. ఢిల్లీ నగరాన్ని దగ్ధం చేసయినా సరే, కంచుకోటను బ్రద్దలుచేసి అయినా సరే-నేటికి సరిగ్గా ఆరు నెలలకు నీ కుమారుడ్ని, నా ప్రభువు ప్రతాపరుద్ర చక్రవర్తిని బంధవిముక్తున్ని చేస్తాను. సూర్యచంద్రులు గతులు తప్పినా, ప్రచండభానుడి కిరణ కాంతిపుంజపు దారుణాతాపానికిహిమశైలం ద్రవించి, పొంగిపొరలి పరవళ్ళు తొక్కుతూ ఢిల్లీ నగరాన్ని ముంచివేసి నా-నాప్రతిన నేను నెరవేర్చుకుంటాను. ఆశీర్వదించు మాతా, ఆశీర్వదించు" .అంటూ తలవంచి మోకరించాడు యుగంధర మంత్రి.

ఆనందభాష్పాలు కళ్ళవెంట జలజల రాలుచుండగా రాజమాత ముమ్మిడమ్మ తన ముందు అవనతమై ఉన్న శీర్షాన్ని తన దక్షిణహస్తంతో సాదరంగా స్పృశించి, హృదయపూర్వకంగా "అభీష్టసిద్ధిరస్తు-దిగ్విజయోస్తు అంటూ ఆశీర్వదించింది.

# 15

ఒరే యెంకా ! ప్రభువుగారిని సిద్ధం చేశావురా?" అన్నాడు జనార్దన మంత్రి-

"చేత్తా చేత్తా ఉన్నానండీ. ఎదవగాడిద సరిగా చేయించుకు సత్తేనా? అదేదంటాడు, ఇదేదంటాడు, రాజుగారి సరాయిసగం తోడుక్కొని, సుర్యా ఎసుకోకుండానే ఎల్లికి సూపిచ్చొత్తానని గోల సేత్తున్నాడు సామీ!"

"ఒరేయ్! మాట్లాడకుండా దుస్తులు వేసుకో" అన్నాడు జనార్దన

పేరిగాడు మరేం మాట్లాడలేదు. అయినా వాడి మనసులో గిలి గిలి గానే ఉంది పట్టక పట్టక పట్టిన వైభోగం గందా యిది. నా నంజ ప్రక్కనుంటే ఎంత బాగుండును అనేది వాడి భావన. సేవకుడు షరాయి తొడగడం పూర్తిచేశాడు. పేరిగాడు చిన్నగా ఆసనం మీదనుండి లేచాడు.

"సూడండి సామీ! నాకింత బోగం పడుతూవుంటే నా ఎల్లి సూడొద్దు ఏళ్ళు దానికి చూపిచ్చొద్దంటాడు ఎదవలు! ఈ దుస్తుల్లో నన్ను చూత్తే ఎంత సంబరపడద్దని! ఆ నంజ సంతోసాన్ని చూసి ఓర్చలేని నంజనాకొడుకులు సామీ ఈళ్ళు. సామీ! ఒక్క చనంలో పరుగెత్తుకుంటా ఎల్లి చూపించి ఒత్తా ఏం సామీ? అన్నాడు తన కోరికను జనార్ధన మంత్రిఅయినా మన్నించకపోడనే ఆశతో.

"ఒరేయ్! పోయి కూర్చో"

"కూసోవాలిసిందేనా సామే!"

"కూర్చో ముందు. ఒరేయ్ ప్రభువుల వారికి నగలు పెట్టండిరా!" అన్నాడు మంత్రి.

పరిజనులు క్రమంగా నగలన్నీ అలంకరించసాగారు.

ఇంతలో దౌవారికుడు వచ్చి "ప్రభూ! విశ్వకర్మ వీరాచారివచ్చాడు" అని మనవి చేశాడు.

"ఒరే వెంకా! వీరాచారి నెందుకురా పిలిపించావు" అన్నాడుమంత్రి.

"చిత్తం, ప్రభూ! ఈ పేరిగాడికి చెవులకు కుండలాలు తగిలిద్దా మని చూస్తే రంధ్రాలు లేవు"

"పేరిగాడనకురా, వెంకా! ప్రభువుగారనరా!"

"అలాగే సామీ ఈ ప్రభువునకు చెవులు కుట్టిద్దామని పిలిపించాను వీరాచారిగారిని" అన్నాడు వెంకడు.

ఆ మాట వినటంతోటే పై ప్రాణాలు పైకి ఎగిరాయి పేరిగాడికి.

"రచ్చించండి దమ్మపెబువులు. మంత్రిగోరూ! సిన్నప్పుడు మా నాయనమ్మ సెవులు కుట్టిత్తానంటే బయమేసి పదిరోజులు పత్తు పడుకుండినా దాంతో ఆ గండం గడిసిపోయింది సామీ! ఈ మాటుకి కాయిండిపెబూ!"

"ఒరే! మేము ప్రభువులం కాదురా! మంత్రులం ప్రభువు నీవురా!"

"నేనేగందా, బాబూ! నామాట సెల్లాలిగా సామీ!"

"ఓరివెధవా! నీకెంత చావుతెలివి పుట్టిందిరా! అవశ్యంచెల్లాల్సిందే!

"అయితే నేను కుట్టించుకోను మంత్రీ!"

"ప్రభువు కావాలంటే ముందు చెవులు కుట్టించుకొని కుండలాలు ధరించాలిరా! ఊ! వీరాచారిగారు కానివ్వండి. ప్రభువులకు ఏమాత్రం నొప్పి కలగకుండా రంధ్రాలు వెయ్యండి" అన్నాడు జనార్ధనమంత్రి అపుడే ప్రవేశించిన వీరాచారితో. పోగులతో తనవైపుకొస్తున్న వీరాచారిని చూసి భయంతో వణికిపోసాగాడు పేరిగాడు.

"అమ్మోయ్! నాయనోయ్! మా మంచి నాయనమ్మ కాబట్టి యేడుస్తున్నాననే దయతో వొదిలేందఖ్ఖోయ్! ఈ ఆశార్లుగాను వొదిలేట్టు లేదురోయ్! ఈ మంత్రిగారు అలూచిరోయ్!" అంటూ రాజభవనమంతా యెలుగెత్తి కేకలువేస్తూ పరుగెత్తసాగాడు పేరిగాడు.

"ఒరే వెంకా! సుబ్బా! ప్రభువులను పట్టుకొచ్చి కూర్చుండ బెట్టండిరా!" అన్నాడు జనార్ధనమంత్రి.

ఆయన ఆజ్ఞ ఇచ్చిన తక్షణంలో ప్రభువు వెంటపడ్డారు సేవకులు. ప్రభువు వాళ్ళని అంతఃపురమంతా తిప్పి తిప్పి ముప్పతిప్పలు పెట్టి

సాగాడు. చివరికి ఎలాగై తేయేం, తన్నుకుంటూ తన్నుకుంటూ ప్రభువు వార్ని తీసుకొనివొచ్చి పెడరెక్కలు విరచికట్టి కూర్చోబెట్టారు. ప్రభువు వారు ఇంకా అరవటం మాత్రం మానలేదు.

"ఇదుగో మంత్రయ్యగోరూ! నన్ను ఇట్టా కట్టేయిత్తివే- యిదే వన్నా నాయంగుంటే? సత్తెం చెప్పు!" అన్నాడు ప్రభువు.

"సర్కార్! వాణ్ని పట్టి బంధించేసరికి గగనమైంది. ఎలాగో అలా పట్టుకునేసరికి గాడిదలా ఓండ్ర పెట్టి నానా హంగామా చేశాడు, ప్రభూ!"

"ఒరే! సాకలాణ్నయినంత మాత్రాన గాడిద అంటావురా! సాకలి గాడిదా! చూస్కో- నా సావిరంగా! ఏం చేత్తానో చూస్కో- మంత్రయ్య గోరూ! ఈడిపని పట్టండి బాబూ!" అన్నాడు పేరిగాడు

"వాడి విషయం ఆలోచిస్తాను. ముందు తమరు చెవులు కుట్టించు కోంది రాజయోగం లభ్యంకాదు," అన్నాడు జనార్ధనమంత్రి. అంతలో విశ్వకర్మవీరాచారి ప్రభువుల కుడిచెవిలోకి పోగు సర్రన దింపేశాడు.

"అమ్మనాయినోయ్! ఎల్లీ! ఈళ్లు నన్ను సంపేత్తున్నారు, ఎల్లీ! రావే నా ఎల్లీ!" అంటూ అరవసాగాడు. ఇంతలో వీరాచారి రెండవచెవి కూడా చిటుక్కుమనిపించాడు. పేరిగాడు మరోసారి పెడబొబ్బలెట్ట సాగాడు.

"ఒరే, నీకు యోగకాలంరా! ఇలాంటివన్నీ ఓర్చుకోవాలి. చూడు- దగద్ధగాయమానంగా మెరిసిపోతున్న ఆ రత్నకుండలాలు నీ చెవులకు అలంకరిస్తాను."

"యోగం సంగతొదిలెయ్యండి, సామీ! సెవులను తూసింత నీకు సున్నమన్నా ఏయించండి, సామీ!"

"వేస్తాగ లేరా?"

"అట్టా అంటే కాదు, సామీ...."

"ఒరే. నన్ను నీవు నలుగురి ముందూ స్వామీ అనకూడదు. అమాత్యా అనో-జనార్ధన మంత్రీ అనో పిలవాలి."

"అలాగేలే, సామీ!"

అధిగో! మళ్ళీ అదే మాటా"?

"బుద్ధి- బుద్ధి- సామీ....అమాత్తెంగోరూ! నా సెవులకు నీరు సున్నం...."

"అలాగే వేస్తారులే. ప్రభూ!"

"అదికాదు. అమాత్తెంగోరూ! ఆ మాట మీరు ఈవిధవనాయాల్లకు సెప్పండి. సేసంటే నియ్యోగ. ఆ వెంకడికి సేసంటే సుకీ-సుకీ సులకన! మీరు సెప్పండి సామీ!"

"అలాగేలే, వెంకా! ప్రభువుల చెవులకు నీరుసున్నం వెయ్యరా!"

"అలాగే, స్వామీ!" అంటూ వెంకడు నీరుసున్నం పట్టించాడు.

"ఆఁ. ఆ తరువాత ప్రభువుల జుట్టుకి అభినందన సూత్రం కట్టండిరా!" అన్నాడు జనార్ధనమంత్రి

"అదెందుకు అమాత్తెంగోరూ?"

"అమాత్తెంగోరూ కాదురా-అమాత్యా!"

"అమాత్తె!"

"అది కాదురా-అమాత్యా! పోనీ, మంత్రిగారూ అని పిలువరా!"

"హన్నన్నీ! అట్టా సేలిగ్గా సెప్పండి పలుకుతా మంతిరిగోరు?"

"గోరు కాదురా-గారు అను."

"గోరు కాదురా-గారు అను."

"ఓరి, నీ దుంపతెగ! సరేలే! ఆ సూత్రం లాగినప్పుడల్లా దేవర వారు భేష్! శహబాస్! వహ్వా! అని అంటుంటాలి. అప్పుడు సభలో జరుగుతున్న వినోదాన్ని తమరు గ్రహించి, అభినందించినట్టవుతుందన్న మాట! ఎవరైనా బాగా పాడినప్పుడు అభినందించదగిన విద్య ప్రదర్శించినప్పుడూ, మీ సింహాసనాకి వెనుకఉన్న వెంకడు త్రాడు లాగుతాడు. ఆ త్రాడు లాగిన వెంటనే తమరు అభినందించడం ప్రారంభించాలి."

"ఓస్! ఇంతేనా అభినందించటం అంటే ఏంకో అనుకున్నా. తాడు లాగినప్పుడల్లా 'వహ్వా!' అంటమేనా, సామీ!"

"అంతే! అంతే!"

"అయినే, సరే, కట్టరా ఎంకా కట్టు అభినంద్ర మూత్రం గట్టిగా కట్టు. దాని సిగతరగా లాగిన ఎంటనే బెమ్మాండంగా అభినందించి పారెత్తా!"

వెంకడు ప్రభులకు అభినందన సూత్రం కట్టాడు.

"ఒరే! వెంకా! ఇక ప్రభువులకు కిరీటం పెట్టరా!" అన్నాడు జనార్దన మంత్రి. మేలుజాతి తురాయితో, మరకత మాణిక్యాది నవరత్న సముచ్ఛయంతో మెరసిపోయే కిరీటాన్ని ప్రభువుల తలమీద ఉంచాడు వెంకడు. ఆ కిరీటాన్ని చేతులతో తమిడి చూసుకొని, సంతృప్తిగా విదిలించాడు తన తలను పేరిగాడు. అతడి నెత్తిన అంత ఎత్తున ఉన్న తురాయి, క్షణమాత్రం ఒక్కసారి ముందుకు వొంగి పైకి లేచింది.

"అమ్మ బాబోయ్! నానెత్తిన పిల్లికూన ఎక్కిందిరోయ్!" అంటూ రంకెపెట్టాడు ప్రభువు.

"పిల్లి! ఎక్కడరా? మా కెవరికీ కనిపించదే! నీ తలమీది కెట్లా వొచ్చిందిరా!"

"వొచ్చింది సామీ వొచ్చింది. బెమ్మప్పెమానకం తోడు, మీతోడు నాతోడు, నా ఎల్లినంజె తోడు-నాను సూసినా సామీ సొంత కళ్లెట్టుకొని. అది నా తల మీది కూకోని, తన తోకతో నా ముఖం మీద కొట్టబోయింది సామీ! నత్తెం- నే నచ్చినంత వొట్టు. నా ఎల్లి ముండ మోసినంతొట్టు సామీ!"

"అది పిల్లితోక కాదురా! అది తురాయి."

"తురాయి అంటే"!

"కిరీటంమీద ఈకలికెలుగా లేవూ. అవీ!"

"కిరీటంమీద ఉండే పీకలా సాములూ? అట్లా చెప్పండి అయినా, ఎదవ పీకలు. ఉన్నచోటా ఉన్నట్టుండదు గదా! అట్టా ఊగలయేం, ఏం వాయువా అంటా!"

"వాయువ కాదురా, వాజెమ్మా! దేవరవారి గాడిదకి ఓండ్ర పెట్టడం అలవాటు అయిపోయినట్లుగానే, వాటికి అలా ఊగటం అలవాటు."

"అద్దగీ అట్లా సెప్పండి, సాములూ! అయితే సరే - అయినా, సాములూ! నాకెందుకొచ్చిన బాధ అంట- సాకిరేవెల్లి చలవసేసేనా కొడుక్కు- రాజు ఏసం ఎందుకూ? అహ రాజు ఏసం ఎందుకూ అంట! మా ఎరికల చుబ్బిగాడి మారాజు ఏసం మాలావు బాగుంటది. ఆడసేత ఏయించుకోండి, సామీ!"

"అది కాదురా-నీకు పట్టింది కదా అని అందరికీ యోగంపడుతుందిటరా? కానీ, ఒరే, వెంకా ప్రభువులకు పన్నీరు చల్లరా!"

వెంకడు పన్నీరు జోరుగా చిలకరించటం ప్రారంభించాడు ప్రభువులవారి మీద.

"ఒరేయ్, ఎంకోయ్! నానేం దున్నపోతు ననుకున్నావేంటి ఊరికే కుమ్మరిత్తుండవు. ఆగవే?"

వెంకడాగలేదు, ప్రభువులకు కోపం వచ్చింది. బలవంతాన వెంకడి చేతిలోని పన్నీరుబుడ్డిని లాక్కొని వాడిమీదచల్లుతూ, వాడివెంట పడ్డారు ప్రభువులు. వెంకడు "అమ్మోయ్-అమ్మోయ్!" అంటూ అంతఃపురం అంతా పరుగెత్త సాగాడు. వెంకడి వెంట ప్రభువులుకూడా పరిగెత్త సాగారు. ప్రభువును పట్టుకోవటానికి ఆంతరంగికపరివారం పరుగులెత్త సాగింది.

"ఒరేయ్, పేరిగా! అన్నాడు పెద్దగా జనార్ధనమంత్రి.

పేరిగాడు వినేటట్టులేడు. వెంకడిమీద జడివాన కురిపించాలని వాడి పట్టుదల.

"ఒరేయ్, పేరిగా! నువ్విలా ప్రవర్తిస్తే.పెద్దన్నగారు యుగంధరుల వార్ని పిలిపించాల్సి ఉంటుంది."

యుగంధరమంత్రి పేరు వినగానే పేరిగాడు అదిరిపోయాడు. యుగంధర శబ్దం వింటేనే వాడికి అమిత భయం. అదీగాక, ఆ రోజున గండాన్ని గడిపి, యోగాన్ని పట్టించే సందర్భంలో మహామంత్రి యుగంధరులవారి చేతిదెబ్బ చవిచూశాడు. అందుకే మంత్రబద్ధునిలా నిలబడి పేరిగాడు.

"మర్యాదగా తిరిగి రా!"

"తిరిగొత్తాను గాని, సామీ! యుగంధరలవోర్ని మాత్రం పిలవరు గందా? ఆయనగోరు వచ్చారంటే, నా ఎల్లిముండ మొయ్యటం సత్తెం, సామీ!"

"పిలవనులేరా! కాని, చెప్పినట్లు వినాలి సుమా!"

"ఇంటాను, సామీ!"

"ఇదిగో, ఇదేమిటో తెలుసా?" అంటూ పచ్చ కర్పూరపు డబ్బీ నొకదాన్ని తీశాడు బల్లకింద నుండి మంత్రి జనార్ధనుడు.

"ఏంది సామీ? కర్పూరంలాగుంది?"

"ఔనౌను, కర్పూరం. దీన్ని కాస్త వేళ్ళకి పట్టించుకో"

"ఎందుకు సామీ?"

సభలో అభినందనసూత్రాన్ని అదికంగా లాగితే, ఈ రెండు వేళ్లూ కళ్ళలో పెట్టుకోవాలి. అప్పుడు ఆనంద బాష్పాలు కళ్ళ వెంట జల జలా రాల్తాయ్ చూసేవాళ్ళకు ప్రభువులెంత రసహృదయులు! నవనీత హృదయులు అనిపిస్తుంది."

"ఆనందబాష్పాలా, సామీ?"

"ఔనౌను. కచేరీలో విద్యాప్రదర్శన ఉత్తమస్థాయిలో జరుగుతున్నప్పుడు అప్పుడప్పుడు ఈ బాష్పాలు కారుస్తూ ఉండాలి. రస హృదయులు."

"అలాగేలే, సామీ! ఆ డబ్బీ నా దొడ్లో ఎట్టుకుంటా కాని, సామీ! ఎల్లినంజి లేకుండా నాను చిమ్మాసనం ఎక్కనే ఎక్కనంట, సామీ!

"ఒరే పగటివేళ ఎల్లిని చూస్తే, దాని మొగుడికి ప్రాణగండం అని జోస్యులు చెప్పటం వినలేదురా?"

"సత్తే సచ్చాడు ఏదవనాయాలు! నా ఎల్లికన్న ఎక్కువా అంట?

"అది కాదురా! ఎల్లి మొగుడంటే నువ్వేకదరా! ఇంకా ఎవడన్నా ఉన్నాడేమిటి?"

"ఛా! ఛా! అవేం మాటలు సామీ?"

"అయితే, చావబొయ్యేది నువ్వే అవుతావ్!"

"అయ్యో, సామీ! ఇదేం యోగంరా, సామీ? పోనీ, సీకటిపడ్డ తరువాత సూడొచ్చా, సామీ!"

"ఆహా! సీకటిపడ్డ తరవాత నీ ఎల్లి నేసుకొని సింహాసనంఎక్కు. అయితే, ఆరు నెలల్లోగా చీకట్లో నీ ఎల్లిని చూస్తే నీవు బాగుంటావు కాని, నీ ఎల్లి చస్తుంది."

"అయ్యో, దేవుడా! ఇదెక్కడి ఖర్మరా, భగవొంతుడా! రాజు గోరినై నానన్న సంతోషమే లేకుండా సంపేశావుగదరా! భగమంతుడా!"

"ఒరేయ్! భయంలేదు. బాధలేదు. ఆరునెల్లు ఓపికపట్టు - నీ ఎల్లి నీతోపాటు తక్త మీద ఎక్కుతుంది. సరేనా!"

"అలాగేలే, సామీ! ఓపికపట్టలేకపోతే, సావాల్సిందేగా!" అంటు తలయూచాడు ప్రభువు.

వెంకడు ప్రభువులను సర్వాలంకారభూషితులను చేశాడు. కర్పూర హారతితోనూ, ఎర్రనీళ్ళతోనూ దిష్టి తీశారు పరిజనులు. సేవకజన ప్రతీత ముందు నడుస్తుండగా జనార్ధనమంత్రి వెంట రాగా ప్రభువు కొలువు కూటానికి బయలుదేరాడు.

ప్రభువువారి రథం నగర వీధులగుండా సాగిపోతున్నది. వేట గాయాలనుండి కోలుకున్న తరువాత ప్రభువులు సభకు బయలు దేరటం, పురజనులకు దర్శనం ఇవ్వటం కూడా ఇప్పుడే కావటంవల్ల ప్రజాసమూహంతోవీధులన్నీ కోలాహలంగాఉన్నాయి. అల్లంతదూరాన్నుంచి రథంలో ఉన్న ప్రభుపులను చూచి "చక్రవర్తికీ జై! ఆంధ్రసార్వభౌముడికీ జై" అనే నినాదాలు చేయసాగింది ప్రజానీకం. చాలాకాలం తరువాత కన్నుల పండువుగా దర్శనం ఇస్తున్న ప్రభువుపై రాజవీధులలో స్త్రీలు పుష్పవర్షం కురిపించసాగారు.

'అయితే సాములూ.'

"ప్రభూ! యిక్కడ నన్ను మంత్రిగారూ అని పిలవాలి." చిన్నగా చెప్పాడు ప్రభువు చెవిలో మంత్రి.

అయితే మంత్రిగోరూ-నాకు తెలక అడుగుతాను. యీళ్ళకేం పిచ్చా అంట-ఆల్లంతా నాకు పూలదండలేత్తున్నారు గందా- నన్ను పెళ్ళి చేసుకుంటారా ఏం సావీ."

"ఛా, ఛా, ప్రభువులకువేసే డండలు పెళ్ళిదండలు కావు. అభినందన మాలలు."

"హద్దదీ-అట్టా సెప్పండి. ఇయ్యికూడా అభినందాలే అన్నమాట. ఉత్తుత్తి దండలు."

"ఆ, ఆ, ప్రభువులు ఆట్టే మాట్లాడకూడదు.

"అది సరే సావీ? యవ్వారం కాబట్టి అడిగినా. రాజుగారిబట్టలు సలపసేసినందుకే సంవత్సరానికి సవాశేరు బంగారం యిత్తంటారుగందా-రాజుగారి యేషమేత్తే ఏమిత్తారు సావీ! కాదు-కాదు. సావీ కాదు మంత్రి గోరు జీతం ఏమిత్తారు?"

"ప్రభువులకు జీతమేమిటి?"

"అయితే నానీయేసం యెయ్యను. ఈరోజు పదిగుడ్డలు సలవసేసు కున్నా ఎల్లిపోద్ది నాకూ నా ఎల్లికి."

"అది కాదు ప్రభూ! తమరిప్పుడు రాజులు. ఖజానా అంతా తమదే"

"అట్టా సెప్పండి సావీ! మల్లీ సెప్పండి."

"ఖజానా అంతా తమదే!"

"ఆహా! ఓసి నా ఎల్లిలంజా నీ అద్రుష్టవే అద్రుష్టవే"

"ప్రభువులు మాట్లాడితే యుగంధరమంత్రులు వొస్తారు.

ప్రభువు మరి మాట్లాడలేదు. రథం ఆ జనసమూహాన్ని చీల్చుకుంటూ కోలువు కూటానికి చేరింది.

రథంలోనించి దిగుతున్న ప్రభువునుచూసి సామంతులూ సరదార్లూ సామాన్యప్రజలు జయజయధ్వానాలు చేశారు.

అంతమంది జనాన్ని చూసేసరికి ప్రభువుగారికి తారెత్తసాగింది. రథంలోనుంచే "అమ్మబాబోయ్" అని కేకవేసి క్రిందికి దూకి పారిపో

బోయాడు. కాని తన ప్రక్కనే ఆసీనుడై వున్న జనార్ధనమంత్రిని చూ: "నాకు భయమేత్తోంది మంత్రిగోరూ!" అన్నాడు.

"భయంలేదు. గియంలేదు. మాట్లాడావో పొడిచిపారేస్తా" అంటూ జనార్ధనమంత్రి తన అంగరఖానుండి సర్రన తళతళ మెరిసే ఓ చిన్నచురిక లాగాడు. "చూశావా ఎలావుందో నాగుపాము కోరలాగా. జాగ్రత్త! నోరు మూసుకోని క్రిందికి దిగి నేరుగా అటూ యిటూ చూడకుండా కొలువు కూటంలో ప్రవేశించు. అటు చూసినా, ఇటు చూసినా ఏ మాత్రం నోరు మెదిపినా డొక్కచించి డోలుకడతా"అంటూ ప్రభువు చెవిలో గర్జించాడు మంత్రి. ఇక విధిలేదురా బాబూ అనుకుంటూ రథం దిగాడు ప్రభువు. అతణ్ననుసరించాడు జనార్ధనమంత్రి.

ప్రభువు చిన్నగా ఠీవిగా అటూ ఇటూ చూడకుండా చెక్క బొమ్మ వలె నడుస్తూ కొలువుకూటంలో ప్రవేశించాడు. సభాభవన సింహద్వారం వద్ద విద్యానాథుడు ప్రభువుకు స్వాగతంయిచ్చి లోనికి ఆహ్వానించాడు. మహారాజుకు అత్యంత అంతరంగికులైన పరిజనానికితప్ప ఆరోజున అన్యులకు సభామందిర ప్రవేశ సౌలభ్యం లభించలేదు. కొమ్ములు తిరిగిన పెద్ద పెద్దలు కూడా మహారాజును ఊరేగింపు సమయంలో మాత్రం దర్శనం చేసుకొని వెళ్ళిపోయారు. సంధ్యా సమయానికి గాని ప్రభువు తిరిగి బయలుదేరడని తెలియటంవల్ల ప్రజాసమూహాలు నగరవీధులలోనించి చెదిరిపోవసాగాయ్.

## 16

ప్రభువు కొలువు కూటాన్ని ప్రవేశించాడు. సాధారణంగా రాజ్యంలోని సామంతులూ సరదారులూ ముఖ్య ప్రముఖులూ అధిష్టించే పీఠాలపై ప్రతాప రుద్ర మహారాజు అంతరంగిక పరివారం రాజసభోచిత వేషభాషణాలంకారాలతో అధిష్టించి వుంది. జనార్ధన మంత్రి విద్యానాథుడు వెంటరాగా ప్రభువు నవరత్న ఖచితమైన ఓరుగల్లు సింహాసనం దగ్గరకు నడిచాడు.

'ప్రభువులు సింహాసనం మీద అదిష్టించండి' అన్నాడు జనార్ధన మంత్రి.

'ఉ! ప్రభువులు సింహపీఠిపై కి ఎక్కండి,' అన్నాడు విద్యానాథుడు బెదుకు బెదుకుగా సింహాసనం వంక చూస్తున్న ప్రభువును చూసి.

అయినా ప్రభువు కదల్లేదు. వళ్ళంతా ముచ్చెమటలు పోయసాగాయ్. జీవం పుట్టిపడేటట్లు, మలచిన రెండు నిలుచున్న సింహాల నాధారంగా చేసుకొని శిల్పికారుడు రత్నమాణిక్యాలను మలచి పొదిగి నిర్మించిన సింహాసనాన్ని అలాగే చూస్తూండి పోయాడు. ప్రభువు ముఖమంతా చెమటలు క్రమ్ముతుండగా.

"ప్రభూ! ఇది రోజూ తమరు అదివసిస్తున్న సింహాసనమే కాని అన్యంకాదు ప్రభూ దయచేయండి! తమకు పట్టిన మహత్తర యోగానికి చిహ్నంగా యీ సింహాపీఠిపై కి దయచేయండి."

అయినా ప్రభువులో చలనంలేదు. ప్రభువు భయం పోదల్లేదు.

"అసలు విషయం యేమిటిప్రభూ?" అన్నాడు జనార్ధనమంత్రి.

"మంత్రిగోరూ! ఆ అయ్యోరు తప్పుడు జోతిస్సం. గండంగడిసి యోగం పట్టుదంటిరే యోగం గడిసి గండంపట్టేటుంది సామే!"

"ఏమి ప్రభూ! తమకు యిప్పుడేంగండం వచ్చిందని!"

"ఏ గండం ఎంటి మంత్రిగోరూ పాణగండం వత్తే. నా ఎల్లికి నేను ఒక్కణ్ణే ముగుణ్ణిగందా! అమాటన్నా పట్టించుకోకుండా చిమ్మాచనం మీదకెక్కమంటారా సామీ!"

"అది కాదురా! దానిమీద కెక్కినవాడికి ఇంద్రబోగం, మహాయోగం—స్వర్గబోగం లభిస్తుందిరా."

"సామీ! నిజం చెప్పిన్రను సదువుకోక పోయినా సాకలాణ్ణి సామీ! సొరగం అంటే తెలేని యదవనాయాల్ని అనుకోకండి. సత్తేనేగా సామీ సొరగమొచ్చేది."

"నీకిప్పుడప్పుడే చావులేదురా. పేరిగాడు చచ్చినా పరకాయ ప్రవేశం చేసిన తమ ఆత్మ ప్రభువులో దూరింది కట్టైతోసహా."

"ఏందోసామీ! నన్ను నిజంగా సంపాలని కాకపోతే ఏంది సామీ! రెండు చిమ్మాలమీన దిండు అడంగాయేసి దానిమీద పట్టుగుడ్డ పరిసి కూకోరా పేరిగా అంటే నేనేం యెట్టియెదవ ననుకున్నారా అమాత్తెయ్యగోరూ? అయినా యీ సాకలినాయాల్ని చిమ్మాలకేసి సంపి త్తే మీకేం వత్తదీ అంట. ఒకసారి సత్తే ఖరారుగా సావాల్సిందే గందా సామీ! సచ్చేవాడు మరు బతకడుగందా? నే సచ్చిపోతే నా ఎల్లి ముండ మోత్తుంది గందా. అది ముండమోపిదై ఏడుత్తుంటే నాను సూడలేను సామీ, నా మొగంచూసి కాకపోయినా సామీ నా ఎల్లి ముఖం చూసయినా నన్నొది లెయ్యండి సామీ!"

"ఒరేయ్! ప్రభూ—"

"సామీ సామీ! నన్నొ చిమ్మాల కెయ్యకండి. అంతగా కావాలంటే నా చొంత ఖరచుమీద అటికి కోళ్ళనో కాక్కి-రాయిలోన్నె, మేకలోన్నె, యాటలోన్నె యిచ్చుకుంటా, నన్ను పోనియ్యండి సామే!"

ఆ క్షణాన జనార్ధనమంత్రి చేతిలోని ఛురిక ప్రభువు జఘనభాగానికి గుప్తంగా తగులుతుండకపోతే ప్రభువు పకపక లంకించుకొనేవాడే.

"ఒరేయ్ వెర్రిమొగమా! అవి ప్రాణాలున్న సింహాలు కావురా!"

"నాకు తెలుచులే సామీ! ఆటికి పాణంవుంటే నా పేణాలు ఆటి కెందుకూ. అవి పాణాలు తీసే చిమ్మాలే"

"కాదు, ప్రభూ"

"మరి చాతబడి చిమ్మాలా! నేను చత్తే దగ్గిరికిపోను."

"అవి చాతబడి సింహాలుకాదు. బొమ్మలు, బొమ్మలు ప్రభూ! బొమ్మలు?"

"అబద్ధాలు సెప్పకండి శాత్రుల్లగారూ! ఆడపిల్లలుడతారు. బొమ్మ అయితే అట్టా గుడ్లురిమి చూత్తయ్యా? అవి నిజం చిమ్మాలే కాకపోతే బొమ్మలైతే వాటి మానాన అవి తోక ముడుసుకోని పండుకోవాలికాని అక లేసినట్టు నోరుతెరిసి కోరలు ఎల్లబెట్టి నాలికసాచి జూలు ఎనక్కేసుకోని గుర్రురుముతూ చూత్తుందా అంట. అహ సాకలి నంజాకొడుకుని, నాకు తెల్లక అడుగుతాను సెప్పండి అంట."

ప్రభువు పడుతున్న బాధను గమనించాడు సింహాసనపు వెనకాల అభినందన సూత్రధారణకని వేచివున్న వెంకడు. వాడి చిలిపి మనస్సుకు చపలం పుట్టి గాండ్రుమని గర్జించాడు.

"అమ్మ బాబోయ్ సచ్చాన్రా సాములూ." అంటూ దౌడుతీయటం లంకించుకున్నాడు ప్రభువు. సింహద్వారంవద్ద వేచివున్న అంగరక్షకదళమూ మిగిలిన మంత్రులూ ప్రభువుగారి వెంటబడి పరిగెత్తుతున్నారు పట్టుకోవటానికి. కాని లగెత్తటంలో సాటిలేని మేటికావటంవల్ల ప్రభువు అడ్డం వచ్చిన వాళ్ళ కాళ్ళ సందులోనించి సహా దూరుతూ ప్రాణాలరచేత పట్టుకొని చిక్కటంలా చూసుకుంటున్నాడు. చివరి కెలాగైతేనేం ప్రభువువార్ని పట్టుకొచ్చి సింహాసనం దగ్గరికి తీసుకొని వచ్చారు అంగరక్షకులు.

"సామీ మంత్రిగోరూ. అమాత్తెయ్యగారూ! నే చేసిన తప్పేమిటి సామీ. గాండ్రుగాండ్రుమంటూన్న చిమ్మాని కేత్తామంటారే నన్ను. సలవ బాగా చెయ్యకపోతే సెప్పకూడదా-సావతన్నకూడదా:నిండు; పాణాన్ని-ఎల్లి మొగుణ్ణి ఎందుకు సామీ నాకే చిచ్చు. చూత్తా చూత్తా చిమ్మాని కేత్తామంటారు."

"ఓ ప్రభువా. అది సింహంకాదు, బొమ్మ."

"ఇంకా అదేమాట:అది బొమ్మయితే గాండ్రిత్తుందా."

"గాండ్రించింది బొమ్మకాదురా, ఎంకడు."

"ఎంకడాసామీ, ఎంకడి సంగతి నాకు తెల్దాఅంట. ఎంకడు గాడిద లాగా ఒండ్రపెట్టగల్డుకాని చివ్వలాగా గాండ్రిత్తాడా సామీ. నన్ను రచ్చించండి. నాకు యోగమూ వద్దు, వైబోగమూ వద్దుసామీ."

"ఈ యోగం పట్టలేదే అని అంతా ఏడుస్తుంటే పట్టించుకోవటానికి నువ్వేడుస్తావేమిరా."

"సామీ, అందుకోసమని సచ్చిపొమ్మంటావా సామీ,"

ఇక వాడిచేత ఆ సింహాలకు ప్రాణంలేదని వప్పించటం బ్రహ్మదేవుని తరంకాదని తేల్చుకున్నాడు విద్యానాథ జనార్ధనులు. అందుకోసం మరోవిధంగా ప్రయత్నం చెయ్యసాగారు.

"ప్రభూ! ప్రతాపరుద్ర మహారాజు రోజూ యీ సింహాసనంమీదే కదా కూర్చునేది? ఆ సింహాలు వారినేమైనా చేశాయా?" అన్నాడు విద్యానాధుడు,

"ఓసోసి, ఆ మాట నాకాడ సెప్పకండి శాస్త్రుల్గోరూ! ఆయన గారు ఆటిని మచ్చిక సేసుకొని వుంటడు. ముందు నా నొక బేపిని పెంచినా-నేనంటె దానికి మాలిమి. నా బేపి నన్ను కరవదుగందా అని వూళ్లో ఆళ్ళని కరవకంతా వుంటుందా? కండలెల్లు కొచ్చేట్టు కరిసి వూరు కుంటుంది తెల్సా."

"తెలుసులేరా: కాని యివి బొమ్మలు పోయి కూర్చోరా రీవిగా. కూర్చోకపోతే సిపాయిలచేత కుమ్మిస్తా."

సచ్చేవాడికి రీవెందుకుసామే. కూకుంటే అవి సంపుతాయ్. కూకోక పోతే ఓరు సంపుతారు. ఏ చేతన్నా చత్తాగాని దానిచేత సావనుసామే. ఎల్లీ-నీ మొగుడు సచ్చిపోతున్నాడే ఇయ్యాల ముండమొయ్యమని నీ మొకానరాశాడే బెమ్మదేముడు-వాడి పెళ్ళాం తాడు తెగ-నీతాడు తెంచు తున్నాడే ఎల్లీ అంటూ బిగ్గరగా ఏడవటం సాగించాదు ప్రభువు.

ఇక లాభంలేదనుకొని జనార్దన మంత్రి అంగరక్షకులకు సంజ్ఞ చేశాడు. మరుక్షణంలో కళ్ళుమూసుకొని గిజ గిజ తన్నుకుంటున్న ప్రభు వును నలుగురు అంగరక్షకులు సింహాసనం మీద ఎత్తి కూర్చోపెట్టారు. కొద్ది క్షణాలు ప్రభువు నోటినుండి మాటలేదు.

"సాములూ, మంత్రులూ, అమాత్తేలూ. నేను బతికి వున్నానా? సచ్చిపొయ్యానా? కూసింత చెప్పండ సామీ మీమేలు మరచిపోను," అన్నాడు ప్రభువు.

"ప్రభువులు యింకా బ్రతికేవున్నారు. నవరత్న ఖచితమైన కిరీ టంతో స్వర్ణ సింహాసనం మీద దగాద్ధగాయి మానంగా వెలిగిపోతున్నారు ప్రభూ," అన్నాడు విద్యానాధుడు.

ఆకాశంలోకి లేచిపోయిన పంచప్రాణాలూ తిరిగివచ్చి ప్రభువు కంలో ప్రవేశించినట్లయింది. మెల్లగా కళ్ళు తెరిచాడు. సింహాలు అయినట్లుగానే కనిపించాయి. ఏమీ గాండ్రించలేదు కదలటం

లేదు. మెదలటంలేదు. ప్రభువు యిప్పుడు సింహాసనంమీద కూర్చొని వుండటంవల్ల సింహాల తెరచివున్న ఉగ్రవదనాలు బయటికి గంభీరంగా చొచ్చుకొని వచ్చిన కోరలూ ప్రభువుకు కనిపించక పోవటం చాల మేల యింది. సింహాలు మచ్చిక అయ్యాయని నమ్మకం చిక్కినా ఎందుకైనా మంచిది. మరి కొన్నాళ్ళవరకూ వాటి విషయం పట్టించుకోకుండా వాటివంక చూడకుండా వుండటమే మంచిదనుకున్నాడు ప్రభువు.

జనార్ధనామాత్యా, ప్రహసనాన్ని ప్రారంభిద్దామా" అన్నారు విద్యా నాథుడు.

"ఇది ప్రహసనమా."

"కాక ఏమిటి? అభ్యాసన ప్రహసనం లోపల ఏమి జరుగుతుందో తెలియని లోకుల కళ్ళల్లో దుమ్ముకొట్టి ప్రభువులు కొలువుతీరి వున్నారని నమ్మించే ప్రహసనం."

"నిజానికంతే అనుకోండి, కొలువుతీరటం ప్రభువులకు అభ్యాసం చేయించటంకూడా అవసరమేకదా."

"అయ్యో రాత."

"ఎలుకతోక తెచ్చి
ఎన్నాళ్ళు ఉతికినా
నలుపు నలుపే గాని,
తెలుపు రాదు."

"కానివ్వండి. రంగు మార్పిడి రాకపోతే వెల్లవేయిద్దాం. ఈ లోగా ప్రభువులు ఎలాగూ తిరిగివొస్తారు. ఒరే వెంకా అభినందన సూత్రాన్ని తీసుకున్నావురా?"

"తీసుకున్నాను స్వామీ."

జనార్ధనమంత్రి సభాకార్యక్రమ నిర్వహణకు అనుమతింనాడు. వెంటనే వందిమాగధులు కైవారం చెయ్యడం ప్రారంభించారు ఖంగున మ్రోగే కంచుకంఠాలతో.

రాజాధిరాజ రాజమార్తాండ

రాజకులచంద్ర కాకతి వంశకంఠీరవ
అరిరాజ భయంకర ఆర్త త్రాణ పరాయణ
ఆంధ్ర సామ్రాజ్యరమా హృదయేశ్వర !
శ్రీ శ్రీ శ్రీ ప్రతాపరుద్ర సార్వభౌమా
బహుపరాక్ బహుపరాక్.

వందిమాగధుల వచనాలు పూర్తి కాగానే అంతవరకు నిలచివున్న సభాసదులంతా సార్వభౌముని సింహాసనానికి వంగి తలవాల్చి వినయ విధేయతలతో నమస్కరించి తమ తమ స్థానాలలో ఆశీనులయ్యారు. సభాసదులు ఆశీనులయించే తడవుగా దౌవారికుడు ప్రవేశించి ప్రభూ - తమ దర్శనార్థం ఆటకత్తెలు నాట్యకత్తెలు వొచ్చివున్నారు. తమ సెలవైతే లోపలికి ప్రవేశపెడతాను" అన్నాడు.

"ఆ ఏందేంది! ఆటకత్తె - కత్తి ఆడుద్దా?"

"కత్తి ఆడదు ప్రభూ"

"మరయితే కత్తి పాడుద్దా"

"ఉహూ"

"మరి పాటకత్తె ఏంది అంట!"

"పాటకత్తె అంటె పాటపాడే ఆడుది ప్రభూ!"

"ఎట్టెట్టా కత్తి అంటే ఆడదా! దీని సిగతరగా అయితే నా కూడా కత్తెగందా"

"అవును ప్రభూ"

"మరి గుచ్చుకోదేం పడకటి ద సేరినప్పుడు."

"ప్రభువులు చమత్కరిస్తున్నారు. ప్రస్తుతం ఆటకత్తెలువొస్తారు! వినోదించండి."

జనార్ధనమంత్రి ఆ మాట అన్నదే తడవుగా ప్రభువు 'వవ్వావవ్వా, అంటూ ఆనందించటం మొదలుపెట్టాడు.

"ఏం ప్రభూ, ఆటకత్తెలు యింకారానేలేదు. అప్పుడే ఆనందించండని మంత్రిగారు సెలవీయగానే నాట్యసభలోని ఆనందపు లోతులు తెలిసినవారేం?" అన్నాడు విద్యానాథుడు.

"ఏమిరా! ఇదేమి ఆట అనుకున్నావా! అభ్యాసకాలమున అనవసరముగా గొడవచేసిన యోగనుబోయి గండము వొచ్చును" అన్నాడు జనార్ధనుడు.

"బుది బుది సామే. ఈ తప్పు నాది కాదు. ఆ నంజకొడుకు ఎంకిడిది. ఎనకాలనుంచి లాగిరే వచ్చా అనమంటిరిగా! ఆ యెదవని శిచ్చించండి."

"ఏరావెంకా! ప్రభువులజుట్టు తెగి వొచ్చేట్లు లాగావాయేం- అంత పెద్దగా అభినందిస్తున్నావ్ ."

"లేదుబాబూ! చేతికి దెబ్బ కోమకుడిరేను తసిమని కొట్టాను దాంతో చేతిలోని సూత్రం కొద్దిగా పనిచేసింది."

"కాస్త జాగ్రత్తగా సూత్రధారణ చేయరా! అవసరాన్నెరిగి లాగుతుండాలిరా!" అన్నాడు జనార్ధనమంత్రి.

ఇంతలోకి ఘల్లు ఘల్లుమనే అందెలరవళి వినవొచ్చింది. ఆ వెంటనే ఆ శబ్దాన్ని అనుసరించి కొలువుకూటంలో ప్రవేశించారు గంధర్వ కన్యలసై దోడుబైన నాట్యకత్తెలు.

"నాట్యకత్తెలంటే యీళ్ళే ! వోళ్లో అనుకున్నానుల్లే. బాగోతం ఎత్తారా? ఎయ్యెండి." అన్నాడు ప్రభువు తనకు సాదరంగా నాట్యభంగిమ లొప్పగా వంగినమస్కరిస్తున్న ఆటకత్తెలను చూసి. వెంటనే గాయకుల పాటను అభినయించటం ప్రారంభించారు ఆటకత్తెలు.

నమో నమో నటరాజా
నాట్య వధూ హృదయేశా
ఢమ ఢమ ఢమ ఢమ
ఢమరుక నాదం
ఘణ ఘణ ఘణ ఘణ
ఘంటారావం
ఋుక్కులు పలికేను
ప్రమథ గణం

రుషులు స్మరించిరి
ఓంకారం ||నమో||
భువన భువనములు
దద్దరిల్లగా
సలిపెడు తాండవ
కేళీనాదం
శిఖలు చెదరగా
గంగ చిందగా
పాద తాడనచె
వసుధ కదలగా
శంభుడు చేసెను
ప్రళయ తాండవం
శాంభవి సలిపెను
శంఖారావం!
నమో నమో నటరాజా
నాట్య వధూ హృదయేశా!

పరమేశ్వరుని ప్రళయ తాండవాన్ని బ్రహ్మాండంగా అభినయించారు నటువక్త్రియలు. సభాసదులంతా ఆనందంతో, ఆశ్చర్యంతో ఆ అపూర్వ నృత్యాన్ని చూసి తన్మయత్వం చెందారు. కాని ప్రభువుకు ఆ నృత్యం చూడగా ఏమీ అర్థంకాలేదు. ఎంతకాలానికి వెంకడు అభినందన సూత్రం లాగకపోవటంతో తాను వచ్చా అనవాచ్చో అనకూడదో అనే అనుమానంలో పడ్డాడు ప్రభువు. నిజానికి సింహాసనం సందులోనుంచి ఆ నృత్యాన్ని తిలకిస్తున్న వెంకడు తన్మయత్వంలో మరో ప్రపంచానికి వెళ్ళిపోయి సూత్రాన్ని లాగాలనే విషయాన్ని మరిచిపోయాడు ఎంతకాలానికి త్రాడులాగని వెంకణ్ని గురించి విపరీతమైన విసుగు జనించింది ప్రభువుకు. సభికులంతా అభినందిస్తుండిరి. తాను అభినందిదామంటే ఆ గాడిద కొడుకు త్రాడు లాగకపోయె ఏమైనా సరే, తెగించి వచ్చా అవాలనుకున్నాడు. కాని ధైర్యం చాలిందికాదు,

ఏరా ఎంకా-తాడు లాగవేంరా నంజాకొడకా! నేను నవ్వాలని తలుచుకున్నా. లాగరా" అన్నాడు ప్రభువు.

"చిత్తం బాబయ్యా!" అంటూ వెంకడు త్రాడులాగాడు. ప్రభువు "వవ్వా వవ్వా వవ్వా" అని కడుపుబ్బ అభినందించాడు. ఆ విచిత్ర ప్రహసనాన్ని మంత్రులూ మిగిలిన సభాసదులుకూడా హృదయపూర్వకంగా అభినందించారు.

"ప్రభువు సారస్వత ప్రియులు రసగ్రహణాధురీణులు. మీనాట్యాన్ని కడుపుబ్బ అభినందించారు. మీరు చాల అదృష్టవంతులు. రంగసానీ ప్రభువులమీద ఓ రసవత్తరమైన కీర్తనను ఆలాపించి మమ్మల్ని మా సభాసదులను ప్రభువులను ఆనందింపచేయటానికి నీకు అనుమతి ప్రసాదిస్తున్నాం" అన్నాడు జనార్దనమంత్రి,

జనార్ధనమంత్రి యిచ్చిన ఆజ్ఞను సాదరంగా వినయపూర్వకంగా స్వీకరించింది రంగసాని. ఆ తరువాత ప్రభువులకు నమస్కరించి నృత్యగానాల్ని మేళవించి ప్రారంభించింది.

చేవేలిన మహారాజువనీ
చేతిరి చేనికి శత్రువనీ
వలచి వొచ్చితిని వొలువవేమిరా
చలవల రాజా మహారాజా!
అశ్వనీపుత్రుల నేస్తడనీ
ఆది కూర్మావతారమని
ఉత్తరకుమార ప్రజ్ఞుడనీ
అంతఃపురమున ధీరుడనీ
రణరంగంబున భీరువనీ
వలచి వొచ్చితిని వొలువవేమిరా
చలవల రాజా మహారాజా!

పదం పూర్తి అయింది, "చూశావా విద్యానాథా! రంగసానిగడుసుదనం. దేవరవారిని నఖశిఖ పర్యంతం వర్ణించివేసింది" అన్నాడు జనాంతికంగా జనార్ధన మంత్రి.

"ఏడి జేకొల్లాంటి నిజమైన మహారాజుల్ని ఎందర్ని చూసిందో అది" అన్నాడు విద్యానాథుడు. "అయినా ఆడుది; సర్వస్వతంత్ర కదా."

ఇంతలో సభాభవన మంతటా రంగసాని నృత్యాభినయాలకు-అంత కన్నా ముఖ్యంగా ఆమె పదంలోని భావానికి అభినందన చిహ్నంగా కోలాహలం మిన్నుముట్టసాగింది. నలుగురితోపాటు తానూ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాడు మహారాజు. వెంకడికి యిది చాల అన్యాయంగా తోచింది. తనమీద ప్రత్యేకంగా నడిపిన నృత్యగానాలకుకూడా పదిమందితో పాటే అభినందిస్తున్న ప్రభువును చూసి మరి కొంచెం ఘనతగా అభినందింప చేయాలనుకున్నాడు వెంకడు. వెంటనే తన చేతిలోని అభినందన సూత్రాన్ని గట్టిగా లాగసాగాడు. సూత్రం బిగిస్తున్న కొద్దీ ప్రభువు తన అభినందన చాలదేమో అనుకొని జుట్టు నొప్పిపెడుతున్నా యింకా పెద్దగా మరింత బిగరగా అభినందించడం ప్రారంభించాడు మహారాజు. జనార్ధన మంత్రికి కొదిగా అనుమానంవేసింది. కాని నేపు అనే శబ్దం అర్థమై అభినందనను అధికం చేశాడెమో అనుకున్నాడు.

ఇంతలో ప్రభువు హఠాత్తుగా నవ్వటం ఆపేశాడు. శిక్కమొహం వేశాడు. అతని ముఖంలో బాధ ద్యోతకమవుతోంది. కాని సేరగంసేర వదనుడయ్యాడు. అసలు జరిగిన విషయమేమిటంటే సూత్రాన్ని వెంకడు గట్టిగా లాగటం. లాగినకొద్దీ వహ్వా వహ్వా అని ప్రభువు తల ఎగురవేస్తూ అభినందించడం. ఈ సవ్య ప్రహసనపు సందర్భంలో జరిగిన గొడవలో మహారాజు జుటుపాయతోసహా వూడివొచ్చింది. జుట్టు వూడిపోయింది అన్న బాధతో అరిస్తే తంతానేమో అన్న భయంతో తాడూడిపోతే అభినందిస్తే ఏమౌతుందో అన్న బెంగతో ప్రభువు ముఖభంగిమలు చిత్ర విచిత్రగతుల మారిపోసాగాయ్.

ఈ పరిస్థితి గ్రహించాడు త్రాడుతోపాటు ఊడివొచ్చిన ప్రభువువారి కేశపాశాన్ని చూసి వెంకడు. వెంటనే రెండవ కంటికి తెలియకుండా సింహాసనపు వెనుకభాగంలో ఉన్న కంతగుండా చేయిజాపి ప్రభువుగారి [illegible] కేశజాలంలోని మకోపాయము గ్రహించి సూత్రాన్ని తిరిగి బిగిం త్వగ్రహణం సమస్యగా మారిపోయింధే అని బాధపడుతున్న

ప్రభువు. తన కేశాలు మళ్ళీ సూత్రబద్ధంగా కావటం చూసి సంతసించాడు. ఇంతలో ప్రభువుగారికి వంగి వంగి సలాములుచేస్తూ నటువ బృందం నిష్క్రమించింది. తనకు నమస్కారాన్నిచేసి నిష్క్రమిస్తున్న నటువ బృందాన్ని ప్రభువు సత్కరించకపోయ్యేసరికి జనార్ధనమంత్రి వారికి సముచిత బహుకృతులనిచ్చి సత్కరించాడు. ప్రభువు తన తప్పు తాను గ్రహించాడు.

తరువాత జనార్ధనమంత్రి అనుమతితో ఒక ఇంద్రజాలికుడు ప్రవేశ పెట్టబడ్డాడు. ఆ ఇంద్రజాలికుడు ప్రవేశిస్తూనే మహారాజుకు వంగి-వంగి ప్రణామాలాచరించి, ఆ తరువాత మంత్రివర్యులు-పిమ్మట సభాసదులకు సవినయంగా ప్రణామాలర్పించాడు. ఆ ఇంద్రజాలికుని వేషం విచిత్రంగా కనిపించింది పేరిగాడికి. వాడు గుడ్లప్పగించి నోరు తెరుచుకొని వాడివంకే కన్నార్పకుండా చూస్తూ, ప్రక్కన ఉన్న జనార్ధనమంత్రిని మెల్లగా అడిగాడు: "ఈడెవడు, సామీ? కేలిగాడిలాగా ఏసం, ఏశాడూనూ?"

"వీడు ఇంద్రజాలికుడు."

"ఇందురుడి సాకలోడా? తన్ని తగిలెయ్యండి ఎదవని. ఈడ కెందుకొచ్చాడు? లేనిపోనిది నా నోట్లో దుమ్ము గొడతాడా ఏంది?"

"చాకలి కాదురా, చపటా! ఇంద్రజాలికుడు."

"అంటే? ఈడేం జేత్తాడిప్పుడు?"

"వాడు గారడీ చేస్తాడు. వాడేం చేసినా నోరు మూసుకుని చూస్తూ ఉండు!" నెమ్మదిగా కసిరాడు జనార్ధనుడు.

ఇంద్రజాలికుడు తన ప్రదర్శనం ప్రారంభించబోయేముందు, ప్రభువులకు మరోసారి ప్రణమిల్లి ఇలా అన్నాడు:

"మహాప్రభో! నా పేరు భేతాళనాథుడంటారు. మాది నేపాళదేశం. అణిమాద్యష్టసిద్ధులూ పొందాను. టక్కుటమార గజకర్ణ-గోకర్ణ విద్యలు నాకు కరతలామలకం. భూత ప్రేత పిశాచ శాకినీ - ఢాకిని, గాలి దయ్యాలు నా సేవకులు."

ఇంద్రజాలికుడు ఆ మాటలంటూండగా ప్రభువుగారు సింహాసనంలో కూర్చునే గజ-గజ వణుకుతూ, వాణ్ణి పంపివేయమన్నట్లుగా జనార్ధనమంత్రికి

సౌంజ్ఞ చేశాడు. జనార్ధనమంత్రి తనవైపు ఉరిమి చూడగానే, భయపడి 'అన్నీ నెత్తికే తెత్తుండారు. నాను బతికి బట్ట గట్టేట్టు గాని, బట్టలుతికే టట్టుగాని అవుపట్టంలా!" అని గొణుక్కుంటూ బెదురు-బెదురుగా ఒదిగి కూర్చున్నాడు. కాని, ఇంద్రజాలికుడు ఇంకా చెప్పుకుపోతూనే ఉన్నాడు,

రాతిని కోతిని చేస్తాను; కోతిని రాతిని చేస్తాను; రాతిని పీతను చేస్తాను, గుఱ్ఱాన్ని గాడిదను చేస్తాను, గాడిదను చాకలిని చేస్తాను, చాకలిని గాడిదను చేస్తాను-" చెప్పుకుపోతున్నాడు ఇంద్రజాలికుడు.

ప్రభువు జనార్దనమంత్రికేసి చూసి నెమ్మదిగా ఇలా అన్నాడు : "సూడండా, ఆ ఎదవను నా ఊసెత్తద్దన చెప్పండి, గాడిద కొడుకుని!"

జనార్ధనమంత్రి ఎంత గంభీరంగా ఉందామన్నా నవ్వాగింది కాదు. బలవంతాన నవ్వాపుకొని ఇంద్రజాలికుని వంక తిరిగి "నువ్వు చేసేది చెప్పక్కర్లేదు. నేరుగానే విద్యనే ప్రదర్శించవచ్చు" అన్నాడు

''చిత్తం," అంటూ ఇంద్రజాలికుడు తన పనికుద్యుక్తుడయ్యాడు. తన సంచిలోనించి మంత్రదండం పైకి తీశాడు. తన మంత్రదండాన్ని చేతిలోకి తీసుకొని కళ్ళు మూసుకొని పైకిచూసి ఒక సిపాయివంక తిరిగి తన మంత్రదండాన్ని ముమ్మారు వాడి చుట్టూ తిప్పి ''ఏయ్! పిల్లా! ఇలా రా। వచ్చి సభ మధ్యగా నుంచో," అన్నాడు.

''ఆ సిపాయికి కోపం వచ్చి ''ఏయ్! పిల్లా ఏందయ్యా?''అన్నాడు తక్కినవాళ్ళంతా వాడిని చూసి విరగబడి నవ్వుతున్నారు. వాడు గాభరా పడి తనను తాను చూసుకున్నాడు. వాడికి నిలువునా సిగ్గు ముంచు కొచ్చింది. చరచరా పరుగెత్తుకుంటూ బయటకు వెళ్ళబోయాడు.

అంతలో మాంత్రికుడు ''ఓయి సిపాయీ! ఎక్కడికయ్యా వెళ తున్నావ్? ఇటు రా!'' అని కేక వేశాడు. అయినా, వాడు పరుగెత్తుతూనే ఉన్నాడు. ద్వారం దగ్గరున్న సిపాయివాడిని చెయ్యిపట్టుకొని ఆపాడు.

"ఏయ్! చెయ్యి పట్టుకుంటావేం? నీకు అక్కల్లేరూ? చెల్లెళ్ళలేరూ? ఇంత పొగరా? నువ్వు నాశనంగానూ!'' అంటూ మెటికలు విరిచాడు.

ద్వారంలో ఉన్న సిపాయి తెల్లబోయి ''ఏందిరా, ఆ కూతలు-ఆడంగిలాళ్ళకుమల్లే!'' అన్నాడు.

"రా" అనుకుంటూ మళ్ళీ తనను తాను చూచుకున్నాడు. తానిప్పుడు ఆడదికాదు; మగవాడు అయిపోయాడు. గబగబా వచ్చి మళ్ళీ తన స్థానంలో నిల్చున్నాడు. ఇంద్రజాలికుడు ఒకసారి సగర్వంగా సభికులవంక చూచి తన మంత్రదండాన్ని పైకెత్తి పట్టుకొని మహారాజు వైపు రెండడుగులు వేశాడు.

"ఏయ్ మంత్రాలాయనోయ్! ఆ యవ్వారాలు నాకాడ చేయమోక తల తీయించగలను!" అన్నాడు బెదురుతూ పేరిగాడు.

మాంత్రికుడు విస్తుపోయాడు. మళ్ళీ సర్దుకొని తన సంచిలోనుంచి ఒక రాతిని తీసి నేలమీద పెట్టి, దానిమీద మంత్రదండంతో ముమ్మారు తాకాడు. ఆ రాయి చూస్తూ ఉండగానే కోతిగా మారింది. అది సభంతా కలియజూసి నెమ్మదిగా అందరిచుట్టూ తిరగసాగింది.

అది ప్రభువుకు దాదాపు దగ్గరకు రాగానే ప్రభువు నెమ్మదిగా "తిమ్మన్నా! తిమ్మన్నా!" అని పిలిచాడు.

అది వెంటనే చెంగున ప్రభువు భుజం మీదకు ఎగిరింది. అదిచూసిన మాంత్రికుడు గాభరాపడి వెంటనే మళ్ళీ మంత్రప్రయోగం చేశాడు. ప్రభువుగారి భుజంమీద దూకుతూ దూకుతూ ఉన్న కోతి మధ్యలో రాయిగా మారి వారి భుజంమీద పడింది. "అమ్మో!" అనిఒక్క గావుకేక పెట్టాడుప్రభువు

జనార్ధనమంత్రి మాంత్రికుని వైపు తీక్షణంగా చూచాడు. మాంత్రికుడు జనార్ధనమంత్రి వైపు చూచి చిరునవ్వు నవ్వి, ప్రభువుల వారి వంక తిరిగి "ప్రభువులు పెద్దమనస్సు చెయ్యాలి. తప్పు మన్నించి తలకాయండి. మహాప్రభూ!" అన్నాడు వణకుతూ.

"కోతి గదా అని ముచ్చటపడి దగ్గరకు పిలుస్తే, రాతిని సేసి ఈపు సిట్లగొట్టి, ఇంకా చమించమంటున్నావా! లాభంలేదు. నీ తల తీయించేది తీయించేదే!" కోపంగా అరిచాడు ప్రభువు.

"మహాప్రభో! తెలియక జరిగిన అపరాధం. క్షమించండి స్వామీ!" అన్నాడు క్రీగంట జనార్ధనమంత్రిని చూస్తూ.

అంతలో జనార్ధనమంత్రి పేరిగాడి వైపు చూసి "పోనీయండి ప్రభూ! అంతగా వేడుకుంటున్నాడు" అని ఇంద్రజాలికుని వంక తిరిగి "ఇకపైద ఇలాంటివి సహించం. నీ తక్కిన విద్యలు కూడా జాగ్రత్తగా ప్రదర్శించు" అన్నాడు.

"చిత్తం !" అంటూ మాంత్రికుడు ప్రభువారికి వంగి వంగి నమస్కారాలు పెడుతూ వెనక్కి నడిచాడు. అక్కడ నుంచొనే ఒక్కసారి సభాసదులందరి వంకా గంభీరంగా చూచి కళ్ళు మూసుకొని, తన మంత్రి దండాన్ని ముమ్మారు గాలిలో తిప్పాడు. అందరూ ఆశ్చర్యపడేలా ఆ శూన్యంలో నుంచి అప్పటికప్పుడే ఒక పావురాల గుంపు పుట్టుకొచ్చి సభంతా విచ్చలవిడిగా ఎగురసాగాయి. అన్ని పావురాలను ఒక్కసారి చూడగానే ప్రభువుగారికి అంతకుముందు మాంత్రికుని మీద ఉన్న కోపం అంతా పోయింది, ఒక్కసారిగా ఉత్సాహం పుట్టుకొచ్చి "భో! భో!...." సింహాసనం దిగి ఒక పావురాయిని కష్టపడి పట్టుకొన్నాడు, తెల్లటి ఆపావురాన్ని లాలసగా నిమురుతూ మురిసిపోతున్నాడు ప్రభువు. ఉన్నట్టుండి ప్రభువుగారి చేతిలోని ఆ పావురం పొడుగాటి త్రాచుపాముగా మారింది. ప్రభువు "బాబోయ్!...." అంటూ కేకవేసి, పామును దూరంగా విసిరి, ఒక్క ఉదుటున సింహాసనం పైకి ఎక్కి కూర్చొని, గజ-గజ వణకసాగాడు. అంతలో మరో పావురం రివ్వునవచ్చి దానిముందు వ్రాలి, ముంగిసగా మారి దాన్ని పట్టుకోబోయింది. వెంటనే ఆ పాము పెద్ద జాగిలంగా మారి ముంగిసను కరవబోయింది. దాని నోటిలోంచి తప్పించుకొని బయటపడి, మొదటి పావురం పెద్దపులిగా మారింది. అది చూచిన ప్రభువు నిలువెల్లా వణికిపోయి "అమ్మో! బాబో! చచ్చానురో! ..." అంటూ పంచె యెగబట్టుకొని సభలో అటూ-ఇటూ గంతులువేస్తూ తిరగసాగాడు.

జనార్ధనమంత్రి పరిస్థితి విషమించిందని గ్రహించి, ప్రభువుగారిని పట్టుకొని సింహాసనంలో కూర్చుండబెట్టి సభాసదులవంక చూచి పెద్దగా ఇలా అన్నాడు:

"సభాసదులారా! ఈ ఇంద్రజాలికుడు సామాన్య ఇంద్రజాలికునిలా లేడు. తన క్షుద్ర మంత్రశక్తిచేత అసమానశూరులు, అనన్య సాధారణ

ధైర్యవంతులు అయిన మహారాజుపై ఏదో ప్రయోగంచేసి, వారిని ఈ విధంగా అవమానింప చూచాడు. ఇందులకు వీనికి తగుశిక్ష విధిస్తాము. ఏవరక్కడ? వీనిని తీసుకొనిపోయి ఖైదు చేయండి!"

ఇద్దరు భటులు ముందుకువచ్చి మాంత్రికుని బంధించి తీసుకొని వెళ్లారు.

అప్పటికి ప్రభువుగారి మనస్సు కుదుటపడింది. జనార్ధనుడు ప్రభువును సమీపించి ...

"ప్రభూ! తమరు చాలా అలసియున్నారు. ఎవరో శత్రువులు తమపై ఏదో క్షుద్రప్రయోగం చేసారు. త్వరలోనే ఆ దుర్మార్గులను పట్టి బంధించి, ఉరికంబానికి పంపిస్తాను. తమరు నేటికి సభ చాలించి విశ్రాంతి తీసుకోవాలని ప్రార్థన" అన్నాడు వినయంగా.

సభ అంతటితో చాలింపబడింది. జనార్ధనమంత్రి - ప్రభువుని స్వయంగా దగ్గరవుండి, అంతఃపురానికి తోడ్కొనిపోయారు. కొలువుకూటం నుంచి జనార్ధనమంత్రితో సహా బయటికి వచ్చి రథాన్ని అధిరోహించి బయలుదేరిన ప్రభువును దారిపొడుగునా వేనవేలుగా ఓరుగల్లు పౌరులు దర్శనం చేసుకున్నారు.

# 17

ఢిల్లీ సుల్తాను
పట్టుకపోతాన్
మల్లీ మాటాడితే
పొత్తుకపోతాన్
ఖోటల్ పేటల్
హడూ రాలేపూ
ఖోఠీలో దాగినా
ఖైదూ చేసేస్తా
ఆయుధమేఫ్కీ

హక్కు-ర్కీ-రాదూ
హవషరం వొచ్చేస్తే
హంతా హుళక్కి-
ఢిల్లీ సుల్తాన్
పట్టుకపోతాన్
మూడేనెల్లాకి
పట్టుకపోతాన్

ఒకనాటి సంధ్యాసమయంలో మేఘ గంభీర ధ్వనితో హఠాత్తుగా వెలువడిన పాట ఢిల్లీ నగరమంతా మారుమోగింది. వజీర్లు-సరదారులు మున్నగు ఉన్నత ప్రభుత్వోద్యోగులనుండి సామాన్య ప్రజవరకూ గజ - గజలాడిపోయారు. ఢిల్లీ చరిత్రలోనే పెదవాడు కానీ, పిన్నవాడు కానీ సుల్తాన్ని బహిరంగంగా పల్లెత్తుమాట అన్నవాడూ లేడు; అని బయటపడ్డ వాడూ లేడు; బయటపడి బట్ట కట్టినవాడూ లేడు. ఢిల్లీ సుల్తాన్ పేరంటే అరి రాజులకే కాక, ఆశ్రితజనులకు కూడా భయంకరం! వారు ఏక్షణంలో ఏం చేస్తారో ఎవరికి తెలీదు. ఆ మాటకొస్తే ఆ మాట వారికి మాత్రం తెలిస్తేగా? సుల్తానుచుట్టూ రాత్రనక-పగలనక అసాధారణ శౌర్య, ధైర్య పరాక్రమ సముపేతులు కాపలా కాస్తుంటారు. ఆకాశాన్ని చుంబించే కోట గోడలు, హనుమంతుడి వాలమంత సుదృఢాలు. పోతుటీగకయినా లోనికి పోవటం దుస్సాధ్యం! అయితే ఏం? ఇంటిదొంగను పట్టటం ఈశ్వరుడి కయినా అసాధ్యం. సుల్తాను ప్రాణాలకు విశేషమైన రక్షణలేని క్షణంలేదు. ఆ అమూల్య ప్రాణానికి ప్రాణాపాయం లేని క్షణంలేదు.

గజనీ మహమ్మద్ దండయాత్రలతో, అంతవరకూ నిరాఘాటంగా హైందవ కోటగోడల మీద నాట్యంచేసిన హిందూపతాకాలు పతనం కాసాగాయి. ఆ తరవాత శహాబుద్దీన్ గోరీ ధర్మమా అని జయిచంద్రుని పుణ్యమా అని పృధ్వీరాజు పతనమయ్యాడు. అంతేకాదు; శహాబుద్దీను [illegible] దండయాత్ర-ఢిల్లీని శాశ్వతంగామహమ్మదీయ సామ్రాజ్యానికిద త్తం [illegible] అంతకుముందు మధ్యఆసియా నుండి యెన్ని దండయాత్రలు [illegible] మూలంగా [illegible] రాజులూ.

ప్రజలూ హిందూదేశ వైభవాన్ని చూసి యిక్కడే స్థిరపడిపోయారు. హూణులూ, శకులూ, కుషానులూ ఈ రకంగా వొచ్చినవారే! వీరంతా ఇక్కడ స్థిరపడిపోవడమే కాకుండా, ఇక్కడి మతాచారాలను స్వీకరించారు. ఇక్కడి ప్రజలతో భోజన ప్రతి భోజనాలే కాక, వివాహ ప్రతి వివాహాలను జరుపుకుంటున్నారు. అంతటితో ఆగక, దీన్నే తమ మాతృదేశంగా భావించారు. వారి జీవనపథం భారతీయ సంస్కృతిలో లీనమైపోయింది. అందువల్ల ఆ దండయాత్రలవల్ల రాజులకూ, సైన్యానికీ నష్టం సంభవించినా, సామాన్య మానవుడి సౌభాగ్యానికి భంగం కలిగింది కాదు. మతభేదాలున్నా మతద్వేషం లేకపోవటంవల్ల జీవితం సుఖంగా సాగిపోసాగింది. ప్రప్రథమంగా హిందూదేశంలోని ధనరాసులు మహమ్మదీయ దండయాత్రలవలనే విదేశాలకు ప్రయాణం కావటం సాగించింది. చివరికి శహాబుద్దీన్ గోరీ ధర్మమా అని ఢిల్లీలో ఆయన రాజప్రతినిధి ఒకడు వెలిశాడు. హిందూదేశాన్ని కొల్లగొట్టి అపారధనాన్ని ఒంటెలమీద ప్రయాణం చేయించి, అంతటితో చాలదన్నట్లు తన బానిసనొకణ్ని చూసి ఢిల్లీ సామ్రాజ్యాన్ని పట్టం కట్టి మరీ వెళ్ళాడు. అతడే కుతుబుద్దీన్. బానిసవంశపు మూలపురుషుడు. ఆ నాటి నుంచీ ఢిల్లీ సింహాసనం మహమ్మదీయ సంస్కృతీపీఠంగా వెలుగొందసాగింది. ఆ నాటినుండీ ప్రారంభమైంది రాజనీతికి కొత్త నిర్వచనం. కానివాడు కాల్లో కలవాల్సిందే! అతడు తండ్రి కానీ, పినతండ్రి కానీ, అన్న కానీ, తమ్ముడు కానీ; చివరికి కొడుకైనా సరే సింహాసనానికి ఎవరడ్డు వొస్తే వారల్లా సఫా! ఎంతమంది బంధుజనాన్ని ఎంత శీఘ్రంగా పరిమారిస్తే, అంత త్వరగా రాజుకావచ్చు, ఎంత ఎక్కువగా పూర్వాపర విచక్షణ లేకుండా దారుణ మారణహోమం చెయ్యగలిగితే తన రాజరికానికీ, సింహాసనానికి అంతరక్ష. ఇంటగెలిచి రచ్చ గెలవమన్న సామెతని ఆ విధంగా నిర్వచించినారు మహమ్మదీయ రాజనీతిజ్ఞులు. ముందు ఇంటిలోని వారలను మారణంచెయ్యాలి- సింహాసనం ఎక్కాలంటే! వారివల్ల దోషంఉన్నా లేకపోయినా సరే! ఆ తరువాత బయటవారిని ఇలాంటి విషమ పరిసితిలో ఈర్ష్య, అసూయ, ద్వేషం మొదల్తైనవానిని ఆధారంగా చేసుకొన్న బంధు రుధిర మథనంలో ఉద్భ

వించిన రాజరికాన్ని నమ్ముకొని సింహాసనం ఎక్కిన ప్రాణికి రక్షణ ఎక్కడినుంచి వొస్తుంది? అయినా, అంతమాత్రంచేత సింహాసనం బలహీనం మాత్రంకాలేదు. "సింహాసనాన్నిబట్టి రాజుకు విలువ; రాజునుబట్టి సింహాసనానికి కాదు" అన్న సత్యాన్ని వెల్లడించింది ఢిల్లీ సింహాసనం. ఆ సింహాసనంమీద ఎవరు కూర్చున్నా సరే సుల్తానైపోతాడు, సుల్తానైన తరువాత అతడు ఆతక్తు మీద ఉన్నంతవరకూ, ఆ సుల్తానుగా అతను చలామణి ఔతున్నంతవరకూ అతడు చండశాసనుడే! అతని మాటకు తిరుగులేదు; అతని చేతకు ఎదురులేదు. అయితే, అతని ప్రాణానికి రక్షణ లేదు.

ఢిల్లీ సింహాసనంలో మరొక విశేషం ఉంది మిగిలిన సింహాసనాలని అదిష్టించటానికి అభిజాత్యం కావాలి. కాని, ఢిల్లీ సింహాసనం అధిష్టించటానికి అలాంటి అవుసరమేమీలేదు. అదృష్టం అందరికీ ఒకటే! ఆమె నిర్హేతుక పరిపూర్ణకటాక్ష ప్రసరణకు ఉచ్చనీచాలతో పనిలేదనే నగ్నసత్యానికి దర్పణం ఢిల్లీ సింహాసనం.

ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన మొట్టమొదటి యవన చక్రవర్తి కుత్బుద్దీన్. ఇతడు కురూపి అయినా, యజమాని అయిన శహాబుద్దీన్ గోరీకి విశ్వాసపాత్రుడైన బానిస. ఇతని ఎనలేని విశ్వాసాన్ని విశ్వసించి, ఢిల్లీ నగరంలో ఈ బానిసనూ తన ప్రతినిధిగా నిలిపి, స్వదేశానికి బయలు దేరాడు గోరీ. అయితే గోరీ పొలిమేర దాటకముందే స్వతంత్రుడైనాడు కుత్బుద్దీన్. ఆ రోజుల్లోనే ప్రపంచ ప్రసిద్ధమైన కుతుబ్‌మినార్‌ను కట్టించాడు కుత్బుద్దీన్. ఇతని తరువాత ఇతని కుమారుడు ఆరామ్ రాజ్యానికొచ్చాడు. అతణ్ని చంపి సింహాసనాన్ని ఆక్రమించాడు. అతడి స్వంత బావమరిది అల్తమష్. అతని కుమారుణ్ని రుక్నుద్దీన్‌ని రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, తాను సింహాసనాన్ని ఆక్రమించింది అతని చెల్లెలు రజియా. ఈమెనే సుల్తాన్ రజియా అంటారు. ఢిల్లీ తక్తు నెక్కిన ఏకైక మహిళ. పరదాను పోనాడి వీరపురుషాలంకారముతో రాజ సభకు వొచ్చి సర్వవ్యవహారాలనూ చూస్తుండేది. వ్యవహార దక్షతలోనూ, కర్తృత్వ శక్తిలోను పాటిలేని మేటిగా పేరుపొందింది. అయితే,

ఈ బానిసవంశపు రాణి తన దగ్గిర బానిసగాఉన్న ఒక అబిసీనియా బానిసను అధికంగా ప్రేమించి, కొన్ని విశేషాధికారాలు ఇవ్వటం మిగిలిన సరదార్లకు సహింపరాని విషయమైంది. ఫలితం ఆమెనూ, ఆమె బానిసనూ, శాస్త్రప్రకారం ఆమెచే వివాహమాడిన భర్తనూ ఆమె స్వంత తమ్ముడు బహరా మిగిలిన సరదారుల ఆసరాతో హత్యచేశాడు. సింహాసనానికొచ్చాడు. ఈ వంశంలో కడపటివాడైన నాసిరుద్దీన్ మహమ్మద్‌కి సంతానం లేకపోవటంతో డిల్లీ సింహాసనాన్ని ఉద్దండియంగా ఆక్రమించాడు అతడి మంత్రి ఘియాసుద్దీన్ బల్బన్. ఇతడుకూడా చిన్నప్పటినుండీ బానిసగానే బ్రతికాడు చివరికి మంత్రి అయ్యాడు. ఆ తరువాత సుల్తాన్ అయ్యాడు ఇతని మనుమడైన కైకూబాద్‌ని దారిదోపిడులుచేయు ఖిల్జీవంశజుడైన ఫీరోజ్ స్వాహాచేసి చక్రవర్తి అయ్యాడు. ఆ తరువాత జలాలుద్దీన్ అని పేరుమార్చుకుని ఢిల్లీ సింహాసనం ఎక్కాడు. ఇతని అన్న ఇతణ్ని చంపి- కుమారుడు అల్లాఉద్దీన్ ఖిల్జీ రాజ్యానికొచ్చాడు. ఇతడే మహమ్మదీయదండును మాలిక్‌కాఫర్ నాయకత్వాన మొదటిసారిగా ఓరుగల్లు మీదికి పంపాడు. అయితే, మాలిక్ కాఫర్ ఆంధ్ర పరాక్రమ ధాటికి తాళలేక, సంధి చేసుకొని తిరిగి వొచ్చాడు. అల్లాఉద్దీన్ మరణానంతరం అతని జ్యేష్ఠ పుత్రుడి కన్నులు పెరకి ఖైదుచేసి, అతని కనిష్ఠ పుత్రుణ్ని అయిదేళ్ళ బాలుణ్నితక్తు నెక్కించి, ఆట ఆడటం మొదలు పెట్టాడు మాలిక్‌కాఫర్. అయితే, అతని సరదారులే హత్య చేశారు అల్లాఉద్దీన్ మరొకొడుకు ముబారక్ రాజ్యానికొచ్చాడు.

ఇంతలో ఖుస్రూ అనే ముసుగు హిందువు బయలుదేరాడు అసలు ప్రస్తుతం రాజపుత్రుడు. అయితే అల్లాఉద్దీన్ బలవంతంగా మతభ్రష్టులను చేసినవారిలో ఈ రసపుత్రుడొకడు.

పరాభవనాల దందహ్యమాన హృదయుడై జాతిభ్రష్టతకు బాధ పడుతూ అదనుకోసం వేచి ఉన్న ఈ రసపుత్రుడు- ఖుస్రూ అని పేరు మార్చుకున్నాడు. ఖుస్రూ అనతికాలంలోనే మూర్ఖుడైన ముబారక్ ప్రాపకాన్ని సంపాయించాడు. ఒకసారి స్వయంగా యవనసైన్యానికి నాయకత్వం వహించి, మలబారు పైకి దండయాత్రకుపోయి అశేష ధనాన్ని

కొల్లగొట్టి తెచ్చి, సుల్తాన్ ముబారక్ పాదపూజ చేశాడు. దాంతో ఖుస్రూ ముబారక్‌కి మరింత సన్నిహితుడయ్యాడు; ముద్దుల చెలికాడయ్యాడు. క్రమ-క్రమంగా రాజ్యాంగం మొత్తాన్ని అరచేత చిక్కించుకున్నాడు ఖుస్రూ. అంతే కాకుండా సరదారుల్లో అసహనాన్ని రెచ్చగొట్టటం కోసమనీ, సామ్రాజ్యంలో అశాంతి వాతావరణం కల్పించటం కోసమనీ సుల్తాన్ వారిచే కావాలని చెడ్డపనులు చేయించేవాడు. తాను మాత్రం బహుమంచివాడుగా నటించేవాడు. దాంతో దేశంలోనూ, సైన్యంలోనూ, సభలోనూ, అతనికి కావలసిన వాతావరణం ఏర్పడినది.

ఒక మంచిరోజు చూసి, వారం-వర్జ్యం చూసి ముబారక్ జన్మకి ముక్తి ప్రసాదించి, హాయిగా ఢిల్లీ సింహాసనాన్ని అధిరోహించి,నసీరుద్దీన్ సుల్తాన్ బిరుదాంకితుడయ్యాడు ఖుస్రూ. అది ఏమని అడిగిన నాధుడులేడు-అయితే, అతడొక చిన్న పొరపాటు చేశాడు. సింహాసనాన్ని అధిష్టించి నెలైనా తిరగకముందే, తన స్వస్వరూపాన్ని బయటపెట్టాడు. ఖురాన్ ప్రతులను బహిరంగంగా సభకు తెప్పించి, సింహాసనం మీద పెట్టించి, దాని మీద తాను కూర్చునేవాడు. ఎక్కడెక్కడమహమ్మదీయులమసీదులున్నవో, అక్కడక్కడల్లా హిందూదేవతల విగ్రహాలను ప్రతిష్టింపచేయసాగారు, అతని అనుచరులు. మౌలీలూ, కాజీలు కుయ్యో మొర్రో అంటూ సుల్తాన్ వారికి మనవిచేయటానికని కోటకెళ్తే దర్శనం ఇచ్చేవాడేకాదు. ఇచ్చినా వారిగోడవంతా విని "అలాగా! భూమి గుండ్రంగా ఉందన్నాడు వరాహమిహిరుడు!" అనేవాడు.

ఇతడు మరికొంతకాలం తన గుట్టు బయటకు రాకుండా తాను సంపూర్ణంగా స్థిరపడేవరకూ వేచి ఉన్నట్లయితే, హిందువులు పోయిన ఢిల్లీ కోటను మళ్ళీ శాశ్వతంగా ఆక్రమించుకొని ఉండేవారే! కాని విధి పరిహసించింది: గుట్టురట్టయింది. తురక వజీర్లు అందరూ గ్యాసుద్దీన్‌ని తుగ్లక్ అనే లాహోర్ ప్రాంతపు సామాన్య రైతు నాయకత్వాన కార్యక్రమాన్ని నిర్ణయించుకొని, హఠాత్తుగా నసీరుద్దీన్‌ని హత్యచేశారు.

ఫలితం గ్యాసుద్దీన్ తుగ్లక్ సుల్తానయ్యాడు. ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించాడు. ప్రస్తుత కథకాలంలో ఢిల్లీని పరిపాలిస్తున్నది ఈ ప్రభువే!

మహమ్మదీయ యుగంలో ఢిల్లీసింహాసన చరిత్ర టూకీగా ఇది-ఈ చరిత్రను జాగ్రత్తగాపరిశీలిస్తే వ్యక్తి ఎవరైనా సింహాసనానికిఉన్న విలువ, సుల్తాన్ పేరులో వున్న ఔన్నత్యం బోధపడుతుంది. అలాంటి సర్వశక్తి వంతుడైన సుల్తాన్‌ను పట్టి బంధిస్తాననే శబ్దమే ఢిల్లీ నగర వాసులకి కర్ణ కఠోరమై, భయంకరమై వినిపించింది. ఆ మాట వినటానికి భయం వేసి, ఇళ్ళలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నవారు లేకపోలేదు. "అల్లా-అల్లా" అంటూ "హర-హర" అంటూ చెవులు మూసుకున్నవాళ్లు లేకపోలేదు. ఆ మాటలన్న అమాయక క్షుద్రప్రాణి ప్రాణాలు పంచభూతాలలో కలవ టానికిక అట్టేకాలం లేదు కదా అని నిట్టూర్పు విడిచినవారు లేకపోలేదు. తాడి తన్నే వాడకి తల తన్నేవాడు రాకపోడని అనుకున్నవారు లేకపోలేదు. కాని, ఎవరికి వాడు ఆ మహా సాహసుని చూడాలని ఆత్రంతో ఉన్నవారే ! చూస్తే ఏం కొంప మునుగుతుందో అనే భయంతో బాధపడుతున్నవారే !

తమ తల్లితండ్రులు బంధించిన కవాటాలను, గవాక్షాలను చిన్న - చిన్నగా సన్న-సన్నగా తెరువజొచ్చారు బాలకులు. ఇంతలో ఒక మూల ఉన్న ఇంట్లోనుంచి ఒక కుర్రవాడు తలుపు సందులోనుంచి నడివీదిలోని వ్యక్తిని పరిశీలించి "ఒరే! బూచాడురా!" అని పెద్దగా అరిచాడు. చుట్టు ప్రక్కలనున్న ఇళ్ళలోని పిల్లలంతా "బూచాడు-బూచాడు" అని అరవటం మొదలుపెట్టారు.

"ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్."

మరోసారి ఆ కంఠం నగరపు నడివీధిలో మారు మ్రోగింది. అప్పుడే తెరచుకుంటూ తెరచుకుంటూ వున్న చుట్టుప్రక్కల ఇళ్ళ తలుపు లన్నీ దఢాలుమని మూసుకున్నాయి.

"మూడే నెలలాకి పట్టుకపోతాన్."

ఆ మాటలంటూ ఢిల్లీ నగరపు వీధుల్లో విచ్చలవిడిగా విహరిస్తున్న వ్యక్తి అజానుబాహుడు. తైలసంస్కార రహితమైన జుట్టు, బాగాపెరిగిన గడ్డం. మానరక్షణకు ఓ పాత జనపనార గోతం, వొళ్ళంతా విభూతి: కాదు బూడిద, మెడలో కపాలం, చేతిలో మూరెడు బొమికి, భయంకర

మైన చూపరులను హడలగొట్టే చూపు, ముసలితనాన్ని వెనక్కినెట్టే గంభీరమైన కంఠం. పాపం! కాలంవాడు బాగా బ్రతికి బట్టన ఆసామీ కావచ్చు. ప్రధమవీక్షణంలో అతణ్ణి చూస్తే చూపరులకు భయం కలగటం సహజమే కాని, కాని అతన్ని ముఖాన్ని పరిశీలించినకొద్దీ భయం అదృశ్యమై జాలి కలుగుతుంది హృదయమనేది ఉన్నవాడికి.

మళ్ళీ వీధి తలుపులు క్రమక్రమంగా తెరచుకున్నాయ్. పిల్లలంతా మరొక్కసారి "బూచాడు, బూచాడు" అంటూ గోలచేశారు.

బూచివాణ్ణి కాదు
బుట్టెత్తుక రాలేదు
నన్ను బూచాడన్నవాడు బూచి
వాడి యబ్బ బూచి
వాడి నాయనమ్మ మెళ్ళో
తాళి కట్టినవాడు బూచి
ఈ రాజ్యాన్నేలే రాజు బూచి
వాడి జెజే ఓ పెద్ద బూచి
నేను కాదు బూచాణ్ణి
నేను కూడ మానవుణ్ణి
మానవులం మానవులం
మనమంతా ఒకటి
నాతో ఆడుకోరూ?
నాతో పాడరారూ?
రారేం రారేం?
నేనందరికి కానివాణ్ణా?
నావాళ్ళంతా చచ్చారా?
ఔనౌను - చచ్చారు
ధ్వమ్మీన ప్రాణాలర్పించారు
నేను కాకిని-నీటికాకిని
కాదు కాదు-ఏకాకిని.

భోరున ఏడవటం మొదలుపెట్టాడా వ్యక్తి.

పిల్లల కతడంటే భయం తీరింది. భయం తీరటమేకాకుండా అతని మీద జాలి పెరిగింది. చూస్తూ-చూస్తూ ఉండగానే అతడి చుట్టూ పిల్లలు చేరారు. పిల్లలకే భయం లేకపోతే, ఇక పెద్దలకా-వారు కూడా ఆ విచిత్ర వ్యక్తి చుట్టూ చేరారు. అతనివంక ఆశ్చర్యంగా చూడసాగారు.

"వచ్చారా పిల్లల్లారా? వస్తారని నాకు తెలుసు. నానుండి నాపిల్లల్ని వేరు చెయ్యలేరెవ్వరు. ఎవరైనా తెగించి ఆ పనిచేస్తే?...."

"ఏం చేస్తావ్?" అన్నాడు గుంపులోనుండి వొకడు.

"ఏం చేస్తానా? ఏం చేస్తానా? నువ్వు చెప్పు ఏం చేస్తానో? అట్టా చూస్తావేం? నువ్వేం చెస్తావులే, బడుద్దాయ్? ఎవరైనా వేరుచేస్తే వాళ్ళను కుక్కలాగా కరిచేస్తాన్! రక్తం త్రాగేస్తాన్! కండలు కొరికేస్తాన్! ప్రాణం పీల్చేస్తాన్!...."

"ఆఁ! ఆః! అన్నీ చేశావులే!" అన్నాడు గుంపులో నుండి మరొకడు.

ఆ-అన్నీ చేసేస్తాన్
చేసి మీకు చూపిస్తాన్
ఒళ్ళ నేళది కాకపోతే
పిల చచ్చిన కోతిని బోలి
గోలు గోలుమని ఏడుస్తాన్
గోలు గోలుమని ఏడుస్తాన్!

—అంటూ బావురుమని నిజంగానే ఏడవసాగాడు ఆ వ్యక్తి. అతని ఏడుపులో ఎంత దైన్యం ఉన్నా, చూపరులకు పరిహాసంగానే ఉంది. పిల్లలందరూ చిన్న-చిన్నగా నవ్వటం ప్రారంభించి, చివరకు పకాలుమన్నారు. దీనంగా తల ఎత్తాడు ఆ వ్యక్తి. అంతకన్నా దీనంగా అన్నాడీ మాటలు:

"నేనేడుస్తుంటే-మీకు నవ్వొస్తోందా?"
నా దొక్కలు మాడితే-మీ దొక్కలు నిండుతయ్యా?
నవ్వండి నవ్వండి, ఈ లోకపు తీరే ఇంత

తమవరకొస్తే కాని - తప్పొప్పులు తెలియలేరు
నవ్వండి నవ్వండి - యింకా యింకా పెద్దగా నవ్వండి
ప్రాణాలన్నీ పొయ్యేదాకా - ఫక్కు ఫక్కుమని నవ్వండి
నవ్విన నాపచేను పండే రోజు రాకపోదు
ఢిల్లీ సుల్తానయ్యాను - ఖైదు చేయలేకపోను
ఏమంటారు సాములూ? ఏమంటారు పిల్లలూ ?
ఏమన్నా అంటే నేనూరుకునేదే లేదు
నాకు కోపమొస్తె - బావురుమని ఏడుస్తా!
బావురుమని ఏడుస్తా! ఏడుస్తా! ఏడుస్తా!
హా....బే....కీ!....బే! ...''

ఆ విచిత్ర వ్యక్తిని చూసి పిల్లలు మరింతగా నవ్వసాగారు. ఒకరి ఖేదం మరొకరికి మోదం! పిల్లికి చెలగాటం, ఎలుకకి ప్రాణసంకటం ! సుల్తాన్‌గారికి పలావ్ మీద మోజు బలిస్తే, ప్రాణాలర్పించేది కోడిపిల్ల ! బెక-బెకలాడే కప్ప ప్రాణాలకోసం కేరుమంటుంటే, రాళ్లు రువ్వి ఆనందించే మనసు పిల్లవాళ్ళది-అందుకే వారలా నవ్వసాగారు గోల - గోలగా.

నవ్వుతారేంతా
నాపవెధవల్లారా
నేనిట్లా ఏడుస్తుంటే
ఒక్క వెధవా ఓదార్చడేం
పాపం అమాయకులు
నేనిలా ఏడిస్తేఏమౌతుందోతెలుసా
నా కన్నీటి బొట్లు
ధారలై వాగులై ఏరులై
యమునా నదిలో కలిసిపోతయ్
అయితే అంతటితో ఆగబోదు
ఆరంభం ఔను ప్రళయం

యమునకు వరదలు వొస్తయ్
మీ ప్రాణాలన్నీ పోతయ్

"ఎవరోరా - పాపం పిచ్చివాడు!" అంటూ సానుభూతి వెల్లడించాడు; అంతవరకూ అతని గోడంతా వింటున్న ఓ సర్దార్ సాహెబ్.

అతని మాటల్లో ఆ సాయబ్బు కంతకన్నా మరేమీ గోచరించింది కాదు. మతిభ్రమణ చెంది మనసుకొచ్చినట్లు ప్రేలుతున్నాడనుకొన్నాడు ఆ సర్దార్. అతని నోటినుండి ఆ మాట వెలువడిందే తడవుగా, ప్రక్కనఉన్న పిల్లకాయలంతా "దివానా! దివానా! దివానా!" అని పెద్దగా అరవటం ప్రారంభించారు,

చూస్తూండగానే ఆ క్షణాన్నే - ఆ అపూర్వ వ్యక్తిని దివానాగా ముద్రించివేసింది లోకం. అప్పుడే ఎవడో ఒక దివానా తెలంగీ దేశం నుండి వొచ్చాడనీ "ఢిల్లిసుల్తాన్ పట్టుకపోతాన్" అని అంస్తూ నగరవీథుల్లో తిరుగుతున్నాడనీ పట్టణమంతా ప్రాకిపోయింది. ఈ అపూర్వ దివానాను చూడటానికని నగరంలోని ప్రజలంతా కొల్లలుగా రాసాగారు. వచ్చిన వారంతా అతనిచుట్టూ వలయాకారంగాచేరి "దివానా అడుగో దివానా ఇడుగో దివానా" అంటూ అరవటం ప్రారంభించారు.

"హుం! దివానా? కోన్ దివానా?" అన్నాడు పిచ్చివాడు సౌలభ్యం కోసం మనంకూడా పిచ్చివాడనే వ్యవహరిద్దాం.

"తూ-తూ-తూ-తూ" అనే శబ్దం నాలుగుప్రక్కలనుంచి గుంపులో నుంచి కొల్లలుగా వినిపించసాగింది. పిచ్చివాడొక దీర్ఘనిశ్వాసాన్ని విడిచాడు.

"నన్ను—

పిచ్చివాడని పరిహసిస్తుందీ
ఈ పాడులోకం పిరికివాళ్ళకు ప్రభుతనిస్తుందీ
పనికిమాలిన వెధవలల్లా
ప్రభువులము అని ముందుకొస్తే
గ్రుడ్డిలోకం హారతిచ్చి
గడ్డితింటూ మసలుతుందీ
పిచ్చివాడని పరిహసిస్తుందీ

ఈ పాడులోకం పిరికివాళ్ళకు ప్రభుతనిస్తుంటే
మెదడు మెదడులో
ఉన్నవాడలా
ఈ లోకమంచున
ఊడిగంబున
గడపవలసిందే
మెదడు క్రిందికి
జారుచూ-మోకాలి
యందున నిలిచిపోతే
మంత్రులై సామంతులై
సరదారులై ధర నేలుతారు
పిచ్చివాడని పరిహాసిస్తుందీ .

"ఒరేయ్, కాశీ! విన్నావురా-ఆయన పాటల్లో వేదాంతముందిరా!" అన్నాడో ఇరవయి సంవత్సరాల యువకుడు.

"అవునురా, రామేశం! మనిషి పిచ్చివాడైనా వాక్శుద్ధి ఉంది. ఆయన మాటలలో వేదాంతమే కాదురా-వాస్తవం కూడా ఉంది. ఆరు సంవత్సరాల నుంచీ శీర్షాసనం వేసి సాధన చేస్తున్న మా గురువుగారికే అబ్బనివేదాంతం ఈ వెఱ్ఱిబాగుల వెంగళప్పకెలా అబ్బిందిరా?"

"అదేరా ఆలోచిస్తున్నాను. మనిషి పిచ్చివాడిలా ఉన్నా, మహా వేదాంతిలే!" అన్నాడు రామేశం.

"ఓరి నా పిచ్చికొయ్యా! ఎన్నాళ్ళకు కనిపెట్టావురా నా తండ్రీ అసలు విషయం? నిజంగా నేను వేదాంతిని. నేను వేదాంతినే కాకపోతే, నాకు తెలిసిన యోగాలకి నేనెక్కడ ఉండేవాడ్నో?"

"అయితే, సామీ! మీకు ఏ ఏ యోగాలు తెలుసు, రాజయోగం, మంత్రియోగం, స్వర్ణయోగం, చాపుయోగం, వాహనయోగం ."

"ఒరేయ్ స్వర్ణయోగం కూడా వొచ్చురోయ్!" అన్నాడు కాశీ రామేశ్వరం చెవిలో,

"అయితే శిష్యులుగా చేరదామా!" అన్నాడు రామేశ్వరం.
"చేరదామా ఏమిటి? నేనెప్పుడో చేరేస్తే!"
"ఒరేయ్! నీకన్నా నేనే యెప్పుడో చేరాను"
"అయితే, నేను స్వర్ణయోగం నేర్చుకుంటా"
"నేను రాజయోగం నేర్చుకుంటా"
"ముందు డబ్బుంటే రాజేమిటి? చక్రవర్తి కావొచ్చు".
"రాజయితే డబ్బు దానంతట అదే నడిచివొస్తుంది"
"రాజయితే శత్రువుల భయం జాస్తిరా"
"డబ్బుంటే దొంగలభయం"

"మడిబట్ట కట్టామా ముట్టుకోవడానికి భయపడతాడు దొంగ ముట్టుకున్నాడా-గాయిత్రి ఊరుకుంటుందిరా."

"అబ్బాయిలూ!"

ఇద్దరూ వక్కసారి ఉలిక్కిపడ్డారు

"మీ ఇద్దరికి ఎందుకీ తగాదా! నా సలహా వినండి. మీ యిద్దరికీ జములుగా వాహనయోగం నేర్పుతా! నేరుగా వల్లకాటిలో దిగొచ్చు"

"అదేమిటి గురూజీ? అలాగంటారు?"
"అదేమిటి గుగ్గురూజి?"
"క్షమించండి. గుర్గురోరోజీ!"
"మా తప్పు కాయండి"
"మమ్మ మన్నించండి"
"మేము మీ శిష్యులం"
"మేము మీ అనుంగు శిష్యులం"

"వవాహ్వా! భలేభలే! వెధవముండకు దొరికినట్లు దొరికారు, అయితే శిష్యులూ! ఈ యోగాలు పట్టాలంటే వేదాంతం నేర్చుకోవాలిరా, వేదాంతులకు కాని ఇవి అబ్బవు. వేదాంతుల కబ్బినా ప్రయోజనం లేదు.

"ఆ ప్రయోజనం విషయం నాకు వదలండి స్వామి!"
"ముందు ఆ వేదాంతమే నేర్పండి స్వామీ?"

"అచ్చా! అయితే నేర్చుకోండి. మరి హిందూ వేదాంతానికి పథ్యం చెయ్యాలే!"

"ఓ! చేస్తాం. చేసేస్తాం. ఏం పథ్యం స్వామీ?"

"రోజుకు తవ్వెడు వేరుశనగ పొట్టు మాత్రమే తింటూ యమునా నదిలో మొలలోతు నీళ్ళలో తల క్రిందకుపెట్టి, కాళ్ళు పైకెత్తి రోజుకో జాము; చొప్పున వారంరోజులు తపస్సు చెయ్యాలి. అంతేకాదు: వేదాంతం నేర్చుకోవాలంటే, జ్ఞానదంతానికి మిగిలిన దంతాలపోటీ ఉండకూడదు. అందుకని ఆ వక్కదంతాన్ని మిగిల్చి, మిగిలిన దంతలూడేలాగా లాగి చాచి; దవడపళ్ళు రాలేటట్టు వక్క వకపే చెపేటం ..." అంటూ చెయ్యి సర్రన పైకెత్తాడు పిచ్చివాడు.

కాశీ-రామేశం హడలిపొయ్యారు. "అయ్యబాబోయ్?" అని పెద్ద పెట్టున అరిచారు.

"ఏం ? దెబ్బ తగులుతుందని భయపడుతున్నారా, నాయనలారా? పోనీలే! సన్నితంగానే ఈ కంకరరాయి తీసుకొని ప్రహరిస్తాను సరేనా, ఏంబాబా, సరేనా? సరేననరేంరా. చచ్చుపీనుగులారా?"

"అమ్మనాయనోయ్! మా నాయనమ్మ ఊరుకోదు"

"అసలు చచ్చిపోతాం ఆ విధంగా చేస్తే."

"అందుకే మీకు కాస్త తురక వేదాంతం నేర్పుతాను,"

"అలాగే గురూజీ! అలాగే! బంగారం చెయ్యటం వొస్తే, నా పెళ్ళానికి పుట్టే పిల్లడికి మీ పేరే పెడతా"

"అయితే చెప్పుకోండి ." అంటూ పిచ్చివాడు వకసారి చుట్టు ప్రక్కల చూశారు. జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. వారిలో వజీర్లు, సర్దార్లు; సైనికులు కూడా అక్కడక్కడ ప్రజల మధ్యలో నిలబడి వినోదం చూస్తూ ఉన్నారు.

"గొల్లా కాసేవాడ్కి గోవిందుడంటార్"

"చెప్పరేంరా, వెట్టికుంకలారా? చెప్పకపోయారో- మీ శిష్యత్వాన్ని

రద్దు చేసేస్తా. బంగారం లేదు, మీ బండారం లేదు."

"అయ్యో గురూ! అంత పని మాత్రం చెయ్యకండి. మీరు పాడమన్నదల్లా పాడతాం——" అంటూ కాశీ-రామేశం యిద్దరూ వంతపాట పాడసాగారు.

ఘుదా కాసేవాడ్కి-ఘోవిందుడంటార్
పంఢీమూతీవాణ్ణి-పరమాత్మడంటార్
రాయినీ సూపించి దేమూడూ అంటార్
సెట్టూనూ సూపించి-దేవతా అంటార్
గాడిద మూతోణ్ణి-గాయకుడంటార్
గాడిద జంటాను-ఘనవైద్యులంటార్
కాట్లా కుక్కన్ తెచ్చి-భైరవుడంటార్
యాన్గ తలకాయ తెచ్చి-ఇగ్నేషుడంటార్
హోడాదాన్ని సూసి-హోదిశక్తంటార్
హోవు పేడా తీసి-హంగట్లో ఏసార్

'మరో పాట.

ఆ-రాముడే మీ దేవుడైతే
కోతి సాయం ఎందుకూ?

"పాడరేంరా, బడుద్దాయిలూ. పాడకపోతే డొక్కచీల్చి డోలు కట్టిస్తా"

"అ-రాముడే మీ——ఊఁ-పాడండి——"

"మీ పీరుదగ్గర సత్తెముంటే
పృష్ఠమున పుల్లెందుకూ?"

ఎదురు పాడాడు కాశీ. పిచ్చివాడికి కోపం వచ్చింది.

నా పాటకు ఎదురుపాట పాడవతావటరా? నా మాటకు ఎదురుమాట చెప్తావ్రా? నేను తురక వేదాంతం బోధిస్తుంటే ఎదురు వేదాంతం చెప్తావా? చూసుకో నిన్నేం చేస్తానో? కోతినిచేసి ఆడిస్తాను. కొంగనుచేసి

ఎగిరిస్తాన్. నాకు తిక్క రేగనే రేగదు. తిక్కరేగిందో త్రిమూర్తులు కూడా నన్నాపలేరు. ఢాం, ఢూం! ఫటాఫట్!" అంటూ పిచ్చివాడు ఒక్క దూకు దూకాడు కాశీ మీదికి.

"ఒరే, కాశీ! నిన్ను కాశికా విశ్వేశ్వరుడి దగ్గరకు పంపిస్తాన్!" అంటూ దభీమని ఓ గ్రుద్దు గ్రుద్దాడు.

"అమ్మ బాబోయ్!" అంటూ అరిచాడు కాశీ.

విజయగర్వంతో పిచ్చివాడి దృష్టి-గుంపులోనుంచి అప్పుడేవెళ్తున్న ఖుస్రూఖాన్ మీద పడింది.

లేవలేక-లేవలేక "అమ్మా, అయ్యా" అంటున్న కాశీగాడి బాధ చూసి రామేశం పక-పక నవ్వాడు.

"ఒరే, రామేశం! నవ్వుతున్నావా? సరేలే-నీకో రంకు ముగు అంటగడతా. ఏదీ నా వంక చూడు!" అంటూ పిచ్చివాడు పక్కకు తప్పు కున్నాడు.

రామేశం అటు చూశాడు.

"చూశావా?"

"చూశాను."

"ఏం కనిపించింది? సరిగ్గా చూశావా?"

"సరిగ్గా చూశాను."

"ఒంటి రాయి ఊరికొచ్చి
బండరాతి దెబ్బతిన్న
బాహుబలుని రూపు నీవు ఎరిగున్నావా,
వాడు యాడికెళ్తాడో ఎరిగున్నావా!"

"లేదే!"

"లేదే అంటే చంపేస్తా! నరికేస్తా! పిసికేస్తా! కరిచేస్తా! లేదంటా వురా? ఔననేదాకా ఎదటికి రాకు. వచ్చావో నాహన యోగం. ఫో - ఫో!"

"అలాగే, స్వామీ! మీ ప్రశ్నకు సమాధానం మా నాయనమ్మనడిగి తెలుసుకొనిగాని మరీ రాను. ఆశీర్వదించండి, గురునాధా!" అన్నాడు. రామేశం వంగి-వంగి నమస్కారిస్తూ.

"అలా అడుగు! ఆశీర్వదిస్తాను."

"శ్రీరస్తు-శుభమస్తు
ఆయుక్షీణమస్తు
దంత భగ్నమస్తు
కూష్మాండ ప్రమాణేన
ఏకైక పాదాభి వృద్ధిరస్తు."

"నీ ఈ విజ్ఞానయాత్రా సందర్భమున మీ గురువుగారు ఆశీర్వదించి ఇచ్చినది-ఏడుజతల వెదురుబద్దలు, రెండు బొంగులు, ఒక చాప, ఒక దవళవస్త్రం. ఫో! ఇంక కాట్లోకి వెళ్ళినా జయం నీదే! ఫో - ఫో - ఫో!"

క్రొత్తగా చేరిన శిష్యులిద్దరూ వెళ్ళిపోయారు. జనం కూడా పలచబడ్డారు. పిచ్చివాడు పాడుకుంటూ బయలుదేరాడు.

పసికళ్లు కమ్మితే లోకమంతా పచ్చ
పిచ్చివాడ్ని చూస్తే పిచ్చివాళ్ళౌతార్
తలబోడి మొలబోడి బోడి కాందేది
గడ్డం మొల్వకపోతే తనువెల్లా బోడి
రసపిచ్చి కల్గితే రాళ్ళనులిమేస్తాన్
ప్రేమ ఉన్మాదిస్తె ఆలిని చంపేస్తాన్
సాకలి పేరణ్ని పట్టుకొచ్చార్
సాకలి ఎల్లి సచ్చిపోతోంది
ఎల్లి కాదది మల్లి-మల్లి కాదు జాబిల్లి
దాని ఉక్రూకొత్తై దగ్గమౌను ఢిల్లీ!

# 18

ప్రతాపరుద్ర మహారాజును బందీగా ఢిల్లీ తీసుకొని వచ్చిన షహజాదా అలాఫ్‌ఖాన్‌ను చూసి విపరీతంగా మురిసిపోయాడు సుల్తాన్ ఘ్యాజుద్దీన్ తుగ్లక్. తన కొడుకు వీరాదివీరుడని సంతోషించాడు. దానికి తగినట్లు షహజాదా కూడా తాను చక్రవర్తిని వేటలో ఒంటరిగాడుగా ఉన్నప్పుడు చూసి పట్టుకొన్న వాస్తవాన్ని కప్పిపెట్టి, తాను తన అయిదు వందలమంది సహచరులతో, రెండువేల అశ్వక దళంతో దండు విడిసి ఉన్న ప్రతాపరుద్ర చక్రవర్తితో హోరా హోరీగా రెండు యామముల కాలం యుద్ధంచేసి, పరివారాన్ని పరిమార్చి, అతణ్ణి బందీగా ఢిల్లీకి తీసుకొని వచ్చానని బొంకాడు; ఈ బొంకును సుల్తాన్‌వారితో సహా ఢిల్లీ మొత్తం విశ్వసించి, షహజాదాకి కర్పూర నీరాజనాలతో సత్కారం జరిపింది. ఎవరి నోట విన్నా షహజాదా ప్రశంసే. ఈ వార్త ఈ విధంగా ప్రచారం కావటం తమకు కూడా ఘనతే కావటంవల్ల, షాజాదా అనుచరులెవ్వరూ వాస్తవాన్ని బయటపెట్టారు కాదు. సోదరుని కీర్తికి కళంకం ఆపాదించటం ఇష్టంలేక, షహజాదీకూడా ఈ పాటకు వంత పాడింది. చూస్తూ - చూస్తూ ఉండగానే షహజాదా కీర్తి హిమాలయయోత్తుంగ శిఖరాల నందుకుంది. అతడి పలుకుబడి ద్విగుణీకృతమైంది. వజీర్ల లోనూ, సరదారులలోనూ అతన్ని కీర్తించేవారు అధికం కాసాగారు; ఇంత దూరం వచ్చిన తరువాత షహజాదా కోరికలు వెర్రితలలు వేయటంలో ఆశ్చర్యంలేదు.

ఈనాడు ఢిల్లీ సామ్రాజ్యం యావత్తూ తన కనుసన్నలలో మెలగుతోంది. తోటి వజీర్లకూ, సరదార్లకూ తానంటే ఎంతో ఇష్టం. ప్రజలందరూ తనను వీరాదివీరునిగా, శౌర్య ధైర్య నిధిగా భావిస్తున్నారు. తన పరాక్రమానికి నిదర్శనగా తెలుగురాజు ఢిల్లీ కోటలో ఇంకా ఉండనే ఉన్నాడు. తన తండ్రి ఘ్యాజుద్దీన్ తుగ్లక్ ముసలివాడు. దాదాపు నాలుగేళ్ళయింది సింహాసనాన్ని అధిష్ఠించి. ఇంకా ఎంత కాలమని తక్తు మీద

కూర్చోవాలి? ఈ రాజరిక సిద్ధాంతమే అసహ్యకరమైంది. ఆ సింహాసనం మీద కూర్చునవాడు చస్తేనే కాని, మరొకడికి దాన్ని అధిష్టించే అవకాశం రాదు ఇవతలివాడు ఎంతశక్తివంతుడైనా. అయితే, వాడు ఎదుటివాడు కోరుకున్నప్పుడల్లా చస్తాడా చావడు. అందుకోసం వాణ్ని హత్యచెయ్యాలి, రెండవ కంటికి తెలియకుండా. అది చేత కాకపోతే, విపులసైన్యాన్ని సమకూర్చుకొని యుద్ధం చెయ్యాలి. వాణ్ని పారద్రోలాలి. తీరా యుద్ధం చేస్తే ఫలితం ఎలా ఉంటుందో? అందుకనే ఇది బుద్ధి బలం తక్కువై భుజ బలం అధికంగా ఉన్న మొరట మానవులు చెయ్యాల్సినపని. తన తండ్రి ఈ రెండో విధాన్నే నసీరుద్దీన్‌ని యుద్ధంలో ఓడించి, రాజ్యానికివొచ్చాడు. అదృష్టం బాగుంది కాబట్టి, తన తండ్రి ప్రాణాలతో బయటపడి సుల్తానయ్యాడు తాను షహజాదా అయ్యాడు. లేకపోతే, షాజాదాగా చెలామణీ ఔతున్న తాను ఏ లాహోర్ పరగణాల్లోనో అరక దున్నుకోవాల్సింది. ఛీ! ఆ యుద్ధ ప్రమేయం లేకుండానే తనకు సింహాసనం వొస్తే ఎంత బాగుండును. చాలా బాగుంటుంది. కాని, తన తండ్రి తనంతట తను "ఓరే, బేటా! ఈ తఖ్తు నీది, దీని మీద ఎక్కి కూర్చోరా!" అని అంటాడా అంటే అలా అనేట్టు కనిపించటం లేదు. మర్యాదలతో అధికార ప్రదానంతో తన్ని మభ్యపెట్టాలని చూస్తున్నాడేకాని, సింహాసనాన్ని వొప్పగించే ఊహే కనిపించటంలేదు. ఇక పోతే పోనీ తనంతట-తానేమైనా చస్తాడా అంటే చావడు. ఆ సూచనలేమీ దగ్గరలో కనిపించటం కూడా లేదు. అరవయ్యో పడిలో పడ్డా, మనిషిమాత్రం దృఢంగా ఉన్నాడు: దీనికేదయినా మార్గాన్ని అన్వేషించాలి, ఏమిటా మార్గం? ఇంతవరకూ ఢిల్లీలోని అన్ని రకాల అధికార్లలోనూ తన పలుకుబడి విపరీతంగాఉంది. నిజమే! కాని, సుల్తాన్ వారికి ఎదురు తిరగాల్సిన అవసరం వొచ్చేసరికి ఎంతమంది అందుకు సంసిద్ధులై తనప్రక్కన ఉంటారో తేల్చుకోవాల్సిన అవసరం ఎంతయినా ఉంది. ఆ మాటకొస్తే తనను అనుక్షణం కొలిచే వారిలో అవసరానికి ఎంత మంది విశ్వాసపాత్రులో- కనీసం సలహా అడిగి, ఆంతర్యం విప్పి చెప్పటానికి ఒక్కడయినా ఉన్నాడా, లేదా అనేది ఒక పెద్ద సమస్యగా రూపొందించి షహజాదాకు,

ఆలోచనానిమగ్నుడై తన మందిరాంతర్భాగ ఉద్యానవనంలో అస్థిమితంగా అటూ ఇటూ పచార్లుచేస్తున్న షహజాదాకు అప్పుడే ప్రవేశించిన పెద్ద ఖొజ్జా వంగి వంగి సలాం చేశాడు. షాజాదా "ఏమిటి విశేషం" అని కళ్ళతోనే ప్రశ్నించాడు.

"షాజాదా! వరంగోల్నించి చెకూముక్ షాస్త్రుల్లూ తమ దర్షనం కోసం వొచ్చి ఉండార్." అంటూ విన్నవించాడు పెద్ద ఖొజ్జా.

షహజాదాకెందుకో విపరీతమైన సంతోషంవేసింది. "వెంటనేప్రవేశ పెట్టు," అన్నాడు. ఖొజ్జా నిష్క్రమించాడు. కనీసం తన మనసులోని మాట చెప్పుకోవటానికీ, ఢిల్లీనగరపు రాజకీయాలకూ సంబంధంలేని ఆగతానాగతవేత్త యగు దక్షిణాది జ్యోతిష్కుడన్నా లభించాడు, అని సంతృప్తి పడ్డాడుషాజాదా. అయినా, పరాయివాణ్ని ఒక పట్టాన నమ్మి తన ఆంతర్యం చెప్పకూడదని అనుకున్నాడు.

ఇంతలో చెకుముకిశాస్త్రి "విజయోస్తు, షహజాదా అలాఫ్ ఖాన్ సరదార్! విజయోస్తు!" అంటూ ప్రవేశించాడు ఉద్యానవనంలోకి.

జ్యోస్యులుభాయిని చూడగానే అలూఫ్ ఖాన్ కి పరమ సంతోషమయింది. "ఆయీాయే ఆయీాయే, చెకుము కిశాస్త్రిభాయ్!" అంటూసాదరంగా ఆహ్వానించి తోటలోని ఒక శిలావేదిక మీద ఆశీనుణ్ని చేశాడు షహజాదా.

"ఓరుగల్లునుంచేనా రావటం?"

"మరెక్కడనించి రమ్మంటావేమిటి? స్వర్గాన్నించిరావటానికి నేనేం చావలేదుగా!"

"కొంపతీసి ఎవరన్నా చనిపోయారేమిటి?" అన్నాడు షాజాదా.

"ఆహా! చావటానికేం? రోజూ చాలామంది చస్తూ ఉంటారు. అందులో యుగంధరమంత్రి ఒకడు."

"యాఖుదా! ఎంత పని చేశావ్"

"ఆ! నీ పిచ్చి గాని వీడికి రోజులు మూడి మసూచి అమ్మవారు ఎత్తుకొనిపోతే ఆఖుదా ఏం చేశాడు పాపం?"

"మసూచివల్ల చనిపోయారా? సరే ఏంచేస్తాం? కాని, ఓరుగల్లులో మా వారంతా క్షేమమే కదా?" అన్నాడు షహజాదా,

"ఇంకా మీవారేవరయ్యా? ధన ధాన్య వస్తు వాహనాదులను ఓరుగల్లుకి ఒదిలిపెట్టి ఎప్పుడో జండా ఎత్తేశారుగా!" అన్నాడు చెకుముకి. ఈ వార్త షహజాదాను ఆశ్చర్యపరచింది. మారుమాట లేకుండా ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు

"నీ కింకా అసలు విషయం తెలీదల్లేఉంది చెప్తావిను! నీవు ఓరుగల్లునుంచి వెళ్ళిన మూడోరోజున- ప్రతాపరుద్రుడు నగరానికి తిరిగి వొచ్చాడు"

"శాస్త్రీలు ఖాయ్ మీరుచెప్పేది జూట్. ప్రతాపరుద్రుడు మా దగ్గర బందీగా ఉన్నాడు," అన్నాడు షాజాదా.

"అదే జూటీబాత్. ప్రతాపరుద్రుడు నిక్షేపంగా హాయిగా ఓరుగల్లు సింహాసనం మీద కూర్చుని, కడుపులో చల్ల కదలకుండా రాజ్యం చేసుకుంటున్నాడు కావలిస్తే ఓరుగల్లుకు పోయి కనుక్కొని రా!"

"ఉఁహు! రాజును నేను ఖైదుచేసి తీసుకొని వొచ్చాను కావాలంటే చూపిస్తాను- రా. చూదువు గాని!"

చూడకుండానే చెప్తాగా- నీవు ఖైదు చేసింది రాజును కాదు; రాజాగారి చాకలి పేరణ్ని"

ఛీ ఛీ! నేను ధోభీని ఖైదు చేశానంటారా"

అఁ! అందులో సందేహంలేదు. ఆ రోజున ఆ కాయసిద్ధిమాటలు నమ్మి మీరటు వెళ్లారో-లేదో యుగంధరమంత్రి తిరిగి వొచ్చి, మీ దురుద్దేశ్యాన్ని గ్రహించి, రాజుపోలికలు గల చాకలి పేరణ్ని తీసుకొచ్చి, దుస్తూగిస్తూ తొడగి రాజాగారి గుర్రానిచ్చి మీ దారిలో ఉంచాడు. యుగంధర మంత్రి పన్నిన ఈ కుట్రలో కాయసిద్ధీ-మురారిదేవుడూ ఇద్దరూ భాగస్వాములే! వారి మోసపు మాటలు నమ్మి చాకలివాణ్ని బందీగా తీసుకొచ్చి, రాజోపచారాలన్నీ చేయిస్తున్నావ్! పోనీ, ఆ రోజున నన్నడగనన్నా అడిగావా? అప్పుడు నేను పనికి రాలేదు. అసలు నేనా రోజున చెప్పానా? ఇది మీకు రాహుకాలంరా బాబూ! మీ మీదికి శని ఎక్కేవరకూ ఊరుకోండిరా అని. వింటేనా!" అన్నాడు చెకుముకి.

"భాయ్? నాకేమీ పాలుపోవటంలేదు. మీరు చెప్పేది నిజమేనా?" అన్నాడు చెకుముకి మాటలకు విచలితుడై షాజాదా.

"అబద్ధం చెప్తే నాకేం వొరుగుతుంది?"

"అయితే, భాయ్! ఈ విషయం ఎవరితోనూ చెప్పలేదు, కదా?"

"నా మటుకు నేను చెప్పలేదు. వేరొకరి విషయం నాకు అనవసరం."

"ఈ విషయం తెలిసినవాళ్ళు ఢిల్లీలో ఇంకెవరన్నా ఉన్నారా?"

"ఊహూఁ! ఈ వార్త ఇంకా ఢిల్లీదాకా రాలేదు. కాని, వొస్తుంది, ఈ వార్త మోసుకొని ఖుస్రూఖాన్ వొస్తున్నాడు "

"ఖుస్రూ?"

"అవును. వాడే! నెల రోజుల్లోగా తమ చాకలిని తమ కప్పగించుమని ఓరుగల్లు రాజు ఆజ్ఞచేశాడు. ప్రస్తుతం మీ సాధన సామాగ్రి మూడు వంతులు ఓరుగల్లువారి ఆధీనంలో ఉంది. అందుకోసమని చాకలిని ఓరుగల్లు రాజాకి ఇచ్చి, తమ సాధన సంపదను విడిపించుకుందామని వొస్తున్నాడు." అన్నాడు చెకుముకి.

చెకుముకి మాటలు వినటంతోనే షహాజాదా ముఖకవళికలు మారిపోసాగాయ్. ఖుస్రూఖాన్ ఢిల్లీ వొస్తే తన గుట్టు రట్టవటమే కాకుంతా దోభీతో ఛేకీ కలపటానికి చూసినందుకు సుల్తాన్ వారు తనపై ఆగ్రహిస్తాడు. అందులో తన ప్రణాళికలన్నీ తారుమారు అయిపోతాయ్. మరి కర్తవ్యం?"

"ఏంచేద్దామనుకుంటున్నావు, షహజాదా?"

"ఔను. నా పరువు నిలబడాలి! నా ప్రణాళిక జయించాలి!"

"అంటే నీవు సుల్తాన్ కావటమేగా?" అన్నాడు చెకుముకి గంభీరమైన మందహాసం చేస్తూ.

షహజాదా విస్తుండిపోయాడు ఆవులిస్తే ప్రేవులు లెక్కించే రకం. అయితే జోతిష్యానికి అందనిది లేదు కదా అనుకున్నాడు షహజాదా.

"మీకు దివ్యదృష్టి ఉంది జోస్యులు భాయ్! ముందు ఈ ఖుస్రూని ఏం చేయాలి?"

"మరో పదిక్షణాలో వస్తాడు."

"నా దగ్గరికే వస్తాడా?"

"ఆహా! నేరుగా ఇక్కడికే వొస్తాడు ముందుగా!" అన్నాడు దక్షిణ హస్తపు బొటనవ్రేలితో కణుపులను లెక్కిస్తూ.

"అయితే, మంచిదే రానీ!"

"ఉహూఁ! అతణ్ణి హత్య చేయాలని ఆలోచిస్తున్నావు కదూ?"

"భాయీ సాబ్! మీరు హృదయాన్ని చీల్చి చదవగల పండితులు. వాడు బ్రతికి ఉంటే, నా గుట్టు రట్టయి నాకే ప్రాణాపాయంకూడా కలుగవచ్చు" అన్నాడు షహజాదా.

"నీ ఇంట్లో చంపితే, నీకే ప్రమాదిస్తుందేమో?"

"అందుకని?"

"ఆ సత్కార్యాన్ని ఏ యమునా నది వొడ్డునో జరిపించటం మంచిది. స్వయంగా చేస్తే మరీ మంచిది?"

"కాని, వాడు యమున దరికి రావద్దూ?"

"మంచి మాటలతో షికారుకి తీసికెళ్లూ, సరిపోతుంది."

"అచ్ఛా భాయ్! మంచి ఆలోచన చెప్పారు. చాల సంతోషం ! ఇక మీ ఆశీర్వాదబలంవల్ల మేము సుల్తానయితే, మిమ్మల్ని వరంగల్‌కి పాచ్ఛా చేస్తాం."

"ఊఁ! దానిదేముంది? అలా ఖరార్ వ్రాసి యివ్వు. రెండోకంటికీ తెలియకుండా మీ సుల్తాన్‌ని మక్కాకు పంపే ఏర్పాటు నేను చేస్తాను." అన్నాడు చెకుముకి.

"నిజంగానా!" అన్నాడు షహజాదా ఆశ్చర్యంగా. తన్ను ఇంత కాలంగా వేదిస్తున్న ఈ సమస్యను ఇంత తేలిగ్గా పరిష్కరిస్తాననంటాడేమా? అని.

"క్షణాలమీద ఆ పని జరిపిస్తాను. ఖరార్ మీద నిశానీపారెయ్!...." అంటూ ఒక తాళపత్రాన్ని అందించాడు.

షహజాదా మారు మాట చెప్పకుండా తాళపత్రాన్ని గ్రహించి, బల్ల మీద ఉన్న ఘంటాన్ని అందుకున్నాడు వ్రాయటానికి.

"అది అలా ఉండాలి కార్యశూరుడి లక్షణం. వ్రాయి బాబూ! నేను చెప్పినట్లు వ్రాయి.

శ్రీశ్రీశ్రీ చెకుముకి శాస్త్రికి కాబోయె వరంగల్ పాచ్చాగారికి ఢిల్లీ సుల్తాన్..."

"ఈ కాబోయే లెందుకు శాస్త్రి భాయ్!"

"అలా కాదు ఇది మంత్రసిద్ధి ఉన్న తాళపత్రం. ఇందులో ఎలా వ్రాస్తే అలా జరుగుతుంది. అందుకు నా ఏడుపు అన్నట్లు సుల్తాను కాగానే పేరు మామూలుగా మార్చుకుంటారుగా! నీకే పేరు ఇష్టం?"

"నాకన్ని పేర్లు ఒకటే."

"అలా అంటే కాదు. నీకు ఏ పేరిష్టం చెప్పు?"

"మీకు నచ్చింది పెట్టండి. అదే నా ఇష్టం?"

"అచ్చా! అలా అన్నావ్ - బాగుంది నీవో మహాపురుషుడివి. మీ మహాపురుషుడు ప్రవక్త మహమ్మద్. అందుకోసం నీకు మహమ్మద్ బీన్ . ."

ఆ సమయంలో వీధిలోనుండి "ఢిల్లీ సుల్తాన్! పట్టుక పోతాన్!" అనే కేక వినిపించింది.

ఆ కేక వినటంతోనే "పిచ్చివాడు" అన్నాడు షహజాదా.

"అయ్యయ్యో! పేరు గుణకం వేసి చెప్తుండగా, పిచ్చి అని కోరుకున్నావేం ? నా పిచ్చి షహజాదా:"

"ఏం? ఏమైంది?"

"ఏమయ్యేదేమిటి? నీ పేరు మహమ్మద్ బీన్ తుగ్లక్! అని వొచ్చింది. నీకు దశ పట్టాలంటే, ఇలా వ్రాసుకోవాల్సిందే!"

"దశ పట్టాలేగాని, అంతకన్నా ఘోరంగా అయినా వ్రాస్తాను...." అంటూ వ్రాయటానికి ఉపక్రమించాడు.

"ఆఁ! మహమ్మద్ బీన్ పిచ్చి తుగ్లక్ వ్రాయు ఖరారునామా ! మా తండ్రిగారు ఢిల్లీ సుల్తానయిన ఘ్యాజుద్దీన్ తుగ్లక్ వారిని రెండు నెల

అలో మక్కాకు పంపి, నేను సుల్తానయిన వెంటనే మిమ్ములను ఓరు గల్లుకు పాద్షాగా చేస్తాను. సంతకం పెట్టు" అన్నాడు చెకుముకి.

షహజాదా సంతకం పెట్టాడు.

షహజాదా సంతకం పెట్టిన తాళపత్రాన్ని చెకుముకి శాస్త్రి కందిం చాడు. శాస్త్రి దాన్ని భక్తి ప్రపత్తులతో స్వీకరించి కళ్ళకద్దుకొని, తరువాత అంగ వస్త్రంలో భద్రం చేశాడు. ఇంతలో పెద్ద ఖొజ్జా ప్రవేశించి, ఖుస్రూ ఖాను ఆగమనాన్ని తెలియజేశాడు షహజాదాకు.

"చూశావా! నా జోస్యం!" అన్నాడు చెకుముకి.

"ఆహా! ఖరారునామా విషయంలో కూడా మీ జోస్యం ఖరార యితే ..." అన్నాడు షాజాదా.

"ఔతుందిలే! దానిదేముంది? అన్నట్లు పోయి ఖుస్రూఖాన్‌ని కబ రస్తాన్ దాకా సాగనంపిరా !" అంటూ సెలవు పుచ్చుకున్నాడు చెకుముకి శాస్త్రి. శాస్త్రికి వీడ్కోలు ఇచ్చి, ఆలోచనా మందిరంలో తన కొరకు వేచివున్న ఖుస్రూని కలవబోయాడు షహజాదా అలూఫ్‌ఖాన్.

# 18

అబ్బబ్బబ్బబ్బా! ఈ వెర్రితొత్తు కొడుకు వెంబడి తిరగలేక ఛస్తున్నాంరా ఏ దుర్ముహూర్తాన పుట్టాడో కాని. వాడికి సుఖంలేదు సరికదా! మన ప్రాణాలకుకూడా సుఖం లేకుండా పోయింది కదరా?" అన్నాడు రామ్ సింగ్ తనతోటి గస్తీ సిపాయి అబ్దుల్లాతో.

"అదే భాయ్! మాకీ కూడా కాళ్ళు హర్గీ పోతున్నాయ్. ఏమ్టి సెయ్యవాలో తెలీటంలేదు. వాడ్కీ నిద్దర్ లేదు. మన్కీ నిద్రాలేదు. వాడ్కీ కూడూ లేదు; మన్కీ కూడూ లేదు. వీడ్కీ దివానా అంటుంది లోకం. వీడ్కీ జాగ్రత్త సూనావాలా అంటాడు సర్కార్."

"ఆ, ఈ బాధపడేకన్నా: ఈ వెధవను ఒక్కసారి గొంతుపిసికి అవతల పారేస్తే సరిపోయేట్టుంది-వాడి ప్రాణాలకూ, మన ప్రాణాలఖూ ఖూడా పీడ ఛాదిలిపోతుంధ్ధి."

"ఆ మాట మాత్రం నాకే తట్టింది అంతా పనీ చేస్తానూ అనీ, సర్కారీక్కి మస్వీ చేశాన్! ఆ పనీ చేస్తే పసదీ తల కూడా కైమా సుల్తాన్ అన్నారు సర్కార్.

"ఎందుకూ?"

"వీడి పాటా వీడి యాటా సుల్తాన్‌గారిక్కి చేరింకీ మాకీ పకడ్ లేవ్ అరిచేవాడు మాకీ చాలా దోస్తీ! పుర్వ జన్మలో వాడు పెద్దరాజూహై ఉంటాడ్. వాణ్కి నిజంగా పిచ్చి ఉందీ? పిచ్చి లేదూ-ఉందీ కనీపెట్టండి. నిజంగా పిచ్చి అయితే వదిలీ వెయ్యండి. నఖిలీ పిచ్చి అయితే నవ్వి వేయండి హంటూ సుల్తానావార్ హుకుం జారీచేసినార్?" అన్నాడు అబ్దుల్లా

"అయితే భాయ్! ఒక పని చేద్దాం ఇవాళ నీడు పిచ్చి వాడు అవునో-కాదో తెల్లవార్లు కాపలా కాసి అయినా సరే తేల్చుకుందా. ఆ తరువాత ఆ విషయం సర్కార్‌తో మనవి చేస్తే, కనీసం రేపటినుంచి అయినా మనకి విశ్రాంతి దొరుకుతుంది"

"అదే భాయ్! మేముకూడా సేయవాలా ఉన్నాం. ఈ తెలంగీ పిచ్చాడీక్కి, ఆ తెలంగీ రాజాకి సంబంధం ఉంటె సచ్చామే అన్కో!"

"అయ్....ఢిల్లీ సుల్తాన్
పట్టుకా పోతాన్
యాభై తొమ్మిదినాడు
పట్టి బందిస్తాన్!"

"ఓరి నాయనోయ్ వొచ్చాడ్రా బాబూ! ఒరే అబ్దుల్లా! నీవా వీది లోకి వెళ్లు. నేనీ వీదిలోకి వెళ్తా!" అంటూ రామ్‌సింగ్ ప్రక్కనున్న వీదిలోకి పరుగుతీశాడు. అబ్దుల్లా మరో వీదిలోకి తప్పుకున్నాడు. పిచ్చి వాడు గెంతుతూ-గెంతుతూ చెంగున దూకాడు ఆ నడివీదిలోకి.

"ఒరే! నన్ను చూచి పారిపోతారేంరా పిచ్చికొయ్యల్లారా, నేనేం హిందుష్టల పిశాచాన్ని కాదు. తురకదయ్యాన్ని కాదు - భూతాన్ని కాదు. బేతాళుణ్ణీ కాదు. నన్ను చూసి పారిపోతే నాకే నష్టంలేదు, నా సాంగత్యం చెయ్యనందుకు ఫలితం సర్వనాశనం,

నాశనం ఈ ఢిల్లీ వినాశనం
మీ పెళ్ళాల మెళ్లోని నల్లపూస నాశనం!

"నన్ను నమ్మండి! నా వాక్కు మక్కా అంత గొప్పది. నానాలిక మీద లక్ష్మీదేవి మొగుడి కొడుకూ పెళ్ళాం వుంది. నా అంగిట్లో పోలే రమ్మ బొయ్యి పెట్టుకొని పోపు వేయిస్తుంది. నా కంఠంలో కాలరుద్రుడు గంగమ్మతో కలసి పార్వతి కంటబడకుండా కాపరం చేస్తున్నాడు. నమ్మండిరా నమ్మండి!"

పిచ్చివాడి ప్రహసనం చూడటానికి, గుంపు చిన్నచిన్నగా చేర సాగింది. రామసింగూ, అబ్దుల్లా కూడా గుంపు వెనకాలకు చేరారు.

"ఏరీ! ఇంతమంది చేరినా, నా శిష్యాధములు ఒక్కడూ రాలేదేం? అవునులే-నా ప్రశ్నలకు సమాధానం వాళ్ళ నాయనమ్మ చెప్పివుండదు. లేక పోతే వ్యతశంకితులగు ఈ కుర్రకుంకలు నన్ను నమ్మి ఉండకపోవచ్చు. ఎవరి ఖర్మ వారిది. అందుకని నన్ను నమ్మండిరా బాబూ అని వాళ్ళను పోయి బ్రతిమాలుతానా! మిమ్మల్నందర్నీ నా వెంటపడమని బ్రతిమాలానా?

నమ్మి చెడినవాడూ లేడూ
నమ్మక చెడిపోతే పొయ్యేరు
అలూఫ్ ఖానుడు ఆత్రంకొద్దీ
చాకలివానిని చక్రవర్తి అని
పట్టుకవచ్చి పట్టణమంతా
ఊరేగించెను విజయగర్వాన
నమ్మి చెడినవాడూ లేడూ!

నమ్మక చెడిపోతే పొయ్యేరు
వీరుణ్ణంచూ శూరుణ్ణంచూ
విజయలక్ష్మి నేస్తున్నంటూ
చక్రవర్తికి సన్నిహితుండై
ఢిల్లీలోనా మాన్యాలందీ

కళ్ళలో ఖారం కొట్టాడూ
ఖనుడు
కల్లమాటలను చెప్పాడూ
నమ్మి చెడినవాడూ ..

"అరే అబ్దుల్లా ! ఏమిట్రా వీడు పాడుతున్నది ?" అన్నాడు రామ్ సింగ్.

"అదేరా, ఈ తెలంగీ దివానా! మన అల్లావుఖాన్ బహద్దర్ పట్టుక వొచ్చిందీ చాకలి పేరిణ్ణి అని చెప్తాడ్! హహ్హా హహ్హా నేనుకూడా ఇన్నాన్! పెర్తాపరుద్రుడ్ ఓరుగల్లుమే హుండీనాడు. రాజాగారి బట్టలుతికే చాకలి రేవూకాడా మోజూపడీ, రాజాకే బట్టల్ కట్టుకోని రాజాగారి గుర్రాన్ని మేపుతూ ఉంటే అలూఫ్‌కాన్ సాహెబ్ పటుకవొచ్చాడ్ అనిఅనుకుంటార్ పాపం-పుణ్యం పర్మాత్ముడిక్ హెరాక్"

"ఈ విషయం సుల్తాన్ వారికి తెలుసా?"

"తెలిసింది లేదు అనుకుంటాన్. హయ్‌నా హమీ పెద్దవారీ గొడ్వామన్కీ ఎందుకులే భాయీ సాహెబ్!" అన్నాడు అబ్దుల్లా,

"హద్దదీ మాట"

"ఢిల్లీ సుల్తాన్ పటుకపోతాన్
మల్లీ మాటాడితే ఎత్తుకపోతాన్"

"వొచ్చారా? రండిరా? నా శిష్యులూ! రాండి రంకుముగుళ్ళలారాండి నా ప్రశ్నకు సమాధానం తెచ్చారా? లేకపోతే వీపు వాయగొడతా!"

"తెచ్చాం దాబూ! వీపు మాత్రం వాయగొట్టకండీ. వాయవ కమ్మి చస్తాం-మీ గుద్దుపడితే!" అన్నారు అప్పుడే గురుదర్శనానికి వొచ్చిన కాశీ-రామేశ్వరం చేతులు జోడించి గడగడా వొణుకుతూ.

"ఊఁ! అలాగుండాలి. అయితే చెప్పండి"

"చెప్తాంకాని, చెప్తే బంగారం చేసే విధానం చెప్తారా స్వామీ?"

ఓ! బంగారం ఏమిటి? భూపిద చేస్తే విధానం కూడా చెప్తాను.

మొక్కజొన్న చేనిలోన
మొక్కజొన్న చెట్లునాటి
నీళ్ళుపోసి చెట్టు పెంచ
కండె కాసెనూ కండె కాసెనూ

మొక్కజొన్న దంటుపరంగా అసలు విషయాన్ని చెప్పమన్న గురువుగారి భాషను గుర్తించాడు శిష్యుడు.

"ఆఁ! కండెనేం చేశారు?" అన్నాడు పిచ్చివాడు.

రామేశం సమాధానం చెప్పాడు.

మొక్కజొన్న దంటునుండి
కండె విరిచిరీ
నక్కి నిక్కి దంటు తీసి నీటవేసిరీ,

"అయితే, శిష్యా! మరి కండెనేం చేశారూ? భోంచేసి ఉంటారు. అంతేనా, అంతేనా? అంతేననవేంరా బడుద్దాయ్?"

కండె తీసి పీచు చెక్కి
వల కాట పాతిపెట్టి
గోతికాడ నక్క వొకటి
కాపు ఉన్నదీ కాపు ఉన్నదీ.

"అయితే, ఓ నా ప్రియమైన శిష్యా! నే చెప్తా విను-నా టిప్పణం?

నీటినుండి దంటుతీసి నిలువబెట్టరా
గోతికాడి నక్క మీద తాటిపండు విసరివేసి
మట్టినుండి కండె తీసి దంటుకతకరా!

"అతికితే....!" అన్నాడు కాశీ.

"హోరి వెఱ్ఱిదద్దమ్మా! అతికితే....

కండె వొచ్చి దంటుకతుప
దంటుతీసి దాచిపెట్టు

దాచిపెట్టి నేల నాట
వేళ్ళుపుట్టి వృక్షమౌను

"మళ్ళీ బ్రతుకుతుందా?" అన్నాడు రామేశం.

"ఓరి ఆనందవాచకా!"

చచ్చిపోయిన ప్రాణి
తిరిగి వాస్తుందా!
పుచ్చిపోయిన కట్టె
చిగురించుతుందా?

అయిలే,

ఆకారానికి లోపం లేదు
వ్యవహారానికి దోషం రాదూ
జీవాత్ముడు పరమాత్మలో చేరిన
ప్రేతాత్ముడు ప్రేతంలో చేరున్
ప్రేతం అంటే తెలుసా?
ప్రేతం అంటే భూతం
భూతం అంటే దయ్యం
దయ్యాన్ని ఎప్పుడయినా చూశావా
దద్దద్దద్దద్దయ్యం
దయ్యం అంటే ధాం
ధాం అంటే నేన్ నేన్

"ఆహాహాహా, విశ్వరూప సందర్శనం! గురోజీ! విశ్వరూప సందర్శనం ." అంటూ శిష్యులు సాష్టాంగపడి నమస్కారం చేశారు.

"అస్మదీయ శిష్యాగ్రగణ్యులారా! నేడెంతయునూ నాకు ముదం బయ్యె. మీవంటి శిష్యాధములు దొరికిననాడు గదా - పరమానందయ్య ఆనందసాగరమవి ఉప్పునీటి సంద్రమున పడి మునకలై తన్నుకొన్నది? మంచిది. మీ భక్తికి మెచ్చితిని: మీ శ్రద్ధకు సంచసించితిని. వరంబిచ్చె

దను; కోరుకొనుడు."

"ధన్యుడను, స్వామీ! ధన్యుడను."

"నేనుకూడా ధన్యుడను, స్వామీ! ధన్యుడను."

"మాకు స్వర్ణయోగం నేర్పండి!" అంటూ తమ గోడును వెళ్ళబోసుకున్నారు శిష్యులు.

"అలాగే! స్వర్ణయోగం లబ్ధికి సన్యాసం పుచ్చుకోవాలి సన్యాసికి వేదాంతం చాలినంత కావాలి. పాడండిరా. శిష్యులూ! పాడండి...." అంటూ మొదలుపెట్టాడు వేదాంతబోధ పిచ్చివాడు. శిష్యులు వంత పాడటం మొదలుపెట్టారు భక్తిప్రపత్తులతో. ఏ మాత్రం వొళ్ళుపోయినా స్వర్ణయోగం పట్టదేమోనని.

అడుదైతేనేమిరా-తల బోడిదైతేనేమిరా
క్రిందమీదా చూడకుంటా-తాలినే కడదాపురా
తల బోడిఅయితే నేమిరా- మెల బోడిదైతేనేమిరా
సాయిబైతే చాలురా-సరదారుదై పోతాడురా
తిండి లేకపోయినా-మొలగుడ్డ లేకపోయినా
మీసముల సంపెంగనూనె-ఘుప్పుమనుచుండాలిరా
పాకలైతేనేమిరా భవనాలు అయితేనేమిరా
అందుచేతీ పాడు ప్రాణిని-మిద్దెలో త్రోసేయురా
కైపుకల్లూ కల్లెరా-మరి తీపికల్లూ కల్లెరా
కైపు కల్లె త్రాగి మనమూ-తందనాలేతామురా

"ఒరే శిష్యులూ! వేదాంతం అంతు పట్టిందిట్రా?"

"కొంచెం కొంచెం ఇప్పుడిప్పుడే పడుతున్నది, గురూజీ!"

"పూర్తిగా ఎప్పుడంతు పడుతుంది, స్వామీ"

"కల్లుముంత ఖాళీచేస్తే కాని, వేదాంతం వంటపట్టదురా, శిష్యా." అంటూ దారినపోతున్న పెరుగమ్ముకునే మనిషి తట్టలోని ఒక పెరుగు ముంతను గడ్డం నిండా పోసుకుంటూ ఖాళీచేశాడు. పెరుగుమనిషి ఆ భయంకర రూపాన్ని చూసి గావుకేక పెడుతూ పారిపోయింది. నెతిన

ఉన్న పెరుగుతట్టను నేలకేసి కొడుతూ. పిచ్చివాడు పకాపకా నవ్వాడు. "ఒక ముంత నా పాలు; కడమ ముంతలు భూదేవి పాలు! భూదేవీ! అంతేనా తల్లీ? సమస్త చరాచర ప్రపంచానికీ తల్లీ! ఓయమ్మో? పెరుగింకా అలానే వుందేం? నీకు ఎక్కువైందా? అవునులే? పాల సముద్రంలో పెరుగుచుక్కపడి పేరుకపోతే గర్భాత్రంకొద్దీ అంతా త్రాగేసి ఉంటావ్? అందుకే నీకు ఎక్కువైంది. సరేలే! నీ కెక్కువైన పాలు నాపాలు. అంతేగాని, వృధాగా పోనిస్తానా?" ఆంటూ ఆ నేలపడిన పెరుగును ఆత్రంగా జుర్రుకోసాగాడు పిచ్చివాడు.

"అరే అబ్దుల్లా భాయ్! వీడు నిజంగా పిచ్చివాడేరా!" అన్నాడు రామ్‌సింగ్.

"అదే భాయ్! మాకీకూడా తట్తూ ఉంది వీడి వేషం పిచ్చి; మాట పిచ్చి. వీణ్ని పరిశీలన్గా చూస్తూ ఉన్నకొద్దీ వీడిలో పిచ్చికానిదేదీ కన్పించటం లేదు భయ్యా!" అన్నాడు అబ్దుల్లా పిచ్చి వాణ్ని పరిశీలనగా చూస్తూ.

"అయితే, భాయ్!" ఒక పని చేద్దాం. వీడికో దీనారాన్ని ఇచ్చి చూద్దామా, ఏం చేస్తాడో?"

"అలాగే భాయ్! సిపాయిలు కూడబలుక్కుకున్నారు

"ఓరే అబ్బి! ఇదిగో ఈ దీనారం పుచ్చుకో—" అంటూ ఓ బంగారు నాణాన్ని విసిరాడు పిచ్చివాడిమీదికి రామ్‌సింగ్.

ఆ నాణెం రివ్వున ఆకాశంలోకి ఎగిరి పిచ్చివాడి తలమీద పడి మరో దొర్లు దొర్లి నేలమీదపడి ఖంగుమంది.

"అరరరెరెరెరే! నాణెం నాకెందుకురా? ఆకలిగొన్న బెబ్బులికి పప్పుదప్పళం రుచిస్తుందా? తియ్యగా ఉంటుంది కదా అని హల్వా పెడితే మదగజం మేస్తుందా? పందిమీద పన్నీరు చల్లితే హర్షిస్తుందా? దప్పిక వేసినవాడికి దద్ధోజనం సహిస్తుందా? నా కెందుకురా నాణెం? మీ పెళ్ళాల కిచ్చుకోండి..." అంటూ క్రిందపడ్డ నాణాన్ని వంగి చేతిలోకి తీసుకున్నాడు. ఒకసారి పరిశీలగా చూశాడు నాణెం వంక.

"ఓహోయ్! ఇది నాణెం కాదు; ఇది సుల్తాన్. చూడండి, దీని మీద సుల్తాన్‌గారి బొమ్మ. ఔనౌను. నా బంగారు సుల్తానా! ఓ నా మేలు

పసిండి సుల్తానా! ఓ నా వన్నెచిన్నెల సుల్తానా! దొరికావా నా చేతికి- చూడు, నిన్ను బందించానా? అన్నమాట తీర్చుకుంటా.." అంటూ గుప్పెటను గట్టిగా బందించాడు- నాణాన్ని అరచేతిలో ఉంచుకొని, "చూశావా నా రాజా! నలుగురూ చూస్తుండగా నిన్ను బంధించివేశాను. నిజంగా బంధించేస్తాన్ ఓ నా సుల్తాన్! ఏడుస్తున్నావా? ఊపిరి ఆడటంలేదా? గుప్పిట కాస్త సళ్ళిస్తాలే? ఏడవకు."

ఏడవకు ఏడవకు వెర్రి నా రాజా
గుప్పెట్లో కూర్చొని నిదురపోవోయి
శ్వ శ్వ శ్వ శ్వ హాయీ
హాయికి పెట్టేరెకోటి వరహాలు
సుల్తానుకెట్టేరే కోడి పలావు
జో!........జో!

అంటూ జోలపాట పాడసాగాడు పిచ్చివాడు.

"వాడికి నిజంగా పిచ్చే భాయ్! నాణెంమీద ఉన్న సుల్తాన్‌వార్ని గుప్పిట్లో బంధించి సుల్తాన్నే బంధించానంటున్నాడు" అన్నాడు రామ్ సింగ్.

"నీది బాత్‌లో నిజం ఉంటే భాయ్! వీడు ఇన్నాళ్లానుంచీ బంధిస్తాన్ చెప్తున్నదీ ఈ నాణెంసుల్తాన్నే భాయ్! ఐసా బోలో! వీడిది నక్లీ పిచ్చి కాదు;ఖరార్ పిచ్చి! సందేహం లేదూ, భాయ్!" అన్నాడు అబ్దుల్లా!

"ఒరేయ్! నాదికాదురా పిచ్చి! నేనుబందిస్తానన్నది అస్లీసుల్తాన్నే!"
"వీడు నిజంగా దివానా, భాయ్?" అన్నాడు అబ్దుల్లా.
సిపాయిల మాటలువిన్న పిచ్చివాడు ఉగ్రుడై పోయాడు.

"జానురా! నేను దివానాలా కనిపిస్తున్నా(టా మీకు! నిజమే నిజ్జంగా నేను ధివానానేరా!"

దివానానై తేంయేంరా
మీ సల్తాన్ని బంధిస్తాంరా
దమ్ముంటే చూసుకో
దాపరికమే లేదు
నక్కపోయిన పిదప
బొక్కట్టు కేడవకు
దడదడలాడిస్తామూ
ఈ ఢిల్లీ నగరాన్నంతా
మాట తప్పానంటే
మాట నిలుపూకోని
మరలిపోతా నేను
దివానానై తేయేంరా
మీ సల్తాన్ని బంధిస్తాంరా
నరసింహస్వామినిరో
నిన్ను నే నలుచక తింటారా
వరాహమూర్తి నిరో
నిన్ను వాల్చి పాతేస్తానురా
కలికావతారుణ్ణిరో
నిన్ను కదిలితే తింతారా
నిన్ను కదిలితే తంతారా

—అంటూ భీకరావతారం దాల్చి తన చేతిలోని దుక్కపెనుకతో రామేశం వీపు వాయకొట్టటం మొదలుపెట్టాడు పిచ్చివాడు. రామేశం కుయ్యో మొర్రో అంటూ దౌడు తీయటం ప్రారంభించాడు.

"పిరికి వెధవ! ధక్కా ముక్కాలకి ఓర్చుకోలేడు. ఎందుకు పనికొస్తాడు, ఎర్రిసన్యాసి? వీడికిటా స్వర్ణయోగం కావాలట ఓసే, కాసీ! ఏవుకూడా వాడి రక మేరా!"

నా! నేను వీరుణ్ని. స్వర్ణయోగాభ్యాసానికి

అన్ని విధాలా తగినవాణ్ని స్వామీ?" అన్నాడు కాశీ నాలుగు దెబ్బలుతిన్నా సరే, స్వర్ణయోగం పడితే చాలనుకుంటూ.

"అయితే, శిష్యా! నా గురుత్వం నచ్చిందిరా?"

"భేష్గ్గా నచ్చిందిగురూ! ఏడడుగులు వేస్తే వాడు, వీరొౌతారని మా బామ్మ చెప్పిందిగా!"

"భేష్, భేష్! ఎంతవరకూ వచ్చిందిరా విద్య? ఇంటి దగ్గర సాధన చేస్తున్నావా?"

"ఓ! రాత్రి నేనొక పాటను కూడా వ్రాశారు."

"అయితే, పాడరా శిష్యా? నీ నేర్చిన విద్య, యీ మహాజనానికి ప్రదర్శించు!" అన్నాడు పిచ్చివాడు.

కాశీ పాడసాగాడు.

నెత్తినా వరహాను పెడితే
పైస చేయని బాబులూ!
పట్టపగలే దొమ్మి విడచుక
ప్రభువులాగా పలుకుతుంటార్

"భేష్-భేష్రా శిష్యా! నీలో మహాకవి లక్షణాలు ఉన్నాయ్. భావ కవి పోకడలున్నాయ్, ఆదికవి ఆశయాలున్నయ్."

"భావకవి అంటే ఏమిటి, గురూ?"

"భావం లేని కవిత్వం చెప్పేవాడు భావకవి. భావమున్న కవిత్వం చెప్పేవాడు మామూలు కవి కవి. 'త్వం'లోనే భావం ఉంటుంది. భావంలేని కవిత్వం చెప్పేటప్పుడు కవి శబ్దం ముందున్నా, భావం అనే అక్షరద్వయం చేరుకొని బయటపడదామని ఆశ."

"వీళ్ళ బాధ బండబు కానూ!"

"సరిగా చెప్పావురా శిష్యా! నేనో పాట చెప్తాను వప్పుకో-వాస్త వాన్ని వప్పిస్తాను: కాదంటే చంపేస్తాను."

కూటికీ లేకా గుడ్డకీ లేకా
కూలికి పోతే - పైసాలు రాక

అకాలి మంటతో - అల్మటిస్తూనూ
దొక్కలంటుకుపోయీ-చిక్కి శల్యామై
బాజాపులోపడ్డ - దుడ్డు తీస్తుంటే
బేజారె త్తేదాక - తన్ని తగిలేస్తార్

అయితే —

కూటికి ఉండీ - గుడ్డాకీ ఉండీ
భంగారు మెత్కల్ని - తింటానికుండీ
త్రాగటానిక్కి ఉండి తగలెయ్యటానుక్కుండి
గానా పీనా బజానకుండీ - రాజులై సులతానులై
రాజ్యాలేలే రాజయ్యలూ
స్వార్థంకోసం - సమరం చేసీ
దేశాల్కి దేశాల్ని దోచేస్తుంటే
వీరులనీ రణశూరులనీ
ఆరాధిస్తుంది లోకం
లోకం పిచ్చిది - లోకం గ్రుడ్డిది
లోకానికి కళ్ళు లేపు
లోకానికి చెవుల్లేవు
లోకానికి నీతిలేదు
లోకానికి జాతిలేదు
నాకే అధికారం లేదు కానీ
ఉంటే మాత్రం ఊరుకోను
దేశాలను దేశాలను
దోచేసే అదికార్లను
బేడీలతో సత్కరించి
ఖైదుచేసి పారేస్తా
పిఱ్ఱమీద పింగాణి మోత
వీపుమీద ఒప్పీవెడు గ్రుద్దూ.

—అంటూ కాశీగాడి వీపు మీద వీశెడు గ్రుద్దు గుద్దాడు. పిచ్చి వాడు.

"చచ్చాన్రా, బాబోయ్! వీడు నిజంగా పిచ్చాడేరోయ్! బంగారం లేదు-గింగారంలేదు. అంతా హుళక్కి-రోయ్ నాయనో - ఓరి రామేశం! ఎక్కడున్నావురా? చెప్పుకోని సరసన ఏడుద్దామన్నా కనిపించవేంరోయ్!" లబాయిలు-దిబాయిలు మంటూ కాశీ రామేశ్వరం దగ్గరకి పరుగుతీశాడు.

"చచ్చుపీనుగ-వీడూ చచ్చే! దొరికిన ఇద్దరూ బడుద్దాయిలు. రేపన్నా ఓ మంచి శిష్యుణ్ణి సంపాదించాలి!" అంటూ బయలుదేరాడు పిచ్చివాడు.

అప్పటికే సంధ్యాసమయం దాటిపోయి చాలకాలమైంది. నగర వీధుల్లో ప్రభుత్వ దీపాల కాంతి తప్ప, మరి ఏ విధమైన వెలుతురూలేదు. వాణిజ్య కేంద్రాలను మూసివేసి తాళాలు బిగించి, వణిక్ప్రముఖులు ఇళ్ళదారి పట్టారు. చూస్తూ-చూస్తూ ఉండగానే, ఢిల్లీ నగరం నిద్రాదేవి ఊరువు మీదికి వ్రాలిపోయింది. పిచ్చివాడు "ఢిల్లీసుల్తాన్ పట్టుక పోతాన్ - రెండే నెలలాకి పట్టుక పోతాన్" అంటూ అంటూ నగర వీధులను అతిక్రమించి పోసాగాడు.

ఆ సమయంలో కూడా రామ్‌సింగ్, అబ్దుల్లాలను చూడలేదు. కనిపించిన ప్రతిలాంతర్ స్తంభాన్నీ "సుల్తాన్‌జీ" అని సంబోధిస్తు ప్రతి రాయినీ చూసి "ఇంకా రెండు నెలలకి నిన్ను పట్టుకెల్తాన్ సుల్తాన్" అని పలకరిస్తు, ప్రతి వస్తువును "సుల్తాన్ - సుల్తాన్" అని ఆప్యాయంగా పరామర్శిస్తు కొంత దూరం తరాటలోనూ. ఇంకొంచెం దూరం పీతనడక లోనూ యమునా నదికి అభిముఖంగా పోతున్నాడు పిచ్చివాడు. అలా చాలా దూరం ప్రయాణంచేసి, చివరికి యమునా తరంగిణి ప్రక్కన ఉన్న భీకర స్మశానానికి చేరాడు.

♦ ♦ ♦

అమావాశ్య నిశి. అంధకారబంధురం. మింటిని ఉన్న తారలకాంతి దూరాన ఉన్న ఢిల్లీలోని దీపాల కాంతి ఒక్కటిగానే ఉన్నాయ్. మినుకు-

మినుకుమంటూ, సగం కాలిన శవాలు, పూర్తిగా కాలి నితగలబడిన కాష్ఠాలు, అంధకారంతో అక్కడక్కడ తళుక్ - తళుక్ అని మెరుస్తున్న మిణుగురు పురుగులు, ఆరిపోతున్న అగ్నిజ్వాలలు, వికృతంగా వినిపిస్తున్న నక్కల కూతలు, యమునా తరంగిణీ మీదినుంచే పయస్సు కఠిన శిలలనైనా గజ-గజ వణికించగల చల్లనిగాలి, యమునా తరంగిణీ ఘోష, బ్రహ్మరాక్షస్సమూహోల్లా అపుపిస్తున్న మింటినంటే వృక్షజాలం, కీచ్ అనే కీచురాళ్ళ శబ్దం, ఎంతటి గుండెనిబ్బరం గలవాడినైనా హడలుగొట్టిస్తుందా స్మశాన వాతావరణం. ఇక్కడే పద్దెనిమిది అక్షోహిణుల కౌరవ సైన్యం భారత యుద్ధంలో భస్మమైంది. తర-తరాలుగా ఢిల్లీ సామ్రాజ్యాన్ని పాలించిన సార్వభౌములంతా ఈ స్మశానానికే చేరారు. సార్వభౌముని మొదలు, సామాన్యుని వరకూ ఈ స్మశానంలోనే భిత్తికా రూపాన్ని దాల్చారు. బ్రతికున్నంతకాలం ఒక జీవి రాజాంతఃపురాలలో వర్ధిల్లుతూంటే మరొక జీవి పూరి పాకల్లో ప్రొద్దు పుచ్చుతుంది. ఒక జీవి పంచభక్ష్య పరమాన్నాలతో కండలను పెంచితే, మరొక జీవి అంబలి తాగి కండలు కరిగిస్తుంది. బ్రతికి ఉన్నన్నాళ్లూ వాళ్ళిద్దరి మధ్య అనంతమైన అగాధం. ఒకరు రాజు, ఒకరు సేవకుడు. ఒకరినోట్లో బంగారపు పానపాత్ర. మరొకరికి అంబలి తాగేందుకు మృత్తికా పాత్ర. ఒకరి ముఖం మరొకరు చూడరు. ఎవరు ఎవరో ఎవరికి తెలియను. అయితే, అందరికి ఒకటే ధ్యేయం. అందరూ కాలానికి దాసులే. మృత్యువుకు తర తమభేదం లేదు. పెద్దా-చిన్నా తారతమ్యం లేదు. బీదా-గొప్పా, భిన్నదృష్టిలేదు. అందరికీ సమానంగా తన భయంకర కరాళ హస్తాలను చాచి, స్వాగత మిస్తుంది సాదరంగా. ఆ స్వాగతాన్ని నిరాకరించటం రాజులకే కాదు, రాజాధి రాజులకూ, సార్వభౌములకు కూడా అసాధ్యం. ఆ ఆహ్వానాన్నందుకున్న తరువాత అందరూ ఒకటే. అందరికే జరిగేది ఒకే మర్యాద. వారందరికీ విడిది ఒకటే. మృత్యుదేవి నిర్మించిన భయంకర సుందర భవనం ఈ యమునా తటిపైనున్న స్మశానం. పిశాచి బాంధవశ్రేణికి ఆలవాలం. టక్కరి భూతమాంత్రికులకు ఆటపట్టు.

నిర్భయంగా ఆ స్మశానంలోకి "ఢిల్లీ సుల్తా పట్టుక పోతాన్!" అనే అరుపులతో బయలుదేరాడు పిచ్చివాడు.

అల్లంత దూరాన అతన్ని అనుసరిస్తున్న చారులు ఆ విషయం చూచి ఆశ్చర్యపోయారు. ఇంతవరకూ అర్ధరాత్రివేళ భయంకర స్మశానానికి వెళ్ళినవాడంటూ లేడు. ఒకవేళ వెళ్ళినా తిరిగి వచ్చినవాడు లేడు.

"అరే! అబ్దుల్లా భాయ్! వీడు నిజంగా పిచ్చి ముండా కొడుకే! అంతేకాదు. వీడి పిచ్చిలో తెగింపు కూడా వుంది. లేకపోతే, అర్ధరాత్రి వేళ స్మశానంలోకి అలా జొరబడటం ఏమిటి?" అన్నాడు రాంసింగ్, స్మశానానికి అల్లంత దూరాన ఉన్న ఒక చెట్టును అభ్యంతరంగా చేసుకుంటూ.

"అదే, భాయ్! మాకి కూడా తెల్వాఁంగా ఉంది. ఇంత ఆదా రాత్రిమే ఈ పాగల్‌కా బచ్చా ఈ మశానంమే ఎందుక్కా-తిరుగుతాడ్?"

"ఏం చేస్తాడో చూస్తాంగా, భాయ్!" తెల్లవారేవరకూ వీణ్ని కని పెట్టి ఉండాల్సిందే ఈ రోజు రాత్రితో వీడి పిచ్చి నిజమో, కాదో తెల్చుకోవాలి."

"అచ్ఛా! అచ్ఛా! నాదీ కూడా అదే బుద్ధి. నాకీ ధైర్యం పాలుకొద్ది తక్వా అయింకీ కానీ, లేకపోతే-అతడితోసాటూ మశానంలోకి ఎల్లి ఉండే వాడీని."

"మరేం ఫర్వాలేదు, భాయ్! ఆ కాలుతున్న కాష్టాల వెలుగులో వాడు చేసే ప్రతీ పనీ మనం చూడవచ్చు"

వీరి మాటలు పిచ్చివాడికి వినిపించినట్టులేదు. అతడు చిన్నగా స్మశానంలోగల ఒక నిర్ణీత స్థలానికి వెళ్ళాడు. క్రిందకి వంగి ఒకమృత్తికా పాత్ర తీసుకున్నాడు. ఆ తరువాత స్మశానానికి ఆవలిదరిన యమునా తరంగిణికి వెళ్ళి, ఆ పాత్రనిండుగా నీళ్ళు ముంచుకుని మరలి వచ్చాడు. ఆరిపోతూ ఉన్న నాలుగు కాష్టాల నొకచోట చేర్చి, దానిచుట్టూ మూడు రాళ్ళను పెట్టి, వాటి మీద జలపూరితమైన మృత్తికా పాత్రనుంచాడు. ఆ తరువాత తన జోలెలోని పిడికెడు బియ్యాన్ని తీ పాత్రలో చేసి,

"అమ్మయ్య!" అనుకుంటూ ఆ భయంకర రుద్రభూమిలోనే విశ్రాంతి కోసం మేను వాల్చాడు. అయితే, అతనేపని చేస్తున్నా, తన నినాదాన్ని మాత్రం మరచిపోలేదు. అప్పుడప్పుడూ "ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్! అనే గావు కేక పెడుతూనే ఉన్నాడు! ఆ గావు కేకకు నలువైపులనుంచీ వచ్చే ప్రతిధ్వనిని విని నవ్వుతూనే ఉన్నాడు. కొంత కాలం గడిచింది. పాత్రవేడెక్కింది. నీరు మరగసాగాయి. గుడ-గుడ శబ్దం రాసాగింది. పిచ్చివానికి ఆవిలింత వచ్చింది. అది ఒక అనవసరపు ఆవులింత. అర్థం లేని ఆవులింత. రావలసిన సమయంకాదు. కాని వచ్చింది. ఏమిటి? ఏమిటి దీనర్థం? అనే జిజ్ఞాసంలో పడ్డాడు పిచ్చివాడు. అనవసరపు ఆవులింతకు మహత్తరమైన కారణం ఉండాలి. ఆ కారణంకోసం అతని నిశితవీక్షణలు చీకటి చీల్చుకుంటూ నలువైపులా చొచ్చుకుపోసాగాయి. అనతి కాలంలోనే వాటి కృషి ఫలించింది.

దూరాన ఉన్న ఒక వృక్షమూలాన రెండు ఛాయాకారాలు సన్న సన్నగా కదలటం గమనించాడు. "ఓహో!" అన్నా డొకసారి పిచ్చివాడు. ఆ వెంటనే "హెహేయే ...! అంటూ లేచాడు. ఆ తరువాత "ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్! అంటూ నెగడు చుట్టూ ప్రదక్షిణం చేయసాగాడు. ఇంతలో ఉడుకుతున్న పాత్రలోని నీరు పెల్లుబికి, క్రిందకిజారి మంటలో పడి "చుయ్!-చుయ్!" మనే శబ్దాలు చెయ్యసాగింది. పిచ్చివాడు హఠాత్తుగా నిలిచిపోయాడు.

"హుఁ! ఇదా సంగతి! నేనెవరన్నా మొగుడు చచ్చి ఏడుస్తున్నా రేమో ననుకున్నాను"

గుడ గుడమని ఉడుకుతోంది
కుండ కుయ్యిమంటున్నది,
ఓ నా మృత్తికా పాత్రమా!
ఓ నా జీవనజ్యోతీ!
ఓ నా అన్నపూర్ణ బొచ్చా
ఓ నా ముద్దులొలుకు చిప్పా!
శతాబ్దాల తరబడి

చేశావ్ చాకిరి మానవుడికి
అయినా, నిన్నా నీచుడు
నిప్పులపై పెడుతున్నాడు
కృతఘ్నుడు....
అసలే మానవుడే కృతఘ్నుడు
మట్టిలోనుంచి వచ్చి
మట్టిని కణకణ కాల్చే
ఆ మానవుడుంటే యేం
మాడి మాడి చస్తే యేం.
ఓ నా సోదరీ!
ఓ నా మృత్తికా!
నీ ఏడుపు విన్నానే
అనవసరపు ఆపులింత
నా కళ్ళను తెరిచింది
చూచుకో-రాచుకో
పునర్జన్మ లేకుండా
ఇస్తున్నా నీకు ముక్తి
నా భుక్తిని వదిలేస్తూ
ఢం-ఢం-ఢం-ఢం-ఢాం——"

-అంటూ చేతిలోని బొమికతో ఉడుకుతున్న కుండను తపీమని కొట్టి పాశేశాడు. మృత్తికా భాండం నేలబడి బ్రద్దలైపోయింది. ఉడుకుతున్న మెతుకులు చెల్లాచెదరైనాయి.

"హ.... హ....హ....హో...." అంటూ పెద్దగా నవ్వాడు పిచ్చివాడు.

"నీకు ముక్తి వచ్చిందా నీకు ముక్తి వచ్చిందా," అంటూ, ఒక్కొక్క మెతుకునే చేతిలోనికి తీసుకుంటూ ప్రశ్నించసాగాడు.

ఈ విషయాన్నంతా దూరాన్నుంచి గమనిస్తున్న చారులిద్దరికీ ఆతడు పిచ్చివాడనే విషయంలో బాగా నమ్మకం చిక్కింది.

"అరె భాయ్! వీడు నిజంగా పాగల్ ఉన్నాడ్! అందులోసందేహం లేదు. పద భాయ్- ఎల్దాం పద!" అన్నాడు అబ్దుల్లా.

"అవును, సిద్ధాన్నాన్ని మట్టిపాలు చేసినవాడు పిచ్చివాడు కాక మంచివాడెందుకవుతాడు? వెళ్దాం. పద. వీడితో మనకెందుకు? ఇంటికెళితే పెళ్లాలయినా సంతోషిస్తారు, అన్నాడు రాంసింగ్.

ఇద్దరూ అలా కూడాబలుక్కుని నాలుగడుగులు వేశారో. లేదో- అరే భాయిలూ!" అన్న పెద్ద పెడకేక వినిపించింది.

"చచ్చాంరా బాబూ! మనవైపే వస్తున్నాడు" అంటూ పరిగెత్తడానికి దౌడు లంకించుకున్నారు. సిపాయిలిద్దరూ. వారలా పాతికగజాలైనా పరుగెత్తారో, లేదో- ముందుకు కదలలేకపోయారు. పిచ్చివాడు తనదృఢ హస్తాలతో వానిదరినీ పట్టుకున్నాడు.

"అరే భాయీ సాయిబులూ! నాతో సహపంక్తి కని వచ్చి చదన్నమన్నా తినకండా పోతారా?రాండి. ముగ్గురం కలసి భోంచేదాం' అంటూ ఇద్దరినీ తిరిగి స్మశానానికి లాక్కువచ్చాడు.

"మాఫ్ కీజియే పాగల్ మహరాజ్! మాకీపెళ్ళాలూ ఇంటి దగ్గర వంటా వండీ కాచుకునీ ఉంటార్!" అన్నాడు అబ్దుల్లా.

"అరే సిపాయీభయ్యా! నువ్వు పోకపోతే నీ పెళ్ళాన్ని కేమీ లోటులేదులే! నాకు మాత్రం నాపెళ్ళాం లేదూ? అది నా కోసం పడిగాపులుగా నే దాని కడుపు కాలిందే! అందాక ఎందుకూ? ఊరికొక పెళ్ళాన్ని చేసుకోవడం ఎందుకయినా మంచిది. ఈ ఊళ్ళో నాకు పెళ్ళాం లేదు. నీ కూతుర్నియ్యరాదూ? పెళ్ళియినా చేసుకుంటాను. పిచ్చివాడికి పెళ్ళేమిటంటారా?.... అసలు మనలో మన మాట-పిచ్చితనానికీ,.. పెళ్ళికీ సంబంధం ఏమిటి? సరే, ఆ విషయం తరువాత చూద్దాం గానీ, ముందీ అన్నం తినండి ...? అంటూ గుప్పెడు బూడిద తీసి ఇద్దరి నోళ్ళలోనూ కుక్కసాగాడు.

"అల్లా అల్లా!" అంటూ అబ్దుల్లా. "రామా-రామా!" అంటూ రాంసింగూ గుడ్లు తేలవేశారు.

"అరే భాయ్‌సాబ్! బూడిద మాకే తిన్పిస్తావా? అన్నాడు అతి కష్టంగా అబ్దుల్లా.

"ఇది బూడిద కాదురా, సాయిబూ? గిని పేరు శివానందం. దీన్ని తిన్నవాడికి చీకూ-చింతా ఉండదు. చూడూ-ఇది తినడంవల్ల నేనెంత గున్నానో? చూసి జబ్బ సత్తవ?" అన్నాడు పిచ్చివాడు.

"వద్దు భాయ్! మాకే పులావ్ తింటాం. ఈ బూడి మేము తినలేం, భాయ్!" అన్నాడు అబ్దుల్లా.

"పులావ్ కావురా! పుల్లిస్తరాకులు తిను. నేను తినే భోజ్యాన్ని బూడిదంటావురా, గాడిదా?" అంటూ వీపుమీద ఓ వీశెడు గుద్దును ప్రసాదించాడు అబ్దుల్లాకు పిచ్చివాడు.

"అమ్మబాబోయ్!" అంటూ పరుగుతీశాడు రామ్‌సింగ్.

"నే గూడా వస్తున్నా, భాయ్!" అంటూ అతని వెనకాలే పడుతూ లేస్తూ అనుసరించాడు అబ్దుల్లా.

"వెర్రి వెధవల్లారా! మీరేనా పట్టుకునేది? అంటూ పకపక నవ్వాడు పిచ్చివాడు.

# 19

సుల్తాన్‌కు బందీ అయిన ప్రతాపచంద్ర చక్రవర్తి చింతా క్రాంతుడై, తను బంధింపబడిన ప్రత్యేక భవనంలో ఆలోచనామగ్నుడై యున్న సమయంలో దూరం నుంచి సన్నని మంజీరనాదం, ఆ నాదంతో మేళ విస్తూ —

ప్రియమొరె ఎస్కతి సునా
ప్రీతమ్ మొహె అపనా బనా

—అన్న సన్నని కోమల గాత్రం వినవచ్చాయి. ప్రభువు ఉలిక్కిపడ్డాడు. "ఇంత రాత్రివేళ ఫాతిమా తన భవనానికి వస్తోంది. ఎందుకు?" అనుకుంటుండగానే, మంజీరనాదం, గానం అతి సమీపంలో వినవచ్చాయి.

మహారాజా తల ఎత్తి ఆ వంక చూశాడు. సన్నని మేలి ముసుగులో అవతరించిన, అపర రతీదేవిలా అలంకరించుకున్న ఫాతిమా హంస గమనంతో నడిచి వస్తూంది.

ఆమె రాక గమనించిన కావలివాళ్ళు నిటారుగా నిలచి, శిరస్సులు వంచారు. ఫాతిమా సమీపానికి రాగానే వారి శిరస్సులు నేలకు తాకుతూండగా, వంగి అభివాదమాచరించారు. ఆమె వారి వంక చూచి సంజ్ఞ చేసింది. వారు వెనుతగ్గి నిష్క్రమించారు. ఆమె మెల్లగా నడిచి మహారాజు సమీపంలోకి వచ్చింది.

"అదబ్ అరజ్ మహారాజ్! తమకు సకల సౌకర్యాలు జరుగుతున్నాయి కదా, కొరత ఏమీ లేదు కదా?" అంది.

"ఆఁ! ఒక్క స్వాతంత్ర్యం తప్ప, మిగిలిన మహారాజు భోగాలు సమస్తమూ నా కనుసన్నలలో మెలగుతున్నాయి ఫాతిమా!" అన్నాడు.

"మీ నుండి ఆ మాట వినటం నాకెంతో సంతోషంగా వుంది ప్రభూ."

"ఫాతిమా! ఎన్నో రోజుల నుండి ఒక్క ప్రశ్న అడగాలనుకుంటున్నాను!" అన్నాడు మహారాజు.

"అవశ్యం అడగండి, ప్రభూ!" అంది రజియా.

"ఫాతిమా! మేము కేవలం చక్రవర్తి బందీలం! మేమంటే నీకెందుకింత అభిమానం? నడిరాత్రి కూడా మా యోగక్షేమాలు విచారించగలవారు, ఢిల్లీలో కనీసం ఒక్కరయినా ఉండటం మాకు సంతోషదాయకమే! అయితే, శ్రేయోభిలాషి ఒక స్త్రీ కావడమే మాకు ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది!" అన్నాడు.

రజియా రెండు క్షణాలు సమాధానంకోసం తడబడింది.

"గోప్యమూ, రాజకీయ ప్రధానమూ అయిన రహస్యమైతే చెప్పమని మేము బలవంతం చెయ్యం!"

"కాదు. ప్రభూ! అది గోప్యమూ కాదు, అందు రాజకీయ ప్రాధాన్యతా లేదు, అది కేవలం వ్యక్తిగతమైన విషయం. మన ఇరువురికి సంబంధించినది మాత్రమే!"

"మన ఇరుపురికా, ఫాతిమా? ఏమిటా విషయం? రాజరికాన్ని కోల్పోయి, శత్రుతో ఢిల్లీ సామ్రాట్టు బందీగావించబడిన మేము - నీకే విధమయిన సహాయమూ చేయలేమే!" అన్నాడు మహారాజు.

రజియా అర్థరహితంగా నవ్వింది. "ప్రభూ! ధనమూ - కానుకలు ఆశించీ గానీ! పదవులు ఆశించి గానీ మీ మంచితనాన్ని సంపాదించటానికి ప్రయత్నించటం లేదు ..."

"మరి అయితే, మా నుండి నువ్వు ఆశించినదేమిటి?"

రజియా సందేహించింది.

"చెప్పు ఫాతిమా! మానుండి నువ్వేం ఆశించావు?"

"ప్రభూ! ఒక రసహృదయుడైన కళాకారుని వద్దనుండి స్త్రీ ఆశించే—"

"ఫాతిమా!" గద్దించాడు మహారాజు, 'మేం హిందువులం! నీవు యవన స్త్రీవి...."

రజియా నీరసంగా నవ్వింది. "హుం! యవనులూ, హిందువులూ ఏమిటి ప్రభూ? ప్రేమకు కూడా భేదముందా? ఆ భేదమే ఉంటే నా మనస్సు మీ సుందర రూపాన్ని ద్వేషించక ఎందుకు ఆరాధిస్తుంది? సర్వశాస్త్ర కోవిదులైన మీరు కూడా సర్వనాశనకారియైన జాతి మత భేదాన్ని పాటిస్తారా? జాతి, మతం మానవుడు సృష్టించిన మహాపిశాచాలు. అల్లా దృష్టిలో అందరూ సమానులే! ఉచ్చారణ వేరు కాని, స్వరూపాలు ఒకటే ప్రభూ!"

"ఫాతిమా! నువ్వన్న మాటను కాదనలేను. మహోదాత్తమై, జాతి మతభేదాల కతీతమైన నీ కళాహృదయాన్ని కాదనలేను. కాని ..."

"కాని, ప్రభూ....?"

"కాని, నేను వివాహితుణ్ణి."

"అంతే కదా! మరేమో అంటారనుకున్నాను. నేను పూజనీయురాలయిన మీ మహారాణిని చూసి గర్విస్తున్నానే కాని, అసూయ పడటం లేదు.

ఆమె మనస్తత్వం అర్థమైంది కాదు మహారాజుకి. మరి, ఇంకేమిటి ఈమె వాంఛ?

"ఫాతిమా! నీకు తెలుసు - మేము ఏకపత్నీవ్రతులమని."

"మీ వ్రతాన్ని నేను భగ్నం చెయ్యాలని కోరుకోవటంలేదు."

"అయితే....?" అనుమానంగా అడిగాడు మహారాజు.

"అయినా, మిమ్మల్ని ప్రేమిస్తున్నాను ప్రభూ!"

మహారాజుకు అది ఏ విధమైన ప్రేమో అర్థంకాలేదు, అలానే విస్తుపోయి చూస్తూండిపోయాడు.

"అలా చూస్తారేం, మహారాజా? నా ప్రేమ స్వచ్ఛమైంది. పూర్ణ జ్యోత్స్నాసదృశమైంది! జాతి మత వర్గ రాజకీయ విభేదాలకే కాదు - స్త్రీ పురుష తత్త్వాలకు కూడా అతీతమైంది. తుచ్ఛమైన శారీరక సంయోగ కుతూహలంచే పంకిలంగాని పవిత్ర ప్రేమ అది."

ఆమె లక్ష్యాన్ని లక్షించలేకపోయాడు మహారాజు.

"ప్రభూ! నేను మీ శారీరక సాంగత్యాన్ని అర్థించిరాలేదు. నా హృదయం రసహృదయం! మీ హృదయం రసహృదయం. ఒక కళాకారిణి సాటి కళాకారుని అభివృద్ధిని వాంఛించి, అన్ని నిబంధనలనూ త్రెంచి పురోగమిస్తుంది, మీ రాజకీయాలతో నాకు నిమిత్తంలేదు. నాకు కళామూర్తి అయిన మీరు సజీవులుగా వర్ధిల్లాలి. నేను త్రికరణ శుద్ధిగా వాంఛిస్తున్నది మీ విడుదల...." అంటూ నిశ్చలంగానూ, గంభీరంగానూ సమాధానం ఇచ్చింది రజియా.

ఆమె మాటలు విని తన తొందరపాటుకు నొచ్చుకున్న మహారాజు "ఫాతిమా!" అన్నాడు,

రజియా తల వాల్చింది "మన్నించండి, ప్రభూ! నేను ఫాతిమా కాను."

"మరెవరు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఢిల్లీసుల్తాన్ కుమార్తె రజియా సుల్తానా-మీముందు నిలిచి ఉంది."

మహారాజు సంభ్రమాశ్చర్యాలతో "షహజాదీ! రజియాసుల్తానా? అన్నాడు.

"అవును, ప్రభూ! దురదృష్టవశాత్తూ షహజాదీగా జన్మించాను. ప్రభూ! అరణ్యంలో మిమ్మ గాయకిగా కలుసుకున్నది- మిమ్మ ఏ విధంగానయినా ఉత్తర దిశకు వేటకు పంపడానికే. అక్కడ మాఅన్న అలూఫ్‌ఖాన్ సర్వసైన్యంతో సిద్ధంగాఉండి, మిమ్మ బందీ గావించాలి. కాని. మీ సుందరమైన ఆకారం, రసహృదయం నన్ను కలవరపరచింది. ఏమో తెలియని ఆకర్షణ నన్ను నా కర్తవ్యతా పథాన్నుండి భ్రష్టురాలను గావించింది. అందుకే ఆ నాడు మిమ్మ ఉత్తర దిశకు వేటకు వెళ్ళ వద్దని ప్రాధేయపడ్డాను, అయినా, మీరు వినలేదు. ప్రభూ! ఇప్పటికయినా మించిపోయింది లేదు. మీరు ఈ కోట విడచి తక్షణం బయలుదేరి పారిపోవటానికి సర్వం సిద్ధంచేశాను. నా ప్రార్థన ఆలకించండి! తెల్ల వారేసరికి ఢిల్లీరాజ్య సరిహద్దులు దాటిపోతారు. అంగరక్షకులు అత్యంత విశ్వాసపాత్రులైన వారిని ఏర్పాటు గావించాను. ఆలశ్యం చెయ్యక బయలుదేరండి, ప్రభూ!" అంది.

"షహజాదీ! మీకు మా మీద ఉన్న అభిమానానికి మా హృదయ పూర్వక కృతజ్ఞత! అయితే, మహాంధ్ర మహీపాలుడు, శత్రు భయం కరుడు అయిన ప్రతాపరుద్రుడు ఒక అబల సహాయంతో పారిపోయేటంత భీరువు కాదు. మీ సహాయం తిరస్కరించాల్సి వచ్చినందుకు చింతిం స్తున్నాం!" అన్నాడు.

"ప్రభూ! అలా అనకండి! మీ వంటి ధీరపురుషులు ఇటువంటిపనికి ఒడబడరని కూడా నాకుతెలుసు. అయినా, మా "భయ్యా!" మిమ్మల్ని మోసంతో బంధించి తీసుకువచ్చాడు. మోసానికి మోసంతోనే జవాబు చెప్పాలి! నా మాట కాదనకండి! బయలుదేరండి! ఆలశ్యం అయిన ప్రతి క్షణం అపాయమే!" అంది.

"రాకుమారీ! నేను మీ సహాయంతో ఢిల్లీ కోటనుండి తప్పించుకొని పారిపోతానన్న విషయాన్ని మీరు మరచిపోండి! ఈ సమయంలో మీ చనికి ఇచ్చట శ్రేయస్కరం కూడాకాదు. వెళ్ళి విశ్రమించండి!" అన్నాడు ప్రతాపరుద్ర మహారాజు.

"ప్రభూ! మీరు తప్పించుకుపోవాలి. మీకోసం కాదు! మహాంధ్ర సామ్రాజ్యంకోసం! అనుపమ శౌర్యఖనులైన మీ పాలన క్రిందనున్న దక్షిణాపథం వైపు తేరపార చూడటానికికూడా సాహసించరు, మాతండ్రి సోదరులు. మీరు లేని రాజ్యం మా వారి హస్తగతం గావటానికి కొన్ని క్షణాలుకూడా పట్టదు కనుక, ఆంధ్ర ప్రజల శ్రేయస్సు దృష్ట్యానయినా మీరు పారిపోక తప్పదు!" అంది- అలా చెబితే అయినా మహారాజు వింటాడనే ఆశతో.

"షాజాదీ! ఒక్క ప్రతాపరుద్రుడు లేక పోయినంత మాత్రాన ఆంధ్రం అంత సులభసాధ్యం కాదు.! మహామంత్రి యుగంధరులవారు, ఆయన సోదరులు, తదితర సామంత మహీపాలురు, అంతే కాదు; అవసరంవస్తే ఒక్కొక్క కాకతీయసిపాయి ఒక్కొక్క ప్రతాపరుద్రుడై ప్రళయకాల రుద్రుడై, శాత్రవజన భయంకరుడై పోరాడుతారు," అన్నాడు.

"అలా కాదు, ప్రభూ! మీరు సురక్షితంగా బయటపడేవరకూ నాకు సుఖశాంతులు లేవు. మీరు నా మాట కాదంటే అల్లా.. "

అంతలోనే సర్రున శబ్దం చేస్తూ వచ్చిన ఛురిక, వెనుదిరిగి మాట్లాతున్న రజియా వెన్నులో గుచ్చుకుంది.

"అల్లా, అంటూ రక్తం స్రవిస్తుండగానే నేలకు ఒరిగింది రజియా.

క్షణంలో జరిగిన ఆ భయంకర దృశ్యాన్ని తిలకిస్తుండగానే, షహజాదా విస్ఫులింగాలు వర్షిస్తున్న నేత్రాలతో అచ్చటికి వచ్చాడు.

"భయ్యా!" అంది బాధగా రజియా.

"భ ...య్యా! పాపీ ఆ మాట అనటానికి నీకు అర్హతలేదు. నీచవై ఇస్లామ్ ద్రోహానికి ఒడిగట్టి, ఈకాఫిర్ ప్రభువును బంధవిముక్తుని గావించటానికి ప్రయత్నించిన నీకు తగిన శిక్ష ఇదే"! అన్నాడు.

"ఏం పనిచేశావు, షహజాదా? మగవాడవై యుండి అబలను సంహరించి, స్త్రీ హత్యా మహాపాపం కట్టుకున్నావా?" అన్నాడు జాలిగా మహారాజు.

"భయ్యా! కాదు.... షహజాదా?" అంది నీరసంగా రజియా.

"కాఫిర్, ఇస్లామ్! ఈ భయంకర భేదమే మన జాతిలోని మంచితనాన్ని, కూకటి వ్రేళ్ళతోసహా కూలుస్తోంది. ప్రతాపరుద్రుడు మనకు ఏం అపకారం గావించాడు? ఆయన రాజ్యం అన్యాయంగా అపహరించకపోతే, మనకు భుక్తి గడవదా? షహజాదా! అహంభావంతో, అధికార లోభంతో యావద్భారతం మీద ఏకఛత్రాధిపత్యం సాధించాలని మీరు మతం పేరిట గావిస్తున్న ఈ దారుణ మారణహోమం ఇకనయినా నిలుపు చెయ్యండి. "భాయీ-భాయీ" అంటూ చేయి-చేయి కలిపి శాంతి మార్గాన పురోగమించండి. ప్రతాపరుద్రమహారాజును గౌరవంగా విడుదల చేసి, బలవంతుడైన ఆ ప్రభువుతో మైత్రి సాధించి: దేశమంతటా శాంతిని నెలకొల్పండి. అప్పుడే నీ జాతికి విలువ హెచ్చుతుంది. లేక ఇదేవిధంగా అధికారాపేక్షతో, రాజ్యకాంక్షతో విర్రవీగితే సర్వనాశనం తప్పదు- అంటూ మహారాజు వంక చూచి-

"ప్రభూ నా ప్రయత్నం విఫలమైంది; నా జీవితం అంతమైంది. కాని, న్యాయమార్గ వర్తనులైన సంచరించేవారికి అల్లా ఎప్పుడూ తోడ్పడుతాడు. మీకు తప్పక విజయం సిద్ధిస్తుంది, శెలవు-ఖుదాహాఫిజ్— అదృష్టముంటే మరు జన్మలో ...,

"అంతే! రజియా అందమైన శిరస్సు నేల వాలిపోయింది ఆమె జీవుడు అల్లాలో ఐక్యమైపోయాడు,

ఆ కరుణాభరిత దృశ్యం గాంచి. మేరుపర్వత గంభీరుడైన మహారాజు తన పట్టు వస్త్రంతో అశ్రువులు తుడుచుకుంటూ, ఆమె మృత దేహం వంక దీనంగా చూస్తూ ఉండిపోయాడు.

మహారాజు అలా చూస్తుండగానే షహజాదావారి పెద్దఖోజా వచ్చి- రజియా దేహాన్ని, భుజంమీద వేసుకొని వెళ్ళిపోయాడు.

కొద్ది క్షణాల క్రితం ఆమె చండశాసనుడైన, భూలోక దేవేంద్రుడైన ఢిల్లీ సుల్తాన్ ముద్దుల పట్టి- ఈ క్షణాన పాంచభౌతికమైన ఆమె శరీరప్రాణాలు తన్ను వొదలిపోగా, యమునా నదిలోని మత్స్య సంతతికి ఆహారం కాబోతూ ఉంది అనుకున్నాడు మహారాజు,

# 20

సుల్తాన్ వారికి సలాంచేసి మన్వి చేసుకుంటున్నాం. వాడు నిజంగా పాగల్ ఉన్నాడ్. తిండితిన్కా తిండి లేదు! కట్టుకోటాన్కి బట్టాలేదు: ఒరడూ పెట్టేదినేది లేదు అయినే, హమేషా "ఢిల్లీ సుల్తాన్ వాల్కి పట్కాపోతాన్" అని అరుస్తూ తిర్గుతూ ఉంటాడ్.... అంటూ నగర రక్షకుడు రహీమ్ సుల్తాన్ వారికి మనవి చేశాడు. ఒకనాటి సాయం సమయాన.

ఢిల్లీ సుల్తాన్ ఘ్యాజుద్దీన్ తుగ్లక్ ఆ వార్తను ఆశ్చర్యంగా ఆసక్తితో వింటున్నాడు.

"అతణ్ణి నీవు స్వయంగా చూశావా?"

"చూసినాన్ సర్కార్! చూసినంతవర్కూ నాది సూఝ్కి మన్ని బహుత్ పాగల్‌గా తోచినాడ్. అయినా, సరీ అంటూ హెండ్రెడ్కానా మంసీదీ హనోక్కనీ సిపాయీలుఅబ్దుల్లా - రామ్‌సింగ్‌లను పంపి ఎసినాన్. వాళ్ళు రెండూమంకి ఆ పాగల్ గాడ్కి హమేషా రెండు నిండూ రోజుల్ గస్తీ కాసినార్. వారీ మాటా చూస్తే వాడు బహుత్‌పాగల్.తింకీ ష్మశానంలో పండూకొని హుడ్కుతూ హున్న కుండన్ పట్టి బొక్కె తీస్కూ కపీమంటూ బాదేయేసినాడ్."

"చాలా విచిత్రమైన మనిషి."

"అదే సాబ్, మాకీకూదా సెప్తున్నాం రాయితో మాట్లాడ్తాడ్? ఎతో మాట్లాడ్తాడ్ ..."

"వాడి నివాసం?"

"పక్లియేలా హీధీలో తిర్గుతాడ్. రాత్రియేలా వల్లకాటిలో తిర్గుతాడ్. కంకీమీద రెప్ప చచ్చినా పెయ్యడ్ సెప్తార్ మనసిపాయీలు:"

"సుల్తాన్ వారికి ఆ పిచ్చివాణ్ని స్వయంగా చూడాలనే కోరిక కలిగింది. తక్షణం ఆ కోరికను దుర్గరక్షకుడు రహీమ్‌కి ఎరిగించాడు, రహీమ్ మొదట్ల కొంచెం ఆశ్చర్యపోయినా, సుల్తాన్ వారి నైజాన్ని

తెలిసినవాడు కావటంవల్ల వెంటనే అందుకు ఒప్పుకున్నాడు. అయితే, సుల్తాన్‌వారు బహిరంగంగా కాకుండా. మారువేషంలో బయలుదేరాలని విన్నవించుకొన్నాడు. దానికి సుల్తాన్ వారు కూడా సమ్మతించారు. ఆ తరువాత కొద్ది క్షణాలలోనే సుల్తాన్‌వారు రహీమ్‌తో కలసి సామాన్య జనోచితవేషంలో కోట విడలి బయలుదేరారు ఢిల్లీనగరాభిముఖంగా అప్పటికి ఇంకా సూర్యాస్తమయం కాకపోవటంవల్ల పిచ్చివాడు వల్లకాటికి చేరి ఉండడని రహీమ్ సుల్తాన్‌వారికి మనవి చేశాడు. అందు మీదట వారిద్దరూ ముందుగా నగరంలోకి వెళ్ళి పిచ్చివాణ్ని చూసి, ఆ తరువాత అతణ్ని స్మశానానికీ అనుసరించి ఎలాగైనా సరే- ఆ పిచ్చివాడి అసలు రూపు పిచ్చితనం ఔనో, కాదో నిశితంగా తేల్చుకోదలుచుకున్నారు.

నగరంలో ప్రవేశించి నాలుగయిదు వీధులన్నా దాటక ముందే పిచ్చివాడి గంభీరమైన కంఠధ్వని కర్ణరంధ్రాలకు సోకింది.

ఢిల్లీ సుల్తాన్- పటుకపోతాన్!
మల్లీ మాట్లాడితే- హైరత్తుకాపోతాన్!
మక్లీ సుల్తాన్-పట్టుకపోతాన్!
సాతిక రోజుల్లో- పట్టిబందిస్తాన్!
రాజులూ రాజులూ-తన్నుకుంటుంటే
సచ్చిపొయ్యేదీ- సామాన్య సిపాయ్
బురుజులూ గిరజులూ- నేల కూలితే
దండుగ అయ్యేది ధనమంతామంది
ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్!

"అదిగో, సర్కార్! వాడే అపురెల్ హారంతో వొస్తూఉన్నాడేవాడే పిచ్చివాడు. సుల్తాన్ వారికి పకడ్‌లాంగాలని అస్తాడు," అన్నాడు రహీమ్,

"అచ్ఛా అచ్ఛా! మమ్మల్ని పట్టిపోగల్ వీడు. బాగుంది వీణ్ని చూస్తూంటే నా కెందుకో ఒక మహాపురుషుణ్ని చూసినట్లుంది. బ్రహాళి

పాపం! ఈ మతి భ్రమణ రాక ముందు మహా మేధావి అయి ఉండాలని మా హృదయం జోస్యం చెపుతోంది," అన్నాడు సుల్తాన్ గడ్డం నిమురు కుంటూ. సుల్తాన్‌వారి మాటలు ఇంకా పూర్తి కాక ముందే "ఢిల్లీ సుల్తాన్!" అంటూవారి ముందుకు ఛెంగున లంఘించాడు పిచ్చివాడు పొలికముంది చిన్న చిన్నపిల్లల్ని వెంబడి వేసకొని.

"ఢిల్లీ ఢిల్లీ ఢిల్లీ సుల్తాన్ పట్టి పట్టి పట్టుకుపోతాన్!" అన్నాడు పిచ్చివాడు సుల్తాన్ వారి కళ్ళలోకి సూటిగా చూస్తూ.

ఆ చూపులకు క్షణకాలం అదిరిపోయాడు సుల్తాన్. ఆతర్వాత అతడు పిచ్చివాడినే విషయమూ. తాను సామాన్య పౌరుని వేషంలో ఉన్నాననే, విషయమూ గమనానికి వొచ్చాయి సుల్తాన్‌కి. వెంటనే సుల్తాన్ స్వస్థు డయ్యాడు.

"అరే పాగల్ భయ్యా! నీకీ ఏ దేశం? తిండీ, గుడ్డా లేక ఎందుక్కీ ఈవుల్లో తిర్గుతూ ఉన్నావ్ ఢిల్లీ రాజు గార్కి పరవ్‌లే జాపుంగా అని అంటూ తిర్గతూ ఉన్నావ్. అయినా నీకే ఏం అన్యాయం చేసినాడ్?" అంటూ అడిగాడు రహీమ్ పిచ్చివాణ్ని.

"ఎవర్రా పిచ్చివాడు? పాగల్ భయ్యా అంటావ్. నీకు పిచ్చి! నీ యబ్బకు పిచ్చి! వాణ్ని కన్నవాడి జేజేకు పిచ్చి! చూశావ్ ఢిల్లీ సుల్తాన్ని పట్టుకెళ్తాను. ఎందుకూ అంటే. అది నా ఇష్టం. మీ సుల్తాన్‌కి తన ఇష్ట మొచ్చిన దేశాన్ని దండెత్తి జయించే స్వాతంత్ర్యం ఉన్నప్పుడు నా ఇష్ట మెచ్చిన వ్యక్తిని పట్టుకోటానికి నాకధికారం లేదా? నా సుల్తానంటే నా కెంతో ప్రేమ. నా ముద్దుల సుల్తాన్ మొహిరీ సుల్తాన్ వరాల సుల్తాన్ వజ్రాల సుల్తాన్! ఎక్కడున్నావ్? ఏం చేస్తున్నావ్ కోటలో అంతమంది భటులమధ్య స్వేచ్ఛ లేక బందీగా ఉన్నావా? నిన్ను విడిపించి నా దగ్గరనా ఖైదులో ఉంచుకుంటాలే! పొలిక రోజులు ఓపిక పట్టు విడిపిస్తాను.

పిచ్చివాడి ధోరణి ఆశ్చర్యాన్ని కలిగించింది రహీమ్‌కి. సుల్తాన్ వారికి మాత్రం పిచ్చివాడి ధోరణి ఆహ్లాదకరంగా తోచింది. వాడు తనకొక అజ్ఞాత భక్తుడు అనుకున్నాడు సుల్తాన్.

ఏయ్! నీ మాట చూస్తే భయంకరంగా ఉంది. మనిషిచూస్తే పిచ్చి వాడూలా ఉన్నావ్. నీది పిచ్చి, నిజం పిచ్చి, లేక నకిలీ పిచ్చి.... మాకీ నీ వివరాల్ వివరంగా కావాలి?" అన్నాడు రహీమ్.

'నీ వెవర్రా వివరాలడగటానికి? నువ్వేం రాజువా, లేక సుల్తానువా?'

"అయితే, సుల్తాన్‌గారికి తప్ప ఇతరులకు చెప్పవా?" అన్నాడు సుల్తాన్.

"ఊఁహూఁ! అన్నాడు పిచ్చివాడు.

"అయితే, సుల్తాన్ గారే అడుగుతున్నారు, చెప్పు"

"ఓరి పిచ్చి గాడిదా? నువ్వురా సుల్తాన్‌వి? అయినా, సుల్తాన్‌గారి పనుపుంటున్నావ్ కాబట్టి, నీ పెత్రనీ మెచ్చి నీకు సమాధానం చెప్తా. అండ పిండ బ్రహ్మాండమంతా నిండియున్న నాకు.... ఊరేమిటి? పేరేమిటి? నాకు పెద్దలు పేరు పెట్టటానికి. పేరులో ఏముంది చెప్పు? నా పేరు పిచ్చా డంటుంది లోకం; లోకమే పిచ్చిదంటాను నేను. ఇందులో ఏది సత్యం? ఏది అసత్యం? సత్యస్వరూపుడు పరమాత్ముడు; పరమాత్మ స్వరూపం నేను ఆది మధ్యాంతరహితుణ్ని అయిన నేను ...అసత్యాన్ని, సత్యాన్ని రెండు కళ్ళుగా చూస్తుంటాను. అబద్ధాలు ఆడాలన్న నియమంలేదు; ఆడకూడదన్న నిషేధం లేదు. చాలా ఈ వివరాలు?"

"అహో! బస్ బస్! వివరాలా క్యా హైనై నీవు పాగల్ ఏక్ న్నావ్," అన్నాడు రహీమ్

పిచ్చివాడు వికటాట్టహాసం చేశాడు.

"అహ్హాహ్హాహ్హాహ్హా! పిచ్చివాణ్ణి, నిజంగా పిచ్చివాణ్ణి పసికళ్ళు కమ్మిన వాళ్ళకి లోకమంతా పిచ్చిగా కనిపిస్తుంది. సందేహంలేదు. కల్లు త్రాగిన వాడికి కళ్ళు తిరిగి ప్రపంచం తలక్రిందులుగా కదిలిపోతున్నట్లు కనిపిస్తుంది. నేను నేను ఓ పెద్ద నయవంచకుణ్ణి నాకు లోకమంతా నయవంచకగానే కనిపిస్తుంది. నేనెవరో తెలుసా? తెలియ చెప్తాను.

నా బుద్ధి మర్మంబు
నాకు ఎరికోయీ
నా బుద్ధి ఎదవదని
నాకు తెలుసోయీ
పాలు పోసిన సామి
ప్రాణాలు తీస్తాను
ఆదరించిన సామి
అనువులను తోడేస్త
పుట్టుకతో వచ్చింది ఈ బుద్ధీ
పుడకలతో పోతుంది ఈ బుద్ధీ
నా నాటకమునెరుగ
నా బూటకము తెలియ
ధాతకైనను గాని
తరము గాదోయి ॥నా బుద్ధి॥
దానులను కాస్తాను
దొంకలను కొడతాను
కార్యసాధన కొరకు
కాని పని చేస్తాను ॥నా బుద్ధి॥
పక్షులను పలికిస్త
ఏకాక్షులను చేస్త
గోడలకు చెవులెట్టి
గోతులను త్రవ్విస్త ॥నా బుద్ధి॥

"ఔనురా! చూడు చూడు. గోతులు త్రవ్వుతాట్ట, ఈ పిచ్చిగాడిద కొడుకుది ఉత్త పక్కా బుద్ధి! అన్నాడు అక్కడచేరిన పిల్లవాళ్ళల్లో ఒకడు.

ఆ పలుకులను విన్న పిచ్చివాడు విచిత్ర మరిదహాసాన్ని చేశాడు.

"ఒరే బాబులూ! పొరపాటు పడుతున్నారు. అంతర్యం మీకు ఇంకా అందింది కాదు. నన్ను పక్కతో పోలుస్తారేంరా?

కుక్క అంటె తేలికా?
కుక్కకు విశ్వాసముంది
నా డొక్క చీల్చి చూసినా
విశ్వాసం కానరాదు
తనవాడని ఎవడైనా
చేరదీస్తే నన్ను
తంటాలపాలు చేసి
తప్పుకోని పారిపోత
మనుషులకి మనుషులకీ
లడాయీలు పెడతాన్
వాళ్ళు తన్నుకు ఛస్తే
పకపక నవ్వేస్తాం
నమ్మించడానికై
సత్యాలు పలుకుతూ
నమ్మిన వెంటనే
నట్టేట ముంచుతా
నా నటన తెలియంగ మీకు తరమా?
నా పలుకు లెఖగంగ మీకు తరమా?
"ఇంతకూ నేనెవరో తెలుసా!
నేనో కాలకూట విషాన్ని
నేనో వాతూలాశన స్వామిని
ప్రళయకాల మహోగ్ర బడబానల జ్వాలను
మూర్తినొందిన మృత్యుదేవత వికటహాసాన్ని
కదన దేవత కరమ కోరల మలచి చేసిన మారణాన్ని
కాలకంఠ కంఠస్థిత హాలాహల స్వరూపాన్ని
కాళికాంబిక వదన గహ్వర అరుణవర్ణ స్వరూపాన్ని

కాలభైరవ పాదతాండన మృత్యుధూళీస్వరూపాన్ని
కలికమూర్తి కరమునందలి కాలఖడ్గ స్వరూపాన్ని

—అంటూ తన చేతిలోని బొమికను ఖడ్గంలా ఎంచి, లాఘవంగా చాలనం చేస్తూ "నన్నెదుర్కొన్నవాడు నాశనం అవుతాడు. నా శక్తికి ఎదురు వచ్చినవాడు నేరుగా కాట్లోకి తేలుతాడు. పోండి పోండి! మీరంతా పిచ్చి వెధవలు. మీతో మాట్లాడితే నాకు పిచ్చి వొచ్చేట్టు ఉంది. పోరేంరా బడుద్ధాయిలూ! పోరా-అవును పోరు. మీరు మర్యాదగా పోరే వేందే ముంది? మీ వీపులు వాయిస్తూ నేనే మీకు దూరంగా పోతా!" అంటూ పిచ్చివాడు తనకెదురైన ప్రతివాణ్ణీ తనచేతిలోని దుక్కిఎముకతో ప్రహరిస్తూ ముందుకు బయలుదేరాడు.

తమను కూడా ఆ ప్రహారాలతో సత్కరిస్తాడేమో అనే భయంతో సుల్తాన్-రహీమ్ కూడా ప్రక్కకు తప్పుకున్నారు. పిచ్చివాడు ముందుకు సాగిపోయాడు.

పిచ్చివాడు పోయినపక్కే ఆశ్చర్యంగా చూడసాగాడు సుల్తాన్.

"సర్కార్! వీడు అస్లీ పాగల్ అంటార్-లేక నక్లీ పాగల్ అంటార్!" అన్నాడు రహీమ్

"ఊఁహుఁ! వీడు ఒకటోరకం అసలు సిసలైన పిచ్చివాడు. కాని, వీణ్ణి చూస్తూంటే నాకు ఎందుకో జాలీ-ఆప్యాయతా కలుగుతున్నాయ్."

"కల్గితే కల్గనివ్వండి సర్కార్! కాని, దాన్ని పైకి కన్పించ నివ్వకండి. వీడూ పాగల్ కాకపోతే, మన ఖోటాలో పాగా వేస్తాడ్!"

"ఏం? నీకు అతడు పాగల్‌గా కనిపించలేదా?"

"చూడటానికి పాగల్ ఉన్నాడ్! సందేహంలేదు. కాని .."

మరొక్కసారి పరీక్షించాలంటావ్?"

"జీ సర్దార్! మేమూ అదేమాట మన్వి సెయ్యాలా ఉన్నాం," అన్నాడు రహీమ్.

"అచ్ఛా! అయితే, ఇక్కడినుండి వాడెక్కడికి వెళ్తాడు?" అని అడిగాడు సుల్తాన్ పిచ్చివాణ్ణి అనుసరించే ఉద్దేశ్యంతో,

"అదే చాలా కష్టంగా ఉంది. హింత పెద్ద నగరిమే హెక్కా- హెక్కా తిర్గుతున్నాడో హెలాగా సెప్తాం: కాని ఒక్టియామం దాటిపోతే వాడు వల్ల కాటిలోకి ఎల్తాడ్ చెప్తార్ మాదీ సిపాయీలు."

"అయితే పద! అక్కడికే వెళ్ళిపిచ్చివాడి రాకకోసం కాచుకొని. వాడు రాగానే దాక్కొని, వాడి కార్యక్రమాన్ని పరిశీలిద్దాం!" అన్నాడు సుల్తాన్.

సందేహిస్తావేం, రహీం? భయంగా ఉందా హిందువుల స్మశానం అంటే?"

"లేదు, సర్కార్! సుల్తాన్ వాసు రాతిరియేలా ..."

"కాని. నేనిప్పుడు సుల్తాన్‌ను కాననే విషయాన్ని అనుక్షణమూ మరచిపోతున్నావ్! ప్రచ్ఛన్న వేషంలో సామాన్య పౌరుడిగా ఉన్న నన్ను, సామాన్య పౌరుడిగానే చూడు. కాని సుల్తానుగా మాత్రం చూడకు. నా మారువేషాన్ని ఎరిగి ఉన్న నీకు సుల్తానులాగా కనిపిస్తున్నానుకదా, లోకానికి కూడా సుల్తానులాగానే కనిపిస్తాననుకున్నావా? సామాన్యుణ్ని అయిన నాకు రక్షణ ఎందుకు నడు నడు! ..." అంటూ సుల్తాన్ యమునాతరంగిణి ప్రక్కన ఉన్న స్మశానంవైపుకు దారితీశాడు.

విధిలేక తన ప్రభువును అనుసరించాడు రహీమ్.

తుగ్లక్ సుల్తాన్-రహీములు స్మశానం చేరేసరికి బాగా చీకటి పడింది. అయినా, ఆ ఇద్దరూ ధైర్యంతో స్మశానం మధ్యానికి చేరారు. కాని, ఎప్పుడు వస్తాడో, ఎలా వస్తాడో, అసలు వస్తాడో-రాడో కూడా సరిగ్గా తెలియని పిచ్చివాడికోసం, ఆ భయంకర స్మశానంలో ఎంత కాలమని వేచి ఉండటం? అందుకని ఆ ఇద్దరూ స్మశానానికి ఆవల వైపున యమునా నదీతీరాన ఉన్న యమున గట్టుపచేరి, ప్రొద్దుపుచ్చసాగారు లోకాభిరామాయణం చెప్పుకుంటూ. కాల అతివేగంగా గడిచిపోతోంది. రెండవయామం గడిచిపోయినట్లు కోటలో మ్రోగిన నగారానుబట్టి తెలుసుకున్నారు వారిద్దరూ. కాని, అంతవరకూ పిచ్చివాడి జాడ తెలియక పోవటంతో విసిగి, వేసారి ఆ రాత్రికే వాణ్ని కనిపెట్టే ప్రయత్నం విరమించి, ఇంటికి పోవాలనే ఉద్దేశంతో బయలుదేరి స్మశానానికి అడ్డంగా నడక సాగించారు.

సరిగ్గా వారు స్మశానమధ్యం చేరారో లేదో, ఆ విశాల స్మశానానికి ఆవలి దరినుంచి చిరపరచిత కంఠం వినవొచ్చింది,

"ఢిల్లీ సుల్తాన్- పట్టుకపోతాన్!"

"అదిగో, వాడే సర్కార్! వొస్తున్నాడు. రానే వచ్చాడు. ఇక వాడిక్కడ ఏమిచేస్తాడో! కనిపెట్టాలి." అన్నాడు రహీమ్.

"నిజమే! వాడు మనవైపుకే వొస్తున్నట్లు వాడి కంఠపు సవ్వడి లోని స్థాయీ భేదాన్నిబట్టి నిర్ణయించవొచ్చు. కారుచీకటి రావటం మనల్ని కొంతవరకూ కాస్తున్నది. కాని, దాక్కోవటానికి దగ్గర్లో ఏమీలేదే," అన్నాడు సుల్తాన్ ఆదుర్దాగా.

రహీమ్‌కూడా పరిసరాల్లో ఏమైనా అనువైన ప్రదేశం దొరుకుతుం దేమో అని తరచి తరచి చూశాడు. కాని, ఏమీ కనిపించలేదు- దూరాన ఉన్న వృక్షసమూహం తప్ప. అయినే, ఆ వృక్షాన్ని చేరాలంటే దగ్గరికి వొస్తున్న పిచ్చివాడికి తెలియకుండా పరిగెత్తటం కలలోని వార్త. వాడికి తామక్కడ ఉన్న విషయం తెలిసిందో, తమ భరతం పట్టాడన్న మాటే! ఏమి చేయటానికీ పాలుపోని రహీమ్ నేత్రద్వయానికి అక్కడ. అప్పుడే పూర్తిగా ఆరిపోయిన చితులు రెండు కనిపించాయ్. అతనికి చప్పున ఓ ఊహ తట్టింది.

"ప్రభూ! ఈ రెండు చితులమీదా ఇద్దరం జీవచ్ఛవాలలాగా పడు కుదాం. కాలీకాలని శవాలని పిచ్చివాడు మన జోలికి రాడు. మనంమాత్రం ఇక్కడ ఈ విధంగా పడుకొని వాడి చేష్టలన్నింటిని కనిపెట్టవొచ్చు...." అంటూ కర్తవ్యాన్ని ఉపదేశించాడు రహీమ్.

సుల్తాన్ ఆ సలహాను వెంటనే పాటించాడు ఆచరణలో. అతణ్ని అనుసరించాడు రహీమ్.

తన మామూలు పదాన్ని భయంకరంగా ఆలాపిస్తూ స్మశానంలో ప్రవేశించాడు పిచ్చివాడు. "ఓహోహో రుద్రభూమీ! మృత్యుకాస్వరూప మానవశరీర భద్రస్వామి! నీ అదృష్టమే అదృష్టం. నీ న్యాయమే న్యాయం. మహామేధావి అయినా, నా వంటి వెర్రివెంగళప్ప అయినా, ఢిల్లీశుడైనా దిక్కుమాలినవాడైనా నీ గాఢ పరిష్వంగంలో శాశ్వత సుఖనిద్ర చెందా

ల్చిందే!" అంటూ మండుతున్న కట్టెల మధ్యనుంచి కపాలాలను తన్ను తుంటూ, ఆరిపోతున్న మంటలను ఎగసన్రోస్తూ,తన వేదాంతాన్ని బిగ్గరగ ఉచ్ఛరిస్తూ ఆ స్మశాన భూమిలో ఇచ్ఛవచ్చినట్లు తిరగసాగాడు.

ఆ రుద్రభూమిలో స్వైరవిహారం చేస్తున్న పిచ్చివాడి కాలికి ఏదో మెత్తగా తగిలింది. పిచ్చివాడు క్రిందికి వంగి చూశాడు. అదొక మానవ కళేబరపు కాలు. తల-శరీరం భస్మమైపోయి చితిమీద రూపుమారి ఉన్నయ్ పిచ్చివాడు "అయయ్యో!" అంటూ కిందికివంగి కూర్చుని, ఆ కాలును తన తొడమీద పెట్టుకొని "ఓ సుందరమైన పాదమా! నీవు బ్రతికివున్న శరీరంలో భాగంగా ఉన్నప్పుడు, ఏ మహానుభావుడి ఆత్మనో మోసిన దానవు కదా-అయ్యో; అయ్యో! నీ ఖర్మ ఇలా కాలిందే!" అంటూ ఆ కాలిని ఒకటే పనిగా నిమిరి-నిమిరి పిసకసాగాడు.

సుల్తానా సాహెబా తన కాలు పిచ్చివాడి కబంధ హస్తాలలో నానా బాధలూ అనుభవిస్తున్నా, కదిలిస్తే ఏం చేస్తాడో అనే భయంతో బలవంతంగా జీవచ్ఛవంలా మారిపోయి, భారంగా ఊపిరి పీల్చసాగాడు!

"ఓ నా ముద్దులొలుకు కాలా! తెల్లవారితే నిన్ను ఏ నక్కలో, ఏ గ్రద్దలో పీక్కుపోతయ్. నీకలాంటి దురన్యాయాన్ని నా బొందిలో ఊపిరి ఉన్నంతవరకూ జరగనివ్వను. ఓహో! నీ శరీరం కూడా సరిగ్గా కాలినట్టు లేదు" అంటూ కాలిని దూరంగా విసిరికొట్టి లేచి నుంచున్నాడు పిచ్చివాడు.

ఓ సగం కాలిన శవమిది
చచ్చిపోయిన కట్టె యిది
కాలటానికి డబ్బులేక
సగం కాలి ఊపుకుంది
అనాథ ప్రేతసంస్కారం
కోటియజ్ఞ ఫలాఫలం

—అంటూ పిచ్చివాడు ప్రక్కప్రక్కన కాలుతున్న కట్టెలను రెండింటిని తీసుకొని వచ్చి తన దక్షిణ హస్తంతో వాటిని పైకి ఎత్తి

కాలుచున్న కట్టెలార
మండుచున్న మంటలార

సగం కాలి కాలుతున్న
శవమిది చూడండి
భగ భగ భుగ భుగ
దహించండి
ముక్తి ప్రసాదించండి

—అంటూ పిచ్చివాడు తన దక్షిణహస్తంలోని కాలుతున్న కాష్టాలను-శవాకారంగా సుల్తాన్ వారి పాదాలకూ, రహీమ్ పాదాలకూ చేరువకు చేర్చాడు. ఆ వేడికి తట్టుకోలేక వారు తమ కాళ్ళను కొద్దిగా గింజుకో సాగారు.

అది గమనించిన పిచ్చివాడు ఉషారుగా ఈలవేశాడు. ఆ ఈలకు భయపడి సుల్తాన్-రహీమ్‌లు చెంగున లేచి నుంచున్నారు.

చచ్చిపోయినవాడు భూతమయ్యాడు
పుచ్చిపోయిన కట్టె లేచి నుంచుంది
ఆహాహా! ఓ భూత ప్రేత
పిశాచీబాంధవా
టక్కు టమార గజకర్ణ
గోకర్ణ విద్యాపారంగతా
నేనొక బ్రహ్మాండమైన భూతవైద్యుణ్ణి
నాతో కుస్తీకొస్తావా ?
నాకే గస్తీ కాస్తావా?
ఎవరనుకున్నావ్ నన్ను
పీకేస్తా నీ ఎముకల్ని
పీకేస్తా నీ ఎముకల్ని.

—అంటూ తన చేతిలోని దుక్కిటెముకతో సుల్తాన్‌వారినీ, రహీమ్‌నూ చేదుకోవటం మొదలుపెట్టాడు. "అరే! అల్లా-అల్లా!"అంటూ అరుస్తూ ఇద్దరూ వెనుతిరిగి చూడకుండా పలాయనమంత్రం చిత్తగించారు. పిచ్చివాడు పెద్ద-పెద్ద అంగలతో వారిని వెంబడిస్తూ, స్మశానం అవతలివారా సాగనంపి వొచ్చాడు.

# 21

ఆనాడు ఢిల్లీ నగరం మనోహరంగా అలంకరించబడింది. ఇంటింటా ఆనందం వెల్లివిరుస్తోంది. తన జన్మదినం కావటంవల్ల ఘ్యాజుద్దీన్ తుగ్లక్ సుల్తాను ఆనాడు ఓ పెద్దసభ చేసి తన సరదార్లనూ సేనాధికారులను తగు- తగు విధంగా సన్మానించాడు. ఆనాడు ప్రభుత్వ కార్యాలయాలన్నిటికీ సెలవు ప్రసాదించి, ఉద్యోగులందరికీ ఒక నెల జీతం ఉచితంగా ఇచ్చాడు. ప్రభువు పేరు చెప్పుకొని ఆనాడు ఢిల్లీలోని ప్రతి ఉద్యోగీ భార్యా-బిడ్డలతో ఆనందకోలాహలంలో మునిగి తేలుతున్నారు. ఏ మూల చూచినా విందుల తోనూ, వినోదాలతోనూ నేత్రానందంగా ఉంది. ఇక సైనికాధికారుల సంగతి చెప్పనే అక్కర్లేదు. విపరీతంగా తప్పత్రాగి, జార కామినులను పదిమందిని తమ మధ్య వదేసుకొని కేరింతలు కొడుతున్నారు. త్రాగుడు మైకంలో ప్రపంచాన్నే మరచిపోయారు వారు. గానా - పీనా బజానాలతో నిండి పోయింది ఢిల్లీ నగరం.

ఆనాటి సాయంకాలం తన ముఖ్యులైన వజీర్లకు ప్రత్యేకంగా దర్శనం ఇవ్వదలుచుకున్నాడు సుల్తాన్. సుల్తాన్‌వారి పరిభాషలో ప్రత్యేక దర్శనానికి ప్రత్యేకమైన అర్థం ఉంది ఆ రోజున సుల్తానావారు ఓ విందు చేస్తారు? అది సాధారణమైన విందు కావొచ్చు· విందు కావొచ్చు, ఆ విందుకు ప్రత్యేక ఆహ్వానితులు ఉంటారు· ఆహ్వానితులంతా విధిగా ధన వంతులైనవారు మాత్రమే ఉంటారు. వారు విందు సందర్భంలో సుల్తాన్ వారిని ప్రత్యేకంగా దర్శిస్తారు. అలా దర్శించినప్పుడు సుల్తాన్‌వారికి ప్రత్యేకమైన, అపురూపమైన కానుకలను అందిస్తారు. వాటి విలువ లకా రానికి అటూ-ఇటూగా ఉంటుంది· ఇలా అనేక వ్యక్తులు అనేక లకారాలను సుల్తాన్‌వారికి ప్రత్యేకంగా సమర్పించి, ప్రత్యేక దర్శనాన్ని చేసుకొని, వారొసగ్న విందు సత్కారాలను పరిగ్రహించి, ఇంటికి తిరిగి వెళుతుంటారు ఇది ప్రత్యేక దర్శనం యొక్క ప్రత్యేక లక్షణం.

ప్రతి దర్శనానికి పాతిక లక్షల వరహాలున్నా లాభం ఉంటుంది సుల్తాన్‌వారికి. సుల్తాన్ వారి పరిపూర్ణ కటాక్షాన్ని యాచించే సరదారులకు ఇదో సదవకాశం ఒకణ్ణిమించి మరొకడు సుల్తాన్‌వారికి సంతోషపెట్టటం కోసమని పోటీలు పడుతుంటారు ప్రత్యేక సమర్పణ రూపంలో. సుల్తాన్ వారికీ ఈ విషయం తెలిసినా, తెలియనట్లుగానే ఉంటూ తన లక్ష్యాన్ని నెరవేర్చుకుంటాడు. ఆయన లక్ష్యం ధనార్జన.

ఆనాడు సంధ్యాసమయంలో సుల్తాన్‌వారు తమ విరామా రామంలో ప్రత్యేకంగా కొలువు తీర్చాడు. సరదారులంతా ఒక్కొక్కరే బంగారు పళ్ళాలలో మొహరీలు పోసి, వాటిని రంగు రంగుల పని చీనాం బరాలతో కప్పి, సుల్తాన్‌వారి పాదాల ముందుంచి వంగి - వంగి సలా ములు చేస్తూ, వెనుకకు జరుగుతూ వెళ్ళి తమ ఆసనాలను అలంకరిస్తున్నారు. తన పాదాలకడ క్షణ-క్షణానికి పెరిగిపోతున్న ధనరాశిని చూసి లోలోన మురిసిపోతున్నాడు సుల్తాన్.

“వజీర్లూ సరదార్లూ, మీరు చేసిన ఈ సన్మానానికి మేము చాలా సంతోషిస్తున్నాం. మీకందరికీ అల్లా కృప పరిపూర్ణంగా కలగాలనీ, మీరు ధన్య సంపదలలో ఇంకా అభివృద్ధి కలిగి, మా పాద పూజ చేయటానికి, నజారానాలు అర్పించటానికి మీరు ఇంకా కలవాళ్ళు కావాలనీ ఆశీర్వ దిస్తున్నాం!” అన్నాడు సుల్తాన్.

వజీర్లంతా కరతాళధ్వనులు చేశారు. లోలోన సుల్తాన్‌వారి ఆశీర్వా దంలో ఉన్న అంతర్యానికి విస్తుపోతూనే

“సుల్తాన్‌వారి దయ ఉండాలి గాని. ధనమంతా వారిదే” అన్నాడొక వజీర్.

“ఆ మాటకొస్తే మా ఆస్తిపాస్తులన్నీ వారివే!” అన్నాడు మరో వజీర్.

వారి మాటలకు సుల్తాన్ సంతోషించాడు. అది చూసి వజీర్ అందుకున్నాడు-తానెందుకు తక్కువ తినాలని.

"ఆ మాటకొస్తే మా ప్రాణాలు వారివి. మా దేహాలు వారివి మా బిడ్డలు వారి బిడ్డలు. మా భార్యలు...."

"ఛూత్!" అన్నాడు సుల్తాన్.

వాచాలత్వంలో తాను నోరు జారిన విషయాన్ని గ్రహించి నాలిక కరచుకున్నాడు ఆ వజీర్.

అంతలో షాజాదా అలూఫ్ ఖానుడు ప్రవేశించాడు. అతడు పాదుషా వారికి నజరానాలేమీ వెంట తీసుకొని రాలేదు. ఆ విషయం గ్రహించిన సుల్తాన్‌వారు లోలోన మండిపడసాగారు. కొడుకైతేనేం? ప్రత్యేక దర్శనానికి వొచ్చేటప్పుడు యువరాజు తన హోదాకు తగిన నజ్రానా తీసుకొని రావాలి. ఈ రోజు యువరాజు ఆచారాన్ని మన్నించక రిక్త హస్తాలతో వొస్తే, రేపటినుంచి ప్రతివాడు అలానే వొస్తాడు. అప్పుడు ప్రత్యేక దర్శనంలో ప్రయోజనమే పోతుంది.

మందిరంలో ప్రవేశించిన షహజాదా సుల్తాన్ వారికి వంగి -వంగి సలాం చేసి, తన అంగరఖాలోనుండి ఒక పచ్చల పతకాన్ని తీసి సుల్తాన్ వారి పాదాల ముందు పెట్టాడు అతని అంగరఖానుండి వెలువడిన వెంటనే పచ్చల పతకం దేదీప్య మానంగా జగజ్జీయమానంగా ప్రకాశించి, ఆ ఆరామ మందిరాన్నే పట్టపగలులా మార్చివేసేంతగా వెలుగొంద సాగింది. దాన్ని చూసిన వెంటనే సుల్తాన్ వారికి ఎనలేని సంతోషంవేసింది అతని కనులు మిరిమిట్లు గొలుపసాగాయ్. కొద్ది కాలంలోనే బెల్లి కమ్మినంత పనైంది

"షహజాదా! అల్లానిన్ను ఆశీర్వదిస్తాడు. ఆ పతాకాన్ని మాకు బహుమతిగానేనా సమర్పించుకుంటున్నావ్?" అంత అమూల్యమైన పతకాన్ని కొడుకైనా తండ్రికి నజరానాగా ఇస్తాడని నమ్మలేక పోయాడు సుల్తాన్.

"జీ! తమరికొరకే దీన్ని భద్రం చేశాను. తమ జన్మదినోత్సవ సందర్భంలో దీన్ని తమకి అర్పించాలని ఎన్నాళ్ళ నుండో ఉబలాట పడ్డాను. ఇప్పటి నా కోరిక తీరింది."

"బహుత్ అచ్ఛా భేటా! నీకీ వజ్రాల పతకం ఎక్కడ లభ్య మైందా అని ఆశ్చర్యపడుతున్నాను."

"అదా? అది మన ప్రతాపరుద్ర మహారాజు కిరీటాన్ని అలంకరించిన పతకం. ఆ ఆంధ్ర కిరీట వజ్రపతాకాన్ని తమ పాదాల దగ్గర ఉంచి, ఆంధ్రదేశం మీద మీ సామ్రాజ్యాధిపత్యాన్ని ఈ సంతోష సమయంలో స్థాపిస్తున్నాను" అన్నాడు షాజాదా సగర్వంగా.

సుల్తాన్ వారికి బ్రహ్మానందమయింది. ఆ వజ్రాల పతాకాన్ని చేతి లోకి తీసుకుని పరిశీలిస్తూ "బహుత్ అచ్ఛా భేటా! బహుత్ అచ్ఛా! మా జన్మలో ఇలాంటి పతకాన్ని చూచిందిలేదు. ఇలాంటి విలువైన ఆభరణా లను ఉపయోగించే ఆ తెలుగుదేశపు రాజు విపరీతమైన ధనవంతుడై కోటికి పడగలెత్తినవాడై ఉంటాడు." అన్నాడు.

"ఆ మాట నిశ్చయం సర్దార్! ఓరుగల్లులో ఉన్న వెండి-బంగా రాలూ, వజ్ర-వైడూర్యాలూ అనంతం అని మన చారులు చెబుతుంటారు," అన్నాడు షహజాదా.

"అచ్ఛా! ఓరుగల్లు మీదికి వెళ్ళిన మన ఖుస్రూ లల్లాబా ఏమైనారో తెలిసిందా? నీవు రాజును మాత్రం పట్టుకొని వచ్చివేశావ్."

"జీ! ఖుస్రూ యుద్ధంలో చనిపోయాడని వార్త వచ్చింది,"

"యా ఖుదా? ఎంత పని జరిగింది! ఆరే బేటా ఖుస్రూ! మమ్మల్ని విడిచి వెళ్ళావా? అల్లా అప్పుడే నిన్ను పిలిచాడా! బేటా బేటా! మీ అమ్మకీ, మా చెల్లెలికి నేనేం చెప్పేది బేటా?" అంటూ సుల్తాన్‌వారు కన్నీళ్లు పెట్ట సాగాడు.

"సుల్తాన్ జీ! విచారించకండి. విధి ఎదురు తిరిగింది. లల్లాఖాన్ దేవగిరిలో తల దాచుకొని తిరిగి ఓరుగలు మీద దండెత్తాలనుకుంటున్నాడు."

"వాడు ఒక్తి ఉంత! రాజాలేని రాజ్యాన్ని జయించటం చేతకాని మూర్ఖుడు! వాడికి శిరచ్ఛేదం చేయించు."

"సుల్తాన్ వారు క్షమించాలి," అన్నాడు షహజాదా.

అంతలో దౌవారికుడు ప్రవేశించి సుల్తాను వారికి సింహళం నుండి రత్నాల వర్తకులు ప్రభువులకు నజరానాలు తీసుకొని వొచ్చి దర్శనం ఆపేక్షిస్తున్నారని మనవి చేశాడు.

రత్నాల వర్తకులు నజరానాలు తెచ్చారని వినగానే సుల్తాన్‌వారి దుఃఖమూ, కోపమూ జములున కరిగిపోసాగాయ్

"అవశ్యం ప్రవేశపెట్టు," అన్నాడు సుల్తాన్.

దౌవారికుడు వెంటనే నిష్క్రమించి సుల్తాన్ వారి ఆజ్ఞ మేరకు రత్నాల వర్తకులను ప్రవేశపెట్టాడు.

సమున్నతాసనాన్ని అధిష్టించిన సుల్తాన్ వారిని అల్లంత దూరాన్నుంచే చూసిన సింహళ వర్తకులు వంగి వంగి సలాములు చేస్తూ పరిచారకులు నజరాలను మోసకొని అనుసరింపగా సుల్తాన్‌వారి సమ్ముఖానికి చేరారు. వర్తక బృందంలో పెద్దశెట్టి స్వయంగా ఓ బంగారు బద్దెలతో అల్లిన బుట్టను తన రెండు చేతులలోనూ మోసుకొని వొచ్చి సుల్తాన్‌వారి పాదపద్మాల దగ్గర ఉంచి మోకాళ్ళమీద కూర్చొని సలాములాచరించాడు.

"వర్తకులూ! మాదర్శనానికి నజరానాలు గొని తెచ్చిన మిమ్మల్ని, మీ ఐశ్వర్యాన్ని అల్లా వద్ధిచేస్తాడు." అన్నాడు సుల్తాను.

దేవరవారి కటాక్ష వాక్కులలోని ప్రతి అక్షరం నిజం కావాలని కోరుకుంటున్నాం," అన్నాడు పెద్దశెట్టి.

"అచ్ఛా, అచ్ఛా, మీరు చాలగడుసువాళ్ళలా ఉన్నారు. గడుసువాళ్ళంటే మాకు చాలా సంతోషం. అచ్ఛా! వర్తకులూ! మీది ఏదేశం?"

"సింహళం, ప్రభూ! తమకీర్తి చండభానుడి కిరణాలలాగా అతి వేగంతో మా సింహళద్వీపం దాకా వ్యాపించటంవల్ల భూతల స్వర్గమైన ఢిల్లీకి అధిపతులగు ఏలినవారి దర్శనానికి వ్యాపారరీత్యా వొచ్చాం."

వర్తకుల సమాధానం చూసి వర్తకులను గడుసువాళ్ళుగా పరిగణించటంలో ధానేమీ పొరపాటు పడలేదనుకున్నాడు సుల్తాన్.

"అచ్ఛా, వర్తకులా! మాతో దోస్తీ ఉంటే మీ వర్తకానికి ఏ కొరతా ఉండదు. ఏవి మీ నజరానాలను ఒక్కసారి చూపించి, మా కళ్ళకి ఖుషీ చేయండి. అన్నాడు సుల్తాన్.

పెద్దశెట్టి వెంటనే సుల్తాన్‌వారి పాదాలదగ్గర తానుంచిన బంగారు బుట్టను తనచేతిలోకి తీసుకుని ఒక్కసారి తన రెండు కనులరా దాని సద్దుకొని ఆ మూత తీశాడు. మరుక్షణంలో అక్కడివారి కళ్ళు మిరుమిట్లు గొలిపాయ్. కోటిసూర్యప్రభాభాసమానమైన శిరోమణితో ఒక మహత్తరమైన పన్నగరాజం అందులో ఉంది. దానిలోని ప్రతి పొలుసూ వివిధవర్ణ సముచ్చయమైన బహురత్న కాంతిని వెదజల్లుతోంది. సప్త వర్ణాలూ దాని నుండి వెలువడి చూపరుల కళ్ళలోనికి చురుచురుమని చొచ్చుకొని పోతున్నాయ్. విశ్రాంతి మందిరం, మందిరాంతర్భాగాలతో సహా పట్టపగలులా మారిపోతున్నాయ్. ఆ అపూర్వాన్ని చూసిన సభాసదులు నోట మాటరేక, తెరచిననోరు మూతపడక అలానే చూస్తూండి పోయారు.

"సుల్తాన్ సాహేబా! ఇదిఒక అపురూపమైన సర్పాకృతి మేలిమైన నల్లచలువరాతితో మలచబడి అపూర్వమైన వజ్రవైడూర్యాలు తాపటం చేయడంతో ఆదిశేషుణ్ణి లజ్జితుని చేస్తోంది. ఈ సర్పాకృతి. దీని శిరోమణి చండకిరణుని వెక్కిరిస్తోంది నానావర్ణ కిరణాలను వెదజల్లే ఈ అమూల్యాకృతి అద్వితీయమైంది?" అంటూ విన్నవించాడు వర్తక శ్రేష్ఠుడు.

ఆ అపూర్వ శిల్పాన్ని చూస్తూ మైమరచిపోయాడు సుల్తాన్. నిజానికి తన యావద్వైభవమూ ఒకఎత్తు, ఆ శిల్పం ఒకటే ఒకఎత్తు అని నిశ్చయించుకున్నాడు.

"వర్తకులా! ఈ బహుమానం మమ్మల్ని చాలా ఆనందపరచింది. మా సంతోషాన్ని వెలువరించటానికి భాషలో మాటలు కొరతగా తోస్తున్నాయ్. మీ మిగిలిన నజరానాలు కూడా చూపండి." అన్నాడు సుల్తాన్.

"అలాగే ప్రభూ! ప్రభువుల సంతోషమే మా సంతోషం, ఇదిగో-ఇది పచ్చల పానపాత్ర. ఇది ఒకటే పచ్చలో అనేక వజ్రవైడూర్యాలను తాపటం చేసి తయారు చెయ్యబడింది. ప్రభువువారి దివ్య హస్తంతో దీని

విలువ ద్విగుణీకృత మవుతుంది!" అంటూ పచ్చలపానపాత్రను ప్రభువు చేతి కందించాడు వర్తకుడు.

"వహ్వా! మహాద్భుతంగా ఉంది. మా మనసునెరిగి యిచ్చినమహత్తరమైన కానుక. వర్తకులా! ఇంకేమీ తీసుకొచ్చారు?"

"ప్రభూ! ఇది మయూరాకృతి. శిఖ విప్పిన వనమయూరిలోని వివిధ ప్రకృతి సహజ వర్ణాలనూ, నవరత్న ఖచితమైన ఈ మయూరాకృతి వెదజల్లుతుంది. ఏయే రత్నం ఏయే సహజ కాంతులను వెదజల్లుతుందో గ్రహించి, ఆయా రత్నాలను ఆయా స్థానాలలో పొదిగి విధాతచేతి చలువనే వెక్కిరించాడు శిల్పి. ఈ అపూర్వ కళాఖండాన్ని నిర్మించటంలో" అంటూ ఒక మయూరాకృతిని అందించాడు సుల్తానువారికి పెద్దశెట్టి.

సుల్తాను పరమానందమైంది. సౌదాగర్ భాయీ! మీరు తెచ్చిన నజరానాలకు ఏ విధమైన కృతజ్ఞత తెలుపవలెనో అర్థంకాకుండా ఉంది.

ఈ అమూల్య శిల్పాలను నజరానాగా స్వీకరించటం మా మర్యాదకు భంగంగా భావిస్తున్నాం. వీటి విలువ చెప్పి ధనం గ్రహించండి" అన్నాడు సుల్తాన్ హుందాతనానికీ, దర్జాకూ లోటు రాకుండా.

"ప్రభువులు మా పైన చిన్న మనసు చేసినట్లున్నారు. వీటిని మేము తమ జన్మదినోత్సవ సందర్భంలో కానుకగా ఇచ్చాం గాని, ధనాపేక్షతో కాదు" అన్నాడు పెద్దశెట్టి. ప్రభువులు మమ్మల్ని మన్నించి మా నజరానాలను స్వీకరించాలి."

"కాని, వీటి విలువ చెప్పండి. ఆ ధనాన్ని మా ఖజానా నుండి ఇప్పిస్తాం."

ప్రభూ! ఇవి బహుమానాలు. వీటికి విలువ ఏమిటి? మీరు కొనవలసినవి ఇంకా ఇంతకు మించిన వస్తువులు అనేకం ఉన్నాయి. వాటిని క్రయానికి పుచ్చుకోండి ప్రభూ!" అన్నాడు పెద్దశెట్టి.

పెద్దశెట్టి మాటలకు సుల్తాన్ విస్తుపోయాడు. యివే అనుకుంటే వీటిని తలదన్నే వస్తువులా? వాటి విలువ ఎంత వుంటుందో, యేమో! అయినా, వాటి అన్నిటినీ తన అంతఃపురానికి చేర్పించాల్సిందే అనుకున్నాడు.

"చూడండి, భాయీసాబ్! వాటినన్నిటినీ తీసుకొని వొచ్చారా ?" అన్నాడు సుల్తాన్.

"లేదు, సుల్తాన్ సాహెబా! మా సరుకు ఏడు ఓడలకు నిండుగా ఉంది. వాటిని కదిలించటం అంత సులభసాధ్యమైన విషయంకాదు. ఏలిన వారే మమ్మల్ని మన్నించి, మా ఓడలపై కాలుంచి, వాటిని ధన్యంచేసి తమకు కావాల్సిన వస్తువులు స్వీకరించాలని ప్రార్థిస్తున్నాం" అన్నారు వర్తకులు.

"ఏడు ఓడల సరుకా!" ఆశ్చర్యపోయాడు సుల్తాన్.

"అవును, ప్రభూ! ఒకదానిని మించిన శిల్పం మరొకటి."

"అచ్చా! తప్పకుండా వస్తాం! వజీర్లూ! ఏమంటారు?" అన్నాడు సుల్తాన్ వజీర్ల వంకతిరిగి.

"అవశ్యం వెళ్ళాల్సిందే, సర్కార్!" అన్నారు వజీర్లంతా ముక్త కంఠంతో.

"అచ్చా, వర్తకులూ! మీ మిగిలిన సరుకులు కొనుగోలు చెయ్యటానికి ఇప్పుడే బయలుదేరి వస్తాం. కాని, ముందు ఈ సర్కారానికి ఖరీదుకట్టి చెప్పండి!" అన్నాడు సుల్తాను.

"ప్రభువులు మన్నించాలి. మా సరుకులు మహాప్రభువుల ముందు మేమే వెలకట్టటం వ్యాపార లక్షణం కాదు."

"అయితే వీటి వెల మాకు తెలీదే! మాకు తోచిన వెల యిచ్చి, మిమ్మల్ని అన్యాయం చెయ్యటం ఢిల్లీ సుల్తానుకు కూడా మర్యాదకాదు. వీటి ధరలు మీరే నిర్ణయించండి."

"ప్రభూ! అది మేము చేయలేమని మనవి చేస్తున్నాం. మీకు వాటి ధర తెలియకపోతే, తెలిసినవారిని రప్పించి విలువ కట్టించండి"

"వారి ధరలనిశ్చయమని ఎలా మీకు నమ్మకం" అన్నాడు సుల్తాన్.

"అది వారు కట్టే లెక్కనుబట్టి ఇట్టే గ్రహించగలం."

"అయితే బహుత్ అచ్చా! వజీర్లూ! మీలో ఎవరన్నా ఈ వస్తువులకు లెక్కకట్టగలరేమో చూడండి" అన్నాడు సుల్తాను.

వజీర్లంతా ముఖాలు-ముఖాలు చూసుకోసాగారు "నేను" అని ముందుకు వచ్చిన వజీరు ఒకడూ లేడు.

"ఏం వజీర్లూ ఏమంటారు?"

"ఆలంపనాహ్! మా జన్మలో ఇలాంటి అద్భుతాల్ చెవితో విందీ లేదు. కంటితో చూసిందీ లేదు. వీటికి ధరా కట్టటం మాకే చేతకాదే!" అన్నారు.

సుల్తాన్ వారికి వాటికి ధర కట్టటం ఒక సమస్య అయింది. తాను కాని, తన వజీర్లు కానీ అంతకు ముందు అలాంటి అద్భుతాలు చూసింది లేదు. మరి ఎలా?

"అయితే వర్తకులూ! మీరు వీటిని ఇదివరకు ఎవరికి విక్రయిస్తూ ఉండేవారు? అప్పుడు వాటి ధర ఎలా నిర్ణయించేవారు?" అని ప్రశ్నించాడు.

"సుల్తాన్ సాహెబా! మాకు సముద్రాంతర వర్తకం ఉంది. జావా, సుమిత్రా దేశాల ప్రభువులు రత్నాలకు వెల కట్టడంలో స్వయంగా గొప్పవారు. భారతదేశంలో ప్రతాపరుద్ర చక్రవర్తి వారికి రత్నాల విలువ బాగా తెలుసు. మా సరుకులను అనేక పర్యాయాలు వారికి విక్రయించాను."

ప్రతాపరుద్ర చక్రవర్తి పేరు చెప్పగానే సుల్తాన్‌వారూ, షాజాదా ఒక్కసారిగా ఉలిక్కిబడ్డారు.

"అయితే, వర్తకులూ! మీరు ఈమాటు ప్రతాపరుద్రరాజు దగ్గరకి పోలేదా?" అన్నాడు సుల్తాను.

"లేదు, ప్రభూ! ఆ మహారాజు అస్వస్థుడిగా ఉండటంవల్ల, ఆరు నెలల కాలంనుంచీ ఎవరికీ దర్శనం ఇవ్వటంలేదనీ, వారి కుమారుడైన పసినాయిణ్ణి రాజును చేసి, యుగంధరులవారే రాజ్య పరిపాలన చేస్తున్నారనీ కొద్దికాలం కింద యుగంధరులవారు కూడా మసూచి జాడ్యంతో మరణించటంవల్ల, వారి తమ్ములు జనార్దన మంత్రిగారే సర్వాధికారిగా ఉన్నారనీ తెలుస్తోంది. అందువల్ల మేము ఓరుగంటికి వెళ్ళకుండానే, మా సరుకు వెల చేయువాడు ఒక్క సుల్తాన్‌వారేనని నిశ్చయించుకొని నేరుగా తమ దర్శనార్థం వచ్చాం" అన్నాడు పెదశెట్టి.

ఆయన మాటలు విన్న సుల్తానుకు ఆశ్చర్యం వేసింది. ప్రతాపరుద్ర మహారాజు తమవద్ద బందీగా ఉండగా, ఓరుగల్లులోనే ఉన్నట్లు వర్తకులు చెపుతున్నారేమా అని ఆశ్చర్యపడ్డాడు సుల్తాన్. వెంటనే తనప్రక్కనున్న షాజాదాను పిలిచి "ఏమిటీ? వర్తకులిలా చెప్తారు?" అని అడిగాడు.

షాజాదా పని ఇరకాటాన పడ్డట్లయింది. తాను పట్టుకొచ్చిందిచాకలి వాడనే సత్యం బయట పడుతుందేమోనని భయపడసాగాడు. అయినా, సమయస్ఫూర్తి కలవాడు కావటంవల్ల సమర్థించుకున్నాడు. "జహాపనాహ్! అది మంత్రి జనార్థనుడి ఎత్తు. రాజు బందీ అయ్యాడంటె రాజ్యం అల్లకల్లోలం అవుతుందని, ఈ విధమైన ఎత్తు ఎత్తాడు ప్రభువుగారు అక్కడున్నాడంటూ."

"అచ్ఛా అచ్ఛా! అయితే, మన దగ్గర బందీగాఉన్న ప్రతాపరుద్ర రాజును పిలుచుకొని వచ్చి వెలలు వేయిద్దామా" అన్నాడు సుల్తాన్.

షహజాదా గొంతులో వెలక్కాయపడ్డట్లయింది. చాకలివాడు వజ్ర వైడూర్యాలకు విలువ కట్టగలడా? కాని, సుల్తానువారి తీరు చూస్తే రాజును పిలిపించకుండా ఊరుకునేటట్లులేదు. ఇక ఎలాగూ కానున్నది కాకమానదనీ ఏ క్షణాన తన గుట్టు రట్టయితే, ఆ క్షణాన సుల్తాన్ని తెగటార్చి మరు క్షణంలో సుల్తాన్ పదవి అధిష్టించ వొచ్చనీ నిర్ణయించుకొని "అలాగే, జహాపనాహ్!" అన్నాడు షాజాదా.

కొద్ది క్షణాలలోనే సుల్తాన్‌వారి ఆజ్ఞమేరకు, ప్రతాపరుద్ర చక్రవర్తి ప్రవేశపెట్టబడ్డాడు ఆ రామ మందిరంలోకి.

మందిరంలోకి ప్రవేశించిన మహారాజును సుల్తానువారు సాదరంగా గౌరవించి, ఆయన రెండు చేతులనూ ఆప్యాయంగా తన చేతులలోకి స్వీకరించి,తోడ్కొని వచ్చి తనప్రక్కనున్న ఆసనంపీద ఆశీనుణ్ని చేశాడు.

ప్రతాపరుద్ర మహారాజు ఒక్కసారి ఆ మందిరాన్ని పరిశీలించాడు. ఎదురుగాఉన్న తన వర్తకులనూ, వారు గొనితెచ్చిన తన స్వంత అంతఃపురంలోని వస్తు సామగ్రినీ చూసి లేనట్టి విమోచన ఓరుం వొచ్చినట్లు గుర్తించి సంతసించాడు.

తమ ఎదుట మహమ్మదీయవజీర్ దుస్తుల్లో సాక్షాత్కరించిన తమ మహారాజును చూసి వర్తకులు కూడా లోలోన విపరీతంగా సంతోషించారు. సర్వం సన్నద్ధమైంది. వ్యూహరచన పూర్తి అయింది. వల పన్నటం ముగిసింది, ఎఱచల్లటం కూడా జరిగింది. పక్షులు మెల్ల-మెల్లగా దగ్గరికి వొస్తున్నాయ్. సమయం చూసి ఉచ్చు బిగించటమే తరువాయి అనుకున్నారు. వర కులు.

సుల్తాన్‌వారు ప్రతాపరుద్ర చక్రవర్తి వంక సాదరంగా చూస్తూ "సౌదాగర్ ఖాయ్! వీరు సింహళ వర్తకులు. తమ తమ వస్తువులు మనకు విక్రయించాలని తీసుకొని వొచ్చారు. వీటికి విలువ కట్టించటానికని మిమ్మల్ని పిలిపించాను," అని వర్తకులవంక తిరిగి "వర్తకులా! వీరు మా స్నేహితులు. వజ్ర వైడూర్యాలు వెలగట్టడంలో వీరు సాటిలేనిమేటి, వజ్ర వ్యాపారంలో అనేక పర్యాయాలు ప్రపంచ యాత్ర చేసి వొచ్చారు. వీరు వెల కడితే మీకేం అభ్యంతరం లేదుగా?" అన్నాడు.

వర్తకులు- క్రొత్తగా వొచ్చిన సౌదాగర్ వంక తేరపార చూశారు. "అహో! ఏమి మా భాగ్యం. వేషం మారినా వ్యక్తి మారలేదు. సాక్షాత్తు ప్రతాపరుద్ర మహారాజులు సాక్షాత్కరించారు. జయోస్తు- విజయోస్తు! శ్రీ మన్మహామండలా ధీశా, ఆంధ్ర సామ్రాజ్య రమాహృదయేశా, కాకతి వంశపారావార పూర్ణ శశాంక విజయోస్తు- దిగ్విజయోస్తు!" అంటూ వర్తకులు సాష్టాంగ నమస్కారం గావించారు.

వేషం మారినా మహారాజును గుర్తించగలిగారే- ఈవర్తకులని ఆశ్చర్యపడ్డాడు సుల్తాన్.

వీణ్ని చాకలివాడిగా గుర్తించనందుకు లోలోన సంతోషించాడు షాదాజా అలూఫ్‌ఖానుడు. అయితే, మరో సమస్య ఎదురొకుంది. వీడు ఆకార సాదృశ్యంలో ప్రతాపరుద్రుడు కాని, అతని మేధస్సు వీడికెలా వొస్తుందా? వీటికి వెలలు కట్టమంటే, తన బండారం బయట పడుతుందేమోనని భయపడసాగాడు.

"ఏం వర్తకులూ! వీరు వేసిన వెలలు ఆమోదించటానికి మీకేం అభ్యంతరం లేదుగా?" అంటూ ప్రశ్నించాడు సుల్తాన్.

"అక్కర్లేదు. రత్నవ్యాపారములో ప్రతాపచంద్ర మహారాజు మాటకు తిరుగులేదు. శ్రీవారు ప్రతాపచంద్ర చక్రవర్తితో కలసి, మా నౌకలను వేంచేయాలని ప్రార్థిస్తున్నాం!" అన్నారు వర్తకులు.

ఈ దోపిడీ ఇక్కడే వెలలు కట్టించనందుకు షహజాదా సంతోషించాడు. అయితే, ఆ దుర్ముహూర్తం దాటిపోలేదు. వెనుకను జరిగింది- అంతే! అందుకోసం ఎలాగైనా తన జాగ్రత్తలో తానుండటం మంచిదని భావించాడు. షహజాదా.

"అచ్ఛా-వర్తకులూ! పదండి. ఈ మందిరం కదిలి మీ ఓడకు వొస్తుంది. పోదామా భాయ్?" అన్నాడు సుల్తాన్- ప్రతాపచంద్ర చక్రవర్తి వంక తిరిగి.

చక్రవర్తి పల్లె అంటూ లేచి నుంచున్నాడు. ఆ మందిరంలో ఉన్న అధికారులందరూ వెంటరాగా, వర్తకులు దారి చూపగా, సుల్తాన్ వారు ప్రతాపచంద్ర చక్రవర్తితో సహా యమునానదిలో ఉన్న వర్తకుల నరుకుల ఓడ దగ్గరకు బయలుదేరాడు.

"ప్రతాపచంద్ర చక్రవర్తీ భాయ్! కాస్త ధరలు చూసి- చూసీ వెయ్యండి. మీ మేలు జన్మలో మరచిపొయ్యేది లేదు," అన్నాడు సుల్తాన్ తన ప్రక్కన ఉన్న ప్రతాపచంద్ర చక్రవర్తిని చూసి.

యమునానది ప్రశాంతంగా ప్రవహిస్తోంది. తీరాన ఉన్న పెద్ద పెద్ద ఓడలు లంగర్లు దింపుకొని విశ్రాంతి తీసుకుంటున్నాయ్. క్రొవ్వొత్తి దీపాలలో జగజ్జేగీయమానంగా ప్రకాశిస్తున్న ఆ నౌకలు నీటిలో తేలియాడే రమ్యహర్మ్యాల్లా ఉన్నాయ్. ఆ నాడు సుల్తాన్ వారి జన్మదినం కావటంతో ప్రభుత్వ నౌకలలోని ఉద్యోగస్థులంతా విందు భోజనాలు ఆరగిస్తూ తప్ప త్రాగి తందనాలాడుతున్నారు. ఆ మాటకొస్తే! ఢిల్లీ నగరం యావత్తూ ఆ

పండుగ సంబరాలలో ఇహాన్ని మరచిపోయినట్లుంది. ఒకరి గోడు ఒకరికి పట్టటంలేదు.

సాయంసంధ్య గడిచిపోతోంది. నలువైపుల నుండీ చీకట్లు క్రమ్ముకు వొస్తున్నాయ్. జనసంచారల క్రమంగా పలచబడి పోతున్నది. ఆ సమయం లో ... నాది పడవల రేవు దగ్గర పిచ్చివాడు కొలువు పెట్టాడు. పిచ్చి వాడిలో ఏదో అజ్ఞాతశక్తి ఉంది. అతడు ఎక్కడ చేరినా పది మందికి తక్కువ కాకుండా పోగవుతారు. ఆ నాడు అతడి చుట్టూ తప్పత్రాగి ఉన్న నదీరక్షకులైన సిపాయిలు చేరి అతడి మాటలకూ, చేతలకూ ఆనందిస్తూ వినోదిస్తున్నారు.

ఢిల్లీ సల్తాన్ పట్టుకపోతాన్
ఇదిగో ఇప్పుడే హెత్తుకపోతాన్
కలవాడు భంగారు కంచంలో తింటాడ్
కస్మిలేనివాడూ కాశీకి ఎల్తాడ్
మహ్మదీన్ తుగ్లక్ని గయా కొట్టిస్తాన్
గోరి కట్టించేసి ఘుశా పెట్టిస్తాన్
ఢిల్లీ సల్తాన్ పట్టుకపోతాన్
ఇదిగో ఇప్పుడే హెత్తుకపోతాన్

"అరే! దివానా సల్తాన్ వార్కి పట్టూకుంటానంటావ్ ఎవరన్నా వింటే ..." అన్నాడొక సిపాయి.

"వింటే నాకేం భయమా?" అన్నాడు పిచ్చివాడు.

"అవునులే, నీకేం? భయమూ?" మహారాజ్ గార్వి."

"ఔను. నాకేం? మహారాజునే! పేడ మోసిన దివానుని. దివానానను కున్నారాయేం? వెర్రివెంగళప్పల్లారా," అన్నాడు పిచ్చివాడు- ఒక రాతి మీద ఠీవిగా కూర్చుంటూ.

"ఔనౌను. నకిలీ దివాను," అన్నాడు నకిలీదివాను గుంపులోనుంచి ఒకడు. వెంటనే "నకిలీదివాను!" అంటూ నలుగురూ గోలచేయటంప్రారంభం ... నాలు కోపం వొచ్చింది. "రేయ్!" అంటూ పొలికేక

నక్లీనక్లీ అంటూ
నన్ను వెక్కిరిస్తారా
నన్ను నకిలీ అన్నవాడు
నకిలీ? వాడియబ్బ నకిలీ
వాడి జేజెబ్బ నకిలీ
నాకు కోపం రానే రాదు
వొచ్చిందా నేనసలు మనిషిని కాదు
నేనే కన్ను తెరిస్తే
మీ ప్రాణాలే నకిలీ

ఒ అంటే ఢం రాని
వెధవాయిల్లారా
పొట్ట కోస్తే అక్షరం లేని
పోకిరి గాడిదల్లారా
నోటికి తాళం వేసుకోండి
సీటుగ తిరిగండి
నోరు తెరిచారంటే
పాచికంపు గుబాళిస్తుంది
చాచికొట్టానంటే
దవడ పళ్ళు రాలుతాయి.

—అంటూ ఎదురుగా నిలబడ్డ సిపాయీల మీది ఒక చక్రాకార విహారం చేశాడు పిచ్చివాడు. వాడు పరిగెత్తే ఊపుకు భయపడి ఎవరికివాళ్ళు వెనక్కి తగ్గి తప్పుకున్నారు.

"చూశారర్రా నా తేజో చక్రం! దీని దాటి వొచ్చిన వాడు భస్మమై పోతాడు. నేనాడిన మాట తప్పితే నేనే భస్మమవుతా. ఓ ఢిల్లీ సుల్తాను! నా కతిదివి. రో, రా!"

ఢిల్లీసులతాను పట్టుకపోతాను
హద్దూ వొచ్చిన వాణ్ణి హడలా కొట్టేస్తాను

ఘ్యాజుద్దీన్ తుగ్లక్‌ని పట్టి వేసేస్తాన్
ఇదిగో ఇప్పుడే హెత్తుకపోతాన్

తన అభిమాన గేయాన్ని ఎత్తుకున్నాడు పిచ్చివాడు.

అంతలో ఆ వైపుకు అతి స్వల్ప పరివారంతో అరుదెంచాడు సుల్తాన్ - సింహళ వర్తకుల నౌకలలోని వస్తుసామాగ్రిని పరిశీలించటం కోసమని. ఆ సమయంలో పిచ్చివాడు పాడుతున్న పాట నాలకించాడు సుల్తాన్. అతని పక్కనే ఉన్న ప్రతాపరుద్ర మహారాజు ఆ పాట విని ఉలిక్కి పడ్డాడు. ఆ కంఠం ఎంత మధురంగా,ఆప్యాయంగా ఉంది. ఆ సుపరిచిత కంఠాన్ని విని దాదాపు ఆరు నెలలు దాటింది. నేడెంత సుదినం అనుకున్నాడు మహారాజు.

ఆ పాట విన్న వర్తకులు పిచ్చివాడి వంకా, సుల్తాన్ వారి ఇంకా ఆశ్చర్యంగా చూడసాగారు.

వర్తకుల ముఖకవళికలోని మార్పును గ్రహించి "వర్తకులూ! వీడు మా పాగల్ మహారాజ్! వీడంటే మాకు చాల ఇష్టం. మూడు నెల్లనించి మమ్మల్ని బందిస్తానంటూ అరుస్తున్నాడు. నేటికి మూడు నెల్లా పూర్తయింది. ఇప్పుడే బందిస్తానంటున్నాడు - నన్ను మా పాగల్ భయ్యా?" అన్నాడు సుల్తాన్.

"ఈ పిచ్చివాణ్ని మీరు ఉపేక్షిస్తున్నారా, ప్రభూ!" అన్నారు వర్తకులు.

"కాదు. వినోదిస్తున్నాం. వీడికి హమేషా మా స్మరణతప్ప మరొకటి లేదు. అందువల్ల వీడంటే మాకు చాల ఇష్టం." అన్నాడు సల్తాన్. ఆ తరవాత పిచ్చివాడి వంక తిరిగి "పాగల్ భయ్యా! అన్నం తిన్నావా!...." అంటూ ఖుషీగా పరామర్శచేశాడు సుల్తాన్.

పిచ్చివాడు సల్తాను వంక ఆశ్చర్యంగా చూశాడు. అయినా అతడే సుల్తానని గుర్తించినట్లు లేదు. అతని కళ్ళకు ఒక సామాన్య మహమ్మదీయుడులాగా కనిపించాడు.

"అన్నమా! అదేమిటి? అదంచేనో ఏమిటో తెలీదు నాకు ఇంతవరకూ నువ్వన్నం తిన్నావా, సాయబయ్యా?"

సాయబ్బయా సలామయా
సద్దన్నం సుష్ట తిన్నావయ్యా
అడపా దడపా
ఆలూ మగలూ
ధిమికిట ధిమికిట
తద్ధిమికిటయని
క్రిందను మీదై
మీదను క్రిందై
దఢాం దడికిణత
గుబగుబ గబగబ
ఘుంక్రించుకొని
తబదబ తబదబ
కటకట కటకట
టకటకమంచూ
ఫాఫాఫాయనీ
కొట్లు చెక్కలై
శృంగారం విషమించగా
శింగారం చెరిగి పోవగా
తలాక్ తలాక్ అని
తాడు త్రెంచుకొని
వీడిన పడతారు
విడివిడిన పడతారూ
జాగ్రత్తయ్యో సాయబ్బయ్యో
సద్దన్నం తిని వాచ్చావా
వాచ్చావా ...

పిచ్చివాడి పాటకు కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వసాగాడు.

సుల్తాను. ప్రక్కన ఉన్న వజీర్లు పిచ్చివాణ్ణి మందలిస్తూ "వారెవరో తెలుసా? ఢిల్లీ సుల్తాన్ వాడు. ఏమన్నా అంటేతల ఎగిరిపోతుంది!" అని హెచ్చరిక చేశారు. ఆ మాట వినగానే ఎగిరిగంతు వేశాడు పిచ్చివాడు.

"ఓహో! సుల్తానంటే ఎలాగుంటాడో అనుకున్నా. ఈ సాయిబ్బేనా సుల్తానంటే? ఓహోహో నా సుల్తాన్! వెన్నె చిన్నెలా సుల్తాన్! వచ్చావా నా దగ్గరికి? అందుకుంటివా ఆహ్వానం! నాకు తెలుసు- వస్తావని. నాకు ఉంది దివ్యదృష్టి. రావయ్యా, రా, రా, రా! అంటూ పిచ్చివాడు సుల్తాన్ని చేరబోయాడు. అది చూసి వజీరు పిచ్చివాణ్ణి వెనక్కు నెట్టివేశాడు. పాపం- సుల్తాను వారిని ఆత్యంరాసక్తితో తాకబోయిన పిచ్చివాడు వజీర్ల తోపిడికి అల్లంత దూరానపడి "చూశావా, నా సుల్తాను! ఈ వజీర్లు ఎంతపని చేశారో? నా సుల్తాను దగ్గరకు నేను వెళ్తానంటే అపటానికి వీళ్ళెవరు? పేదవాడి ఆహ్వానాన్ని అందుకోదా సుల్తాను, కలవాళ్ళకు గులాంలాగా రాజ్యాన్ని పరిపాలిస్తాడా? ఏం సుల్తాను? మాట్లాడవే? నేనే కీడు చేశాను నీకు?" అన్నాడు పిచ్చివాడు.

వాడి అమాయక హృదయం తన వజీర్లు చేసిన పనికి నొచ్చుకున్న దని సుల్తాను నొచ్చుకోసాగాడు.

"లేదు, పాగల్ భయ్యా! నీవూ, నేనూ భాయీభాయీ! నీ ఆహ్వానాన్ని అంగీకరిస్తాన్. కాని ఇవ్వాల్టికి ఆహ్వానాన్ని అంగీకరించి నాతో రా. నేను ఈ రాత్రి చూడబోయే వింతలన్నీ చూద్దువు గాని," అంటూ ఆహ్వానించాడు సుల్తాను.

పిచ్చివాడు ఉషారుగా లేచి వజీర్ల వంక పరిహాసంగా చూస్తూ "ఒరేయ్. వజీరూ! సుల్తాను నా వాడురా! వాజమ్మల్లారా! తెలీకపోతే తెలుసుకోండి!" అంటూ సుల్తానుని అనుసరించాడు! పాగల్ భాయి మాటలు సుల్తాను వారికి శ్రవణపేయంగా ఉండటంవల్ల పాగాల్ని పల్లెత్తు మాట అనటానికి సాహసించారు కాదు వజీర్లు.

ఆ తరువాత కొద్ది క్షణాలలో వారంతా తీరానవిడిసి ఉన్న సింహళ వర్తకుల ఓడలోకి చేరారు.

ఆ ఓడలను చూసి ప్రథమవీక్షణంలోనే పరమానంద భరితుడయ్యాడు సుల్తాను.

"వర్తకులా! ఇవి ఓడలా, లేక యమునానదిలో తేలియాడే రమ్య దివ్య హర్మ్యరాజాలా?" అన్నాడు సుల్తాను జగజ్జేగీయ మానంగా వెలుగుతున్న దీపాల కాంతిలో కన్నులకు మిరుమిట్లు గొలుపుతున్న ఆనౌకలను చూసి. ఆ తరువాత ఒకొక్క వస్తువునే పరిశీలించటం ప్రారంభించాడు సుల్తాను; ఆయన్ని వెంటనే అనుసరిస్తూ ప్రతాపరుద్ర చక్రవర్తి; వర్తక ప్రముఖులూ ఆయన చూస్తున్న వస్తు విశేషాలను తేలియజెప్పటం ప్రారంభించారు. పిచ్చివాడు తన లల్లాయి పదాలను పాడుతూ జల్సాగా వారిని అనుసరిస్తున్నాడు. వజీర్లందరూ అక్కడ ఉన్న వస్తువులను ఒకొక్కదాన్నే చూసి ఆశ్చర్యపోతున్నారు. ఒకదానికి మించింది మరొకటి. ఆ ఓడలోనివారికి కేవలం ఒక్కమాటలో చెప్పాలంటే మయసభ సాక్షాత్కరించింది అంతా భ్రమయేమో అని అనుమానం వేసేస్థితికి వొచ్చారు వజీర్లు.

సుల్తానువారు అక్కడవున్న శిల్పాలనూ! వజ్ర-వైఢూర్యాది నవ రత్న రాసులనూ, నవరత్న ఖచితమైన వివిధ ఆభరణాలనూ చూసి పొంగిపోయాడు. ఎలాగైనా అవన్నీ తన స్వంతం కావాలి అనే ఉద్దేశ్యంతో ప్రతాపరుద్ర చక్రవర్తిని పిలిచి "భాయీసాబ్! వీటివిలువలు బాగ తగ్గించివెయ్యండి. లేకపోతే నా ఢిల్లీ నగరానంతా అమ్మి అయినా ఇందులో ఒక్క ఓడను పూర్తిగా కొనగలననే ధైర్యం నశిస్తోంది?" అన్నాడు.

ఆతని నీచ బుద్ధికి లోలోన ఏష్ట పడుతూ "అలాగే, సుల్తానుజీ?" అన్నాడు ప్రతాపరుద్రుడు.

ఇంతలో పెదశెట్టి వారి దగ్గరకు వొచ్చాడు. అతణ్ణిచూసిసుల్తాను "వర్తకులూ! మేము చూడాల్సినవి ఇంకా ఉన్నాయా?! అని అడిగాడు.

"దేవరవారు చిత్తగించాలి. తమరు చూసింది అవగింజలో అరవయో భాగం మాత్రమే ఒక ఓడలోని సరుకుల్లో పదోవంతు కూడా తమ దర్శనానికి నోచుకోలేదింత వరకూ," అన్నాడు పెద్దశెట్టి.

సుల్తాన్‌వారు ఆశ్చర్యంగా చూశాడు.

"నిజం, జహాంపనాహ్! మా సరుకులు ఎంత శీఘ్రంగా చూడాలన్నా, కనీసం నాలుగు రోజులన్నా పడుతుంది. ఈ నాలుగు రోజులూ దేవరవారు ఇక్కడే విశ్రాంతి తీసుకోవాలని కోరుతున్నాం."

"సుల్తాన్‌వారికి ఏవిధంగానైనా అ సరుకులన్నింటినీ పట్టించుకోని గాని, నగర ప్రవేశం చేయకూడదనే కోరిక మిక్కుటంగా ఉండటంచేత పెద్దశెట్టి మాటలకు అట్టే శ్రమలేకుండానే "సరే" అనేశాడు. నిజానికి ఆ కుబేరుడి ఖజానానించి కదల బుద్ధి వేసింది కాదు. ఆ వింతలనూ, అద్భుతాలనూ చూస్తూ, నిద్రాహారాలుకూడా మరచిపోవచ్చు ననుకున్నాడు సుల్తాను.

"దేవరవారికి విందు భోజనం ఏర్పాటు చేశాం. తామూ, తమ వజీర్లూ నేడు మాకు అతిథులు " అంటూ ఆహ్వానించాడు పెద్దశెట్టి సుల్తానువారి నిర్ణయాన్ని హర్షిస్తూ.

సుల్తానువారు పెద్దశెట్టి ఆహ్వానాన్ని మన్నించారు.

"జహాపనా! నేడు మేము చాల ధన్యులం భూలోక దేవేంద్రులైన ఏలినవారికి ఆతిథ్యమిచ్చే భాగ్యం కలిగింది. విందు భోజనం సిద్ధంగా ఉంది. దయచేయండి! మిగిలిన విశేషాలను విందు అనంతరం పరిశీలించవొచ్చు. అదీకాక, దేవరవారి వినోదార్థం విందు అనంతరం "సుల్తాన్‌వారి ఆంధ్రదేశ విజయం" అనే నాటక ప్రదర్శనను కూడా ఏర్పాటు చేశాం!" అన్నాడు పెద్దశెట్టి.

"ఓ! మా ఆంధ్రదేశ విజయం! బహుత్ అచ్ఛా! మా కీర్తి మీ దాకా వ్యాపించిందన్న మాట!"

"అవును, ప్రభూ! దేశదేశాల వ్యాపించిన మీ కీర్తిని వర్ణిస్తూ నాటకాన్ని ప్రత్యేకంగా వ్రాయించాం-మీ ముందు ప్రదర్శించాలని సుల్తాను వారి ఆంధ్ర విజయం...."

"సుల్తాను వారి ఆంధ్రవిజయమేమిటిరా, ఆడవావెధవల్లారా! పిచ్చి వాడి ఢిల్లీ విజయం ప్రదర్శించి ఏడవండోయ్!" అన్నాడు అప్పుడే అక్కడికి వొచ్చిన పిచ్చివాడు.

"అచ్ఛా-అచ్ఛా పిచ్చివాడి విజయంకూడా ఆడండి! అన్నాడు సుల్తాను.

"అలాగే, ఆలంపనాహ్!" అన్నాడు పెద్దశెట్టి.

"ఏం పాగల్ భాయ్!" నీ విజయం కూడా ఆడతారుటగా?"

"వెధవలు! వీళ్ళాడేదేమిటి? ఒకప్రక్క నేను ఆడిచూపిస్తుంటే ..."

"అచ్ఛా! ఆడు భాయ్!- నీ ఇష్టం వొచ్చినట్లు ఆడు! నీ వాడు తుంటే మా మనసు ఆడుతుంటుంది," అన్నాడు సుల్తాను.

"ఆలంపనాహ్! విందుకు దయచేస్తారా," అంటూ మరోసారి ప్రార్థించాడు పెద్దశెట్టి.

"అచ్ఛా-అచ్ఛా!" అన్నాడు :లాను.

"నన్ను పిలవ్వేమయ్యా?నావవెధవయ్యా?" అన్నాడు పిచ్చివాడు గుడ్లు ఉరుముతూ.

"తన తప్పు తెలుసుకున్న పెద్దశెట్టి వెంటనే "పాగల్ మహారాజ్! నీకూ ుందు స్వాగతం," అన్నాడు.

"ఓహోహో! నీవు రమ్మంటే వొచ్చే వాణ్ణా, పొమ్మంటే పోయే వాణ్ణా? అయినా ఇదంతా నా స్వంతం అయినప్పుడు నువ్వెవరు నన్ను రమ్మంటానికి?"

పెద్దశెట్టి మరి మాట్లాడాడు కాదు,

"సుల్తానువారి షాజాదాతోనూ, వజీర్లతోనూ కలసి విందు భోజనానికి బయలుదేరాడు పెద్దశెట్టి దారిచూపగా. బయలు దేరబోయేముందు ప్రక్కనున్న ప్రతాపరుద్ర మహారాజును చూసి "భాయీ సాబ్! మీరు మాతో కలసె భోజనం చేయరుగా? మీకు భోజనం ఇక్కడికే పంపే ఏర్పాటు చెయ్యమని చెప్తాను. దయచేసి- ఈలోగా ఈ విశేషాలన్నిటికి మనం అనుకున్న పద్ధతిలో - భాయీ సాబ్! మనం అనుకున్న పద్ధతిలో

ధరయిపేసి, పట్టీ పెద్దం చేయండి. ప్రత్యుపకారంగా మీ రాజ్యం మీకు ఇచ్చి వేస్తాను," అన్నాడు.

ప్రతాపరుద్ర చక్రవర్తి చిరునవ్వు నవ్వాడు.

షాజాదాకు సురో గండం గడిచినట్లయింది. ఈ నకిలీ ప్రతాప రుద్రుడు ధరిస్తే కత్తి అవసరం వొస్తుందేమో- బండారం బయట పడుతుందేమోనని వేయి కండ్లతో ఒరలో ఉన్న కత్తి పిడిమీద చేయి ఉంచి, ఇంతవరకూ సుల్తానువార్ని అనుసరించాడు. కాని, ఆ అవసరం కలుగక పోయేసరికి "హమ్మయ్య!" అనుకుంటూ సుల్తానువారి వెంట నడిచాడు విందు భోజనానికి.

చాకునుకి శాస్త్రులు ప్రతాపరుద్ర చక్రవర్తి క్షేమంగా ఉన్నారని చెప్పటంతోనూ, అందుకు నిదర్శనంగా నగర వీథులగుండా మంగళ తూర్యారావాలతో ఊరేగుతూ వెడుతున్న మహారాజును తాము కళ్ళారా చూడటంతోనూ షాజాదా అలూఫ్‌ఖాను పేరిగాన్ని మహారాజని బంధించుకు పోయాడనీ, వాడిని మర్యాదగా విడుదల చెయ్యకపోతే ప్రమాదం తప్పదు అని చండ ప్రచండుడైన యుగంధర మహామంత్రి హెచ్చరికతోనూ ఓరుగల్లు వదలి పెట్టి ఖుస్రూఖాను ఢిల్లీకి పోగా, లల్లూకాను మాత్రం తనయొక్క, ఖుస్రూకాన్ యొక్క అసంఖ్యాక సైన్యానికి ఏకైక నాయకుడై కాకతీయ సామ్రాజ్య ఆగర్భ శత్రువైన దేవగిరి యాదవరాజు కోటలో తల దాచుకొన్నాడు. ఏ విధంగానయినా షహజాదా ఆజ్ఞాపించినట్టు ఓరుగల్లును నామరూపాలు లేకుండా నశింపజెయ్యాలని అతని ఆకాంక్ష. అందుకుగాను దేవగిరి యాదవరాజు సహాయంకూడా ఉంటే తను తలచిన కార్యం సులభ సాధ్యం కాగలదని అతని భావన.

కాకతీయ సామ్రాజ్యానికీ, తనకూ మొదటినుంచీ బద్ధవైరం ఉన్న కారణంచేతనే దేవగిరి యాదవుడు సుల్తానుగారి దయ సంపాదించి, ఓరుగల్లు సింహాసనం అధిష్ఠించాలని వాంఛిస్తున్నాడు. అటువంటి సమ్మ

యంలో అతను సుల్తాను దయను సంపాదించేందుకు అల్లాఖానుద్వారా ప్రయత్నం చెయ్యటంలో ఆశ్చర్యం ఏమీలేదు.

ఆరోజు దేవగిరి మహారాజ భవనాంతర్భాగంలో ఉచితాసనాల మీద ఉపవిష్టులై ఓరుగల్లు ముట్టడిని గూర్చి యోచన సాగిస్తున్నారు గౌరవపురుషులు.

"ఖాన్‌జీ! షాజాదా రాజుకూ, చాకలికీ భేదం తెలియని అంతటి వెర్రివాడా? ఒక చాకలిని బంధించి, రాజని ఢిల్లీకి గొనిపోతాడా?" అన్నాడు యాదవుడు.

"సచ్! మహారాజ్! మాకీ కూడా అదే హాలోచన్ ఉంది. అలాఫ్ కాను సర్దార్ బహుత్ బడా అక్లమంద్ షాజాదా! దోభీకి-మహారాజ్‌కిఫరక్ తెల్సుకోలేడ్? హిందూలో హేదో బడా మోసం ఉండ్వాలా. అదీ మాకీ దిల్‌కి బాత్," అన్నాడు అల్లాకాను.

ఖాన్‌జీ! ఆ విషయం తెలుసుకొని ప్రస్తుతం ఓరుగల్లులో ఉన్నది అసలు రాజో, నకిలీ రాజో అని తెలుసుకుని రమ్మని బహుప్రజ్ఞావంతుడైన ఒక ఇంద్రజాలకుణ్ని పంపాను అతని దగ్గరనుంచి ఇంతా వర్తమానం రాలేదు. బహుశా నేడో, రేపో అతనే రావాలి," అన్నాడు యాదవుడు.

"బహుత్ అచ్ఛా చేశార్, మహారాజ్! దీంతో వరంగోల్‌రాజు అసలీబాత్ బయటా పడుతుంది," అన్నాడు అల్లాకాను.

ఇంతలోనే ఒక పావురం ఎగురుతూ వచ్చి వారి ముందు వాలింది. యాదవుడు గబాలుని ఆ పావురాన్ని చేతుల్లోకి తీసుకుని; దాని రెక్కల మధ్యనుండి ఒక కమ్మను బయటకు తీశాడు. ఒక్కసారి పై నుంచి క్రింద వరకూ పరపార చూచి, సంతోషంగా అల్లాకాను భుజం తట్టుతూ "ఖాన్‌జీ! శుభవార్త!" అన్నాడు.

"క్యాహై, మహారాజ్? హంత అఛ్చీబాత్ హొహై కొంచం మాది కాన్‌లో కూడా వెయ్యండి!" అన్నాడు ఉత్సాహంగా,

వెయ్యటం కాదు, తక్షణం ఈ కమ్మలో ఉన్నట్టు చెయ్యాలి! అలా చేశామో ఓరుగల్లు క్షణాలమీద మన వశమవుతుంది!" అన్నాడు పొంగి వస్తున్న ఆనందాన్ని బలవంతంగా అణుచుకుంటూ.

"అసల్ ఆ ఖత్‌లో హైమీ ఉంది. జరాపడో మహారాట్?" అన్నాడు లల్లూఖాన్.

యాదవరాజు చదవసాగాడు;

"స్వస్తి శ్రీ రాజాధిరాజ రాజపరమేశ్వర, వైరి భయంకర శ్రీశ్రీశ్రీ దేవగిరి యాదవరాజుల పాదపద్మ సన్నిధికి సేవకుడను రామప్ప భక్తిపూర్వక ప్రణతులర్పించి విన్నవించుకొను విన్నపం.

ప్రభూ!

నేను దేవరవారిచేత అనుజ్ఞాతుడనై కతిపయ దిన ప్రయాణములు గావించి, ఇంద్రజాలికుడుగా ఓరుగల్లును చేరుకున్నాను. ఏ విధంగానయినా ప్రభువు ప్రతాపరుద్రుని నేను గుర్తించాలని చేసిన ప్రయత్నాలన్నీ భగ్నమవగా, చివరకు ఇచ్చటి ఆస్థాన ఇంద్రజాలికునితో స్నేహం నెరపాను.

దర్బారులోకి ఆత్మీయులను తప్ప, ఇతరులను ప్రవేశపెట్టడం లేదు. ఆనాడు ప్రభు సమక్షంలో ఇంద్రజాల విద్య ప్రదర్శనకు ఆస్థాన ఇంద్రజాలికుడు బయలుదేరుతుండగా, నేను అతనితో కలిసి బయలుదేరి, మార్గ మధ్యంలో అతనిని మట్టుపెట్టి, అతని దుస్తులతో, ఆకారంతో సభా భవనం ప్రవేశించాను.

ప్రభూ

ప్రస్తుతం ఓరుగల్లు స్వర్ణసింహాసన మధిరోహించింది ప్రతాపరుద్ర ప్రభువుకాదు. వాడే చాకలిపేరిగాడు అయి ఉంటాడని నా దృఢ విశ్వాసం. తప్పక పేరిగాడే. అయితే; జనార్దనమంత్రి అనుక్షణము సహస్రాధిక నేత్రాలతో అతన్ని కనిపెట్టుకుంటున్నాడు. అసలు ప్రతాపరుద్రుడు షాజాదాకు బందీగా చిక్కి ఢిల్లీలో సల్తానుకు ఖైదీగా ఉంటున్నాడు ఆ విషయం కప్పిపుచ్చేందుకు యుగంధర మంత్రి ప్రతాపరుద్రుని పోలికలున్న రజకుణ్ణి తీసుకువచ్చి సింహాసనమెక్కించి, అమాయకులయిన ఓరుగల్లు వాసులన్న

వంచిస్తున్నారు. అంతేకాదు, సాటి రాజలోకాన్ని అవమానిస్తున్నారు. మరో ముఖ్య విషయం. యుగంధర మంత్రి స్వయంగా మహారాజు విడుదలకై ఢిల్లీకి వెళ్ళినట్టు విశ్వాసనీయంగా తెలుస్తుంది. కేవలం ఒక చాకలివానికోసం యుగంధరునివంటి బహుముఖ ప్రజ్ఞావంతుడు ఢిల్లీ వెళ్ళటం అసంభవం. కనుక, షహజాదా బంధించింది అసలు ప్రతాపరుద్రుడనే. కనుక మీరు సత్వరం ససైన్యంగా వచ్చి ఓరుగల్లును ముట్టడించండి! రాజు, మంత్రి లేని చతురంగంవలె సునాయాసంగా కోట మన వశమౌతుంది. ఇప్పటికే ఆలశ్యమైంది. జనార్ధన మంత్రి నన్ను అనుమానించి బందీ చెయ్యటంవలన, సావకాశం చిక్కక మీకు ఈ వార్త ఇంతకన్న త్వరగా తెలుపలేకపోయాను. మీరు శీఘ్రగతిని రావలసిందిగా కోరుతున్నాను.

మీ సేవకుడు

రామప్ప."

—అని చదవటం ముగించాడు.

అది విని అలూఖాను చంకలు గుద్దుకున్నాడు.

"అచ్ఛా అచ్ఛా! బహూత్ అచ్ఛా! మహారాజ్! మీ సైన్యం మాదీసైన్యంతో జోడాయించండి. తచ్ఛనం ఓరుగల్లు మీదీ లడాయికి పోదాం. మనం గెలిస్తే మీదీ సహాయంకి సుల్తానుగార్కి చెప్పు, మీ కి మాంచి ఈనాం హిప్పిస్తాం!" అంటూ ఆశ చూపాడు,

యాదవరాజు మనస్సు ఆనందంతో ఉరకలు వేస్తూంది. ఎన్నో సంవత్సరాలనుండి-తన తాత తండ్రులనుండి ఓరుగల్లును స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించి విఫలులైనారు. అనేక యుద్ధాలలో తాము అపజయం పొందటమేగాక, అపారంగా నష్టపోయారు. అటువంటి కాకతీయ సామ్రాజ్య రాజధానీ నగరం, ఓరుగల్లు నాశనం తను కళ్ళారా చూడాలి. దారుణ మారణహోమం గావించబడిన కాకతీయ ముఖ్య నగరాన్ని, తాను కళ్ళారా చూడాలి. ఆ నాడే తన పూర్వీకుల ఆత్మలకు శాంతి లభిస్తుందనుకున్నాడు.

"అలాగే, కాన్‌బే! ఈ అర్ధరాత్రి రెండవ యామం గడిచిన తరువాత, ఓరుగల్లుపై పురుసు మనం చతురంగబలాలు నడిపిద్దాం! కాని, ఈ విషయం సైన్యం బయలుదేరేవరకూ మరెవ్వరికీ తెలియరాదు. ఈ క్షణమే దండయాత్రకు సిద్ధం కమ్మని దళపతులకు వర్తమానం పంపిస్తాను. రథగజ తురగ పదాతి దళాలు, నేల ఈనినట్లు ఒక్కుమ్మడిగా నలువైపుల నుండీ ఓరుగల్లును ముట్టడించి సర్వనాశనం గావించాలి. "మేము చతురంగ బలాలతో బయలుదేరుతున్నాం. మీరు అప్రమత్తులై కోటలోని జనాన్ని రెచ్చగొట్టి, అదను చూచి మా ప్రవేశానికి వీలుగా దుర్గ ద్వారాలు తెరవవలసిందిగా ఒక లేఖ వ్రాసి, జైనాశ్రమానికి పంపిస్తాను.

"చాకలి పేరణ్ణి సింహాసనమెక్కించి, సకల రాజ లోకానికి తలవంపులు గావించిన ఓరుగల్లు నామరూపాలు లేకుండా నశించిపోవాలి. హ్హాహ్హాహ్హా!" అంటూ మందిరం ప్రతిధ్వనించేటట్టు వికటాట్టహాసం గావించాడు యాదప్పడు.

# 24

వణిక్ ప్రముఖులు ఇచ్చిన మృష్టాన్న భోజనాన్ని కడుపార తిని బ్రేవ్‌మని త్రేన్చింది సుల్తాను బృందం. ప్రతి పదార్థము రుచ్యాతిరుచ్యంగా ఉండటం వల్ల దేనినీ పారవెయ్యటానికి మనసు వొప్పింది కాదు సుల్తాను బృందానికి దానికి తగినట్లుగా వణిక్కులు కొసరి వడ్డించటంవల్ల కక్షిలో చోటున్నంత వరకూ వంటకాలను లోనికి పంపివేశారు సరదార్లులే ఉన్నచోటులోనుండి కదిలే పరిస్థితిలో లేరెవరూ. ఒకరూ అరా కదిలే పరిస్థితిలో ఉన్నా, ఆ తరువాత వణిక్కులు అందించిన ద్రాక్ష సారాయం మహిమతో తమ తమ స్థానాలకు కట్టుబడిపోయారు అతిథులందరూ. విపరీతంగా త్రాగి మైమరచిపోయారు. సుల్తానువారు కూడా తాము జన్మలో రుచిచూడనంత రుచ్యంగా ఉన్న ద్రాక్షాసాన్ని సంపూర్ణంగా స్వీకరించారు. ఇంతలో ఒక ప్రక్కనుండివాద్య గోష్ఠి శ్రవణానందకరంగా ప్రారంభమైంది. నట్టువ కత్తియలు ఛెంగు ఛెంగున గారియంచెల రవళులు ఘల్లు ఘల్లనగా సరదార్ల మధ్యకు వచ్చారు.

ఇంకేంకావాలి? గానాపీనా బజానా మరింకేం కావాలి? సరుదాళ్లంతా ఆ అసాధారణ వాతావరణంలో అద్వితీయమైన కట్టడంలో ఇహాన్ని సంపూర్ణంగ మరచి స్వర్లోక విహారం చేస్తున్నారు.

* * * *

"ఒరే కళాసులూ! నేనెవరో తెలుసున్రా?" అన్నాడు పిచ్చివాడు. పడవ ఉపరితలాన కూర్చొని చుట్ట వెలిగించుకుంటున్న కళాసులతో.

"తమరా బాబయా! వారం రోజుల నుంచీ సూత్తూనే ఉన్నాంగ మారాజులు; పిచ్చిమారాజులు?"

"ఏ రాజునైతేనేంరా. నేనూ రాజునేగా?"

"ఆహా!"

"నా ఆజ్ఞలు పాలించాలిగా?"

"పాలించని వారికి శిక్ష ఏమిటో తెలుసా?"

"మరణశిచ్ఛ"

"అఁ అదీ! అయితే! ఎత్తండి లంగర్ని."

"లంగర్నా?" కళాసులు ఆశ్చర్యపోయారు.

"ఔను లంగర్నేరా! ఎత్తండి?

"ఆ మాట మా పెద్దశెట్టిగోరు సెప్పాలండీ!" అన్నారు కళాసులు

"ఒరేయ్! మీ పెద్దశెట్టిగోరు చెప్తే ఒకటీ, నేను చెప్తే ఒకటీనా?

ఆ సంగతీ మాకు తెలీదు బాబూ!"

"తెలీదంటే చెల్లదు. నా సంగతి తెలియజెప్పి నా మాట నెగ్గించుకుంటా, ఎత్తుతారా, - ఎత్తర్రా - లంగరు? ఎత్తక పోయారో

మక్కెలింగదందా!.. అంటూ పిచ్చివాడు కళాసుల్లో పెద్దను చాచి ఒ గ్రుద్దు గుద్దాడు. ఆ దెబ్బకు పెద్ద కళాసీ ఆవులించాడు, పాపం! వచ్చినంత ంది.

'అమ్మనాయినోయ్! చచ్చాన్రా బాబూ! ఇది మాములు దెబ్బ కాదురోయ్ యుగంధరులోని దెబ్బలాగుందిరోయ్! పెద్దశెటిగారూ ఈ పిచ్చోడు మమ్మల్ని సంపేతుండా డండోయ్ అంటూ అరవ సాగాడు. గందరగోళానికి పెద్దశెట్టి పరుగున నౌక ఉపరిభాగానికి వచ్చాడు. వీర హనుమన్ భంగిమలో ఉన్న పిచ్చివాణ్ణి లంఖిణిలా పడిపున్న కళాసీనీ చూసి క్షణకాలం అదిరిపోయాడు.

"వచ్చావా, రాబాబూ! చూశావా? వీడికో గ్రుద్దు ఇచ్చాను బహుమానంగా నా మాట కాదన్నందుకు!" అన్నాడు పిచ్చివాడు

"మీరేమన్నారూ?"

"లంగరెత్తమన్నాను, ఇంకా ఎత్తరేంరా?" అంటూ గర్జించాడు కళాశీల వంక తిరిగి పిచ్చివాడు.

కళాసులు గజ - గజలాడుతూ పెద్ద శెట్టి వంక చూశారు. పెద్ద శెట్టి లంగరులెత్తమని సైగ చేశాడు. వెంటనే కళాసులు లంగరు లెత్తారు నాలుగు పడవల. వెనువెంటనే తెరచాపలు కూడా నింగి కెగిశాయ్ చూస్తూ - చూస్తూ ఉండగానే నౌకలు నాలుగు ఒకదాని వెనుకగా ఒకటి బారు తీర్చి బయలుదేరి, ప్రవాహపు వాలులో సర - సర సాగిపోసాగయ్. దానికితోడు వాయుదేవుడు కూడా అనుకూలించ టంవల్ల వాలుగాలిలో ద్విగుణీకృత వేగాన్ని సాగించాయి నౌకలు. అప్పటికి చాలదన్నట్టు పిచ్చివాడు ఎలుగెత్తి కేకవేశాడు "ఒరేయ్" కళాసులూ! తెడ్డు వెయ్యండి - జోరుగా వెయ్యండి"

తమ పెద్ద కళాసీకి పట్టిన ఖర్మమే తమకు కూడా పడుతుం దేమోననే భయంతో, కళాసులంతా తెడ్లు వెయ్యసాగారు.

"ఏరేయ్! ఏడుస్తూ తెడ్డేస్తారేంరా? పాట చెప్తా పాట పాడుతూ జోరుగా వెయ్యండి తెడ్లు. ఎవడైనా పొరపాటున అయినా సరే వంత పలక్కపోయాడో, వాడి బుర్ర రామకీర్తన పాడిస్తా!"

కళాసులంతా "పిచ్చివాడితో కయ్యం - మృత్యువుతో చెలగాటం" అవుతుందనే భయంతో 'అలాగే, బాబయ్యా!' అన్నారు,

పిచ్చివాడు పాట పాడటం మొదలుపెట్టాడు :
'అక్కడి రాజూ ఇక్కడి కొస్తాడ్'
'చెప్పరేరా దుంకాతులా;'
'చెప్తున్నాం బాబూ, చెప్తున్నాం'
'అక్కడి రాజూ....'

'అక్కడి రాజూ ఇక్కడికొస్తాడ్
ఇక్కడి రేడూ అక్కడికెల్తాడ్
కాలం ఖర్మం కల్సి రాకపోతే
కాలరుద్రుడైన కానలను పట్తాడ్
తలదన్నే వాడికి తాడి దన్నేవాడ్
తాడి తన్నేవాడి శిగల్ను కోసేవాడ్
నచ్చిన మన్సి బట్టా కడ్తాడు
ఢిల్లీ సుల్తాను పట్టుకపోతాన్
ఇదిగో ఇప్పుడే పట్టుకెళుతున్నాన్.'

పిచ్చివాడి పాటకు వంత పాడుతూ కళాసులు వడి - వడిగా తెడ్లు వేయసాగారు

సప్తప్రాకార పరీవృతమైన ఓరుగల్లు కోట - ఒకనాటి అర్ధరాత్రి ఒక్కుమ్మడిగా మేలుకుంది. ఏ వంక చూచినా అలజడి, ఆందోళన అధికంగా వినవస్తున్నాయి, ప్రజలు గగ్గోలుగా ఇటునుంచి అటు -

అటునుంచీ ఇటు తిరగసాగారు. ఎవరి ముఖాల మీద చూచినా ఆపద గోచరిస్తుంది.

దుర్గ రక్షకుడైన బుక్కరాయలు హుటాహుటిని జనార్దన మంత్రి దర్శనానికి వచ్చాడు.

"అమాత్యవర్యా అకస్మాత్తుగా శత్రువులు మన కోటను ముట్టడించారు. ఏ క్షణాన ఏం ముంచుకు వొస్తుందో అని నేను సప్త ద్వారముల వద్ద తగినంత సిబ్బందిని కాపుంచాను. అయినా ప్రథమ, ద్వితీయ ద్వారముల వద్ద శత్రుసైన్యాన్ని భేతాళరావు ఎదిరించాడు. అయితే, లోపల వారు కొంతమంది కుట్ర చేయటంతో సర్వసేనాని భేతాళరావు ద్వారా ద్వితీయ ద్వారం వద్ద సంకుల సమరం గావిస్తూ వీరస్వర్గ మలంకరించాడు. ద్రోహులు కొందరు ద్వారాలు తెరచి శత్రువుకు దారి ఇచ్చారు. తృతీయ ప్రాకార ద్వారం వద్ద అప్పుడే సంకుల సమరం ఆరంభమైంది" అన్నాడు.

ఆయన మాటలను నిర్ధారణ చేస్తూ అశ్వముల సకలింపులు, గజ ఘీంకరింపులు, సైనికుల రణగర్జనలు, రణభేరి మ్రోతలు, కత్తుల తాకిడి వల్ల ఉత్పత్తయే ఖణ - ఖణ నాదం భయంకరంగా వినవచ్చాయి.

'బుక్కరాయా! ద్వారాలు కూడా తెరిచారంటే, ఇది తప్పక అంతఃశత్రువుల కుతంత్రమే అయి ఉంటుంది. అనేక యుద్ధాలలో కాకలు తీరిన కాకతీయ సేనాని భేతాళరావు కన్ను మూసాడు. ఆలోచించేందుకు, అశ్రుతర్పణ గావించేందుకు కూడా అవకాశం లేదు. ఈ క్షణంనుంచి మీరే కాకతీయ మహాసైన్యాధిపతి పదవిని స్వీకరించాలి. ముఖ్యంగా జైనవివా సాలపై కన్ను ఉంచి, వారి చర్యలను కనిపెట్టాలి. చతుర్థ ప్రాకారాన్నుంచి సప్తమ ప్రాకారం వరకు రక్షణ అధికం చెయ్యండి. బురుజులపై సైనికులను నిలిపి, శత్రువులను సర్వవిధాలుగానూ ఎదిరించమనండి.'

ఇంతలో ప్రతిహారి పరుగు-పరుగున వచ్చాడు, 'అమాత్య వర్యా! దేవగిరి యాదవుని సహాయంతో అసంఖ్యాకంగా, ఉల్లూఖాను నాయకత్వం క్రింద వచ్చిన సేన, తృతీయ ద్వారాన్ని కూడా గడిచింది. చతుర్థద్వారాన్ని కాపాడ్డటానికి మన బలగం అప్పుడే వెళ్ళింది!" అన్నాడు.

"బుక్కరాయా! సర్వసైన్యాలను చతుర్థ ద్వారం దగ్గరకు తీసుకు వెళ్ళండి. అక్కడనుండి ఒక్క అడుగుకూడా ముందుకు కదలకుండా చూడండి. అన్నగారు ప్రభువుల ముదలకు బయలుదేరివెళ్ళి కూడా ఆరు మాసాలు గడిచిపోయింది. నేడో, రేపో ప్రభువులతోపాటు వారు రావచ్చు. అంతవరకూ శత్రువులను అరికట్టండి! తుచ్ఛులు! దొంగచాటుగా దెబ్బ తియ్యటానికి ప్రయత్నించారు. అందుకు మన అంతశ్శత్రువులైన జైనులు సహాయపడి ఉంటారు! ..." అంటుండగానే—

మరొక భటుడు పరుగున వచ్చి "దేవా! కోటలోని ప్రజలలో అలజడి ప్రారంభమైంది ఇప్పుడు కోటలో ఉన్నది అసలు మహారాజు కాదని, చాకలి వానిని రాజుచేసి, ప్రతాపరుద్ర మహారాజు అని ప్రజలను మోసపుచ్చుతున్నారని కొందరు ప్రచారం చేస్తున్నారు ప్రజలు వారిమాటలు విశ్వసించినట్టే గోచరిస్తూ. ఇందుకేదయినా తక్షణం ఉపాయం చెయ్యాలి లేకపోతే, విప్లవం చెలరేగేటట్టు ఉందే!" అన్నాడు

జనార్దనమంత్రికి ఆవేశం ఆవహించింది "బుక్కరాయా! ఇది తప్పక జైనుల కుతంత్రమే అయి ఉంటుంది తక్షణం జైన నివాసాలను చుట్టుడించండి. జైనులందరినీ బంధించండి ఎదిరించినవారిని నిర్దాక్షిణ్యంగా సంహరించండి. మహామాత్యులు యుగంధరులు ప్రభువులు వచ్చేవరకు ప్రాణాలుపోయినా కోట శత్రువశం కాకూడదు మహారాజ భవనం చుట్టూ పహరాను పర్యవేక్షించి, నేను కూడా ఇప్పుడే రణరంగానికి బయలుదేరు తాను-యాదవరాజుకు మరోసారి కాకతీయ ఖడ్గ ప్రహారం రుచిచూపుదాం" అన్నాడు ఆవేశంగా.

బుక్కరాయల నరనరమూ ఆవేశపూరితమైంది. 'హర హర మహదేవ్! జై: కాకతీ సామ్రాజ్య రమామణి!జై! ప్రతాపరుద్ర చక్రవర్తి జై! ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి! జై! హరహర మహదేవ్!" అంటూ ఒర నుండి లాగిన ఖడ్గంతో గబాలున బయట వేచిఉన్న తన ఉత్తమాశ్వం పైకి లంఘించాడు

"హరహర మహదేవ్! హరహర మహదేవ్" అన్న మాటల్లో

ఓరుగల్లు అంతటా ప్రతిధ్వనిస్తున్నాయి. రణభేరులు, నగరాలు అవిశ్రాంతంగా మ్రోగుతున్నాయి. వాటి ధ్వనికి భూనభోంతరాళాలు ఏకమై పెను కంపన బయలుదేరింది.

ఉన్నవారు ఉన్నట్టు కాకలు తీరిన కాకతీయ యోధులు కవచములను, శిరస్త్రాణములను కూడా ధరించకుండా కేవలం ఖడ్గమాత్ర సహాయులై గృహాలు వదలి "హరహర మహాదేవ్!" అంటూ బయటకు ఉరుకుతున్నారు. బాల వృద్ధ వివక్షతలేకుండా ఓరుగల్లులోని సమస్త ప్రజలూ క్షణంలో సైనికులుగా మారిపోయారు. ఒక్క జైనులు మాత్రం పోరుకు వెళ్ళబోతున్న సైనికులను నిలువరించేందుకు నానాప్రయత్నములు చేస్తూ ప్రతాపరుద్రుని గూర్చి విపరీత ప్రచారం చేయసాగారు. అసంఖ్యాకమైన జైనులు కూడా కాకతీయ యోధులుగా మారి సైనికులలో కలసిపోయారు. వారి ధ్యేయం ఒక్కటే! తమ మతానికి ప్రబల విరోధి అయిన ప్రతాపరుద్రుని సింహాసన భ్రష్టుని గావించటమే! తమను ఆదరించని కాకతీయ వంశాన్ని సమూలంగా నశింప జేయటమే!

ఓరుగల్లు చతుర్ద ద్వారం వద్దకు లల్లూఖాన్ అసంఖ్యాకమైన తన సైన్యంతో వచ్చేసరికి అతను ఊహించని ప్రతిఘటన ఎదురయింది. ప్రాకార ద్వారాలు బలంగా బంధించబడి ఉన్నాయి. బురుజులపైన అసంఖ్యాకమైన ఆంధ్ర సైన్యం సర్వసిద్ధమై నిలచి ఉంది. యాదవ, యవన సైన్యాలు చతుర్ద ద్వారం సమీపించగానే బురుజులపైనున్న సైనికులు రణకండూతితో అట్టహాసం గావిస్తూ, తమ వాడి శిలీముఖాలను సైన్యంపై వర్షించసాగారు.

అంతవరకూ తీవ్ర ప్రతిఘటనలేకుండా అనాయాసంగా మూడు ద్వారాలు దాటుకుంటూ వచ్చిన యవన, యాదవ సేనలు తమ పురోగమనానికి ఎదురుతిరిగిన కాకతీయ సైన్యంపై శరవర్షం గావించసాగాయి.

భయంకరమైన సమరం చెలరేగింది. కుడ్యానికి ఆవలవైపున సర్వసేనాధిపతి బుక్కరాయలు, హరిహర రాయలు ఉత్తమాశ్వాలను అధిరోహించి తమ సైనికులను ఉత్తేజపరుస్తున్నారు.

బయటనున్న అల్లాఖాను, యాదవరాజులు కూడా కాకతీయ సామ్రాజ్య వినాశనానికి అది కడపటి యుద్ధంగా భావించి, తమ సైన్యాలు విపరీతంగా నష్టపడుతున్నా లెక్క చెయ్యక తీవ్రమైన పోరు సాగిస్తున్నారు. యవన, యాదవ సైన్యాలు అడుగు దూరం ముందుకు సాగాలంటే అసంఖ్యాకమైన వీరులను బలి ఇవ్వాల్సి వస్తూంది.

ప్రాకారం వద్దకు చేరి ప్రాకారం అధిరోహించ బూనుకొన్నవారిపై బురుజుల మీదనుండి ఆంధ్ర సైనికులు శర పరంపరలు కురిపించి, కణ కణ మండుతున్న నిప్పులను, కళపెళ కాగుతున్న నూనెను పోసి కలువరపరచసాగారు. ఆ ధాటికి తట్టుకొనలేక బాధాభరితంగా అరస్తూ నేలబడి ప్రాణాలు వదులుతున్న సైనికులు, అశ్వములు గావించే ఆర్తనాదాలు హృదయవిదారకరంగా వినవస్తున్నాయి.

ఇంతలో చతుర్థ ద్వారం వదనున్న కాకతీయ సైనికులపై కాకతీయ సైనిక దుస్తులలో ఉన్న జైనులు దెబ్బతీశారు. అర్ధరాత్రి సమయంలో అకస్మాత్తుగా జరిగిన ఈ వెనుక దాటిని తట్టుకునేందుకు ఆంధ్రభటులు వెనుతిరిగే లోపునే వారి శిరస్సులు నేల కూలాయి. కంచే చేను మెయ్యటం ప్రారంభిస్తే ఇక రక్షణ ఏది? ద్వారం వద్ద ఏం జరుగుతుందో ఊహించే లోపునే ప్రాకార ద్వారం తెరచుకుంది. అసంఖ్యాకంగా శత్రుసేన లోనికి చొచ్చుకు రాసాగింది.

అది గమనించి బురుజుల మీదనున్న సైనికులు, బుక్క రాయలు రంగంలోకి వచ్చే లోపునే యాదవ యవన సైన్యాలు చేతికందిన శత్రువులను నిర్జిస్తూ, పంచమ ప్రాకారంవైపు పరుగు- పరుగున పురోగమించ సాగాయి.

ఆంధ్రసైన్యం అడుగడుగునా వారిని ఎదిరిస్తూ, వారి పురోగమనాన్ని ...కు తీవ్రప్రయత్నం చెయ్యసాగింది.

ఇరుపక్షాలలోనూ అసంఖ్యాకమైన సైన్యం నష్టపోతుంది. క్షత గాత్రులైన సైనికుల ఆర్తనాదాలతో, శరబాధకు భయంకరంగా ఘీంకరించే ఘాయ గజ ఘోష అంబరాన్ని అంటుతూంది. క్షణ క్షణానికి అసంఖ్యా

కంగా లోనికి చొచ్చుకు వస్తున్న యవనయాదవ సైన్యాన్ని చూచి, హరి హర బుక్కరాయలు పంచమ ప్రాకారంలోకి సమరం సాగిస్తూనే జొర బడ్డారు. వెంటనే పంచమ ద్వారం బలంగా బంధించబడింది. బయట మిగి లిన ఆంధ్ర సైనికులు ప్రాణాలకు తెగించి, ఒక్కొక్క సైనికుడూ ప్రళయకాలరుద్రుడై పదిమంది శత్రుసైనికులను సంహరించి నేలకూలు తున్నాడు. ఆ క్షణంలో కాకతీయ సైనికుల ప్రతిభ,రణ కౌశలమూ చూచిన యవన యాదవ సైన్యాలు రిచ్చబడిపోతున్నాయి.

ఎంతటి బలవంతులైనా, ధైర్యసాహస పరాక్రమాలు నిండిన జోదులైనా-అంతఃశత్రువులు అధికమైనప్పుడు నిలవరించుకోవటం అసం భవం.

ఓ వంక "హరహర మహదేవ్!" అంటూ ఆంధ్ర సైనికులు శత్రువులను ఊచకోత కోస్తుంటే, మరొక వంక ఆంధ్ర సైనికుల వేష భూషలు ధరించిన జైనులు వారికి స్వాగతాలు పలుకుతున్నారు. నాలుగు ద్వారాలవద్ద తమ మోసాన్ని గుర్తించిన ఆంధ్ర సైనికులు అప్రమత్తులై యుంటారని, అయిదవ ప్రాకారానికి దక్షిణపు భాగంలో ముందే ఏర్పాటు చేసుకున్న విధంగా అతిప్రయాసతో ప్రాకారాన్ని పగులగొట్టారు. అనేక మహాయుద్ధాలలో శత్రునిర్భేద్యమైన ఆ ప్రాకారం జైనుల కృత్రిమ విధా నాలకు లొంగిపోయి బీటలు వారింది.

మరుక్షణం ఆ వంక నుండి నేల ఈనినట్లు శత్రుసైన్యం లోనికి చొచ్చుకు వచ్చింది. ఆ వార్త ద్వార రక్షగావిస్తున్న బుక్కరాయలకు అందింది. అతను హరిహరరాయలను అచ్చట కొంత సైన్యముతోనిలిపి, తను ఆ వంకకు వెళ్ళేలోపుగానే శత్రు బలగమంతా ఆ వంకనుంచే లోనికి ప్రవేశించింది, వెంటనే బుక్కరాయలు మితిమీరిన ఆవేశంతో ముందు,వెను కలు చూడకుండా మధ్యందిన మర్తాండునివలె అశ్వంపై ద నిలిచి, భయంకర మైన సమరం గావించసాగాడు. ప్రేటుకు పదుగురు నేలకూలుతున్నారు- ఆయన యుద్ధపటిమ చూచి ఉత్సాహవంతమైన ఆంధ్ర సైన్యం అవలీలగా ముగ్గునూచగా శత్రుసంహారం గావిస్తూంది. ఆరవద్వార ప్రాంగణంలో

భయంకరమైన పోరు సంభవించింది. వెనుక, ముందు లాలోచింపక ఆంధ్ర సైన్యం ప్రాణాలకు తెగించింది, "హర హర మహాదేవ్!" "అల్లా బిస్మిల్లా!"—అంటూ ఉభయ పక్షాలవారూ గావించే అట్టహాసాలకు దిశలు ప్రతిధ్వనిస్తున్నాయి.

ఇరుతెగలలోనూ మరణించివారియొక్క క్షతగాత్రులయొక్క రక్త ప్రవాహం ఏరై, కందకాలలోనికి ప్రవహించి, అందులోని జలాలనుకూడా రక్తప్రవాహంవలె గోచరింపజేసింది.

ప్రాకారం తరువాత ప్రాకారం తమ వశం గావటంతో యవన యాదవ సైన్యాలు రెట్టించిన ఉత్సాహంతో భయంకరమైన సమరంగావించ సాగాయి. ఆంధ్ర సైనికులు ఎంత విజృంభించి పోరినా, అసంఖ్యాకంగా శత్రుబలాలను సంహరించినా, క్షణ-క్షణానికి అనంతంగా పెరిగిపోతున్న యవన యాదవ సైన్యాల ధాటికి ఆగలేకపోతున్నారు. క్షణ-క్షణానికి ఆంధ్ర సైన్యం అల్పసంఖ్యాకమైపోతూంది. బ్రహ్మాండమైన మహా యుద్ధం జరిగిన తరువాత బుక్కరాయలు ఆరవ ద్వారాన్నికూడా వదిలి పెట్టక తప్పింది కాదు. విజయాట్టహాసాలు గావిస్తూ, అసంఖ్యాకమైన ఆంధ్ర సైనికులను వధిస్తూ, జైన సహాయ ద్వితీయులైన యవన యాదవ సైన్యాలు సప్తమద్వారాన్ని హుటాహుటిన చేరుకున్నాయి. అక్కడే ఆరంభమైంది అంతిమ సమరం, మహోజ్వలంగా, చండప్రచండంగా, తేరి చూడరాని విధంగా వెలుగొందుతున్న కాకతీయ సామ్రాజ్యభానుడు నిస్తేజ మౌటమో, లేక ఇనుమడించిన కీర్తి కిరణపుంజాలలో జ్వాజ్వల్యమానంగా విభవించటమో తేల్చివేయగల ప్రచండ సమరారంభం జరిగింది. బుక్క రాయలు, హరిహరరాయలు, జనార్ధనమంత్రి- మొదలైన హేమా హేమీ లందరూ తమ బలాలనన్నిటినీ క్రోడీకరించుకొని సప్తమ ద్వార పరిరక్ష ణకు పూనుకున్నారు. జగజెట్టులయిన వీరాధివీరులైన కాకతీయ వీరులచే పరిరక్షితమైన సప్తమ ప్రాకారం శత్రుదుర్భేద్యమై విరాజిల్లింది. యవన యాదవ సైన్యాల పురోగమనం స్తంభించిపోయింది. ఇరుపక్షాలవారు ప్రాణా లకు తెగించి, అంతిమ విజయం కోసం పోరు సల్పుతున్నారు.

సురాపానం ప్రసాదించిన మైకంలోనుంచి సుల్తానువారు తేరుకునేటప్ప టికి నాల్గవనాటి రాత్రి నాల్గవయామం ప్రవేశించింది. సుల్తాన్‌వారితోపాటే మిగిలిన వజీర్లందరూ కూడా క్రమక్రమంగా కోల్కొని ఇహ లోకానికి రాగలిగారు. అయితే మత్తు మాత్రం పూర్తిగా వదలలేదు. మైకం నుంచి కోలుకుంటున్న సుల్తానువారికి మరో పానపాత్రనిండా ద్రాక్షసారాయాన్ని అందించాడు పెద్దశెట్టి రత్నాకరుడు. మిగిలిన వజీర్లందరికీ కూడా యధో చితంగా ద్రాక్షరసం అందించబడింది. తన చేతికిచ్చిన పానపాత్రను ఖాళీ చేస్తూ "మేము ఇప్పుడు ఏ లోకంలో ఉన్నాం" అని అడిగారు సుల్తానువారు.

"ప్రభూ! తమరిప్పుడు మా నౌకలో ఉన్నారు. తమరు విందార గించి పది క్షణాలయినా కాలేదు."

"అలాగా! మా కొరకై మా ఆంధ్రదేశ విజయయాత్ర నాటక మేదో ప్రదర్శిస్తామని చెప్పావు కదూ?"

"అవును సర్కార్! తమ కోసం నటులు చాల సేపటినుంచి వేచి ఉన్నారు" అన్నాడు పెద్దశెట్టి.

"అచ్ఛా! అచ్ఛా! నాటకాన్ని మేం చూడాలి! ఏరి మా సర్దా ర్లంతా? సారాయం త్రాగి లేచినట్లులేరే?" అన్నాడు సుల్తాన్.

"అవును ప్రభూ! ఇప్పుడిప్పుడే ఇహలోకంలోకి వస్తున్నారు."

"వాళ్ళందరినీ కూడా లేపి కూర్చోబెట్టండి! మా విజయనాటకాన్ని వాళ్ళు కూడా చూడాలి!" అన్నాడు సుల్తాన్.

పెద్దశెట్టి, మిగిలినవారు సుల్తాన్ ఆజ్ఞమేరకు మిగిలిన వజీర్లనందరినీ నిద్రలేపే ప్రయత్నంలో ఉన్నారు. ఇంతలో ఎక్కడినుంచి వచ్చాడో —

"ఓ నా ఢిల్లీ సుల్తాన్-ఓ నా వరహాల సుల్తాన్!...." అంటూ అక్కడకు వచ్చాడు పిచ్చివాడు.

"ఓ నా పిచ్చి సుల్తాన్! వీళ్ళను లేపటానికి ప్రయత్నిస్తున్నావా? వాళ్ళసంగతి నీకింకా తెలియలా? తెలియంది తెలుసుకోవటం ధర్మం! చెప్తాను విను."

తలలన్ని సారాకు
తాకట్టు పెటారు
మైమరచి కైపులో
తేలిపోతున్నారు
పనికిమాలిన పక్షులయ్యా
సరదార్లూ
తిమ్మరాజులు తిండికయ్యా

సుల్తాను వారికీ
సాలాములంటారు
సుల్తాను వెనుకనే
గోతులను తీస్తారు
నీతి జాతి లేనివారు
సరదార్లు
తల్లి రొమ్మును గ్రుద్దుతారు

తిన్న ఇంటికి వారు
చిచ్చు పెడుతుంటారు
ఏరు దాటిన పిదప
తెప్ప తగలేస్తారు
పరమనీచులు వారు సుమ్మా
సరదార్లు
కరకుహృదయులు తెలుసుకొమ్మా ॥తల॥

"ఓ" అంటే "ఢం" రాని
వాజమ్మలయ్యో
ఉన్న మాటంటేను
ఉలికులికి పడతారు
నిస్వార్థులము మేము అంటారూ
సరదార్లు
నివురుగప్పిన నిప్పులయ్యా ॥తల॥

అప్పుడప్పుడే స్పృహలోకి వస్తున్న సరదార్లు అందరికీ ఖంగున మ్రోగిన పిచ్చివాని కంఠం మేలుకొలుపులా పనిచేసింది. సుల్తాన్ వారి సమక్షంలో తామున్న స్థితిని చూచుకుని తమలో తాము లజ్జితులయ్యారు. వెంటనే ఎవరి స్థానాల్లో వాళ్ళు నిశాంతగా లేచి నుంచున్నారు.

"సరాదార్లూ! ఇప్పుడు మా విజయ నాటకం ప్రదర్శించబోతున్నారు మనమంతా దాన్ని చూడబోతున్నాం! మీమీ స్థానాల్లో మీమీ ఆసనాలు రంగస్థలానికి ఎదురుగా తిప్పుకుని కూర్చోండి!" అన్నాడు సుల్తాన్.

ఆ తరువాత పెద్దశెట్టి రత్నాకరుడివంక తిరిగి, నాటకం ఆరంభం చెయ్యటానికి అనుజ్ఞ ప్రసాదించాడు.

వెంటనే ఎదురుగా ఉన్న అవనికాంతర్భాగం నుండి ఖంగ్‌మనే శబ్దం వినవచ్చింది.

జరీ జలతారు పని చేయబడిన ముఖమల్ తెర రెండుగా విచ్చుకుంది.

అది ఒక అరణ్యప్రదేశపు దృశ్యం! మహామంత్రి యుగంధరుడు, పేరిగాడు. యుగంధరులవారి గుడారం ముందు నిలచి సంభాషిస్తున్నారు.

యుగం

చూశావా పేరిగా

స్త్రీ రాజును పట్టాలని

యవన సేన పేటకొచ్చె
మన దగ్గర మందికొద్ది
ఏం చేద్దామంటావు ?

పేరి

మంచి కొద్ది అయినా
మజ్జిగ చిక్కటిదే
గజ్జ కట్టి కత్తి పట్టి

కర కర నరికేద్దాం

యుగం

అది కాదురా పిచ్చి కుంక
యవనుల కీ క్షణమందున
అధికమైన బలగముంది
కత్తి పట్టి కాలు దువ్వ
కాలం ఇది కాదురా

పేరి

అయితే ఏం చేద్దాం దొరా?

యుగం

కత్తి చేయలేని పనిని
యుక్తిగ సాధించాలి
చూశావా ఒక వింత
నీవు వేరు రాజు వేరు
అయినా ఆకారమొకటె

పేరి

సిన్నప్పుడు మా బాబులు
అనేవాళ్ళు ఈ మాటే

రాజు మీద మనసు పడిన
మా అమ్మకు నేను పుడితి

యుగం

నీ మాటలు నిశ్చయం
నీ పోలిక రాజు పోలిక
రాజా వేషముంచుంచే
నిన్ను చాకలనదెవ్వడు

పేరి

అయితే బాబయ్యా! ఏం చెయ్యాలంటారు?

యుగం

ఒరే పేరిగా! ఈ దుస్తులు
వేసుకొని, ఈ అశ్వం తీసుకొని
నీటుగ మహారాజు పోలె
విగడవన్ని కూర్చోరా!
అలాఫ్ఖాను వొస్తాడు
నిన్ను రాజు అనుకుంటూ
చేసినట్లు చెయ్యి ఆది
లొంగినట్లు లొంగిపో.
రాజ భోగం లభిస్తుంది
ఆంధ్రదేశం సుఖిస్తుంది.

నిన్నేలిన ప్రభువు కొరకు
నీవీ పని చేయాలి

పేరి

అలాగే బాబయ్యా
గలానికి చాకలి నయినా
గుణానికి మారాజున్నులే

చిన్నటాల నుంచి
ఆడాన్లే నాటకాలు
అలూఫ్‌కాన్ అయ్యగోర్ని
ఆడిత్తా ఓ నాటకం
ఢిల్లీ పట్నమంతా
తీసుకొస్తానో కొలికీ

యుగం

అన్నీ తెలిసిన వాడివి
నీకు నేను చెప్పాలా?
సమయాన్ని అనుసరించి

సన్నివేశం మార్చుకో
కోటలోన పాగవేసి
మాట కలిపి సుల్తాన్‌తో
కోటను పడగలనెత్తుతు
తిరిగి రమ్మ క్షేమంగా

పేరి

అమ్మో, బాబయ్యా!
అంతగాను సెప్పాలా
తమ బట్టల ఉతికి ఉతికి
తమ తెలివిని పిండేశా

బాబుగారి చాకలోడు
బాబుగారి పేరు చెప్పి
సులతానుల సరదారుల
సఫా సేసి వత్తాడు

- అంటూ పేరిగాడి పాత్ర రాజోచిత వేష భూషలుదాల్చి, ప్రతాప రుద్ర మహారాజుగా మూర్తిభవిల్లింది, అవనిక జారింది.

అంత వరకూ చూస్తున్న సుల్తానువారి గుండె గతుక్కుమంది. ఇంతవరకూ తను రాజోచిత మర్యాదలతో ఘనంగా గౌరవించి, సరి సమానుడుగా సంభావించిన వ్యక్తి ఒక "ధోబీ" అని తెలియగానే సుల్తాన్ ముఖ కవళికలు మారిపోసాగాయ్.

"బేటా అలూఫ్ ఖాన్! నీవు రాజానుపట్టుకొచ్చానంటున్నావ్. వీరు చాకలిని పట్టుకొచ్చావని అంటున్నారు. మా చేత చాకలికి పరిచర్యచేయించావా?" అంటూ గర్జించాడు సుల్తాన్.

"జహాపనాహ్! ఇది జూటా నాటకం. సరి అయింది కాదు; వీరికి అసలు విషయం తెలిసి ఉండదు!" అన్నాడు షజానా.

అయితే, అసలు విషయం క్రమ-క్రమంగా బయట పడుతున్నందుకు ఆందోళన పడుతూనే ఉన్నాడు.

"సరే! కాని, ఇంకా కొంత నాటకం చూద్దాం," అన్నాడు సుల్తాను.

"ఇంతలో మళ్ళీ అవనికాంతర్భాగంలో ఖంగుమని శబ్దంరావటం, అవనిక పైకి లేవటం ఏక కాలంలో జరిగాయ్.

రాజు వేషంలో ఉన్న పేరిగాడు ఒక వటవృక్షచ్ఛాయను అశ్వాన్ని ఆదిరోహించి, ఒకసారి కిరీటాన్ని దుస్తులను సరిచూచుకొని, కాసేపు సంబరపడి నిద్రనభినయించసాగాడు.

ఆ దృశ్యాన్ని ప్రేక్షకులలోంచి చూస్తున్న పిచ్చివాడికి హుషారెక్కింది. ప్రేక్షక సమూహం మధ్యనుంచే పెద్దగా పాట ప్రారంభించాడు!

భోగం భోగం మహరాజ బోగం
పేరిగాడికి పట్టింది పెద్దింటి మాపళ
ఎల్లి ముండకు పట్టె మొగుడున్న వైధవ్యం
నాకూ పట్టింది బోగం
వల్లకాటి సామ్రాజ్య వై బోగం
ఓహోహో ఇదే నా సింహాసనం
అదే నా మహిషం

ఇది నా వేషం
ఇది నా మోసం

సుల్తానువారు ఆశ్చర్యంగా పిచ్చివాడి వంక చూచాడు. ఈ పిచ్చివాని పాటకు అర్థమేమిటి? వీడు కూడా పట్టుబడ్డది చాకలే అంటున్నాడు.

"పాగల్ మహారాజ్! మీరీ నాటకాన్ని చూశారా?" అన్నాడు సుల్తాను.

"లేదు-లేదు. ఓ దయ్యం చెప్పగా విన్నాలే!" అన్నాడు పిచ్చివాడు.

"పిచ్చివాని మాటలు లెక్కచేస్తారా, జహాపనాహ్? అన్నాడు షాజాదా అలూఫ్‌కాన్.

"లేదు, లేదు, ఈ నాటకాన్ని ఇంకా చూచి అసలు విషయాన్ని తేల్చుకుంటాం," అన్నాడు సుల్తాన్.

అంతలో రంగస్థలం మీద అలూఫ్‌కానుడి పాత్ర ప్రవేశించింది.

ఓహో, అడుగో ప్రతాపరుద్రుడు
అలసిపోయి సొలసిపోయి
మైమరచి నిద్రించే తెలుగు
రాజును పట్టి బందించివేస్తాను
ఏయ్ సిపాయిలూ
అడుగో అక్కడ నిద్రించే
ఆంధ్ర సార్వభౌముడిని
కరచరణాలను బందించి
ఖైదీగా గొనిరండీ

షాజాదా ఆజ్ఞ మేరకు సిపాయిలు ప్రతాపరుద్రుని వేషంలో ఉన్న [illegible]లిని బంధించివేశారు,

అ హా హా నా భాగ్యం
అదృష్టం ఫలించింది
[illegible]

ఢిల్లీ సంతోషిస్తుంది
నా మాట కెదురేది
నా ఆట కెదురేది
ఢిల్లీశుడై నాను
తల వంచ వలసిందే
మంచి మాటగ చెప్తె
మక్కాకు బొమ్మని
నన్నూ కాదంటేను
నరికేస్త ఢిల్లీశ
ఢిల్లీశు చంపేసి
సుల్తాను నౌతాను
భారతావని నాకు
హారతులు పటంగ

"నీకు ఇలాంటి ఉద్దేశ్యం కూడా ఉందా, అలూఫ్‌ఖాన్?" అన్నాడు సుల్తాన్ షాజాదా వంక చూస్తూ.

"లేదు జహాపనాహ్! ఇది చాల తప్పుడు నాటకం. ఏయ్, వర్తకులూ! లేనిపోని అభియోగాన్ని నాకు అంటగట్టి నాటకంలో చూపిస్తున్నారా? ఏం చేస్తానో చూడండి—" అంటూ వర్తకుల వైపు తిరిగి మండిపడ్డాడు షాజాదా.

"అనే, బేటా! వర్తకులపై గదమాయిస్తావేం?"

"అది కాదు, జహాపనాహ్! వీరు మనకీ-మనకీ. తండ్రీ కొడుకుల మధ్య వైరం పెట్టాలని చూస్తున్నారు."

"ఏం వర్తకులూ! ఇది మీకు తగునా? నాటకం జూట్ అని తెలిస్తే, మీ అందరి తలలూ తెగనరికిస్తాను" అన్నాడు సుల్తాన్.

ఆ మాట వినగానే గజగజ వణకసాగారు వర్తకులు. పెద్దశెట్టి రత్నాకరుడు చేతులు జోడించి నమస్కరించి "ప్రభూ! సేవకుడిదో విన్నపం. ఇది అసలు కథ అవునో, కాదో మాకు తెలీదు. మేము ఈ రేవుకు వొచ్చినవాడే నదిలో ఒక గుర్తు తెలియని మొండెం కనిపించింది. పాపం - ఎవరిదో అని వెతికి తీసి అటూ ఇటూ పరిశీలించగా ఒడ్డున ఓ శిరస్సు కనిపించింది. అతుకుతయ్యేమోనని రెంటినీ ఒకచోట పెట్టాం. అంతే! అతుక్కొనే అతుక్కున్నాయ్. అంతే కాదు: అకాల మృత్యువు వాతపడి అంతరిక్షంలో విహరిస్తున్న అతని ఆత్మ అందులోకి దూరింది. దూరిన వెంటనే ఆ శవం నడిచి, పరిగెత్తి మా ఓడలో చేరి తన్ను ఒక వ్యక్తి అన్యాయంగా చంపాడనీ. ఆ విషయాన్ని తాను నాటకం వ్రాశాననీ, ఆ నాటకాన్ని మేము అభ్యసించి సుల్తాన్‌వారికి చూపే వరకూ వొదలననీ, తన పాత్ర తానే ధరిస్తాననీ గోల గోలచేసిందీ. ఆ ప్రేతంచేత వ్రాయబడిన నాటకమే ఇది, ప్రభూ!"

వర్తకుల మాటలకు సుల్తాన్‌వారు ఆశ్చర్యపోయాడు. అంతా శ్రద్ధగా విన్న తరువాత: "ఎవరిదా దయ్యం? ఎవరిదా దయ్యం?" అని ప్రశ్నించాడు.

"సుల్తానువారు స్వయంగా వీక్షించగలరు!" అన్నాడు పెద్దశెట్టి.

అంతలో రంగస్థలంపైకి ఖుస్రూఖాను వొచ్చాడు.

అతణ్ణి చూడగానే "బేటా, ఖుస్రూ!" అంటూ పెద్దగా అరిచాడు సుల్తాను. ఆయన కళ్ళవెంట కన్నీళ్ళు జలజలా రాలసాగాయ్. షాజాదా లోని ప్రతిరోషం నిక్కపొడుచుకోసాగింది. కర్తవ్యనిష్ఠుడై తనకిష్టులైన సరదార్లకు కన్నుగీటి ఉషార్ చెయ్యసాగాడు షాజాదా.

అది గమనించిన రత్నాకరుడి అనుచరులు పిచ్చివాడి సైగ నందుకొని ఒక్కొక్క సరదార్ ప్రక్కన ఒక్కొక్కడుగా కాపు కాశారు.

ఖుస్రూ

ఓహోయ్ షాజాదాహో

నీ అసలు అడియాసలు

సుల్తాన్‌వారుండగా

నీ ఆటలు సాగబోవ్వు
చాకలాణ్ణి పట్టితెచ్చి
చక్రవర్తి అంటావా
సుల్తానును మోసగించి
బోల్తా కొట్టిస్తావా
అల్లావుఖాన్
అవునోయీ నా ఇష్టం
అడగటానికీ నువ్వెవరు?
చాకలాణ్ణే పట్టితెచ్చి
సాదించా కార్యాన్ని
అసలు సంగతి వెలికి వొస్తే
అర్పిస్తావు నీ ప్రాణాలను
ఖుస్రూ
ప్రాణాలకు భయపడతానా
నీచానికి ఒడిగడతానా
చూడబోయి నీ నాటకమంతా
చెప్తానోయ్ ఢిల్లీశ్వరునికి
ఢిల్లీశుపై కత్తికట్టబోకోయీ
కాళ్ళపై బడి నీవు కరుణించమనవోయ్
మంచి మార్గంలోన మసలుకోవోయి
అల్లావుఖాన్
నాకే నీతులు చెప్తున్నావా
నన్నే బెదిరిస్తున్నావా
తాటాకు చప్పుళ్ళకు
బెదరబోదు మృగరాజం

ఆ మాట వినగానే గజగజ వణకసాగారు వర్తకులు. పెద్దశెట్టి రత్నకరుడు చేతులు జోడించి నమస్కరించి "ప్రభూ! సేవకుడిదో విన్నపం. ఇది అసలు కథ అవునో, కాదో మాకు తెలీదు. మేము ఈ రేవుకు వొచ్చినవాడే నదిలో ఒక గుర్తు తెలియని మొండెం కనిపించింది. పాపం - ఎవరిదో అని వెతికి తీసి అటూ ఇటూ పరిశీలించగా ఒడ్డున ఓ శిరస్సు కనిపించింది. అతుకుతయ్యేమోనని రెంటినీ ఒకచోట పెట్టాం. అంతే! అతుక్కొనే అతుకున్నాయ్. అంతే కాదు: అకాల మృత్యువు వాతపడి అంతరిక్షంలో విహరిస్తున్న అతని ఆత్మ అందులోకి దూరింది. దూరిన వెంటనే ఆ శవం నడిచి, పరిగెత్తి మా ఓడలో చేరి తన్ను ఒక వ్యక్తి అన్యాయంగా చంపాడనీ. ఆ విషయాన్ని తాను నాటకం వ్రాశాననీ, ఆ నాటకాన్ని మేము అభ్యసించి సుల్తాన్‌వారికి చూపే వరకూ వొదలననీ, తన పాత్ర తానే ధరిస్తాననీ గోలగోలచేసింది. ఆ ప్రేతంచేత వ్రాయబడిన నాటకమే ఇది, ప్రభూ!"

వర్తకుల మాటలకు సుల్తాన్‌వారు ఆశ్చర్యపోయాడు. అంతా శ్రద్ధగా విన్న తరువాత: "ఎవరిదా దయ్యం? ఎవరిదా దయ్యం?" అని ప్రశ్నించాడు.

"సుల్తానువారు స్వయంగా వీక్షించగలరు!" అన్నాడు పెద్దశెట్టి.

అంతలో రంగస్థలంపైకి ఖుస్రూఖాను వొచ్చాడు.

అతణ్ణి చూడగానే "బేటా, ఖుస్రూ!" అంటూ పెద్దగా అరిచాడు సుల్తాను. ఆయన కళ్ళవెంట కన్నీళ్ళు జలజలా రాలసాగాయ్. షాజాదాలోని ప్రతిరోమం నిక్కబొడుచుకోసాగింది. కర్తవ్యనిష్ఠుడై తనకిష్టులైన సరదార్లకు కన్నుగీటి ఉషార్ చెయ్యసాగాడు షాజాదా.

అది గమనించిన రత్నాకరుడి అనుచరులు పిచ్చివాడి సైగనందుకొని ఒక్కొక్క సరదార్ ప్రక్కన ఒక్కొక్కడుగా కాపు కాశారు.

ఖుస్రూ

ఓహోయ్ షాజాదాహో
నీ ఆసలు అడియాసలు
సుల్తాన్‌వారుండగా

నీ ఆటలు సాగబోవు
చాకలాణ్ణి పట్టితెచ్చి
చక్రవర్తి అంటావా
సుల్తానును మోసగించి
బోల్తా కొట్టిస్తావా

అలూఫ్ ఖాన్

అవునోయీ నా ఇష్టం
అడగటానికి నువ్వెవరు?
చాకలాణ్ణే పట్టితెచ్చి
సాధించా కార్యాన్ని
అసలు సంగతి వెలికి వస్తే
అర్పిస్తావు నీ ప్రాణాలను

ఖుస్రూ

ప్రాణాలకు భయపడతానా
నీచానికి ఒడిగడతానా
చూడవోయి నీ నాటకమంతా
చెప్తానోయ్ ఢిల్లీశ్వరునికి
ఢిల్లీశుపై కత్తికట్టబోకోయీ
కాళ్ళపై బడి నీవు కరుణించమనవోయ్
మంచి మార్గంలోన మసలుకోవోయి

అలూఫ్ ఖాన్

నాకే నీతులు చెప్తున్నావా
నన్నే బెదిరిస్తున్నావా
తాటాకు చప్పుళ్ళకు
బెదరబోదు మృగరాజం

షాజాదా! తప్పించుకుందామనుకుంటున్నావా? ఓడలు నాలుగు రోజుల క్రితమే ఢిల్లీ నుండి బయలుదేరాయ్. పాపం, ఈనాలుగురోజులూ! సురాపానాలలో లోకాన్నే మరచి పోయ్యావు -చేచినప్పుడల్లా మరో పాత్ర అందివ్వటంతో. ఇప్పటికి ఓడలు చాలా యోజనాలు ప్రయాణం చేసి ఉంటాయ్. సహాయాన్ని తెచ్చుకొని మమ్మల్ని సాధించే ప్రయత్నం విరమించటం మంచిది," అన్నాడు షాజాదా అంతర్యాన్ని తెలుసుకున్న యుగంధరుడు.

షాజాదా సమయం మించిందని అర్థం చేసుకున్నాడు. మరుక్షణంలో అతణ్ని మహామంత్రి అనుచరులు బంధించివేశారు.

ఈ కార్యకలాపాలను శ్రద్ధగా తిలకిస్తున్న సుల్తాను మొదట ఇది అంతా అర్థంలేని కలయేమో అనుకున్నాడు. కాని, కాలం గడిచిన కొద్దీ అది స్వాప్నిక దృశ్యం కాదనీ, యదార్థమే అని తెలుసుకున్నాడు. ఆయనకు క్రమక్రమంగా విషయాలు విశదం కాసాగాయ్.

"యుగంధర మహామంత్రీ! మాఫ్‌కిజీయే; మా షాజాదా ప్రవర్తన మమ్మేదీ బాధపెడుతున్నది."

"ఆ మాట ఇప్పటికయినా గ్రహించినందుకు సంతోషం, అన్నాడు యుగంధరమంత్రి. యుగంధరమంత్రి మాటలు వింటున్న షాజాదాకు చెవులలో నిశిత శిరీష ఖాలు గ్రుచ్చుకున్నట్లయింది.

"జహాపనాహ్! ఏ బాత్ జూట్ హై! ఈ తెలంగీ దివానా మోసకారి అంతా నటన! అంతా మోసం! కుట్ర!!!" అన్నాడు షహజాదా.

"నటన, మోసం, కుట్రఎవరిది? నీది; నాది కాదు. రాజరికం కొరకు నీ తండ్రినికూడా సంహరించటానికి తలపడిన నీవు .. .."

"లేదు. అంతా అబద్ధం. నేను కత్తి దూసింది నా తండ్రిమీదికి కాదు,"

"హ్హాహ్హాహ్హా! ఈ ఖరారునామా కూడా నీ స్వహస్తలిఖితం కాదా, చూడు?" అంటూ అలూఫ్ ఖాన్ చెకుముకిశాస్త్రికి వ్రాసి ఇచ్చిన ఖరారునామా బయటికి తీశాడు. దాన్ని చూడంటతోనే పై గుండెలు పైకెగశాయ్ షాజాదాకు నోటమాట పెగలింది కాదు.

"చూడండి, సుల్తాన్‌జీ! మీ ముద్దుల బిడ్డడు మా విద్యానాధుడికి వ్రాసి ఇచ్చిన ఖరారునామా" అంటూ ఆ ఖరారునామాను సుల్తానువారి చేతి కిచ్చాడు యుగంధర మంత్రి.

సుల్తానువారు దానిని చూసి విస్తుపోయాడు. షహజాదా అంటే పరమ అసహ్యం వేసింది ఆయనకు.

"యుగంధర మహామంత్రీ! మాకు అన్ని విషయాలూ తెలిశాయ్, గతానికి విచారిస్తున్నాం. షాజాదావంటి నీచ హృదయుడికి సర్వాధికారాలు కట్టబెట్టటం మాదే తప్పు. ఫలితం అనుభవించాలి. అయితే, అల్లా దయామయుడు! మనం ఇకనుంచి-మీరు ఇష్టపడితే-భాయీ భాయీగా ఉందాం. లేకపోతే మీకు బందీగానే ఉంటాం" అన్నాడు సుల్తాను.

దీనుడై, అచేతనుడై భోరున ఏడుస్తున్న సుల్తాన్‌ను చూస్తే జాలి వేసింది యుగంధర మంత్రికి. వెంటనే అవనికాభ్యంతరాన ఉన్న ప్రతాప రుద్ర చక్రవర్తిని "ప్రభూ! ఇలా దయ చెయ్యండి" అంటూ పిలిచాడు మహామంత్రి.

మంగళాలంకరణ భూషితుడైన ప్రతాపరుద్ర చక్రవర్తి రంగస్థలం మీదికి ప్రవేశించాడు. అతణ్ణిచూసి సుల్తాను విస్తుపోతూ "ఈయన చాకలి ప్రభువా, అసలు ప్రభువా? మాకంతా అయోమయంగా ఉంది. మీరు పిచ్చి వారా, యుగంధరులవారా అని కూడా ఆశ్చర్యపడుతున్నాం" అన్నాడు.

"సుల్తాజీ! ప్రతాపరుద్రుణ్ణి నేనే! నాటకంలో చాకలి అభినయించిందీ నేనే! మీ షాజాదాకు బందీ చిక్కిందీ నేనే! నాటకంలో చాకలి ప్రభువూ-నకిలీ ప్రతాపరుద్రుడూ ప్రస్తుతం ఓరుగల్లు సింహాసనం మీద కులుకుతున్నాడు. మహామంత్రి యుగంధరులే కార్యసాధనకు ఉన్మాదిగా నటించారు. అంతే!"

అంతా విన్న సుల్తాను తన ప్రతిపక్షపు తెలివితేటల్ని అభినందించకుండా ఉండలేకపోయాడు.

"ప్రతాపరుద్ర చక్రవర్తీ! మాఫ్ కీజియే! ఇకనించీ మనం భాయీ భాయీ!" అన్నాడు సుల్తాను చక్రవర్తిని ఆలింగనం చేసుకొంటూ.

"మేము కూడా అదే కోరుతున్నాం. మేము మీకు బందీలుగా

ఉన్నా, 'మమ్మల్ని మహారాజులుగా ఆదరించి మన్నించారు. కృతజ్ఞుణ్ణి! ఇక నించీ మనం భాయీ భాయీ!" అన్నాడు ప్రతాపరుద్ర చక్రవర్తి.

యుగంధర మహామంత్రి "తథాస్తు!" అన్నాడు.

ఇంతలో నౌకలు త్రివేణీ సంగమస్థానం చేరాయని పెద్ద కళాసీ వచ్చి ప్రభువుకు వంగి నమస్కరించి మనవి చేశాడు.

త్రివేణీ సంగమం దగ్గర ప్రభువు రాక కొరకు వేచిఉన్న ఆంధ్ర సైనికులు ప్రతాపరుద్ర చక్రవర్తికీ, యుగంధరులవారికీ జయ - జయ ధ్వానాలు చేశారు తమ నౌకలను చూడగానే. ఆ నినాదాలకు ఓడలోనివారి చెవులు గింగురుమన్నాయ్.

"సుల్తాన్ భాయ్! మా సైన్యాలు అనుకున్న ప్రకారం త్రివేణీ సంగమంలో వేచి ఉన్నాయి ఇక మేం వెళతాం! మన స్నేహానికి చిహ్నంగా అమూల్యమైన రత్నాభరణ విశేషాలుగల ఈ నౌకలను తమకు కానుకగా ఇస్తున్నాను. మీరు ఈ నౌకలలోనే తిరిగి ఢిల్లీకి వెళ్ళిపోవచ్చు. నావికులే మిమ్మల్ని మీ నగరానికి చేరుస్తారు" అన్నాడు ప్రతాపరుద్ర చక్రవర్తి.

వారి మైత్రి క్షణాలమీద హిమాలయోత్తుంగ శిఖరాల నందుకుంది. వారిద్దరూ ఒకరి దగ్గర ఒకరు సజల నయనాలతో వీడ్కోలు తీసుకున్నారు.

# 27

ఆనాటి సాయంత్రమే ప్రతాపరుద్ర మహారాజు తన సేనానివహంతో ఓరుగల్లుకు బయలుదేరాడు ప్రయాగనుండి. అయితే, యుగంధర మహామంత్రి మాత్రం తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాననే సంతోషంతో కాశీలో విశ్వేశ్వరుడికి లక్షబిల్వార్చన చేయించి వస్తానని మహారాజుతో మనవి చేశాడు.

యుగంధర నిర్ణయం తిరుగులేనిదని తెలిసినవాడవడంవల్ల మహారాజు అందు కభ్యంతరం చెప్పలేదు.

సాష్టాంగ ప్రణామంచేసి మహారాజు "మహామంత్రీ! ఎన్నో దినాలు తమ చరణారవిందాలను స్పృశించే మహాభాగ్యం ఈనాడు లభిం

చింది. గురులుగా, హితులుగా, అమాత్యులుగా నన్ను కంటికి రెప్ప వోలె కాపాడటమే కాకుండా ఆపత్సమయంలో ప్రాణాలకు తెగించి, నాకు బంధవిముక్తి ప్రసాదించి ప్రాణదానం చేశారు. మీ ఉపకారానికి ప్రత్యుప కారం నేనేం చేయగలను-హృదయపూర్వకంగా అంజలి ఘటించటంతప్ప. వీలైనంత త్వరలో మాకు పునర్దర్శన భాగ్యం లభింపచేస్తారు కదూ?" అంటూ తన అశ్రువులతో మహామంత్రికి పాదాభిషేకం చేసి, వీడ్కోలు ఇచ్చాడు.

కతిపయదినాలు ప్రయాణం చేసిన తరువాత మహారాజు గోదావరీ తీరాన్ని ఓనాటి ప్రాతఃకాలంలో చేరాడు. అల్లంతదూరాన ఉషఃకాలపు లేత కెంజాయసంజ కాంతులతో బంగారు నీరులా జల-జలా ప్రవహిస్తున్న పవిత్ర గోదావరీ జలాలను చూసి ఉప్పొంగి ఉషఃస్నాన మాచరించాలనీ బయలుదేరాడు మహారాజు తన శిబిరంనుండి. బయలుదేరుతుండగానే ఎదురుగానున్న తరుశాఖపైనున్న ఒక గుడ్లగూబ భయంకరంగా అరి చింది. ఆ అపశకునానికి విస్తుబోయి, మనసును సంబాళించుకుని మరి నాలుగడుగులు వేశాడో లేదో, మహారాజుకు ఎదురుగా ఒక నల్లని మార్జాలం నడిచి వచ్చింది. ఆ రెండవ అపశకునం దర్శనానికి విచలితుడైన మహారాజు మరో నాలుగడుగులు ముందుకు వేసేలోగానే పడగవిప్పిన కాల నాగు తోకమీద నిలిచి ఎదురైంది. అది చూసిన మహారాజుకు ఏమీ పాలుపోయింది కాదు. ఒక్కసారిగా ఇన్ని అపశకునాలు ఎందుకు గోచ రిస్తున్నాయి? మహారాజు మనసు కీడు శంకించసాగింది. తన కర ద్వయాన్ని జోడించి పడగవిప్పిన పన్నగేంద్రునకు భక్తిపురస్సరంగా అంజలి ఘటించి "స్వామీ! ఫణిరాజా! ఏమిటీ? ఒక్కసారిగా ఇన్ని దుశ్శకునాలు నాకు ఎదురురావటమేమిటి? నేను చేసిన అపరాధమేమిటి? ఈ శకునాల ఫలిత మేమిటి?" అన్నాడు మహారాజు.

ఆయన ప్రార్థనకు సమాధానంగా నాగేంద్రుడు పడగవంచి పక్కకు తప్పుకున్నాడు.

మహారాజు డోలాందోళనా మానసుడై ముందుకు సాగిపోయాడు.

పావన గౌతమీ జలాలలో స్నానమాచరించి, ఉదయభానునికి అంజలి ఘటించే సమయంలో అతని కెదురుగా చిన్న నావ రావటం కను

పించింది. మహారాజు ఆ పడవ వంక ఒక్క క్షణం చూచాడు. క్షణ-క్షణా నికి సన్నిహితమౌతున్న ఆ నావలో వస్తున్నది తనకు చిరపరిచితులు గావటం మహారాజును నూతనోత్సాహాన్ని కలిగించింది.

ఆ పడవలో ఉన్నది కాకతీయ సామ్రాజ్య కోశాధికారి హరిహర రాయలు, దుర్గరక్షకుడు బుక్కరాయలు.

చూస్తూండగానే పడవ సమీపించింది. చాలా రోజుల తరువాత కనుపించిన తన మిత్రద్వయాన్ని చూచి వడివడిగా దగ్గరకుచేరి ఆప్యాయ భరితంగా కౌగలించుకోబోయాడు మహారాజు. గోదావరీ తీరాన హఠాత్తుగా సందర్భపడిన తమ మహారాజును చూసి సోదరద్వయం విస్తుపోయింది. చిరునవ్వులు చిలకరిస్తూ తమను సమీపిస్తున్న ప్రభువును ఏ విధంగా సంబోధించాలో వారికి అర్థంకాలేదు.

తనను చూచి సంతోషించవలసిన వారి ముఖాలు వెలవెలవారటం గమనించి మహారాజు ముఖభంగిమలు మారిపోయాయి. రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి. "ఏం జరిగింది, హరిహరా? ఏమిటిది బుక్కరాయా? మాట్లాడరేం?" అంటూ ప్రశ్నించాడు మహారాజు.

"ప్రభూ!...." అనలేక అనలేక అన్నాడు హరిహరుడు.

"ఏం జరిగింది? అనుపమ శౌర్య నిష్ఠాగరిష్ఠులయిన మీకు ఈ బేలతనమేమిటి? చెప్పండి! ధైర్యంగా చెప్పండి" అంటూ వారి భుజాలు పట్టుకుని కుదుపసాగాడు ఆందోళనాభరితాంతరంగుడైన మహారాజు.

"ప్రభూ!ఆ ఘోరాన్ని మీకు విన్నవించటానికే విధాత మాకు ఇంకా ఆయువిచ్చాడు. ఎలా చెప్పమంటారు? ఏం చెప్పమంటారు? అన్నాడు బుక్కరాయలు అవనత శీర్షతో-గద్గద కంఠంతో.

"అయినా చెప్పండి. మా మనసును వేధించక చెప్పండి. అది ఎంతటి దారుణ వార్త అయినా సరే! సందేహించక చెప్పండి హరిహర రాయా!"

"ప్రభూ! సర్వ నాశనమైంది. కాకతీయ సామ్రాజ్య ప్రచండ భానుడు అస్తమించాడు. మహారాజుల ఎదుటనే ఈ మాట ఉచ్చరించా ల్సిన దౌర్భాగ్యం కలిగింది. ప్రభూ! దారుణమైన కుట్ర జరిగింది. కోట లోని జైనులు ఎదురుతిగారు. బయటనుండి యాదవ సైన్యం-యవన సేన ఒక్కుమ్మడిగా ప్రాకారాలను మోహరించాయి.

"జరుగుతున్నదేమిటో తెలుసుకునే లోపునే- ఆరు ద్వారాలు కొన్ని ఘడియల్లో అంతఃశత్రువులైన జైనుల సహాయంతో యవనుల వశమైనాయి. సప్తమ ప్రాకారాన్ని మాత్రం దాదాపు నెలరోజులుగా కాపాడ గలిగాం కాని, విధి వికటించింది. కాలం పరిహసించింది. అదనపు బలాలు రావటంతో, రెట్టించిన ఉత్సాహంతో యవనులు తమ మదగజాల కుంభస్థలాలను మోటించి, సప్తమద్వారాన్ని ఛేదించారు. ఆ తర్వాత జరిగిన దారుణ భీకర సంగ్రామంలో జనార్దనమంత్రితో సహా- వీరాధివీరు లైన కాకతీయ జోదులంతా అస్తమించారు.

"ఇన్నాళ్ళుగా యుగంధర మహామంత్రుల వారి ఆజ్ఞమేరకు తమ పాత్రను నిర్వహిస్తున్న పేరయ్య ప్రభువులుకూడా చివరి క్షణం వరకు వీరావేశంతో దారుణ సంగ్రామం సలిపి, వీరస్వర్గ మలంకరించారు.

"కోట యవనుల వశమైంది. పరమ పూజనీయులు, మానినీ మణులు అయిన అంతఃపుర స్త్రీలు ఆత్మగౌరవ రక్షణార్థం అగ్నిజ్వాలలకు ఆహుతయినారు ప్రభూ-ఆహుతయినారు.

"మేం మాత్రం చావలేక జీవచ్ఛవాలలా బ్రతికియున్నాం, ప్రభూ!" అంటూ బొట-బొటా కన్నీరు కార్చాడు హరిహరరాయలు.

హరిహరరాయలి మాటలు వింటున్న మహారాజు ముఖభంగిమలో ఏ విధమైన చలనంగాని, భావోద్రేకంగాని, ఆవేశంగాని గోచరించలేదు. తన ఎదుటనున్న అనంతశూన్యంలోకి చూస్తూ, మహారాజు స్థాణువులా నిలచిపోయాడు.

* * *

ఆనాటి అర్ధరాత్రి తన పరివారానికిచెప్పకుండా మహారాజు అదృశ్యుడై పోయాడు-తన శేషజీవితాన్ని పవిత్రగోదావరీ తీరాన తపోనిష్ఠలో గడిపి వేయటానికి నిశ్చయించుకొని.

* * *

ఈ విషయం తెలిసే కావొచ్చు- కాశీకిపోయిన మహామంత్రి యుగంధరుడు ఓరుగల్లు నగరానికి తిరిగిరాలేదు. ఆ తరువాత అతడెవ రికీ కనిపించలేదు. కూడా. ఆయన స్థితప్రజ్ఞుడు తన ప్రతిన నెరవేర్చు కున్నాడు. కాని, విధిని కాదనలేకపోయాడు. అయినా ఆ మహాపురుషుని గాథ ఆంధ్ర చరిత్రలో సువర్ణాక్షరాంకితమైంది. ఓం తత్సత్

# మనవి

చారిత్రకంగా చూస్తే యుగంధరులవారి ప్రాధాన్యత అల్పంగాఉన్నా అనశ్రుతంగా వొస్తున్న గాధ నాధారంగాచేసుకొని, యుగంధర చరిత్రను నాటకంగా గ్రంథస్థంచేసిన ఖ్యాతి శ్రీ॥ శే॥ వేదం వేంకటరాయశాస్త్రి గారిది. అయితే, చారిత్రకాధారాలు వారు వ్రాసేనాటికి సరిగ్గా లభ్యం కాక పోవటంవల్లనే కావొచ్చు శ్రీ శాస్త్రిగారు కల్పనకే ప్రాధాన్యత ఇచ్చారు.

నేనీ గ్రంధంలో అటు చారిత్రకాంశాలనూ, ఇటు అనుశ్రుతంగా వొస్తున్న ఆధారాలనూ సమన్వయం చేయటానికి కృషిచేశాను. ఈ రచనకు శ్రీ కొమర్రాజుల వేంకట లక్ష్మణరావుగారి, "హిందూ దేశ కధా సంగ్రాహం" 'మహమ్మదీయయుగం' 'పెనుగల్లు కైఫియత్' మొదలైనవి చారిత్రక ఆధారాలు.

మహోమ్మదీయులకు వాడిన భాషలో ముఖ్య పాత్రలకు మినహా తక్కిన పాత్రలకు తెలుగూ-ఉరుదూ మేళవించిన యాస వ్రాశాను. కేవలం రసపోషణ కొరకే అలా వ్రాయటం జరిగింది. పేరిగాడి భాషలోని అశ్లీలాలు కూడా వాస్తవ సాన్నిహిత్యంకొరకు వ్రాసినవే. రసజ్ఞులు మన్నిస్తారనీ, ఆదరిస్తారనీ విశ్వశిస్తున్నాను.

మద్రాసు
20-1-60

భవదీయుడు,
పాలపర్తి రామప్రసాద్